శ్రీరస్తు

# శ్రీరామాయణ తరంగిణి

ఆఱవ భాగము

హనుమత్తీర్థాదిత్రయము



రచయిత

పోలూరి హనుమజ్జానకీరామ శర్మ

1987 మార్చి]

[మూల్యము : రు. 20/-

ప్రథమ ప్రకాశనము : మార్చి 1987

ప్రతులు – 1000

ప్రకాశకుఁడు :
పోలూరి హనుమజ్జానకీరామశర్మ, (B. A., Hons)
16/1216, పొగతోట, నెల్లూరు–524 001.

ప్రతులు దొరుకుచోట్లు :
1. శ్రీరామకృష్ణ సేవా సమితి (రిజిష్టర్డు)
కాసుఖేలవారి అగ్రహారం, నెల్లూరు–524 001.

2. శ్రీ వివేకానంద విద్యాలయము
4/120, ముకుందపురము,
నవాబుపేట, నెల్లూరు–524 002.

3. శ్రీ బ్రహ్మానందతీర్థస్వామి శ్రీ సత్యానందాశ్రమము
ఇనమడుగు–524 137.
కోవూరుతాలూకా, నెల్లూరు జిల్లా.

ముద్రణము :
కమలాంబికా ప్రెస్, నెల్లూరు.

# ప్రసన్నప్రసాదనం

## శ్రీ సత్యానందమహర్షులవారు

### శ్రీ సత్యానందాశ్రమము. ఇనమడుగు, నెల్లూరు జిల్లా



శ్రీపోలూరి హనుమజ్జానకీరామశర్మగారు శ్రీవాల్మీకిరామాయణమును ప్రమాణముగ గైకొని 26-10-1974నుండి 14-12-75 వఱకు ఏబదియొక్క ఉపన్యాసము లొసంగిరి. ఆఉపన్యాసపరంపరయే ఈ'రామాయణతరంగిణి' అను గ్రంథరాజము. ఆరవభాగమునందు 'హనుమత్తీర్థము' 'శరణాగతితీర్థము', 'సేతుబంధతీర్థము' అను తీర్థములు మూడు కలవు. శ్రీరామచంద్రభగవానుని యనుగ్రహవిశేషమున

ఇదివరకు ఐదుభాగములు వెలువడి భక్తలోకమును ఆనందపరచినవి. ఇది ఆరవభాగము.

చిఱుతప్రాయమునుండి నేను రామభక్తుడ నని, శ్రీరామచంద్ర ప్రభువునే తల్లిగ, తండ్రిగ ఇష్టదైవముగ, గురువుగ భావించుటయే కాక, సేవించి, ధ్యానించి పరమానుగ్రహమునకు పాత్రుడ నైతి నను విషయమును తెలిసికొని శ్రీశర్మగారు ప్రతిభాగమునకు నన్ను అభిప్రాయమును, ఆశీఃపరంపరను వ్రాయు మని కోరుచున్నారు. కాన అట్టి అవకాశము లభించినందులకు నేను బ్రహ్మానందమును పొందుచున్నాను.

నాపదిసంవత్సరములవయస్సుననే శ్రీరామప్రభువివిగ్రహమును కాని, సుందరపటమును కాని దర్శించినంతనే హృదయము ద్రవీభూతమై అప్రయత్నముగ కన్నీరు కారుచు, తన్మయత ప్రాప్తించుచుండెడిది. నాపండ్రెండుసంవత్సరములప్రాయమున ప్రతిదినము శ్రీరామతారకమంత్రమును నియమబద్ధుడనై జపించుచు, శ్రీరామచంద్రభగవానుని ఆరాధించుట జరిగినది. నాయిరువదివర్షములవయస్సున శ్రీరామభద్రునియఖండప్రసాదమునకు, చరమానుగ్రహమునకు పాత్రుడనగుట సంభవించినది. అందులకు కేవలము శ్రీరామచంద్రుని సంపూర్ణముగ శరణాగతి నొందుటయే ప్రబలకారణము. శ్రీరామానుగ్రహము ప్రాప్తించినచో సాధింపరానిఘనకార్య మే మున్నది?

శ్రీమద్రామాయణమహాకావ్యమునకు ఎందరెందరో మహాపండితప్రకాండులు ఆంధ్రభాషలో గ్రంథములను రచించిరి. కొందఱు గ్రాంథికక్లిష్టభాషలో మరికొందఱు శిష్టవ్యావహారికభాషలో, ఇకకొందఱు దుష్టవ్యావహారికభాషలో శ్రీరామాయణదివ్యచరితను వ్రాసియున్నారు. మనఆంధ్రభాషకు ఎట్టి దుర్గతి పట్టినదో ఆగ్రంథములను చూచిన ఆస్తికు లెల్లరికి విషాదము కలుగుచుండును. సంస్కృతాంగ్లతమిళహిందీమళయాళాదిభాషల కిట్టి దుస్థితి పట్టకుండుట ఆనం

దింపవలసినవిషయము. ఆంధ్రభాష యింతదిగజారిపోవుట శోచనీయాంశము శ్రీశర్మగారు తెలుగుభాషయందు సులభసుందరశైలిలో చదువగ చదువగ సమగ్రముగ చదువువరకు వదలిపెట్టజాలని రీతిని ఈ శ్రీరామాయణతరంగిణి యను గ్రంథరాజమును రచించియున్నారు.

ఈగ్రంథమునందలి ప్రతితీర్థము విమర్శనాత్మకముగ నుండి, విశిష్టముగ నున్నను, శరణాగతితీర్థమును చదువునప్పుడు నాకు అనిర్వచనీయమైన ఆనందము, అనుభూతి కలిగినవి. అనగ ఈతీర్థము నన్ను అమాంతముగ ఆకర్షించినది.

"సీతామహాదేవిని శ్రీరామచంద్రునకు సమర్పించి, శరణొంది సుఖజీవితమును గడపుము" అని ధర్మాత్ముడును, అగ్రజునిహితమును కోరినవాడును నగు విభీషణుడు తన అన్నయగు రావణున కెంతగ బోధించినను, కామజ్వరపీడితుడగు రావణుడు విన దయ్యెను. అంతియగాక ఆతడు విభీషణునితో "ఎవ డైన నాయెదుట నీవలె నా కెంత మాత్రమును ఇష్టముకాని మాటలను మాటలాడిన తత్‌క్షణమే వాడు విగతజీవు డయ్యెడివాడు; ధైర్యముతో నన్నెదిరించి సంభాషించునీవు మిత్రరూప శత్రుడవు; ని న్నీక్షణముననే పరిత్యజించుచున్నాను" అని నిండుసభలో కఠినోక్తులాడెను. ఆకర్ణకఠోరవాక్యములను సహింపజాలక, విభీషణుడు అంతరిక్షమార్గమున లక్ష్మణసహితుడైన శ్రీరామచంద్రునిదివ్యసన్నిధానమున కేగి, "ప్రభూ! నాసర్వస్వము నీవే! నిన్నే సంపూర్ణముగ శరణుపొందుచున్నాను" అని వినతుడై పలికెను. సుగ్రీవాదు లెంతగ నిరోధించినను, శ్రీరాముడు "నేను విభీషణునకు అభయమొసంగితిని, వెంటనే విభీషణుని తోడ్కొనిరండు" అని ఆజ్ఞాపించి, తనవ్రతము నిట్లు ఉద్ఘాటించుచున్నాడు.

సకృ దేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే,
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ॥

"ఒక్కమాఱు నిన్ను శరణుపొందితిని; నేను నీవాడను" అని యాచించువానికి సమస్తభూతములనుండి అభయమును ప్రసాదించు చున్నాను. ఇది నావ్రతము."

విభీషణునివలె భగవంతుని సంపూర్ణముగ శరణాగతి నొందు వారు భగవదనుగ్రహమునకు పాత్రు లగుటయే గాక భగవద్దర్శన మును పొందగలరు. నవవిధభక్తివిధానములలో శరణాగతి అంతిమ మును సర్వశ్రేష్ఠమును నగుచున్నది. ప్రహ్లాదనారదాదులు భగవానుని సమగ్రముగ శరణొంది దర్శనమహాభాగ్యమును పొంది కృతార్థులైరి.

అద్భుతావహముగ ఈ 'రామాయణతరంగిణి' ఆరవభాగము శీఘ్రకాలమున ముద్రింపబడి వెలువడుట ఆస్తికలోకమునకు మహదా నందమును ఒనగూర్చినది. నాయిష్టదైవమగు శ్రీరామప్రభునికృపచే, మాయాశీర్వాదపటిమచే ఏడవభాగము ప్రచురింపబడి, బ్రహ్మచారులకు గృహస్థులకు, స్త్రీలకు, పురుషులకు, బాలురకు, వృద్ధులకు, ఆబాల గోపాలము, ఆదర్శప్రాయమై వరలునుగాక; కర్తవ్యవిముఖులను కర్త వ్యనిష్ఠులనుగ జేయుగాక! ఈమహోద్యమము జయప్రదమై వ్యష్టిగ, సమష్టిగ ఆత్మహితమును చేకూర్చుగాక!

---

శ్రీరస్తు

# తొలిపలుకులు

ప్రియమిత్రుఁడు చి॥ బొమ్మిశెట్టి ఎల్లమందయ్య. బి.ఏ.యొక్క ప్రేరణమున శ్రీరామకృష్ణసేవాసమాజయాజమాన్యమున 26-10-74 నుండి 14-12-1975 వఱకు వాల్మీకిరామాయణముపై ఏఁబదియొక్క యుపన్యాసములు జరిగినవి. వానిలోని విషయములు క్రమముగా గ్రంథ రూపమున ఇప్పటికి అయిదుభాగములు ప్రకటింపఁబడినవి. ఇది యాఱవ భాగము. ఏడవభాగముతో గ్రంథము పూర్తి యగును. శ్రీరామచంద్రుని యనుగ్రహమున అదియును త్వరలో ప్రకటింపఁబడు నని యాసించు చున్నాను.

ప్రియశిష్యుఁడు, చి॥ శివరాజునరసింహరావు. బి. ఏ; బి. టి; శ్రీ శ్రీ శ్రీ సత్యానందమహర్షులవారి యత్యంతప్రియాంతేవాసియైన శ్రీ శ్రీ శ్రీ బ్రహ్మానందతీర్థస్వామివారును ఈగ్రంథప్రకటనమును మిగుల ప్రోత్సహించుచున్నారు. మొదటినుండియు ముద్రణవ్యయ మును చి॥ బొమ్మిశెట్టి ఎల్లమందయ్య బి. ఏ., ఇతనితమ్ముఁడు బొమ్మి శెట్టి వీరరాఘవులును కొంతవఱకు వహించుచున్నారు. శ్రీదొమ్మరాజు నరసింహరాజుగారి ప్రోత్సాహమున తెలుగుగంగ డైరెక్టరు శ్రీ కె. రామరాజుగారు కొంతధనము నొసంగిరి. శ్రీవేముల సత్యనారాయణ గారు (Retired Officer, State Bank of India) శ్రీగోపరాజు పూర్ణచంద్రరావుగారు (Professor & Head of the Dept of

Civil Engineering, B. I. T, RANCHI) కూడ ధనసాహాయ్యము గావించిరి.

శ్రీ తిరుమల తిరుపతిదేవస్థానమువారు మూడవభాగమునకు రు. 7010/-లు, నాల్గవభాగమునకు రు. 7500/-లు ధనసాహాయ్యమును గావించిరి.

చి॥ R. C. కేశవరావు. B. A., చి॥ రావినూతల శ్రీరాములు B. A., LL. B., శ్రీ శ్రీ శ్రీ రామానందభారతీస్వామివారును (బెజవాడ) మొదలుగా అనేకులు ఈ గ్రంథవిక్రయప్రచారములకు కృషి చేయుచున్నారు.

చి॥ మామిడిపూడి పట్టాభిరామన్ M Sc... చిత్రీకరించి యిచ్చిన గ్రంథకర్తపేరు నాలుగుభాగములలో ముద్రింపఁబడినది. అయిదవ భాగమునకు ఆఱవభాగమునకు అట్టమీఁదిబొమ్మను గ్రంథ నామాదికమును శ్రీరాజి (నెల్లూరు) చిత్రించియిచ్చినాఁడు. అయిదవభాగములో 137వ పుటలో ముద్రింపఁబడిన పంచవటీమతంగవనాదిసన్నివేశమును చి॥ B. రవీంద్ర M. A. (Lecturer, Inamadugu Govt, Junior College) చిత్రించి యిచ్చెను.

కమలాంబికాముద్రణాలయాధినేతలు శ్రీపద్మనాభముగారు. చి॥ రంగనాథము, అచ్చుటి కార్యకర్తలును ఎంతో శ్రద్ధతో గ్రంథము అందముగా ముద్రించుటకు కృషి యొనర్చిరి.

ఈ గ్రంథముద్రణప్రకాశనములకు తోడ్పడుచున్నవారి కందఱకును శ్రీసీతాలక్ష్మణహనుమత్సమేతుఁడైన శ్రీరామచంద్రప్రభువు ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించును గాక యని ప్రార్థించుచున్నాను.

అమోఘములైన యాశీస్సులను ప్రసాదించుచున్న శ్రీశ్రీశ్రీ సత్యానందమహర్షులవారికి, ఈయాఅవభాగమునకు తప్పొప్పులపట్టికను తయారుచేసిన శ్రీశ్రీశ్రీ బ్రహ్మానందతీర్థస్వామివారికిని అనేక నమస్కారములు చేయుచున్నాను.

తప్పులను సవరించుకొని తరువాత గ్రంథమును చదువుఁడని పాఠకులను ప్రార్థించుచున్నాను.

బుధవిధేయుఁడు

నెల్లూరు. పోలూరిహనుమజ్జానకీరామశర్మ

ప్రభవ, ఉగాది. మార్చి, 1987

శ్రీరస్తు

# స్తుతి

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే॥

శ్లో॥ వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యేపుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్।
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాన్తం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్॥

శ్లో॥ నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై।
నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో
నమోఽస్తు చంద్రార్కమరుద్గణేభ్యః॥

శ్లో॥ యత్ర యత్ర రఘునాథకీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్।
బాష్పవారిపరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాన్తకమ్॥

శ్లో॥ కూజన్తం రామ రామేతి మధురం మధురాక్షరమ్।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్॥

శ్లో॥ యః కర్ణాంజలిసంపుటై రహ రహ స్సమ్యక్పిబ త్యాదరాత్
వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు।
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యంతసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్॥

శ్లో॥ వాల్మీకిగిరిసంభూతా రామసాగరగామినీ।
పునాతు భువనం పుణ్యా రామాయణమహానదీ॥

# విషయసూచిక

## తీర్థములు; ఘట్టములు


| | | |
|---|---|---|
| 18. | హనుమత్తీర్థము | 1–147 |
| 1. | స్వయంప్రభావృత్తాంతము | 1–10 |
| 2. | సంపాతివృత్తాంతము | 10–30 |
| 3. | హనుమత్ప్రశస్తి | 30–36 |
| 4. | హనుమద్వృత్తాంతము | 36–48 |
| 5. | సాగరలంఘనము | 48–58 |
| 6. | లంకాప్రవేశము | 58–60 |
| 7. | సీతాన్వేషణము | 61–75 |
| 8. | సీతాసందర్శనము | 75–87 |
| 9. | సీతాసంభాషణము | 87–95 |
| 10. | అభిజ్ఞానవినిమయము | 95–106 |
| 11. | రాక్షససంహారము | 106–120 |
| 12. | హనుమద్రావణసమాగమము | 120–127 |
| 13. | లంకాదహనము | 127–132 |
| 14. | వృత్తాంతనివేదనము | 132–139 |
| 15. | చూడామణిసమర్పణము | 139–147 |
| 19. | శరణాగతితీర్థము | 147–197 |
| 1. | జైత్రయాత్ర | 147–149 |
| 2. | విభీషణహితోపదేశము | 149–164 |
| 3. | శరణాగతి | 164–197 |

20. సేతుబంధతీర్థము 197–243

1. దర్భశయనము 197–206

2. సాగరదర్శనము 206–209

3. సేతునిర్మాణము 209–211

4. చారకృత్యము 211–215

5. సీతావిమోహనము 215–220

6. మాల్యవంతుని యుపదేశము 220–225

7. వానరసైన్యోద్యోగము 225–236

8. అంగదునిరాయబారము 236–243

శ్రీరస్తు శ్రీరామ శుభమస్తు

# శ్రీ రామాయణ తరంగిణి

## 18. హనుమత్తీర్థము

### 1. స్వయంప్రభావృత్తాంతము

తారాంగదాంజనేయాదులు వింధ్యపర్వతమును చేరి దానియందు అన్నివైపులను సీతను వెదకిరి. అటనుండి కండుమునిచే శపింపఁబడి నిర్జలమై మృగపక్షివిసర్జితమైన ఘోరవనమున ప్రవేశించి యక్కడ నుండి గిరినదీకాననప్రదేశమునకు చేరిరి. అక్కడ వారు కొండవలె నున్న యొకరాక్షసుని చూచిరి. అంగదుఁడు వానిని సంహరించెను. తరువాత వా రాగిరిగుహ లన్నియు వెదకి పరిశ్రాంతులై యొకనాఁడు మధ్యాహ్నము ఒకవృక్షమూలమును చేరిరి. అప్పుడు అంగదుఁడు కాలము గడచిపోవుచుండుటను గుర్తునకు తెచ్చి, సుగ్రీవునియాజ్ఞాచండతను వర్ణించి బడలిక లెక్కచేయకుండ వెదకుటకు బయలుదేరుఁ డని వానరులను ప్రోత్సహించెను. గంధమాదనుఁడు కూడ ఆమాటను బలపఱచెను. వానరులు వెంటనే బయలుదేరి రజతపర్వతమును చేరి దాని నంతయు వెదకిరి. అట్లు వెదకుచు వారు వింధ్యపర్వతశ్రేణియొక్క దక్షిణపశ్చిమకోటికి (South western end) చేరిరి. అప్పటికి సుగ్రీవుఁడు నియమించిన నెల గడచిపోయెను.

ఆప్రాంతమున ఎక్కడను జలాశయము గాని ఫలవృక్షములు గాని వారికి కన్పింపలేదు. వారు క్షుత్పిపాసార్దితులై నీటికొఱకు ఆహారముకొఱకు వెదకఁజొచ్చిరి. ఒకచోట వారికి ఒకబిలమునుండి క్రౌంచ హంస సారసములు వెలికి వచ్చుచుండుట కన్పించెను. ఆంజనేయుఁడు

ఆపక్షులతెక్కలపై నీటితుంపురులు ఉండుటను గమనించి ఆబిలములో ఏదేని ఒకజలాశయ ముండు నని చెప్పెను. ఆమాట విని వా రందఱు ఆబిలమును సమీపించిరి. ఆబిలద్వారము పొదలతో నిండి దుర్గమమై యంధకారమయముగా నుండెను. సీతసంగతి యెట్లున్నను ఆబిలమునందు అంజనేయుఁడు చెప్పినట్లు జలాశయమున్నచో దప్పి కను తీర్చుకొని ప్రాణములను నిలుపుకొనవచ్చు ననునాశతో వారు ఒకరిచేతు లొకరు పట్టుకొని దానియందు ప్రవేశించి మెల్లగా ముందునకు పోవఁజొచ్చిరి. కొంతదూరముపోయినతరువాత వెలుతురు కన్పింపఁ జొచ్చెను. అప్పుడు వారికి పోయినప్రాణములు వచ్చినట్లయ్యెను వారు ముందునకు పోయి పుష్పఫలోపశోభితమైన మహావనమును సరస్సు లను భవనములను స్వర్ణశయ్యాసనములను భోజనభాజనములను చూచిరి. అది యంతయు వారికి మాయామయమైన విచిత్రసృష్టిగా తోఁచెను. అందువలన ఆనీటిని త్రాగినచో ఏమగునో ఆఫలములను గైకొన్నచో ఏమగునో అని వారు భయముతో ఆభవనములకు సంబం ధించినవారు ఎవరైన కన్పింతు రేమో యని వెదకఁజొచ్చిరి. వారికి ఒకచోట తేజోమహితయైన యొకతాపసి కన్పించెను. ఆమె తేజము నకు విస్మితులై వా రందఱు ఎక్కడివా రక్కడ నిలిచిపోయిరి. అంజ నేయుఁడు సాహసించి ఆమెను సమీపించి నమస్కరించి వినయముతో, "అమ్మా! నీ వెవరు? ఈ బిల మెవరిది?" అని యడిగెను.

ఆమె యిట్లు చెప్పెను. "మయుఁ డను దానవునిచేత ఈకాంచన వనము సృష్టింపఁబడెను. అతఁడు వేలకొలఁది సంవత్సరములు తపస్సు చేసి బ్రహ్మవలన శిల్పశాస్త్రాచార్యుఁడైన శుక్రునియొక్క జ్ఞానసాధన సంపద నంతయును పొంది ఈవనమును భవనాదులను సృష్టించి సుఖ ముగా నుండి హేమ యను నప్సరసయందు ఆసక్తుఁడై ఇందు ఆమెతో చిరకాలము క్రీడించుచుండెను. ఇంద్రుఁడు దానవుని వజ్రముతో ప్రహ

శించెను. బ్రహ్మ ఈవనమును హేమ కొసంగెను. నేను మేరుసావర్ణి మహర్షిపుత్రికను, స్వయంప్రభను; హేమకు ప్రాణసఖిని. అందువలన నే నిందుండి ఈవనమును రక్షించుచున్నాను. మీ రెందులకు ఇట్లు తిరుగుచున్నారు? దుర్గమమైన యీబిలమునందు ఎట్లు ప్రవేశించితిరి? ఈఫలమూలములను భుజించి పిదప మీవృత్తాంతమును చెప్పుఁడు."

శ్లో॥ ఉవాస సుఖితః కాలం కంచి దస్మిన్ మహావనే।
త మప్సరసి హేమాయాం సక్తం దానవపుంగవమ్॥ 14

శ్లో॥ విక్రమ్యై వాశనిం గృహ్య జఘా నేశః పురందరః।
ఇదం చ బ్రహ్మణా దత్తం హేమాయై వన ముత్తమమ్॥ 15

శ్లో॥ శాశ్వతః కామభోగా శ్చ గృహం చేదం హిరణ్మయమ్।
దుహితా మేరుసావర్ణే రహం తస్యా స్స్వయంప్రభా॥ 16

శ్లో॥ ఇదం రక్షామి భవనం హేమాయా వానరోత్తమ।
మమ ప్రియసఖీ హేమా నృత్తగీతవిశారదా॥ 17

కిష్కింధాకాండ-సర్గ-51

ఈమయుఁడే హేమయందు తనకు జనించిన మందోదరిని రావణునకు భార్యగా నొసంగెను. అప్పు డతఁడు తన వృత్తాంతమును రావణునితో ఇట్లు చెప్పెను. "నీవు హేమయను నప్సరసపేరును వినియుందువు. ఇంద్రునకు శచీదేవివలె ఆమె నాకు దేవతలచేత నొసంగఁబడెను. ఆమెయందు ఆసక్తుఁడనై వేయిసంవత్సరములు క్రీడించితిని. ఆమె దేవకార్యముకొఱకై పోయి పదుమూఁడుసంవత్సరములు నిండి పదునాల్గవసంవత్సరము జరుగుచున్నది. నేను స్వర్ణమయమైన పురమును వజ్రవైడూర్యచిత్రితముగ నిర్మించియుంటిని. హేమ వెడలిపోయినతరువాత చాలదుఃఖితుఁడనై దానియందు ఇంతవఱ కుంటిని. ఇప్పు

డీపుత్రికను గైకొని ఆపురమునుండి వెలువడి వచ్చితిని. ఈమె హేమ యందు నాకుఁ గలిగినపుత్రిక. ఈమెను వెంటఁబెట్టుకొని తగినభర్త కొఱకు వెదకుచు తిరుగుచున్నాను. అభిమానధనులైన వారి కందఱ కును ఆడపిల్లకు తండ్రియగుట దుఃఖమే. కన్య పుట్టినింటిని మెట్టి నింటిని రెండుకులములను ఎప్పుడును సంశయస్థితిలో నుంచును. నాకు హేమయందు ఇద్దఱు పుత్త్రులు కలిగిరి; మాయావి మొదటివాఁడు. తరువాతివాఁడు దుందుభి."

శ్లో॥ హేమా నా మాప్సరసా స్తత్ర శ్రుతపూర్వా యది త్వయా॥ 6

శ్లో॥ దైవతై ర్మమ సా దత్తా పౌలోమీవ శతక్రతోః॥
తస్యాం భక్తమనా హ్యాసం దశవర్షశతా న్యహమ్॥ 7

శ్లో॥ సా చ దైవతకార్యేణ త్రయోదశసమా గతాః।
వర్షం చతుర్దశం చైవ తతో హేమమయం పురమ్॥ 8

శ్లో॥ వజ్రవైదూర్యచిత్రం చ మాయయా నిర్మితం మయా।
తత్రాహ మవసం దీన స్తయా హీన స్సుదుఃఖితః॥ 9

శ్లో॥ తస్మా త్పురా దుహితరం గృహీత్వా వన మాగతః।
ఇయం మమాత్మజా రాజం స్తస్యాః కుక్షౌ వివర్ధితా॥ 10

శ్లో॥ భర్తార మనయా సార్థ మస్యాః ప్రాప్తో౽స్మి మార్గితుమ్।
కన్యాపితృత్వం దుఃఖం హి సర్వేషాం మానకాంక్షిణామ్॥ 11

శ్లో॥ కన్యా హి ద్వే కులే నిత్యం సంశయే స్థాప్య తిష్ఠతి।
పుత్త్రద్వయం మమాప్యస్యాం భార్యాయాం సంబభూవ హ॥ 12

శ్లో॥ మాయావీ ప్రథమ స్తాత దుందుభి స్తదన స్తరః॥ 13

ఉత్తరకాండ-సర్గ-12

స్వయంప్రభ చెప్పినవృత్తాంతమునకు మయుఁడు స్వయముగా చెప్పినదానికి కొంతభేదము కన్పించుచున్నది. ఇంద్రుఁడు తన్ను

వజ్రముతో కొట్టినవిషయమును తన కది అవమానకర మగుటచే, మయుఁడు చెప్పలేదు. ఏమైనను ఇంద్రుఁడు వజ్రాయుధముతో కొట్టి నప్పుడు మయుఁడు చచ్చిపోలే దని స్పష్ట మగుచున్నది. మూల ములో "జఘాన" అనుపదమునకు కొట్టె ననియే అర్థము కాని చంపె నని కాదు. ''హన" ధాతువునకు హింసించుట పోవుట అను రెండర్థ ములు కలవు (హన హింసాగత్యోః). హింసించుటయందు మరణము సంభవింపక పోవచ్చును. ''జఘాన" యనఁగా ప్రహరించి బాధించె ననియే గ్రహింపవలసియున్నది. అందువలన ఇంద్రుఁడు ప్రయోగిం చినయశనిచేత మయుఁడు చచ్చిపోయినట్లుగా మూర్ఛిల్లియుండి తరు వాత తేరుకొనియుండును. అప్పు డతఁడు చచ్చియున్నచో హేమ నుండి వియోగమును పొందుట కాని మండోదరిని రావణునకు ఇచ్చుట కాని కుదురదు.

"బ్రహ్మ ఈవనమును హేమ కొసంగెను" అని స్వయంప్రభ చెప్పినప్పుడు ఇంద్రుఁడు మయుని ప్రహరించిన తరువాత బ్రహ్మ దేవుఁడు వచ్చి అవనమును హేమకు ఇచ్చె నని చెప్పుట పొసఁగదు. ఇందు బ్రహ్మదేవునకు ఏమియు ప్రసక్తిలేదు. పైన గమనించినట్లుగ మయుఁడు చావలేదు. హేమ స్వర్గమునకు పోయినతరువాత మయుఁడే పదునాల్గుసంవత్సరములు విరహముతో వ్యథ నొందుచు మండోదరిని పెంచుచు అవనమునందే యుండెను. స్వర్గమునకు పోయిన హేమకు బ్రహ్మదేవుఁడు ఈవనము నెట్లు ఇచ్చును? కావున ఇక్కడ బ్రహ్మ యనఁగా బ్రహ్మతో సమానుఁడైన మయుఁ డనియే యర్థము. మయుఁడు దానవులకు విశ్వకర్మ. ఆయన వారికి కావలసిన భవనములను పురము లను నిర్మించి ఇచ్చుచుండెను. బ్రహ్మవలెనే సృష్టిచేయువాఁ డగుటచే మయుని కూడ మయబ్రహ్మ యనియే వ్యవహరించుచుందురు. కావున మయుఁడే ఈవనమును సృష్టించి హేమ కొసంగె నని గ్రహింపవలసి

యున్నది. అట్లయినచో హేమ స్వర్గమునకు పోయినవిషయమును చెప్పి తరువాత మయుఁడు ఈవనమునుగూర్చి ప్రస్తావించెను గదా! ఆమె స్వర్గమునకు పోయినతరువాత ఆమెకు మయుఁ డీవనమును ఎట్లు ఇచ్చును, ఎందులకు ఇచ్చును? అస లామె వెడలిపోయినతరువాత మహాభోగసాధనమైన ఈమహావనమును ఆయన విరహముతో నుండి ఎందులకు సృష్టించును? దీనికి సంబంధించిన యుత్తరకాండలోని శ్లోక ములు భ్రాంతిజనకములుగా నున్నవి."

"వర్షం చతుర్దశం చైవ తతో, హేమమయం పురమ్॥ 8

వజ్రవైడూర్యచిత్రం చ మాయయా నిర్మితంమయా। 9

ఇందు "తతో" అనుపదము "వర్షం చతుర్దశం చైవ" అని వెనుకనున్న వాక్యముతో అన్వయించుచున్నది. అనఁగా హేమ స్వర్గ మునకు పోయినతరువాత పదుమూఁడుసంవత్సరములు గడచినవి; పదు నాల్గవసంవత్సరము కూడ గడచినట్లే, అని యర్థము [సా చ దైవత కార్యేణ (గతా); తతః త్రయోదశసమాః గతాః; వర్షం చతుర్దశం చైవ (గతమ్) ]

ఇట్లు చెప్పుచు మయుఁడు హేమతో తాను కూడి యుండుటకు పూర్వమే నిర్మించియున్న వనమునుగూర్చి ప్రస్తావించి, ఏవనమునందు తాను ఆమెతో క్రీడించుచు చిరకాలము ఉండెనో ఆవనమునందు ఆమె యొక్క స్మృతులతో విరహముతో బాధపడుచు పదునాల్గుసంవత్సరము లుంటి నని చెప్పినాఁడు. ఆయన ఆమహావనములో కొంతకాలము హేమతో సుఖముగా నుండె నని, అప్పుడు ఇంద్రుఁడు వచ్చి ఆయ నను అశనితో ప్రహరించె నని, స్వయంప్రభ స్పష్టముగా చెప్పెను. కావున మయుఁడు హేమకొఱకే ఆమహావనమును విచిత్రభవనాదు లతో సృష్టించి ఆమె కొసంగె నని వ్యక్తమగుచున్నది.

స్వయంప్రభ చెప్పినదానిని మయుఁడుచెప్పినదానిని పరిశీలించి పూర్వాపరములను గమనించినచో ఈవృత్తాంతముయొక్క సారము నిట్లు గ్రహింపవచ్చును. దేవతలకు విశ్వకర్మ ఎట్లో అట్లే మయుఁడును దానవులకు శిల్పాచార్యుఁ డయ్యెను. (పురా దానవముఖ్యానాం విశ్వకర్మా బభూవ హ। శ్లో. 11; సర్గ. 51; కిష్కింధాకాండ) ఇతఁడు వేల కొలఁదిసంవత్సరములు బ్రహ్మనుగూర్చి తపస్సుచేసి శుక్రాచార్యునకుఁ గల విజ్ఞానసాధనసంపత్తిని పొందిి సౌధసభానగరాదినిర్మాణకళయందు అసమానుఁ డయ్యెను. దేవతలు కూడ ఇతనిచేత పెక్కునిర్మాణములను చేయించుకొనుచుండిరి ఒకప్పుడు వారు ఈతనికళాకౌశలమును మెచ్చి హేమ నీతనికి బహుమతిగా నొసంగిరి. ఉత్తరపుదిక్కున క్రౌంచమున కవ్వల మైనాకపర్వతమునందు ఈతఁడు ఒకభవనమును స్వయముగా నిర్మించుకొనె నని సుగ్రీవుఁడు శతబలితో చెప్పెను. (మయస్య భవనం తత్ర దానవస్య స్వయంకృతమ్—శ్లో 30; సర్గ. 43) కాని హేమ లభించిన తరువాత అప్రాంతయింటియందు ఆమెతో క్రీడించుటకు మన సొప్పక వింధ్యపర్వతదక్షిణపశ్చిమకోటియందు ఈ గుహలో విచిత్రసరోవరవనసౌధాదిమహితమైన యద్భుతమైన హేమమయమైన నగరము నిర్మించి ఆమె కొసంగెను. అనఁగా దానియందు తనకు ఆమెకు ఆమెసఖులకు తప్ప ఇతరుల కెవ్వరికిని ప్రవేశము లేకుండ చేసె నన్నమాట వేయిసంవత్సరములు ఆతఁడు ఆమెతో అక్కడ క్రీడించుచుండెను. ఆమెకు ఆతనివలన మాయావి దుందుభియు జన్మించిరి. యౌవనము వచ్చినంతనే వా రిరువురు స్వతంత్రులై వెడలిపోయిరి. తుదకు హేమకు మండోదరి జన్మించెను. మేరుసావర్ణిపుత్రికయైన స్వయంప్రభ హేమకు ప్రాణసఖి. అందువలన హేమ కాలక్షేపముకొఱకు స్వయంప్రభను తమతో నుండుటకు ఆహ్వానించి, యోగినియు తాపసియు నైన యామెకొఱకు ప్రత్యేకములైన వసతు

లను ఏర్పఱచెను. ఎంతకాల మైనను హేమ మయునియొద్దనుండి స్వర్గమునకు రాకుండుటచే ఇంద్రుఁడు స్వయముగా వచ్చి ఆమెను పంపు మని యడిగి యుండును. మయుఁడు హేమను వదలఁజాలక, "నీకు పౌలోమి యెట్లు భార్యగా నున్నదో నాకు ఈహేమయు దేవతల చేత ఈయఁబడినభార్య. కావున నేను పంపను'' అని యింద్రుని ధిక్క రించియుండును. అప్సరసలు ఎవ్వరికిని భార్యలు కారు. వారు దేవత లకు సాధారణమైన సంపద. కావున ఏయప్సరస నైనను కొంతకాలము అనుభవింపవచ్చును కాని ఆమెను తనకు భార్యగా ఎవ్వఁడును భావిం చుట తగదు. మఱియును మయుఁడు హేమకు శచీదేవితో సామ్య మును చెప్పినంతనే ఇంద్రుఁడు క్రుద్ధుఁడై అశనితో వానిని ప్రహ రించి మూర్ఛితుని గావించి హేమను స్వర్గమునకుఁ దీసికొనిపోయి యుండును. ఆమె స్వర్గమునకు పోవుచు స్వయంప్రభయొద్ద వీడ్కో లును గైకొనుచు "మయుఁడు నాకొఱకు నిర్మించిన సరోవరసౌధాది మహితమైన యీవనమంతయు ఇంక నీదే; దీనిని రక్షించుచుండుము; నేను ఎప్పు డైనను వచ్చి నిన్ను కలిసికొనుచుందును'' అని యీ వన మును ఆమెకు అప్పగించి వెడలిపోయి యుండును హేమ మరల ఎప్పుడైన వచ్చు నేమో యని నిరీక్షించుచు మయుఁడు మందోదరిని పెంచుచు పదునాలుగుసంవత్సరము లుండి యౌవనము నొందిన యామెకు వరునికొఱకు అన్వేషించుచు ఆవనమును వీడి అనేక ప్రదేశ ములలో ఆమెతో కూడ పర్యటించుచు తుదకు ఆమెను రావణున కొసంగి బాధ్యతనుండి విముక్తుఁడై మరల హేమస్మృతుంతో వ్యధా కరమైన యీవనమునకు పోవుటకు ఇచ్చగింపక తపస్సు చేసికొనుటకై ఏదే నొక తపోవనమునకు పోయియుండును. ద్వాపరాంతమున ఇతఁడు ఖాండవవనమునం దుండి, అది యగ్నిపాలై నప్పుడు, కృష్ణార్జునులచే రక్షింపఁబడి ధర్మజునకు మయసభను నిర్మించి బహూకరించెను.

స్వయంప్రభ అనుమతి ఇచ్చినంతనే వానరులు ఫలమూలములను భక్షించి నీరు త్రావి విశ్రమించిరి. అప్పుడు ఆంజనేయుఁడు ఆమె యొద్దకు పోయి సీతావృత్తాంతమును తమయన్వేషణకారణమును సంగ్రహముగా చెప్పి యిట్లనెను. "మేము ఆఁకలిదప్పికలతో అల్లాడుచు ఒక చెట్టుక్రిందికి చేరి అన్నివైపులకు చూచుచుంటిమి. ఈబిలములోనుండి కొన్నిపక్షులు నీటితోఁ దడిసి పైకివచ్చుచుండెను. ఇందు నీరుండు నని యూహించి అందఱము ఇందు ప్రవేశించితిమి. చీఁకటిలో ఒకరిచేతుల నొకరు పట్టుకొని ఎట్లో లోనికి వచ్చితిమి. నీయాతిథ్యమున మే మందఱమును బ్రతికితిమి. నీకు ఏమి ప్రత్యుపకారము చేయు మందువో చెప్పుము."

ఉపకారమును పొందువా రందఱకును ప్రత్యుపకారము చేయవలయు నను తలంపు కలుగదు. మహాపురుషులు ఇతరులవలన ఎంత చిన్న యుపకారమును పొందినను దానిని ఉపేక్షింపక విస్మరింపక తమకు చేతనైనంతవఱకు ప్రత్యుపకారము చేయుటకే ప్రయత్నింతురు.

ఆయన ఇట్లనుటవలన ఆమె ఎంతయో ప్రసన్నురాలై "మీ విషయమున నేను పరితుష్టురాల నైతిని; ధర్మానుష్ఠానపరాయణనైన నాకు దేనితోను పనిలేదు" అనెను. అప్పుడు ఆంజనేయుఁడు ఆమె నిట్లు ప్రార్థించెను "అమ్మా! మే మందఱము నిన్ను శరణు పొందుచున్నాము. ఈబిలములోనికి వచ్చుటతో మా కీయఁబడిన గడువు గడచిపోయినది. మేము సుగ్రీవాజ్ఞకు భయపడుచున్నాము. మాపై పెద్ద కర్తవ్యము కలదు. మమ్ము ఎట్లైనను దయతో వెలుపలికి చేర్పుము" ఆమె, "నిజమే ఇందులోనుండి మీరు బయల్పడుట దుర్ఘటము. అయినను నాతపఃప్రభావముచేత మిమ్ము వెలుపలికి చేర్చెదను. మీరందఱును కనులు మూసికొనుఁడు" అనెను. వెంటనే వా రందఱును అట్లే

కావించిరి. కొంతసేపైనతరువాత ఆమె "కనులు తెఱువుఁ" డనెను. వారు కనులు తెఱచునప్పటికి గుహవెలుపలికి వచ్చియుండిరి. ఆమె వారిభయము నుపశమింపఁజేయుచు ప్రియవాక్యములు పలికి, "ఇది వింధ్యము; ఇది ప్రస్రవణము; అది మహోదధి" అని గుర్తులు చూపించి మరల గుహలోనికి పోయెను.

వానరులు గుహలో ప్రవేశించి ఫలమూలజలములను పొందఁ గలుగుటకు, స్వయంప్రభవలన బిలములోనుండి బయల్పడుటకు ఆంజ నేయుని బుద్ధిశక్తి వాక్చాతుర్యము ప్రధానకారణము లనుట స్పష్టము. ఇతరులకు అట్టిచొరవ లేకుండుట గమనింపఁదగియున్నది.

## 2. సంపాతివృత్తాంతము

స్వయంప్రభ వెడలిపోయినతరువాత అంగదాదులు పుష్పించిన యొక చెట్టునీడయందు కూర్చుండి చుట్టును పరికించి పుష్పించియున్న లతావృక్షములను చూచి వసంతము వచ్చుచున్న దని యొకరి కొకరు చెప్పుకొని దుఃఖింపఁజొచ్చిరి. అప్పుడు అంగదుఁడు అందఱను చూచి యిట్లు పలికెను. "మనకు గుహయందే కాలము గడచిపోయినది. సీతను కనుగొనక కాలము నతిక్రమించి సుగ్రీవునియొద్దకు పోయినచో మనకు మరణము తప్పదు. సహజముగనే సుగ్రీవుఁడు తీక్ష్ణస్వభావుఁడు; ఇప్పుడు రాజు; మనలను క్షమింపఁడు. కావున మన మందఱమును ఇచ్చట ప్రాయోపవేశనము చేయుటయే మేలు. సుగ్రీవుఁడు రాముని మాటపై నాకు యువరాజపట్టాభిషేకమును చేసినాఁడు కాని, తనకు ఇష్టమై కాదు. నాతండ్రిమూలమున నాయందు బద్ధవైరుఁడై యున్న సుగ్రీవుఁడు నాయందలి యీయపరాధమును నిమిత్తముగా చేసి నన్ను తప్పక సంహరించును. కావున పవిత్రమైన ఈసాగరతీరమున ప్రాయోప వేశనము నాకు మేలు". తక్కినవానరనాయకులు, "మరల సీతను

వెదకుదము. ఆమెయునికి తెలిసినచో సుగ్రీవునియొద్దకు పోవుదము లేకున్నచో ఇక్కడనే మరణాంతము'' అని పలికిరి.

శ్లో॥ వింధ్యస్య తు గిరేః పాదే సంప్రపుష్పితపాదపే।
ఉపవిశ్య మహాత్మానః చింతా మాపేదిరే తదా॥ 13

శ్లో॥ తతః పుష్పాతిభారాగ్రాన్ లతాశతసమావృతాన్।
ద్రుమాన్ వాసంతికాన్ దృష్ట్వా బభూవు ర్భయశంకితాః॥ 14

శ్లో॥ తే వసంత మనుప్రాప్తం ప్రతిబుద్ధ్వా పరస్పరం।
నష్టసందేశకాలార్థా నిపేతు ర్ధరణీతలే॥ 15

[గో.టీక:-త ఇతి। వసంతం అనుప్రాప్తం ప్రత్యాసన్నం। తదానీం హి శిశిరః। తథాహి-శరత్కాలాంతే మార్గశీర్షే మాసి సేనాం సన్నిధాప్య పౌషమాస మవధిం కృత్వా ప్రస్థాపితవాన్। స పౌషో మాఘ శ్చాతీతః ఫాల్గున ఏవ ప్రవృత్త ఇతి। తేన వసంతః ప్రత్యాసన్న ఏవ న ప్రాప్తః]

కిష్కింధ-సర్గ-53

ఇక్కడ వారు వసంతము వచ్చుచున్న దని భయపడుచున్నప్పుడు ఏమాసము జరుగుచున్నది? సుగ్రీవుడు మార్గశీర్షమాసమున సేనను రామునియొద్దకు తెచ్చి అక్కడనుండి పుష్యమాసము అవధిగా చేసి వానరులను అన్నిదిక్కులకు పంపెను. అంగదాదులకు పుష్యమే కాక మాఘము గడచిపోయినది; ఫాల్గునము జరుగుచుండెను. ఆంజనేయుడు లంకయందు ప్రవేశించినదినమున ఇంచుమించుగా పూర్ణచంద్రుడు తెల్లవారుజామువఱకు ప్రకాశించుచున్నట్లు వర్ణింపబడియున్నది. అందువలన ఆంజనేయుడు ఫాల్గుణశుద్ధత్రయోదశియందు లంకలో ప్రవేశించె నని గ్రహింపవచ్చును.అంగదాదుల దుఃఖము, సంపాతి వచ్చి నూఱుయోజనములదూరమున లంకలో సీత యున్న దని

చెప్పుట, జాంబవంతుని ప్రోత్సాహమున ఆంజనేయుఁడు లంకకు పోవుట అను సంఘటనము లన్నియు ఒక్కదినముననే అనఁగా ఫాల్గుణశుద్ధ త్రయోదశియందే జరిగిన వని గ్రహింపవలసియున్నది. వసంతము సమీపించినది (వసంత మనుప్రాప్తం) అని వారు తలంచుటవలన ఫాల్గుణమాసములో కూడ ఇంచుమించుగా సగము జరిగిన దని స్పష్ట మగుచున్నది

అంగదాదులమాటలను విని తారుఁ డిట్లనెను. "మాయావిహిత మైన యీబిలము దుర్గముగా నున్నది. ఇందే యుందము. ఇక్కడ నున్నచో మనకు రామసుగ్రీవులవలననే కాదు ఇంద్రునివలన కూడ భయ ముండదు. మీ కందఱకును సమ్మత మైనచో ఇందే యుందము."

తారునియీప్రసంగము ఏఁబదిమూఁడవసర్గయొక్క అంతమున విశేషవృత్తములలో రచింపఁబడియున్నది. ఈప్రసంగముపై ఆధారపడి ఏఁబదినాల్గవసర్గ ఆరంభమగుచున్నది. కావున ఈప్రసంగము కథాగమనమున ఆవశ్యకమే. కాని విశేషవృత్తములు మహర్షి రచనముగాఁ దోఁచుట లేదు. ఇక్కడ గ్రంథపాతము జరుగఁగా ఏమహాకవియైన పూరించియుండునా అను సందేహమునకు అవకాశము కలుగుచున్నది.

తారుని మాటలను అంగదుఁడు చెవియొగ్గి ఆదరముతో వినఁజొచ్చెను. తక్కినవారును అందులకు అనుకూలురుగనే యుండిరి. ఆ పరిస్థితి కొనసాఁగినచో వా రందఱు మరల బిలములోనికి పోవుట సంభవించునట్లుండెను. ఆపరిస్థితిని తప్పించుచు ఆంజనేయుఁడు వారిని బెదిరించుచు అంగదునితో ఇట్లనెను. "నీవు మీతండ్రివలె సమర్థుఁడవే; కపిరాజ్యమునకు యోగ్యుఁడవే కాని యీవానరులు అస్థిరచిత్తులు; నీవు ఈబిలమున వానరరాజ్యమును ఏర్పఱచినచో జాంబవంతుఁడు నీలుఁడు సుహోత్రుఁడు మొదలగునాయకులు సుగ్రీవుని వదలుకొని నిన్ను సేవింపరు. సామదానాదికములతో నీవు వారిని లోఁబఱచుకొనలేవు.

అవియునుగాక ఈబిలమును ఒకమహాదుర్గమునుగా నీవు భావించు చున్నావు. కాని యిది లక్ష్మణునిబాణములకు అభేద్యము కాదు. ఇక్కడ నీవు నిలువ నిశ్చయించినంతనే ఇప్పుడు నీతో నుండుటకు అంగీకరించిన యీవానరు లందఱు భార్యాపుత్రులను స్మరించుచు గుంపులు గుంపులుగా వెడలిపోవుదురు నీవు ఏకాకివై లక్ష్మణునిబాణములకు ఎట్లు తట్టుకొనఁగలవు? ఇంత యేల సుగ్రీవుఁడు ధర్మకాముఁడు; మీతల్లియొక్క ప్రీతిని నిత్యము కోరువాఁడు. కావున నీవు వినయముతో అతనియొద్దకు పోయినచో అతఁడు ని న్నెప్పుడును వధింపఁడు."

అంగదుఁడు ఆంజనేయునిమాటలకు అంగీకరింపక యిట్లనెను. "సుగ్రీవునియందు స్థైర్యశౌచదయార్జవాదిగుణము లేవియును లేవు. అతఁడు గుణవంతుఁడే యైనచో, అన్న జీవించియుండఁగా, తల్లివంటి అన్నభార్యను తనకు భార్యనుగాఁ గై కొనునా? అన్న యుద్ధాభిముఖుఁడై యుండఁగా ధార్మికుఁడైనచో బిలద్వారమును మూసివచ్చునా? అగ్నిసాక్షికముగా మైత్రిని గావించుకొని ఉపకారమును పొంది రాముని మాటనే మఱచునా? లక్ష్మణునకు భయపడి కదా అతఁడు సీతాన్వేషణమునకు వానరులను పంపినాఁడు! అట్టివానిని విశ్వసింపవచ్చునా? అతఁడు తనకుమారుని (అప్పటికి లేఁడు. ఇకముందు కలిగినచో) రాజును చేయును గాని, దాయాదిని నన్ను బ్రతుకనిచ్చునా? అపరాధినైన నన్ను అతఁడు ఉపాంశువధముననో బంధనముచేతనో ఏదే నొకవిధమున తనమార్గమునుండి తొలఁగించుకొనును. కావున ఆదుర్గతికన్న ఇచ్చట ప్రాయోపవేశమే నాకు మేలు. మీరు యథేష్టముగ పొండు. నేను మాత్రము కిష్కింధకు రాను. రామలక్ష్మణులకు రుమాసుగ్రీవులకు నాయభివాదనములను తెలుపుఁడు; మాయమ్మ నోదార్పుఁడు. నేను మృతుఁడ నైనచో ఆమెయు ప్రాణములను వదలును."

పిమ్మట అంగదుఁడు దర్భలను పఱచుకొని వానియందు కూర్చుండెను. వానరు లందఱును కన్నీరు విడుచుచు జలోపస్పర్శనము

కావించి దర్భలను పఱచుకొని యం దుపవిష్టులై ప్రాయోపవేశనము గావించి సుగ్రీవుని నిందించుచు వాలిని మెచ్చుకొనఁజొచ్చిరి.

అక్కడ దాపుననే యొకగుహయందున్న సంపాతి ఆ కలకలమునకు వెలుపలికి వచ్చి దర్భలయందు ప్రాయోపవేశనము చేసి కూర్చుండి యున్న వానరులను చూచి బిగ్గరగా ఇట్లనుకొనెను. "నాకు భాగ్యవశమున చిరకాలమునకు భక్ష్యము నాచెంతకే వచ్చినది. వీరి నందఱను ఒక్కొక్కరుగా మృతులైనయంతనే భక్షించుచుందును" ఆ మాటలను విని యంగదుఁడు ఆ వైపు తిరిగి సంపాతిని చూచి హనుమంతునితో ఇట్లనెను. "చూడుము; ఈగ్రద్దరూపమున యముఁడు వానరులకు దాపురించినాఁడు. రాజశాసనము రామునికార్యము జరుగలేదు. అకస్మికముగా ఈయజ్ఞాతమైన విపత్తు తటస్థించినది. ధర్మజ్ఞుఁడైన జటాయువుచేత రామునకు ప్రియముఁ గావింపఁబడినది. రామకార్యార్థమై తిరుగుచు సీతను గానలేక మనమే వ్యర్థుల మైతిమి. జనస్థానమున రావణుని చేత రణమున నిహతుఁడైన జటాయువు మనవలె సుగ్రీవునిభయము నెఱుంగక యుత్తమగతి నొంది సుఖశాలి యయ్యెను." ఈమాటలు విని సంపాతి ఆర్తుఁడై యిట్లనెను. "ఎవరయ్యా మీరు? చిరకాలమునకు మీవలన నాతమ్ముని ప్రశంసను వినుచున్నాను. వానికి జనస్థానమున రావణునితో యుద్ధ మేల కలిగినది? సూర్యకిరణములచేత దగ్ధపక్షుఁడనైన నేను దిగి రాలేకున్నాను. నన్ను ఈగుహనుండి క్రిందికి తీసికొనిపొండు."

సంపాతి శోకగద్గదస్వరమున మాటాడుచున్నను వారికి అతని యాకారమునుబట్టి భయమే కలుగుచుండెను. కాని, "మన మెట్లయినను ప్రాయోపవేశనమే గావించుచున్నాము గదా! ఈగ్రద్ద భక్షించినచో త్వరితముగనే దేహముక్తుల మగుదుము" అని తలంచుచు వారు సాహసించి సంపాతిని క్రిందికి తీసికొనివచ్చిరి. అంగదుఁడు జటాయు

వృత్తాంతము తమవృత్తాంతమును కూడ చెప్పెను. అది విని సంపాతి శోకించుచు మహాస్వనముతో ఇట్లనెను. "వృద్ధత్వముచేత ఱెక్కలు లేకపోవటచేతను తమ్మునిపగను తీర్పలేకున్నాను. పూర్వము వృత్రవధ జరిగినప్పుడు నేను నాతమ్ముఁడు పందెము వైచుకొని పై కెగిరితిమి సూర్యుఁడు గగనమధ్యమున చేరునప్పటికి జటాయువు చండకిరణపీడితుఁడై సోలుచుండఁగా నేను సోదరస్నేహమున వానిని నాఱెక్కలతో కప్పితిని. వెంటనే నేను నిర్దగ్ధపక్షుఁడనై యిచ్చట పడితిని అప్పటినుండియు జటాయువువృత్తాంతమే నాకు తెలియలేదు" అంగదుఁడు, "అట్లయినచో ఆరావణుఁడు ఎక్కడ నున్నాఁడో నీకు తెలిసినచో చెప్పుము" అని యడిగెను. సంపాతి యిట్లు చెప్పెను. "దగ్ధపక్షుఁడను వృద్ధుఁడను వాఙ్మాత్రముగా నైనను రామునకు సాయ మొనరింతును. రావణుఁడు సర్వాభరణభూషితయైన యొకతరుణిని తీసికొనిపోవుచుండఁగా ఒకనాఁడు చూచితిని. ఆమె "రామా! రామా!" అని యాక్రందనము చేయుచుండెను. కావున ఆమె సీతయే యైయుండును. రావణునినివాసము లంక. అది యిచ్చటికి నూఱుయోజనముల దూర మున సముద్రములో నున్నది. రావణాంతఃపురములో సీత సురక్షితయై యున్నది. నేను ఇక్కడనుండి రావణుని జానకిని స్పష్టముగా చూచు చున్నాను. సుపర్ణునివంశీయులమైన మాకు చక్షుర్బలము అట్టిది. మేము ఆహారముయొక్క బలముచేత సహజముగా కూడ నూఱుయోజనము లకు మించి నిత్యము చూచుచుందుము. మీరు సముద్రమును దాఁటుటకు ఉపాయమును ఆలోచింపుఁడు వైదేహిని చూచి కృతార్థులై రాఁగలరు. నన్ను సముద్రమునొద్దకు తీసికొనిపొండు. నాతమ్మునకు ఉదకప్రదా నముఁ గావింతును."

వానరులు సంపాతిని సముద్రమునొద్దకు తీసికొనిపోయిరి. అతఁడు తమ్మునకు ఉదకప్రదానము గావించి స్నానమొనర్చినపిమ్మట వానరు లతనిని అంగదునియొద్దకు చేర్చిరి.

ఇంతటితో ఏఁబదియెనిమిదవసర్గ పూర్తియగును. ఏఁబది తొమ్మిదవసర్గయొక్క ఆరంభమున గోవిందరాజస్వామి అక్కడి నుండి అయిదుసర్గలు, 59, 60, 61, 62, 63 అన్నికోశములయందును కన్పించుట లేదని అవి లేకున్నను కథ సంఘటితముగనే జరిగి పోవుచున్నదని, వెనుక చెప్పినదానికి ఈసర్గలలోని వృత్తాంతమునకు విరోధము స్ఫురించుచున్నదని, కావున ప్రక్షిప్తములని, అయినను వ్యాఖ్యానించుచున్నానని చెప్పెను.

గో. టీక;—తత స్తదమృతాస్వాద మిత్యారభ్య పంచసర్గాః ప్రక్షిప్తాః సర్వకోశేష్వదర్శనాత్ తాన్ వినాపి కథాసంఘట్టనాత్ పూర్వోక్తార్థవిరోధస్ఫోరకత్వా చ్చ। తథాపి తే వ్యాఖ్యాస్యన్తే। శ్లో. 1-సర్గ.59.

ఆయన ఈహేతువులను వివరింపలేదు. కాని ఈ యయిదు సర్గములలోని వృత్తాంతములను పరిశీలించినచో ఈక్రిందిహేతువుల వలన ఇవి ప్రక్షిప్తములు కావేమో యని తోఁచుచున్నది. వీనిలో విశేషఛందస్సులలో వృత్తములు లేవు. అర్వాచీనకవులరచనమువలె శైలి ప్రౌఢముగ లేదు. శైలి సులభమై సరళమై వాల్మీకిరచనము వలెనే యున్నది. సంపాతి జటాయువునకు ఉదకప్రదానము చేసి వచ్చినతరువాత, సీతారావణులనుగూర్చి ఆసోదరులవృత్తాంతమును గూర్చి తెల్లిసికోవలయు నని వానరులు తలంచుట సహజము. జటాయువు రామునకు ఎంతో ఉపకారము చేసెను. ఇప్పుడు సంపాతి కూడ వానరులకు అట్టియుపకారమునే చేసెను. అట్లు మహోపకార మొనర్చిన సంపాతి సోదరునిగూర్చి దుఃఖించుచుండఁగా వారు అతనిచేత సోదరుని వృత్తాంతమును విని సానుభూతిని ప్రకటించి ఆతనికి సాంత్వనము కలిగించుట ఆవశ్యకము. స్వయంప్రభావృత్తాంతమును వారు ఎట్లు వినిరో అట్లే సంపాతివలన ఆతనివృత్తాంతమును అట్లే వినిరి. అట్లుగాక వారు వెంటనే సంపాతిని వదిలిపెట్టి పోవుట అసహజము. మఱియును

సంపాతిప్రసంగమున ప్రధానకథకు సంబంధించిన రెండు ముఖ్యవిషయములు తెలియుచున్నవి. సంపాతితో వారు మాటాడుచున్నయాప్రదేశము, అనఁగా వింధ్యముయొక్క దక్షిణపశ్చిమకోటి దక్షిణసముద్రమునందున్న దనువిషయము మొదటిది. సీతాదేవి లంకలో సంవత్సరకాలము శత్రువు లిచ్చినయాహారమును భుజించుచున్నదా? లేక యింతకాలము నిరాహారముగనే యున్నదా? అనుసందేహములకు సమాధానముగా ఆమె రాక్షసులయన్నమును భుజించుట లేదని యింద్రుఁడు పంపుచుండినపరమాన్నమును భుజించుచుండె ననుట రెండవది. ఈకారణములచేత ఈయయిదుసర్గలు ప్రక్షిప్తములు కావనియే తోఁచుచున్నది.

సముద్రతీరమునుండి సంపాతిని వృక్షమూలమునకు చేర్చినతరువాత అతఁడు ఏమి చెప్పునో వినవలయు నని అంగదాదులు అతనిని పరివేష్టించి కూర్చుండిరి. అప్పుడు జాంబవంతుఁడు, "సీత యెక్కడ నున్నది? ఆమె హరింపఁబడుచుండఁగా చూచిన దెవరు?" అని సంపాతిని అడిగెను. సంపాతి వారికి ఊరటను కలిగించుచు, "వైదేహియొక్క హరణమును నే నెట్లు వింటినో, ఎవనిచేత ఆవృత్తాంతము నాకు చెప్పఁబడినదో ఆమె ఎక్కడ ఉన్నదో చెప్పెదను వినుఁడు" అని చెప్పమొదలిడెను.

ఇచ్చట సందేహమునకు అవకాశము కలదు. ఈప్రశ్నలను అతనిని ఇదివఱకే అంగదుఁ డడిగెను. దానికి అతఁడు సమాధానముగా రావణుఁడు సీతను తీసికొనిపోవుచుండఁగా నేను చూచితి నని, ఆమె లంకలో రావణునియంతఃపురమున సురక్షితయై యున్నదని, వారి నిద్దఱను తా నప్పుడు లంకలో చూచుచున్నా నని చెప్పెను. ఇప్పుడు మరల ఆవిషయమునే జాంబవంతుఁ డడుగుట కవకాశ మే మున్నది? అదియును గాక సీత హరింపఁబడుచుండఁగా తాను చూచినట్లుగా చెప్పిన

సంపాతి వెంటనే ఆవృత్తాంతమును తాను విన్నట్లుగా చెప్పుట పూర్వో త్తరవిరోధముగా నున్నది. ఈవిరోధమునే గోవిందరాజస్వామి గమనించియుండును. కాని యిది కేవలము అసహజము కాదు. మనకు దేనియందు అధికమైన యాదర ముండునో అవిషయమును విశేషముగా తెలిసికోవలయు నను తలంపుతో అనేకవిధముల ప్రశ్నించుచుందుము. అట్లే జాంబవంతుఁడు కూడ, సంపాతి తమ్మునిగూర్చి శోకించుచు చెప్పిన సంగ్రహవిషయముతో, తృప్తిపడక విశేషములను తెలిసికొనఁగోరి మరల ప్రశ్నించెను. సీత రావణునియంతఃపురములో దీనురాలై సురక్షితయై యున్నదనఁగా అతనిచేత భంగపడి వానిభార్యలలో ఒకతెయై యింకను దుఃఖించుచున్నదా? లేక పాతివ్రత్యమును కోల్పోక రాముని రాకను ప్రతీక్షించుచున్నదా? నేరుగా లంకలోనికి చూడఁగలుగుచున్న సంపాతివలన వారు అసందేహమును తీర్చుకొనఁదలంచుట సహజము. అట్లే సంపాతి సీతాహరణమును చూచినప్పుడు ఆసమయమున ఇతరులును చూచియుండవచ్చును. అట్టిఋషులవలననో గంధర్వాదులవలననో ఇంకేమైన విశేషములు తెలిసినచో చెప్పుమని జాంబవంతునియభిప్రాయము. అందువలన దీనిని పూర్వాపరవిరోధముగా తలంప నక్కఱలేదు.

సంపాతి యిట్లు చెప్పెను. "నేను ఈగిరియందు పడిననాఁటి నుండి నాకుమారుఁడు సుపార్శ్వుఁ డనువాఁడు భుక్తివేళకు ఆహారమును తెచ్చియిచ్చుచున్నాఁడు ఒకనాఁడు వాఁడు సాయంకాలమునకు రిక్తహస్తుఁడై వచ్చెను. నాకు ఆఁకలి చాలతీవ్రముగ నుండెను. గంధర్వులకు కామము, భుజంగములకు కోపము, మృగములకు భయము, మాకు ఆఁకలి తీక్ష్ణముగా నుండును. అందువలన నేను వానిపై కోపించితిని. వాఁడు నన్ను శాంతింపఁజేయుచు ఇట్లు చెప్పెను. 'నేను మహేంద్రగిరియొక్క ద్వారమును ఆవరించి సాగరమున చరించు

చుండువేలకొలఁది జంతువులను నిరోధించుటకై ముఖమును క్రిందికి వంచియుంటిని. అప్పుడు ఉద్యత్పూర్యసమప్రభయైన యొకవనితను గైకొని కాటుకరాశివంటి పురుషుఁ డొకఁడు అచ్చటికి వచ్చుచుండుటను గమనించి అప్పటికి వారిని ఆహారముగాఁ గైకొన నిశ్చయించితిని. కాని వాఁడు నాయభిప్రాయమును గ్రహించి సామవచనములతో తనకు మార్గమి మ్మని ప్రార్థించెను. సామవచనములతో సమీపించినవానిని ప్రహరించునట్టి నీచుఁడు ఎందైన నుండునా? అట్టియెడల నావంటివాని సంగతి చెప్పవలసిన దే మున్నది? నేను వానికి మార్గము నిచ్చితిని. వాఁడు వెంటనే కడువేగమున గగనమార్గమునఁ జనెను. అప్పుడు ఖేచరు లందఱు నన్ను మెచ్చిరి. ''భాగ్యవశమున బ్రతికితివి గదా!'' అని యభినందించుచు ఆరాక్షసుఁడు రావణుఁ డని, రామునిభార్యను హరించుకొని పోవుచున్నాఁ డని చెప్పిరి. 'హా! రామా! హా! లక్ష్మణా!' అని యాక్రందించుచు భ్రష్టాభరణయు ముక్తమూర్ధజయునై ఆరావణునిచే తీసికొనిపోఁబడుచున్న సీతను చూచుచుండుటవలన నాకు ఆలస్యమైనది'. వానివలన సీతవృత్తాంతమును వినియును ఆమెను రక్షింపవలయు ననుతలంపు నాకు కలుగలేదు. ఱెక్కలులేనిపక్షిని నే నేమి చేయఁగలను? దాశరథికార్యము నాకార్యమే. ఇందు సందేహము లేదు. ఇప్పుడు నేను వాక్కుచేతను బుద్ధిచేతను చేయఁగలిగిన సాయమును చేయుదును. మనకు జయము కలుగునా కలుగదా యని మీరు సంశయింప నక్కఱ లేదు. దశగ్రీవుఁడు తేజోబలసమన్వితుఁడే యైనను మీరు కూడ సమర్థులే. మీకు ఏదియును దుష్కరము కాదు. కాలవిలంబము వలదు. ప్రస్తుతకార్యమును నిశ్చయింపుఁడు."

సంపాతి ఇట్లు చెప్పి ఆలోచించుచు పూర్వవృత్తాంతమును స్మరించుచు హర్షముతో నిమీలితనేత్రుఁడై కొంతసేపుండెను. అప్పుడు ఋక్షవానరులు తమలో **తాము** మాటాడుకొనఁజొచ్చిరి. సంపాతి కనులు తెఱచి సంతోషముతో వారికలకలమును వారించి యంగదుని

జూచి యిట్లనెను "మీ రందఱు నిశ్శబ్దముగా సావధానులై వినుఁడు. మైథిలివృత్తాంతము ఆమె జన్మింపకముందే నాకు తెలియును. ఇది నా కెట్లు తెలియవచ్చినదో చెప్పుచున్నాను. దగ్ధపక్షుఁడనై యీగిరి యందు పడినప్పుడు నాకు ఆఱురాత్రులకు తెలివివచ్చినది. అన్ని వైపులకును చూచితిని. నే నెక్కడ నుంటినో తెలియలేదు. క్రమ క్రమముగా సాగర శైలనదీ సరస్సులను చూచుచు ఇది దక్షిణోదధి తీరమందున్న వింధ్య మని గుర్తించితిని. ఇచ్చట దేవపూజితమైన యాశ్రమ ముండెను. అందు నిశాకరుఁ డను మహర్షి యుండెడివాఁడు. ఆయన స్వర్గమునకు పోయి ఇప్పటికి ఎనిమిదివేలయేండ్లయినది. నేను మాతమ్ముఁడును ఆయనను అనేకపర్యాయములు దర్శించితిమి. అందు వలన ఆయనను దర్శించినచో నేను ఆరోగ్యము నొందుటకు ఏదైన అవకాశము కలుగు నేమో యనునాశతో శిఖరమునుండి దర్భాగ్రముల చేత పరుషమైనప్రదేశమున మెల్లమెల్లగా జరుగుచు ఆశ్రమమును చేరి తిని. అచ్చట లత లన్నియు పుష్పించి వృక్షము లన్నియు ఫలించి సుగంధవాయువులు వీచుచుండెను. నేను ఆయనరాకను ప్రతీక్షించుచు అచ్చట నొకవృక్షమూలమునొద్ద కూర్చుంటిని. కొంతసేపటికి ఆ మహర్షి స్నాన మొనర్చి జ్వలితతేజస్కుఁడై ఉత్తరాభిముఖముగా వచ్చుచుండెను. యాచకులు దాతను సేవించుచు పరివేష్టించి వచ్చు విధమున ఆమహర్షిని ఋక్షములు సృమరములు వ్యాఘ్రములు సింహ ములు నాగములు సరీసృపములు ఆయనవెంట భక్తితో వచ్చుచుండెను. రాజు అంతఃపురమున ప్రవేశించినంతనే అమాత్యసహితమైనపరివార మంతయు వెనుదిరిగిపోవునట్లు, ఆమహర్షి ఆశ్రమమున ప్రవేశించి నంతనే ఆ మృగము లన్నియు వెడలిపోయెను.

మహర్షి నన్ను జూచుచు ఆశ్రమములోనికి పోయి కొంత సేపైనతరువాత తిరిగివచ్చి యిట్లనెను, "నీవు సంపాతివి గదా! అంగ వైకల్యము కలుగుటచేత నిన్ను గుర్తింపనైతిని. నీకు ఱెక్కలు పోయి

నవే! జటాయువు మీతమ్ముఁడు గదా! వాయువేగముగల మీ రిరువురు కామరూపులైన గృధ్రరాజులు గదా! మానవరూపములతో వచ్చి నాకు ప్రణమిల్లుచుంటిరి. ఱెక్కలేల పోయినవి? ఏమేని వ్యాధి వచ్చినదా? లేక ఎవరైన దండించిరా? ఏమి జరిగినది? చెప్పుము?''

శ్లో॥ త మంగద ముపాసీనం తైః స్సర్వై ర్వానరై ర్వృతమ్।
జనితప్రత్యయో హర్షా త్సంపాతిః పున రబ్రవీత్॥ 2

[తి, టీక:—జనితప్రత్యయః ఏష్య త్యన్వేషకా ఇతి నిశాకరము న్యుక్తారీత్యా రామదూతాగమనదర్శనా న్నిశాకరోక్తపక్షప్రరోహాది దర్శనా చ్చ నిశాకరవచసి విశ్వస్తః। హర్షా త్పక్షలాభజనిత హర్షాత్ ।]

శ్లో॥ కృత్వా నిశ్శబ్ద మేకాగ్రాః శ్రుణ్వన్తు హరయో మమ।
తథ్యం సంకీర్తయిష్యామి యథా జానామి మైథిలీమ్॥ 3

శ్లో॥ అస్య వింధ్యస్య శిఖరే పతితోఽస్మి పురానఘ।
సూర్యతాపపరీతాంగో నిర్దగ్ధ స్సూర్యరశ్మిభిః॥ 4

శ్లో॥ లబ్ధసంజ్ఞ స్తు షడ్రాత్రా ద్వివశో విహ్వల న్నివ।
వీక్షమాణో దిశ స్సర్వా నాభిజానామి కించన॥ 5

శ్లో॥ తత స్తు సాగరాన్ శైలా న్నదీః సర్వా స్సరాంసి చ।
వనాని చ ప్రదేశాం శ్చ నిరీక్ష్య మతి రాగతా॥ 6

శ్లో॥ హృష్టపక్షిగణాకీర్ణః కందరోదరకూటవాన్।
దక్షిణ స్యోదధే స్తీరే వింధ్యోఽయ మితి నిశ్చితః॥ 7

శ్లో॥ ఆసీ చ్చాత్రాశ్రమం పుణ్యం సురై రపి సుపూజితమ్।
ఋషి ర్నిశాకరో నామ యస్మి న్నుగ్రతపా భవత్॥ 8

శ్లో॥ అష్టౌ వర్షసహస్రాణి తే నాస్మిన్ ఋషిణా గిరౌ।
వసతో మమ ధర్మజ్ఞే స్స్వర్గతు తు నిశాకరే॥ 9

శ్లో॥ అవతీర్య చ విన్ధ్యాగ్రాత్ కృచ్ఛ్రేణ విషమాత్ శనైః।
తీక్ష్ణదర్భాం వసుమతీం దుఃఖేన పున రాగతః॥ 10

శ్లో॥ త మృషిం ద్రష్టుకామో ఽస్మి దుఃఖే నాభ్యాగతో భృశమ్।
జటాయుషా మయా చైవ బహుశో ఽధిగతో హి సః॥ 11

శ్లో॥ తస్యాశ్రమపదాభ్యాశే వవు ర్వాతా స్సుగంధినః।
వృక్షో నాపుష్పితః కశ్చి దఫలో వా న దృశ్యతే॥ 12

శ్లో॥ ఉపేత్య చాశ్రమం పుణ్యం వృక్షమూల ముపాశ్రితః।
ద్రష్టుకామః ప్రతీక్షే చ భగవన్తం నిశాకరమ్॥ 13

శ్లో॥ అథ పశ్యామి దూరస్థం ఋషిం జ్వలితతేజసమ్।
కృతాభిషేకం దుర్ధర్ష ముపావృత్త ముదఙ్ముఖమ్॥ 14

శ్లో॥ త మృక్షా స్సృమరాః వ్యాఘ్రా సింహా నాగా స్సరీసృపాః।
పరివా ర్యోపగచ్ఛన్తి దాతారం ప్రాణినో యథా॥ 15

శ్లో॥ తతః ప్రాప్త మృషిం జ్ఞాత్వా తాని సత్త్వాని వై యయుః।
ప్రవిష్టే రాజని యథా సర్వం సామాత్యకం బలమ్॥ 16

కిష్కింధాకాండ-సర్గ-60

సంపాతి తాను దగ్ధపక్షుఁడై పడినప్రదేశము దక్షిణోదధితీర మందున్న వింధ్యశిఖర మని చెప్పుచున్నాఁడు. ఇది గమనింపఁదగిన విశేషము. సుగ్రీవుఁడు వింధ్యమున సహస్రశిఖరములు కల వని చెప్పెను. ఇప్పుడు మనము మహారాష్ట్రప్రదేశమునకు ఉత్తరమున తూర్పునుండి పశ్చిమసముద్రమువఱకు వ్యాపించినశైలములవరుసనే వింధ్యమని తలంచుచున్నాము. కాని సంపాతిచెప్పినదానివలనబట్టి వింధ్య పర్వతశ్రేణి పశ్చిమసముద్రతీరమున ముగియక దక్షిణముగా క్రిందికి వ్యాపించి దక్షిణసముద్రతీరమున, అనఁగా, కన్యాకుమార్యగ్రప్రాంత మున ముగియుచున్న దన్నమాట. అనఁగా అరేబియాసముద్రతీరము

పొడవునను ఉత్తరదక్షిణములుగా వ్యాపించియుండి పడమటికనుమ లుగా ఇప్పుడు మనచే వ్యవహరింపఁబడుచున్న పర్వతశ్రేణి యంతయు ప్రాచీనకాలమున వింధ్యపర్వతశ్రేణిగానే భావింపఁబడుచున్న దన్న మాట. స్వయంప్రభగుహ, వానరులు సంపాతితో సమావేశమునొందిన ప్రదేశము, ఇప్పటి దర్భశయనము మొదలగుస్థలములకు సమీపమే యని స్పష్ట మగుచున్నది. భారతదేశముయొక్క యీదక్షిణపుకొన యొద్దనే తూర్పుసముద్రము పశ్చిమసముద్రము దక్షిణసముద్రముతో కలియుచున్నవి. ఇక్కడనున్న మహేంద్రగిరినుండియే ఆంజనేయుఁడు నూఱుయోజనముల సముద్రమును దాఁటి లంకకు పోయెను.

సంపాతి అంగదాదులతో మరల చెప్పఁబూనునప్పుడు పూర్వ వృత్తాంతమును స్మరించుచు హర్షముతో చెప్పె ననుట గమనింపఁదగి యున్నది. ఇచ్చట మూలమున "జనితప్రత్యయో హర్షాత్" అని యున్నది. ఎవనికి ప్రత్యయము కలిగినదో వాఁడు జనితప్రత్యయుఁడు. ప్రత్యయ మనఁగా జ్ఞానము. అనఁగా అప్పుడు సంపాతికి అంతకు పూర్వము విస్మృతమైయున్న క్రొత్తవిషయము స్మృతికి వచ్చె నన్న మాట. అప్పటివఱకును అతఁడు సుపార్శ్వుఁడు చెప్పినవృత్తాంత మునే భావించుచుండెను. అది కొన్నినెలలక్రిందట జరిగినది. కావున వెంటనే అతనిస్మృతిపథమునకు వచ్చెను. దానిని చెప్పి ముగించిన పిమ్మట ఎనిమిదివేలయేండ్లక్రిందట జరిగినవృత్తాంతము అతనికి జ్ఞప్తికి రాఁదొడఁగెను; అది నిశాకరుఁడు తనతో చెప్పినవిషయము. సీతవృత్తాంతమును సంపాతి వానరులకు చెప్పినపిమ్మట ఱెక్కలు వచ్చు నని నిశాకరుఁడు చెప్పెను. అంగదాదులు సీతారాములవృత్తాంత మును ప్రస్తావించుచున్నను, జటాయువుపేరు వినుటతోడనే సంపాతికి దుఃఖము పొంగివచ్చెను. సోదరునకు ఉదకప్రదానము గావించి రోద నము చేసినతరువాత దుఃఖము తగ్గిపోయి బుద్ధికి క్రమముగా ప్రశాంతత

కలిగి మొదట సుపార్శ్వుఁడు చెప్పినవిషయము తరువాత నిశాకరుఁడు చెప్పినవిషయము సంపాతికి జ్ఞప్తికి వచ్చెను. అంగదాదులకు తాను సీతవృత్తాంతమును చెప్పినచో నిశాకరుని వాక్యము ననుసరించి తనకు ఱెక్కలు వచ్చునుగదా అను హర్షముతో అతఁడు అంగదాదులకు ఆ విషయమును చెప్ప నారంభించెను.

సంపాతి మరల ఇట్లు చెప్పెను; "నేను ఆమహర్షికి జరిగిన వృత్తాంతమును ఇట్లు చెప్పితిని. 'అయ్యా! జరిగినది చెప్పుటకు సిగ్గగు చున్నది. వ్రణములవలనను వ్యాకులతను పొందుచున్నాను. నేను మా తమ్ముఁడు జటాయువు మాపరాక్రమతారతమ్యము నెఱుంగఁ గోరి కైలాసశిఖరమున మునులసమక్షమున సూర్యుఁ డస్తపర్వతమును చేరు లోపల సూర్యుని చేరుట పందెమునుగా పెట్టుకొని స్పర్థతో గర్వ మోహితుల్మై బయలుదేరితిమి. పైకి పోవుచున్నకొలఁది నగరములు రథ చక్రములవలె, నదులు సూత్రములవలె, హిమవద్వింధ్యాదిపర్వతములు జలాశయమున నిల్చియున్న యేనుఁగులవలె కన్పింపఁజొచ్చెను. దిక్కులు తెలియకుండెను. నేనెట్లో అతిప్రయత్నమున సూర్యునివంకఁ జూచి తిని. అప్పుడు సూర్యుఁడు భూమిప్రమాణమున కన్పించెను

ఇంతలో జటాయువు నాతో చెప్పకుండఁగనే క్రిందికి పడిపోవఁ జొచ్చెను. వాఁడు సోలిపోవుటను గుర్తించి నేను వెంటనే వానిని నా ఱెక్కలతో కప్పితిని. వాఁడు దగ్ధుఁడు కాలేదు. నేను దగ్ధపక్షుఁడనై వాయుపథమునుండి వింధ్యమునఁ బడితిని. జటాయువు జనస్థానమున పడియుండు నని యనుకొనుచున్నాను. రాజ్యహీనుఁడనై సోదరవిర హితుఁడనై ఱెక్కలుపోయిననేను వింధ్యశిఖరమునుండి పడి చావఁగోరు చున్నాను.'

ఇట్లు చెప్పుచు నేను రోదన మొనర్చితిని. ఆయనకొంతసేపు ధ్యానించి యిట్లనెను. 'నీకు ఱెక్కలు చిఱుఱెక్కలు బలవిక్రమములు

మరల కలుగును. ఒకమహాకార్యము జరుగవలసియున్న దని నేను పురాణమునందు వినియుంటిని. నేను ఆవిషయమునకు తపశ్శక్తిచేత చూచియు తెలిసికొంటిని. దశరథునిపుత్రుఁడు రాముఁడు సీతాలక్ష్మణ సహితుఁడై తండ్రిమాటను చెల్లించుటకు అరణ్యమునకు వచ్చును. అతని భార్యను రావణాసురుఁడు హరించును. వాఁ డామెను భక్ష్యభోజ్యాది సకలకామములతో ప్రలోభపెట్టును. ఆమె వాఁ డొసంగినయన్నము తినదు. ఆవిషయము నెఱింగి వాసవుఁడు దేవతలకు కూడ దుర్లభమైనది అమృతముతో సమానమైనదియు అగునన్నమును ఆమెకు ఈయఁ గలఁడు. అది యింద్రునివలన లభించిన దని ఆమె తెలిసికొని దానిలో అగ్రభాగమును తీసి 'నాభర్త కాని లక్ష్మణుఁడు కాని జీవించియున్నను దేవత్వమును పొందియున్నను వారి కిది యన్నము కాఁగలదు' అని చెప్పుచు భూతలమున కుశలయం దుంచును. కొంతకాలమునకు ఆమెను వెదకుచు రామదూత లిక్కడికి వత్తురు. వారికి నీవు సీతాదేవినిగూర్చి చెప్పవలసియున్నది నీవు ఇక్కడనుండి ఎక్కడికిని పోవద్దు. ఇట్లున్న వాఁడవు ఎక్కడికి పోఁగలవు? వారు వచ్చువఱకు వేచియుండుము. నీకు అప్పుడు ఱెక్కలు రాఁగలవు. నేను నీ కిప్పుడే ఱెక్కలు పుట్టింపఁ గలను. నీకు ఇప్పుడే ఱెక్కలు కలిగినచో నీవు ఎక్కడికైన పోవుట సంభవించును. నీవు ఇట్లే ఇచ్చటనే యున్నచో రామలక్ష్మణులకు మునులకు దేవేంద్రునకు ప్రియమును కావింపఁగలవు. నాకు కూడ రామలక్ష్మణులను చూడవలయు నను కోరిక కలదు. కాని యింకను ఈశరీరమును చిరకాలము వహింప నిచ్ఛగింపకున్నాను."

ఆయన ఇట్లు నాతో చెప్పి ఆశ్రమములోనికి పోయెను. నేను మెల్లగా శిఖరమునకు చేరి అప్పటినుండియు మీరాకను ప్రతీక్షించుచున్నాను. ఆమహర్షి మహాప్రస్థాన మొనర్చి స్వర్గమున కేగినతరు

వాత బహువితర్కములతో సంతాపము నన్ను దహింపఁజొచ్చెను. ఒక్కొక్కప్పుడు చచ్చిపోవలయునను తలంపు కూడ కలుగుచుండెను. కాని ఆమహర్షి వాక్యములను స్మరించి ఆప్రయత్నమునుండి విరమించు కొనుచుంటిని. "హా! రామా! హా! లక్ష్మణా!" అని సీత విలపించుచుండఁగా ఆమె రామపత్ని అని వ్యక్తమగుచుండఁగా నీ వేల ఆమెను రక్షింప వైతి వని, రావణునివీర్యము నెఱింగిన నేను, నాపుత్రుని తర్జించితిని. దశరథుని స్నేహమును పురస్కరించుకొని పుత్రుఁడు నాకు ప్రియమును కలిగింపలే దని పొగులుచుంటిని."

సంపాతి ఇట్లు చెప్పుచుండఁగా ఆతనికి ఎఱ్ఱనిఱెక్కలు మొలవఁ బొచ్చెను వానిని జూచుకొని యతఁడు ప్రహర్షము నొంది యిట్లనెను. "రాజర్షియైన నిశాకరునిప్రభావమువలన నాకు ఱెక్కలు వచ్చినవి. యౌవనమునందువలె పరాక్రమము కలిగినట్లు తోఁచుచున్నది, మీరు సీతను చూచుటకు సర్వథా యత్నింపుఁడు. నాకు ఇట్లు ఱెక్కలు కలుగుటయే మీకార్యసిద్ధికి సూచకము." వెంటనే అతఁడు తన గమన శక్తిని పరీక్షించుకొనుటకై గగనమున కెగెను.

శ్లో॥ అహం చైవ జటాయుశ్చ సంఘర్షా ద్దర్పమోహితౌ।
ఆకాశం పతితౌ దూరా జ్జిజ్ఞాసంతౌ పరాక్రమమ్॥ 3

శ్లో॥ కైలాసశిఖరే బద్ధ్వా మునీనా మగ్రతః పణమ్।
రవి స్స్యా దనుయాతవ్యో యావ దస్తం మహాగిరిమ్॥ 4

[తి. టీక:-రవిః యావ దస్తం మహాద్రిం యాయాత్ తతః ప్రాక్ ఆవాభ్యాం రవిః అనుయాతవ్యః అనుప్రాప్తవ్యః ఇతి ప్రతిజ్ఞా।]

శ్లో॥ అ ప్యావాం యుగపత్ప్రాప్తా వపశ్యావ మహీతలే।
రథచక్రప్రమాణాని నగరాణి పృథక్పృథక్॥ 5

శ్లో॥ తూర్ణ ముత్పత్య చాకాశ మాదిత్యపద మాస్థితౌ।
ఆవా మాలోకయావ స్త ద్వనం శాద్వలసన్నిభమ్॥ 7

శ్లో॥ ఉపలై రివ సంఛన్నా దృశ్యతే భూః శిలోచ్చయైః।
ఆపగాభి శ్చ సంవీతా సూత్రై రివ వసుంధరా॥ 8

శ్లో॥ హిమవాం శ్చైవ వింధ్య శ్చ మేరుశ్చ సుమహాగిరిః।
భూతలే సంప్రకాశ న్తే నాగా ఇవ జలాశయే॥ 9

శ్లో॥ తీవ్రః ఖేద శ్చ భయం చాసీ త్తదావయోః।
సమావిశత మోహ శ్చ తతో మూర్చా చ దారుణా॥ 0

శ్లో॥ న చ దిగ్ జ్ఞాయతే యామ్యా న చాగ్నేయీ న వారుణీ।
యుగాన్తే నియతో లోకో హతో దగ్ధ ఇ వాగ్నినా॥ 11

శ్లో॥ మన శ్చ మే హతం భూయః చక్షుః ప్రాప్య తు సంశ్రయమ్।
యత్నేన మహతా హ్యస్మి న్మనః సంధాయ చక్షుషీ॥ 12

శ్లో॥ యత్నేన మహతా భూయో భాస్కరః ప్రతిలోకితః।
తుల్యః పృథ్వీప్రమాణేన భాస్కరః ప్రతిభాతి నౌ॥ 13

కిష్కింధ–సర్గ–61

శ్లో॥ పురాణే సుమహత్కార్యం భవిష్య తీతి మయా శ్రుతమ్।
దృష్టం మే తపసా చైవ శ్రుత్వా చ విదితం మమ॥ 3

[తి. టీక:–పురాణే, నారదాదిభి రుచ్యమానే భవిష్యరామచరిత రూపే పురాణే, శ్రుత్వా విదితం, తపసా దృష్టం చ।]

శ్లో॥ రాజా దశరథో నామ కశ్చి దిక్ష్వాకువర్ధనః।
తస్య పుత్రో మహాతేజా రామో నామ భవిష్యతి॥ 4

శ్లో॥ అరణ్యం చ సహ భ్రాత్రా లక్ష్మణేన గమిష్యతి।
తస్మి న్నర్థే నియుక్తః సన్ పిత్రా సత్యపరాక్రమః॥ 5

శ్లో॥ నైరృతో రావణో నామ తస్య భార్యాం హరిష్యతి।
రాక్షసేంద్రో జనస్థానేఽవధ్య స్సురదానవైః॥ 6

శ్లో॥ సా చ కామైః ప్రలోభ్యన్తీ భక్ష్యై ర్భోజ్యైశ్చ మైథిలీ।
న భోక్ష్యతి మహాభాగా దుఃఖమగ్నా యశస్వినీ॥ 7

శ్లో॥ పరమాన్నం చ వైదేహ్యై జ్ఞాత్వా దాస్యతి వాసవః।
య దన్న మమృతప్రఖ్యం సురాణా మపి దుర్లభమ్॥ 8

[తి. టీక:-పరమాన్నం పాయసమ్। జ్ఞాత్వా నిరాహారతా మితి శేషః। వాసవో దాస్యతి స్వపురుషద్వారా ఇతి శేషః।]

శ్లో॥ త దన్నం మైథిలీ ప్రాప్య విజ్ఞా యేంద్రా దిదం త్వితి।
అగ్ర ముద్ధృత్య రామాయ భూతలే నిర్వపిష్యతి॥ 9

శ్లో॥ యది జీవతి మే భర్తా లక్ష్మణో వాపి దేవరః।
దేవత్వం గచ్ఛతో ర్వాపి తయో రన్న మిదం త్వితి॥ 10

కిష్కింధాకాండ-సర్గ-62

శ్లో॥ మహాప్రస్థాన మాసాద్య స్వర్గతే తు నిశాకరే
మాం నిర్దహతి సంతాపో వితర్కై ర్బహుభి ర్వృతమ్॥ 4

శ్లో॥ ఉదితాం మరణే బుద్ధిం మునివాక్యై ర్నివర్తయే।
బుద్ధి ర్యా తేన మే దత్తా ప్రాణానాం రక్షణే మమ॥ 5

శ్లో॥ సా మేఽపనయతే దుఃఖం దీప్తే వాగ్నిశిఖా తమః।
బుధ్యతా చ మయా వీర్యం రావణస్య దురాత్మనః॥ 6

శ్లో॥ పుత్త్రః స్సంతర్జితో వాగ్భి ర్న త్రాతా మైథిలీ కథమ్।
తస్యా విలపితం శ్రుత్వా తౌ చ సీతావియోజితౌ॥ 7

శ్లో॥ న మే దశరథస్నేహా త్పుత్త్రేణోత్పాదితం ప్రియమ్।
తస్య త్వేవం బ్రువాణస్య సంపాతే ర్వానరైః సహ॥ 8

శ్లో॥ ఉత్ప్రేతతు స్తదా పక్షౌ సమక్షం వనచారిణామ్। 9

కిష్కింధాకాండ-సర-63

పై వృత్తాంతమునుబట్టి సంపాతి సీతావృత్తాంతమును మూఁడు దశలలో స్మరించె నని వ్యక్తమగుచున్నది. రావణుఁ డామెను తీసికొనిపోవునప్పు డామె ఋష్యమూకముపై వానరులను జూచినప్పు డెట్లు విలపించుచు ఆభరణములను జార్చెనో అట్లే గుహకు ముందు సంపాతి కన్పించినప్పుడు కూడ ఆమె అట్లే విలపించియుండును. తమ్ము ఎవ రైనను బలవంతముగా హరించుకొనిపోవుచున్నప్పుడు స్త్రీలు కాని పురుషులు కాని దారిలో ఎవరు కన్పించినను వారు తమ్ము రక్షింతు రేమో అనునాశతో పెద్దగా విలపించుచుండుట సహజము. ఆకృతినిబట్టి సంపాతి జటాయువువంటివాఁడే. అందువలన అతఁడు రక్షించుటకు పూనినను పూనకున్నను తనవిషయమును రామలక్ష్మణులకు చెప్ప వచ్చు నని ఆమె పెద్దగా విలపించి యుండును. సంపాతి కుతూహలముతో తలపై కెత్తి చూచునప్పటికి రావణుఁడు అమితవేగముతో దాఁటిపోయియుండును. ఆవృత్తాంతమునే సుపార్శ్వుఁడు చెప్పినప్పుడు సంపాతి, నిశాకరుఁడు చెప్పినవృత్తాంతమును స్మరించి, హరింపఁబడినస్త్రీ "ఓ రామా! ఓ లక్ష్మణా!" అని విలపించుచున్నదన్నచో ఆమె రామలక్ష్మణులకు సంబంధించినదై యుండు నని, వారు దశరథునికుమారు లనియు స్మరించెను. జటాయువు దశరథునకు మిత్త్రుఁడైనచో సంపాతికి కూడ మిత్త్రుఁడై యుండుట సంభవము. తమ్మునకున్నంతమైత్త్రి లేకున్నను ఆయననుగూర్చి తెలిసి యుండుట మాత్త్రము తప్పదు. నిశాకరుఁడు చెప్పినవృత్తాంతములో దశరథునకు రాముఁడు లక్ష్మణుఁడు అను కుమారులు జన్మింతు రని వారు సీతతో అడవికి వత్తు రని రావణుఁడు సీతను హరించు నని విని యుండెను. అట్టియెడల జటాయువు భావించినట్లే మిత్త్రునియొక్క

కోడలిని రక్షించుట తమకు ధర్మకర్తవ్య మని సంపాతి కూడ భావించెను. సుపార్శ్వుఁడు ఆమెను రక్షించుటకు ప్రయత్నింపకపోవుట తనకు సంతోషమును కలిగింప లే దని సంపాతి యనెను.

ఇంక మూఁడవదశలో రామదూతలకు సీతవృత్తాంతమును చెప్పినచో తనకు ఱెక్కలు వచ్చు నని సంపాతి స్మరించెను. కావున సోదరుని యొక్క వధమును విని దుఃఖముచేత ఉద్విగ్నతను పొందిన సంపాతి జరిగినవిషయమును సాకల్యముగా పూసగ్రుచ్చినట్లుగ సక్రమముగ స్మరించి చెప్పఁజాలక అప్పుడప్పుడు కొంచెము కొంచెముగా స్మరించి చెప్పుట అసహజము కాదు.

## 3. హనుమత్ప్రశస్తి

సంపాతి వెడలిపోయినతరువాత, ఆతనిమాటలవలన వానరులు ప్రహృష్టులై సముద్రతీరమును చేరిరి. ఆకాశమువలె అనంతముగ కనిపించుచున్నదక్షిణసముద్రమును చూచి, దానిని ఎట్లు దాఁటవలయునో తెలియక వారు నిర్విణ్ణు లైరి. దానిని దాఁటలేకున్నచో సీతను చూచుట కుదురదు. సీతను చూడఁజాలకున్నచో మరల ప్రాయోపవేశము తప్పదు. అందువలన సీతనుగూర్చి విన్నప్పుడు మొదటఁ గలిగిన హర్షమంతయు పోయి వారిని మరల విషాద మావరించెను. అప్పుడు అంగదుఁడు వారి నిట్లు అనునయించెను. "ఏపరిస్థితియందును మనము విషాదమును పొందరాదు. విషాదము దోషవత్తర మైనది. కోపించిన పాము బాలునివలె విషాదము పురుషుని చంపును. విక్రమింపవలసిన తరుణమున ఎవఁడు విషాదమును పొందునో అట్టితేజోహీనునకు ఏ పురుషార్థము సిద్ధింపదు.

శ్లో॥ న విషాదే మనః కార్యం విషాదో దోషవత్తరః॥
విషాదో హన్తి పురుషం బాలం క్రుద్ధ ఇవోరగః॥ 9

శ్లో॥ యో విషాదం ప్రసహతే విక్రమే సముపస్థితే।
తేజసా తస్య హీనస్య పురుషార్థో న సిద్ధ్యతి॥ 10

తి. టీక:–విషాదం ప్రసహతే ప్రసహ్య విషాదే ప్రవర్తతే।

కిష్కింధాకాండ–సర్గ–64

అంగదుఁడు అగ్రేసరుల నందఱను చూచి "శతయోజనములు సముద్రమును లంఘించి సుగ్రీవుని సత్యసంధుని గావించి యీ వానరానీకమును మహాభయమునుండి యెవ్వఁ డుద్ధరింపఁగలఁడో వాఁడు ముందుకువచ్చి అభయ మొసంగును గాక!" అని పలికెను. అందులకు ఎవ్వఁడును వెంటనే సమాధానము చెప్పలేదు. కాని కొంతసేపైనతరువాత ఒక్కొక్కఁడు తనబలముకొలఁదిని చెప్పఁజొచ్చెను. గజుఁడు పదియోజనములు పోఁగల నని చెప్పఁగా, గవాక్షుఁడు ఇరువదియోజనములు చెప్పెను. శరభుఁడు ముప్పది, ఋషభుఁడు నలువది, గంధమాదనుఁడు ఏఁబదియు చెప్పిరి. ఇట్లు క్రమముగా ఒక్కొక్కరును పెంచి చెప్పిరి. సుషేణుఁడు ఎనుబదియోజనములు పోఁగల నని చెప్పెను. తరువాత జాంబవంతు డిట్లు చెప్పెను. "పూర్వము నాకు అప్రతిమమైన గమనశక్తి యుండెడిది బలిచక్రవర్తియొక్క యజ్ఞమునందు వామనుఁడుగా నున్న విష్ణుదేవుఁడు త్రివిక్రముఁడై మూఁడులోకములను ఆక్రమించినప్పుడు నేను ఆయనకు ప్రదక్షిణ మొనర్చితిని. కాని యిప్పుడు వృద్ధుఁడ నైతిని. అయినను ఇప్పుడు తొంబదియోజనములు పోఁగలను కాని అంతమాత్రమున కార్యసిద్ధి కాదు గదా!"

శ్లో॥ మయా వైరోచనే యజ్ఞే ప్రభవిష్ణు స్సనాతనః।
ప్రదక్షిణీకృతః పూర్వం క్రమమాణః త్రివిక్రమః॥ 15

కిష్కింధాకాండ-సర్గ 65

అందఱును చెప్పినతరువాఁత అంగదుఁ డిట్లు చెప్పెను. "నేను నూఱుయోజనములు పోఁగలను; కాని మరలఁ దిరిగి రాఁగలనా యని

సంశయించుచున్నాను." జాంబవంతుఁ డిట్లనెను. "ఇప్పుడు నీవు పోవు ప్రసక్తి యేమున్నది? ప్రభువు ఎప్పుడు ఇతరులను పంపునే కాని తాను పంపఁబడఁడు. మాకు ఇప్పుడు నీవు నాయకుఁడ వగుటచే ప్రభుఁడవు. నిన్ను మేము కళత్రమునువలె రక్షించుకో వలసియున్నది. ప్రభువు సైన్యమునకు కళత్రమువంటివాఁడు. ఇదియే పద్ధతి. ఇప్పు డీకార్యమునకు నీవు మూలము. కార్యమునకు ఏది మూలమో దానిని రక్షించుకోవలయు ననుట కార్యవిదులనీతి. మూలము చక్కఁగా ఉన్నప్పుడు గదా సర్వ గుణసమన్వితమైన ఫలము సిద్ధించును."

శ్లో॥ భవాన్ కళత్ర మస్మాకం స్వామిభావే వ్యవస్థితః।
స్వామీ కళత్రం సైన్యస్య. గతి రేషా పరంతప॥ 23

శ్లో॥ అపి వైతస్య కార్యస్య భవాన్ మూల మరిందమ।
తస్మా త్కళత్రవ త్తాత ప్రతిపాల్య స్సదా భవాన్॥ 24

శ్లో॥ మూల మర్థస్య సంరక్ష్య మేష కార్యవిదాం నయః।
మూలే హి సతి సిధ్య న్తి గుణా స్సర్వే ఫలోదయాః॥ 25

కిష్కింధాకాండ - సర్గ - 65

అప్పు డంగదుఁ డిట్లనెను. "అయ్యా! మఱి నేను బయలుదేరక, ఇతరు లెవ్వరును పోఁజాలకున్నచో కార్య మెట్లు సిద్ధించును? కార్యము సిద్ధింపకున్నచో సుగ్రీవునిదండనమును తప్పించుకొనుట ఎట్లు? కావున మనకు మరల ప్రాయోపవేశమే గదా గతి." జాంబవంతుఁ డతని ననున యించుచు ఇట్లు చెప్పెను. "ఇంతమాత్రమున కార్యమున కేమియు భంగము లేదు. కార్యసాధకుఁడైన వానిని నేను ప్రోత్సహింతును."

వేలకొలఁది వానరులు ఇట్లు మాటాడుకొనుచు విషణ్ణులై యుండఁగా ఆంజనేయుఁడు వారిప్రసంగములలో పాల్గొనక ఏకాంత మున నిశ్చింతుఁడై యుండెను. దీనినిబట్టి అంజనేయునిస్వభావములోని

యొక గుణవిశేషము వ్యక్తమగుచున్నది. ఇతరులు అయనయొద్దకు వచ్చి అర్థించి ప్రోత్సహించిననే తప్ప ఆయన ఏవిషయమునందును పాల్గొనడు; కుతూహలమును కూడఁ జూపఁడు. రామునియొద్దకు మొదట పోయినప్పుడు కూడ సుగ్రీవుఁడు పంపుటవలననే పోయి వారి యిద్దఱకు మైత్రిని గూర్చినాఁడు. ఆయనకు ఎప్పుడును కావలసినది ఏమియు నుండదు. అందువలన ఆయన దేనినిగూర్చియు సంకల్పము చేయఁడు. అందువలన ఏకార్యమును ఆరంభింపఁడు. అనఁగా ఆయన సంకల్పారంభరహితుఁడు. ఇది తత్త్వజ్ఞుని లక్షణము. శ్రీకృష్ణభగవానుఁడు అర్జునునితో ఇట్లు చెప్పెను. "ఎవనియొక్క సమారంభము లన్నియు కామసంకల్పవర్జితము లగునో, జ్ఞానాగ్నిచేత ఎవనికర్మ లన్నియు దగ్ధము లైనవో వానిని పండితుఁ డని బుధులు చెప్పుదురు."

శ్లో॥ యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః॥ 11

భగవద్గీత–అధ్యాయము–4–శ్లో.19

ఇట్టివారు తమప్రయోజనముకొఱకు ఏకార్యమును ఆరంభింపకున్నను, జీవితమునందు ధర్మముచేత కర్తవ్యముగా ఏర్పడిన కార్యములను మాత్రము సంకల్పించి వానిని ఆరంభించి చక్కఁగా నిర్వహింతురు. సముద్రలంఘనము విషయమున ఆయనకు కామము గాని సంకల్పము గాని లేదు. అయినను సుగ్రీవునిసచివుఁడుగా ఆయనకు ఆవశ్యకమైన కార్యమును నిర్వహించుట ధర్మముచేత కర్తవ్యముగా ప్రాప్తించినప్పుడు దానికి ఆయన పూనుకొనెను. తనకు కావలసినది ఏదియు లేకపోవుటచే ఆయన వీలైనపుడెల్ల ఏకాంతమునం దుండి ఆత్మానుసంధానమున ఆనందమును పొందుచుండు నని చెప్పవచ్చును.

జాంబవంతుఁడు,నిస్సంగుఁడై నిశ్చింతుఁడై ఏకాంతమున కూర్చుండి యున్న యాంజనేయునియొద్దకు, పోయి ఇట్లు ప్రశంసించెను. "ఈ

వానరానీకమున నీవే సర్వశాస్త్రవిశారదుఁడవు. ఇట్టినీవు మేమందఱము కార్యాలోచనవ్యగ్రులమై యుండఁగా ఏకాంతనిరతుఁడవై యొక్కమాటయును పలుకవేమి? ఇప్పు డేర్పడినకార్యమును గట్టెక్కించుటకు నీకన్న సమర్థుఁ డెవఁ డున్నాఁడు? నీవు సుగ్రీవునితో సమానుఁడవు; తేజోబలములందు రామలక్ష్మణులకు తుల్యుఁడవు; వేగమునందు గరుత్మంతుని నైతము మించఁగలవు. నీవు శైశవమున సూర్యుని జూచి ఫల మనుకొని పై కెగిరిపోయి చండకరణనిర్ధూతుఁడ వయ్యు విషాదము నొందకుంటివి. నీవిక్రమమును చూచి యింద్రుఁడు కోపావిష్టుఁడై వజ్రమును ప్రయోగింపఁగా శైలాగ్రమునఁ బడితివి. వజ్రఘాతమున నీహనువు మాత్రమే కొంచెము భగ్నము కాఁగా నీకు హనుమంతుఁ డను నామము ప్రసిద్ధమయ్యెను. మీతండ్రియైన వాయుదేవుఁడు ఇంద్రునిపై కోపించి వీచుట మానెను. పరమేష్ఠి మీతండ్రిని అనునయించి నీకు అశస్త్రవధ్యత్వము నొసంగెను; ఇంద్రుఁడు స్వచ్ఛందమరణమును వరముగా నిచ్చెను.

ప్రస్తుతమైన సాగరలంఘనమున మేము ఎవరము సమర్థులము కాక విషాదాంబుధియందు మునుఁగుచున్నాము. నిరాశోపహతులమైన మాకు నీవే దిక్కు.

వామనుఁడైన విష్ణువు త్రివిక్రముఁ డైనప్పుడు నేను పృథ్వి యంతయు నిరువదియొక్క పర్యాయములు ప్రదక్షిణ మొనర్చితిని. దేవశాసనమున అమృతమథనమునకై ఓషధులను కూడ ప్రోపు చేసితిని. కాని యిప్పుడు వృద్ధుఁడ నైతిని. ఇచ్చటనున్న వానరు లందఱిలో ఉత్తముఁడవు నీవే. ఈవానరసైన్య మంతయు నీపరాక్రమమును చూడఁగోరుచున్నది. లెమ్ము. విజృంభింపుము. సాగరము లంఘింపుము. సకలభూతములయొక్క వేగములలో నీగమనవేగమే శ్రేష్ఠమైనది.''

శ్లో॥ త్రివిక్రమే మయా తాత సశైలవనకాననా।
త్రిస్సప్తకృత్వః పృథివీ పరిక్రాన్తా ప్రదక్షిణమ్॥ 32

శ్లో॥ తదా చౌషధయోఽస్మాభి స్సంచితా దేవశాసనాత్।
నిర్మథ్య మమృతం యాభి స్తదానీం నో మహ ద్బలమ్॥ 33

శ్లో॥ త ద్విజృంభస్వ విక్రాంత ప్లవతా ముత్తమో హ్యసి।
త్వద్వీర్యం ద్రష్టుకా మేయం సర్వా వానరవాహినీ॥ 35

శ్లో॥ ఉత్తిష్ఠ హరిశార్దూల లంఘయస్వ మహార్ణవమ్।
పరా హి సర్వభూతానాం హనుమాన్ యా గతి స్తవ॥ 36

కిష్కింధాకాండ-సర్గ-66

జాంబవంతుని ప్రశంస విని యాంజనేయుఁడు సంతోషముతో వికసితవదనుఁడై పొంగఁ జొచ్చెను. వానరు లందఱును ఆయన చుట్టును చేరి ప్రశంసాదృక్కులతో చూడఁజొచ్చిరి. ఆవానరానీకమధ్యమున ఆంజనేయుఁడు మహోత్సాహముతో శరీరమును పెంచఁజొచ్చెను. ఆవిజృంభణమును జూచి ఋక్షవానరులు హర్షధ్వానములు కావింపఁ జొచ్చిరి. వారు స్తుతించినకొలఁది హనుమంతుఁడు పెరుగఁజొచ్చెను. ప్రవృద్ధకాయుఁడై హనుమంతుఁడు ఋక్షవానరవృద్ధులకు నమస్కరించి యిట్లనెను. "నేను వాయుదేవుని పుత్త్రుఁడను; బలవేగసంపన్నత యందు ఆయనతో సమానుఁడను, ఆకసము నంటుచు మేరువును చేరవలయు నన్నంతగా, బాహువేగమున సముద్రమును కలగుండుపఱచి యందు లోకము ముంచివేయవలయు నన్నంతగా, నాకు ఉత్సాహము కలుగుచున్నది. నే నిప్పుడు గరుత్మంతుని నైతము రయమున అందుకొనఁగలను. మహామేరువువలె ఆకాశము నాక్రమించి పోవుదును. చూడుఁడు; పదివేలయోజనములైన పరిక్రమింపఁగలను. నూఱుయోజనములు లెక్క ఏ మున్నది? నేను సీతాదేవిని చూడఁగల ననియే నాకుఁ దోఁచుచున్నది. మీ రందఱు నిశ్చింతులై హృష్టులై యుండుఁడు.

ఇంద్రునియొద్దనుండి బ్రహ్మదేవునియొద్దనుండి యైనను ఆవశ్యక మగుచో అమృతమును కూడ తేఁగలను. సీత కనిపింపకున్నచో లంకనే పెకలించుకొని వచ్చెదను.

ఇట్లు గర్జించుచున్న హనుమంతుని జూచి జాంబవంతుఁడు ప్రహృష్టుడై యిట్లనెను. "నీవిజృంభణమున ఋక్షవానరులమహా దుఃఖము నశించినది. ఋక్షకపిముఖ్యులు నీకు మంగళములను విర్వహించుచున్నారు. ఋషులప్రసాదమున ఋక్షకపిముఖ్యులయాశీర్వాదమున గురుజనులయనుగ్రహమున ఈమహార్ణవమును లంఘింపుము; పై దేహిని దర్శింపుము. నీవు వచ్చువఱకును మే మిచ్చట నొంటి కాలిపై నీకొఱకు వేచియుందుము. ఈఋక్షవానరులప్రాణము లన్నియు నీచేతిలో నున్నవి. నీవిక్రమమున వీరి నందఱను బ్రతికింపుము." ఆంజనేయుఁ డిట్లనెను. "ఇచ్చటియీశిలలు నాయుత్పతన వేగమునకు నిలువఁజాలవు. మహేంద్రపర్వతశిఖరములు దృఢమైనవి. అచ్చటికి పోవుదము."

అంత నందఱును ఆంజనేయునివెంట మహేంద్రపర్వతముపైకి పోయిరి. హనుమంతుఁడు ఉన్నతములైనయాశిఖరములలో తిరుగుచు నొకచోట నిలిచి అది తనయుత్పతనమునకు తగినప్రదేశ మని నిశ్చయించెను.

## 4. హనుమద్వృత్తాంతము

ఈసందర్భమున హనుమంతునిజన్మాదివృత్తాంతమును గ్రహించుట యుక్తము.

శ్రీరామపట్టాభిషేకానన్తరము అగస్త్యుఁడు రామునకు రావణునిచరిత్రమును చెప్పినతరువాత రాముఁడు ఆయనను ఇట్లు ప్రశ్నించెను. "శౌర్యము, దక్షత, బలము, ధైర్యము, ప్రాజ్ఞత, నీతిచేత పనులు

సాధించుట, విక్రమము, ప్రభావము హనుమంతునియందు నివాసమును ఏర్పఱచుకొనియున్నవి. యుద్ధమునందు ఆంజనేయుఁడు కావించిన మహాకార్యములవంటివి కుబేరుఁడు యముఁడు ఇంద్రుఁడు విష్ణువు మొదలుగా ఎవరిచరిత్రయందును వినఁబడుట లేదు. హనుమంతుఁడే లేకున్నచో సాగరము లంఘించి సీతవార్తను నా కెవ్వరు చెప్పుదురు? రావణుఁడు కాని వాలి కాని బలమున హనుమంతునితో సమానులు కారు. మఱి యితఁడు వాలి నెందులకు తృణప్రాయముగా వధింప లేదు?"

అగస్త్యుఁ డిట్లు చెప్పెను. "రఘువర్యా! నీవు చెప్పినది నిజము. బలమునందును బుద్ధియందును ఇతనికి సమానుఁడు లేఁడు. కాని మును లిచ్చినయమోఘములైన శాపములవలన ఇతఁడు తనబలమును తా నెఱుంగఁడు. ఈతనితండ్రి కేసరి సుమేరుపర్వతదేశమును పాలించుచుండును. ఆతనిభార్య అంజనాదేవి. ఆమె వాయుదేవునివలన ఈ పుత్రుని కనెను. ఆమె యితనిని కనినంతనే ఫలములను తెచ్చుటకొఱకు అరణ్యమునకు పోయెను. ఇతఁడు తల్లి దగ్గర లేకపోవుటచేత ఆకలిచేతను, శరవణమున కుమారస్వామివలె, మిక్కిలి రోదన మొనర్చెను. కొంతసేపైనతరువాత దాసానిపువ్వుయొక్క వర్ణముగల బింబముతో సూర్యుఁ డుదయించుచుండఁగా నితఁడు చూచి ఆబింబమును పండనుకొని పైకి ఎగిరెను. బాలార్కసన్నిభుఁడైనయీశిశువు బాలార్కుని కబళించుటకై గగనమున మనోవేగుఁడై పోవుచుండఁగా దేవదానవయక్షాదులు విస్మితులై చూడఁజొచ్చిరి. 'ఈశిశువునకే యింత వేగ మున్నదే, యింక నితఁడు యౌవనము నొందినచో ఎంత వేగము కలవాఁ డగునో' యని ఖేచరు లందఱు సంభ్రమింపఁజొచ్చిరి. అట్లు కుమారుఁడు పైకి పోవుచుండఁగా సూర్యకిరణములవలన తాపము కలుగకుండ వాయువు చల్లనిగాలులు వీచుచు వెంటఁబోవఁజొచ్చెను. అనేక సహస్రయోజనములు అవలీలగా దాఁటి ఇతఁడు సూర్యునియొద్దకు

పోఁగా, "వీఁడు శిశువు; తెలియక వచ్చినాఁడు" అని గ్రహించి యా దేవుఁ డితనిని దహింపలేదు.

అది సూర్యోపరాగదివసము. అందువలన రాహువు సూర్యుని సమీపించుచుండెను. తనకు అడ్డముగా వచ్చుచున్న రాహువు నితఁడు త్రోసివేసెను. ఆత్రోపునకు భయపడి రాహువు ఇంద్రునియొద్దకు పరుగిడి తనకన్న బలవత్తరుఁడైన మఱియొకరాహువు సూర్యునిపైకి వచ్చుచున్నాఁ డని మొఱపెట్టుకొనెను. ఇంద్రుఁడు అదరిపడి వెంటనే లేచి ఐరావతముపై రాహువును పురస్కరించుకొని బయలుదేరెను. రాహువు ఇంద్రునియందఁ జూచుకొని ఆయనకన్నను ముందుగా పరువిడి వచ్చెను. ఇతఁడు రాహువును జూచి మఱియొక ఫల మనుకొని పట్టుకొనఁబోయెను. తనపైకి వచ్చుచున్న యితనిని చూచి రాహువు భీతుఁడై వెనుదిరిగి పరువెత్తుచు "ఇంద్రా! ఇంద్రా" అని కేకలు పెట్టఁ జొచ్చెను. ఇంద్రుఁడు, "నీ కేమియు భయము లేదు. నేను వీనిని వధింతును" అని చెప్పుచుండఁగా ఇతఁడు రాహువును వదలి ఐరావతమును కబళింపవచ్చెను పాకశాసనుఁడు ఇతనిశైశవచాపలమును గ్రహించి కొంచెము కోపముతో సమీపమునకు వచ్చి యితనిని వజ్రాయుధముతో ప్రహరించెను.

ఆదెబ్బకు ఇతఁడు విహ్వలించి ఒకకొండపై పడెను. వజ్రహతిచేత నితనియెడమదవడ భగ్న మయ్యెను. వాయుదేవుఁడు కుపితుఁడై లోకమున తనప్రచారమును ఉపసంహరించెను. లోక మంతయు స్తంభించెను. దేవతలు బ్రహ్మయొద్దకుపోయి కలిగిన కష్టమును విన్నవించిరి. ఆయన వారితో కూడ వాయుదేవునియొద్దకు వచ్చెను. ఆయన పరమేష్ఠిని చూచి స్తుతించుచు మూఁడుపర్యాయములు పాదములకు ప్రణమిల్లెను. బ్రహ్మదేవుఁడు శిశువును చేతితో నిమిరెను. వానచేత తడిసినపైరునకు వలె ఇతనికి మరల జీవము కలిగెను. వెంటనే

వాయుభట్టారకుఁడు సంతోషించి పవనతరంగములను లోకమున ప్రసరింపఁజేసెను. పరమేష్ఠి తన్ను పరివేష్టించియున్న మహేంద్రమహేశ్వరాదులచు చూచి యిట్లనెను. "మీకు ఈశిశువువిషయము తెలిసినదే. అయినను మీకు హితమును గోరి చెప్పుచున్నాను. వినుఁడు. ఈశిశువు వలన మీకొక కార్యము జరుగవలసియున్నది. కావున ఈవాయుభట్టారకునకు ప్రీతి కలుగునట్లు మీ రందఱు ఈశిశువునకు వరముల నొసంగుఁడు." అప్పుడు ఇంద్రుఁడు ప్రసన్నుఁడై యితనికి పద్మమాల నొసంగుచు, 'నావజ్రముచేత ఇతని హనువు భగ్న మైనది కావున ఇతఁడు హనుమంతుఁ డని ప్రసిద్ధి నొందును. ఇంక నితఁడు వజ్రాయుధమునకు కూడ అవధ్యుఁ డగును.' అని చెప్పెను. భాస్కరుఁడు 'నేను వీనికి నాతేజస్సులోనూఱవవంతు భాగమును ఇచ్చుచున్నాను. శాస్త్రముల నధ్యయనము చేయుశక్తి కలిగినప్పుడు శాస్త్రజ్ఞానము నొసంగుదును. దాని వలన నితఁడు వాగ్మి యగును' అని చెప్పెను. తనపాశమువలన ఉదకములవలనను మృత్యువు లేకుండ వరుణుఁడు వర మొసంగెను. తన దండమువలన అవధ్యత్వము, ఆరోగ్యము, యుద్ధమునందు విషాదము నొందకుండుటయు వరముగా యముఁ డొసంగెను. 'నాగదచేత యుద్ధమున మరణము నొందఁ' డని కుబేరుఁడు పలికెను; 'నావలన నాయాయుధములవలన కూడ వీనికి మరణము కలుగ' దని శంకరుఁ డను గ్రహించెను. 'నాచేత నిర్మింపఁబడిన దివ్యములైన సకలశస్త్రములకు నితఁడు అవధ్యుఁడై చిరంజీవి యగును' అని విశ్వకర్మ వరప్రదాన మొనర్చెను. అంత పరమేష్ఠి సంతుష్టుఁడై వాయుభట్టారకుని చూచి, 'వీఁడు సకలబ్రహ్మదండములకును అవధ్యుఁడై మహాత్ముఁడై దీర్ఘాయు వగును. ఇతఁడు కామరూపుఁడు కామచారి అవ్యాహతగతియునై అజేయుఁడై అమిత్రులకు భయంకరుఁడు మిత్రులకు అభయప్రదుఁడునై కీర్తిశాలి యగును. ఇతఁడు రావణసంహారముకొఱకు రామప్రీతికరములైన మహాకార్యములను సంగ్రామమునందు నిర్వహించును' అని

చెప్పి దేవతలతో కూడ వెడలిపోయెను. పిమ్మట వాయుదేవుఁడు వీనివి గైకొని వచ్చి అంజనాదేవికి జరిగినవృత్తాంతమును చెప్పి యప్పగించి వెడలిపోయెను.

ఇతఁడు బాల్యములో వరగర్వముచేత మహర్షులయాశ్రమము లందు ప్రవేశించి యథేష్టముగ సుక్స్రువములను భగ్నమొనర్చుచు, భాండములను పగులగొట్టుచు, అగ్నిహోత్రములను చల్లార్చుచు అల్లరి చేయఁజొచ్చెను. ఇతఁడు బ్రహ్మదండములకు అవధ్యుఁ డని వారు ఎఱింగియుండుటచే చాలకాల మీతనియాగడములను సహించిరి. కేసరి వాయుభట్టారకుఁడును ఇతనిని వారించుచునే యుండిరి. అయినను ఇతఁడు ఆగడములను మానలేదు. అందువలన ఆమహర్షులు విసుఁగు నొంది, 'నీబలము నీకు చాలకాలమువఱకు తెలియకుండును గాక! ఎవ రైనను నీశక్తిని నీకు జ్ఞప్తికి తెచ్చినప్పుడే తెలియఁగలదు' అని శపించిరి. అందువలన అప్పటినుండి యితఁడు తన ప్రభావము నెఱుంగక సామాన్యునివలె వ్యవహరించుచుండెను.

ఋక్షరజసుఁడు సకలవానరులకు రాజుగా నుండెను. అతఁడు చిరకాలము పాలించి కాలధర్మము నొందెను. మంత్రులు వాలిని తండ్రి యొక్క పదమునం దుంచి, సుగ్రీవుని వాలియొక్క పదమునందు, అనఁగా, యౌవరాజ్యమునం దుంచిరి. ఇతనికి బాల్యమునుండియు సుగ్రీవునితో భేదములేనిసఖ్య మేర్పడెను. ఇతఁడు వాలిచేత తఱుమఁ బడుచున్నప్పుడు శాపము కారణముగా, తనబలము నెఱుంగక, ఏనుఁగు చేత ఆక్రమింపఁబడుచున్న సింహమువలె నుండెను."

శ్లో॥ దీర్ఘాయు శ్చ మహాత్మా చ బ్రహ్మా తం ప్రాబ్రవీ ద్వచః।
సర్వేషాం బ్రహ్మదండానా మవధ్యోఽయం భవిష్యతి॥ 20

[తి. టీక.-మహాత్మా-మహాన్ ఆత్మా యస్య సః, బ్రహ్మజ్ఞః ఇతి యావత్। సర్వేషామ్-బ్రహ్మాస్త్రాణామ్। బ్రహ్మదండః బ్రహర్షి క్రియమాణః సంహారోద్దేశ్యకః శాపః, న భవిష్యతి।]

శ్లో॥ అమిత్రాణాం భయకరో మిత్రాణా మభయంకరః।
అజేయో భవితా పుత్ర స్తవ మారుత మారుతిః॥ 22

శ్లో॥ కామరూపః కామచారీ కామగః ప్లవతాం వరః।
భవ త్యవ్యాహతగతిః కీర్తిమాం శ్చ భవిష్యతి॥ 23

శ్లో॥ సోఽపి గంధవహః పుత్రం ప్రగృహ్య గృహ మానయత్।
అంజనాయా స్త మాఖ్యాయ వరదత్తం వినిర్గతః॥ 26

శ్లో॥ శేషు రేనం రఘుశ్రేష్ఠ నాతిక్రుద్ధాతిమన్యవః।
బాధసే య త్సమాశ్రిత్య బల మస్మాన్ ప్లవంగమ॥ 33

శ్లో॥ త ద్దీర్ఘకాలం వేత్తాసి నాస్మాకం శాపమోహితః।
యదా తే స్మార్యతే కీర్తిః తదా తే వర్ధతే బలమ్॥ 34

శ్లో॥ తస్మి న్నస్తమితే చాథ మన్త్రిభి ర్మంత్రకోవిదైః।
పిత్ర్యే పదే కృతో వాలీ సుగ్రీవో వాలినః పదే॥ 38

[తి. టీక:—వాలినః పదే యౌవరాజ్యే।]

శ్లో॥ సుగ్రీవేణ సమం త్వస్య అద్వైధం ఛిద్రవర్జితమ్।
ఆబాల్యం సఖ్య మభవ దనిల స్యాగ్నినా యథా॥ 39

ఉత్తరకాండ—సర్గ-36

బ్రహ్మదేవుఁడు వరము లిచ్చుచు ఇతఁడు మహాత్ముఁడగు నని చెప్పుట గమనింపఁ దగియున్నది. గోవిందరాజస్వామి చెప్పినట్లు మహాత్ముఁ డనఁగా బ్రహ్మజ్ఞుఁ డనియే గ్రహింపఁ దగును. ఆవర ప్రభావముననే ఆంజనేయుఁడు శ్రీరాముని మహత్త్వమును గుర్తించి భక్తుఁడై బ్రహ్మజ్ఞుఁ డయ్యె నని చెప్పవచ్చును.

ఈసందర్భమున అగస్త్యుఁడు చెప్పినట్లుగా వాలిసుగ్రీవుల జన్మ వృత్తాంతము రావణునిశ్వేతద్వీపగమనము 37వ సర్గను పిమ్మట

అయిదుసర్గలలో విస్తృతములై యున్నవి. ఇవి ప్రక్షిప్తము లని వ్యాఖ్యాతలు నిశ్చయించి వీనికి వ్యాఖ్యానములు వ్రాయలేదు.

ఆంజనేయుని జననవృత్తాంతము అగస్త్యునికథనమున వివరముగా లేదు. జాంబవంతుఁడు గావించినప్రశంసయం దిట్లు వివరింపఁబడినది. అప్సరసలలో శ్రేష్ఠురాలైన పుంజికస్థల శాపవశమున కుంజరుఁడను వానరునకు కూఁతురుగా జన్మించి కేసరికి భార్య అయ్యెను. ఆమెకు కామరూపధారణశక్తి యుండెను. ఒకనాఁ డామె మనుష్యరూపమున సౌందర్యయౌవనవస్త్రాభరణశాలినియై ఒకపర్వతాగ్రమున విహరించుచుండెను. వాయుదేవుఁ డామెను చూచి మోహితుఁడై కౌఁగిలించుకొనెను. ఆపతివ్రత సంభ్రాంతయై అదృశ్యుఁడై తన్ను కౌఁగిలించుకొనిన వ్యక్తి నుద్దేశించి, "నా యేకపత్నీవ్రతమును ఎవఁడు నాశనము చేయఁగోరుచున్నాఁడు!" అని పలికెను. వాయుదేవుఁడు, "భయము నొందకుము. నేను వాయుదేవుఁడను. నేను నీశరీరమును భంగపెట్ట లేదు. కీర్తిశాలినివైననిన్ను నేను మనస్సుచేతనే ఆలింగ ఘొందితిని. నీకు వీర్యవంతుఁడు బుద్ధిసంపన్నుఁడును అయిన పుత్రుఁడు కలుగును." అని చెప్పి వెడలిపోయెను. ఆమె ఆపర్వత గుహయందే హనుమంతుని ప్రసవించెను.

శ్లో॥ స తాం భుజాభ్యాం దీర్ఘాభ్యాం పర్యష్వజత మారుతః।
మన్మథావిష్టసర్వాంగో గతాత్మా తా మనిందితామ్॥ 15

[తి. టీక:—తాం గతాత్మా..దద్గర్భప్రవిష్టాత్మతేజా బభూవ। దేవత్వాత్ వినాపి యోనిసంబంధం నిజతేజఃప్రవేశన మితి బోధ్యమ్।]

శ్లో॥ సా తు తత్రైవ సంభ్రాన్తా సువ్రతా వాక్య మబ్రవీత్।
ఏకపత్నీవ్రత మిదం కో నాశయితు మిచ్ఛతి॥ 16

శ్లో॥ అంజనాయా వచ శ్రుత్వా మారుతః ప్రత్యభాషత।
న త్వాం హింసామి సుశ్రోణి మా భూత్తే సుభగే భయమ్॥ 17

[తి. టీక:-త్వాం న హింసామి-యోనిసంబంధేన తావక మేక పత్నీవ్రతం న నాశయామి। అనేన బలాత్ పరపురుషేణ ఆలింగనాదావపి న పాతివ్రత్యభంగః; కిం తు యోనిభోగే నైవేతి సూచితమ్।]

శ్లో॥ మనసాస్మి గతో య త్త్వాం పరిషజ్య యశస్వినీ।
వీర్యవాన్ బుద్ధిసంపన్న స్తవ పుత్రో భవిష్యతి॥ 18

[తి. టీక. యద్-యస్మాత్ త్వాం పరిష్వజ్య మనసా మానస భోగే నైవ త్వాం గతోఽస్మి స్వతేజసా త్వద్గర్భం ప్రాప్తోఽస్మి, తస్మాదీదృశ స్తే పుత్రో భవిష్యతి]

కిష్కింధాకాండ-సర్గ-66

సుందరకాండమున హనుమంతుఁడు ఈవృత్తాంతమునే సీతతో ఇట్లు చెప్పెను. "మాల్యవంతము గిరులలో ఉత్తమము; అందు వానరులలో మహితుఁడైన మాతండ్రి కేసరి యుండెను. ఆయన యొకప్పుడు గోకర్ణక్షేత్రమునకు పోయెను. అందు శంబసాదనుఁ డను వాఁడు ప్రజాకంటకుఁడై యుండఁగా వానిని నిర్మూలించుటకు దేవతలు ఋషులును మాతండ్రిని నియోగించిరి. ఆయన ఆశంబసాదనుని సంహరించెను. అప్పుడు ఆయనక్షేత్రమునందు వాయుదేవునివలన నేను జన్మించితిని."

శ్లో॥ మాల్యవా న్నామ వైదేహి గిరీణా ముత్తమో గిరిః। 79
శ్లో॥ తతో గచ్ఛతి గోకర్ణం పర్వతం కేసరీ హరిః।
స చ దేవర్షిభి ర్దిష్టః పితా మమ మహాకపిః।
తీర్థే నదనదీపతేః పుణ్యే శంబసాదన ముద్ధరత్॥ 80
శ్లో॥ త స్యాహం హరిణః క్షేత్రే జాతో వాతేన మైథిలి॥ 81

గో. టిక:-సః గోకర్ణ గతః। దేవర్షిభిః తత్ర త్యైః దిష్టః నియుక్తః, శంబసాదనం తీర్థోపద్రవకారిణ మసురం శంబసాదనాఖ్యం। ఉద్ధరత్-ఉదహరత్, దేవర్షి ప్రార్థనయా అవధీత్ ఇత్యర్థః।-81

గో. టీక:_హరిణః హరేః కేసరిణః క్షేత్రే పత్న్యా మంజనాయాం జాతః। పితుః దేశాంతరగమనకాలే జాతః।

సుందరకాండము_సర్గ-35

హనుమంతునిజన్మవృత్తాంతమున చర్చనీయాంశములు పెక్కులు గలవు. అంజనాదేవి పూర్వజన్మమున పుంజికస్థలయను నప్సరస. అప్సరసగా నున్నప్పు డొకనాఁ డీమె బ్రహ్మభవనమునకు ఆకాశమార్గమున పోవుచుండఁగా రావణుఁ డీమెను మార్గమధ్యమున పట్టుకొని బలవంతముగా భోగించి వివస్త్రను గావించెను. ఆమె అతనితో పెనఁగులాడుచుండఁగా అతఁడు కోపముతో ఆమెవస్త్రమును లాగి విసరివైచి ఏ కొండగుహకో పట్టుకొనిపోయి భోగించి వెడలిపోయియుండును. ఆ వృత్తాంతమును బ్రహ్మదేవున కెట్లో తెలిసి రావణుని పిలిపించి. "ఇంక మీఁద నీవు ఏ స్త్రీ నైనను బలాత్కరించి పొందినచో నీతల నూఱు వ్రక్క లగును" అని శపించెను. ఈవృత్తాంతమును రావణుఁడే మహోదరునితో రామునిదండయాత్రనుగూర్చి చర్చించు సభలో చెప్పెను.

శ్లో॥ పితామహస్య భవనం గచ్ఛన్తీం పుఞ్జికస్థలామ్।
చంచూర్యమాణ మద్రాక్ష మాకాశేఽగ్నిశిఖా మివ॥ 11

శ్లో॥ సా ప్రసహ్య మయా భుక్తా కృతా వివసనా తతః।
స్వయంభూభవనం ప్రాప్తా లోలినీ నలినీ యథా॥ 12

శ్లో॥ తచ్చ తస్య తథా మన్యే జ్ఞాత మాసీ న్మహాత్మనః।
అథ సంకుపితో వేధా మా మిదం వాక్య మబ్రవీత్॥ 13

శ్లో॥ అద్యప్రభృతి యా మన్యాం బలా న్నారీం గమిష్యసి।
తదా తే శతధా మూర్ధా ఫలిష్యతి న సంశయః॥ 14

యుద్ధకాండ_సర్గ_13

రావణునిచే భంగపడినయీమె వానిసంహారమునకు ప్రధాన సహాయుఁడైన హనుమంతుని గనుట యుచితమే. కాని యిది కేవలము యాదృచ్ఛికముగా జరిగినసంఘటనము కాదు. "ఈశిశువువలన మీ కొక మహాకార్యము జరుగవలసియున్నది. కావున ఈ వాయుభట్టారకుని ప్రీతికొఱకు మీ రందఱు ఈశిశువునకు వరము లిండు" అని దేవతలతో బ్రహ్మదేవుఁడు చెప్పినమాటలలో ఈవిషయము వ్యక్త మగుచున్నది.

వాయుదేవునివలన పుత్రుని పొందినప్పుడు అంజనకు పాతివ్రత్యము భంగపడలేదా? అట్టిభార్యను పుత్త్రిని కేసరి యెట్లు స్వీకరించెను? ఆమె కేసరివిషయమున పతివ్రతగానే యున్నది. ఆమెకు వాయుదేవుని పొందవలయు నను తలంపు లేదు వాయుదేవుఁ డామెతో శారీరకముగా సంగమింపలేదు. ఆయన వాయురూపముననే ఆమెను కౌఁగిలించుకొని మానసికముగానే తన తేజమును ఆమెయందు ప్రవేశపెట్టెను. ఆ తేజము ఆమెయందు ప్రవేశించుచున్నప్పుడు తన్ను ఎవఁడో అదృశ్యముగా కౌఁగిలించుకొనుచున్నాఁ డని ఆమెకు తోఁచినది. ఆమె విభ్రాంతురాలు కాఁగా వాయుదేవుఁడు జరిగినదానిని చెప్పెను. ఆమె శారీరకముగా సంభోగమును పొందకుండుటవలన, అంతకన్నను ముఖ్యముగా ఆమెకు వాయుదేవునియందు కామము లేకుండుటవలనను, ఆమెయొక్క ఏకపత్నీవ్రతమునకు భంగము కలుగ లేదు. ఒక్కనినే పతిగా కలిగియుండుట స్త్రీలకు ఏకపత్నీవ్రతము; (ఏకః పతిః యస్యాః సా ఏకపత్నీ) అనఁగా పాతివ్రత్యమే.

పురుషులవిషయమున, "రాముఁడు ఏకపత్నీవ్రతుఁడు" మొదలైనప్రసంగములు భ్రాంతిమూలకములు. పురుషులవిషయమున ఇట్టి వ్రత మేదియు శాస్త్రముచే విధింపఁబడలేదు. పురుషులకు బహుభార్యాపరిగ్రహము దోషము కాదు. ఇంచుమించుగా ప్రజాపతులైన కశ్యపాది మహర్షు లందఱును చాలమంది భార్యలను పొందినవారే. రాముఁ డెచ్చ

టను తాను ఏకపత్నీవ్రతమును అవలంబించుచున్నట్లు చెప్పలేదు. వాల్మీకియు అట్టివ్రతమును ఎక్కడను ప్రస్తావింపలేదు. సీతాదేవి యందు ఉన్నయనురాగాతిశయముచేత, స్త్రీభోగకామము లేకుండుట వలనను, సీతాదేవి యున్నప్పుడు, ఆమె లోకాంతరమునకు పోయిన తరువాత కూడ ఆయన మఱియొకస్త్రీని భార్యనుగా పరిగ్రహింపక ఆత్మారాముఁడై యుండె నని గ్రహింపవలసియున్నది.

విష్ణుదేవుఁడు రాముఁడుగా అవతరించుసందర్భమున పరమేష్ఠి దేవతలను తమ తమయంశములతో ఋక్షవానరవీరులను పుట్టింపవలసిన దని యాదేశించియుండెను. అప్పటినుండియు దేవతలు ఋక్షవానరుల క్షేత్రములయందు, అనఁగా భార్యలయందు, తమయంశములను ప్రవేశ పెట్టి పుత్త్రులను కలిగించుట పరిపాటి యయ్యెను. దేవతలు ఇతరుల భార్యలను పొందుట ఎందులకు? వారు ఋక్షవానరకన్యలను భార్యల నుగా పరిగ్రహించినచో ఆకన్యలు దేవలోకప్రవేశమునకు అర్హులు కారు; దేవతలును వీరితో సంసారము చేయుచు ఈలోకమునందు ఉండఁ జాలరు మఱియును వారు కన్యలను పుత్రోత్పత్తికొఱకు మాత్రమే పరిగ్రహించి పుత్త్రుడుకలిగినతరువాత వదిలిపెట్టినచో ఆకన్యలను ఇతరు లెవ్వరును భార్యలనుగా స్వీకరింపరు. అందువలన ఆకన్యలు ఇహలోకసుఖములకు దూర మగుదురు. అందువలన బ్రహ్మదేవుని యాదేశమును ఋక్షవానరగృహస్థులకు తెలియఁజెప్పి వారిభార్యల యందు పుత్రులను కలిగించినచో ఆపుత్రులకు మాతాపితృపోషణము సంవర్ధనము సంభవించును. కన్యాపుత్రుల కది సంభవము కాదు. అందు వలన దేవతలు ఋక్షవానరులక్షేత్రములనే ఇందుకొఱకు స్వీకరించి యుందురు. భర్తలు ఇందులకు అంగీకరించుటలో ఆశ్చర్యము లేదు. తేజస్వులైన పుత్త్రులు కావలయు నని కోరుకొనువారు ప్రాచీనకాల మున తమకన్న అత్యధికతేజస్సుగల మహర్షులవలన దేవతలవలన

తమ భార్యలయందు, పాండురాజువలె, పుత్త్రిలను పొందుట పరిపాటిగా నుండెను.

పాండురాజుయొక్క అభ్యర్థనమున కుంతి వాయుదేవుని, మంత్ర జపముచేత, ప్రసన్నుని చేసికొని భీముని పుత్రునిగా పొందెను. ఇక్కడ కేసరి దేవతల యభ్యర్థనమున శంబసాదనుని సంహరింపఁగా, అందులకు వరముగా వారు ఆంజనేయుని పుత్రునిగా ప్రసాదించి రని గ్రహింపవలసియున్నది. అగస్త్యుఁడు ఈవృత్తాంతమును ఒకదాని వెంట నొకటిగా చెప్పుటవలన ఈవిషయము వ్యక్తమగుచున్నది.

అట్టిపుత్త్రిలను క్షేత్రజు లందురు వారు ఔరసులైన పుత్త్రిలతో సమానులే యగుదురు. పరశురాముఁడు క్షత్రియజాతిని నిర్మూలించినప్పుడు కశ్యపప్రజాపతి క్షత్రియక్షేత్రములందు మహర్షులను నియోగించి క్షత్రియులను మరల పుట్టించెను. అవిధముగా క్షత్రియజాతి మరల ఏర్పడెను. అట్లే యిప్పుడు బ్రహ్మదేవునియాదేశమున దేవతలు కూడ ఋక్షవానరక్షేత్రములయందు రాక్షససంహారసమర్థులైన మహావీరులను సృష్టించుట పరిపాటిగ జరిగె నని గ్రహింపవలసి యున్నది. ఇది ప్రత్యేకమైన సృష్టి (Special creation) అగుట వలననే, అట్లు పుట్టినవారు కామరూపము, కామగమనము మొదలగు శక్తులను కలిగియుండిరి. సామాన్యవానరులకు ఋక్షులకు ఇట్టిశక్తు లుండవు ఇది సమాజముచేత అంగీకరింపఁబడినవిషయ మగుటచే కేసరి మొదలగువారు తమభార్యలను క్షేత్రజులైన పుత్రులను స్వీకరించుటకు ఏమాత్రము సంకోచింప లే దని స్పష్ట మగుచున్నది. కావుననే దేవతలు వరము లిచ్చినతరువాత వాయుదేవుఁడు స్వయముగ ఆంజనేయుని తీసికొనివచ్చి అంజనకు అప్పగించిపోయెను. ఇందు లజ్జాకరమైన విషయము లేదు. కావుననే ఆంజనేయుఁడు తన జన్మ వృత్తాంతమును సీతతో చెప్పెను. అట్లే జాంబవంతుఁడును అంగదా

దుల సమక్షమున ఈవృత్తాంతమును ప్రశంసించెను. అగస్త్యమహర్షియు ఆంజనేయుని ఈజన్మవిశేషమును అభినందనపురస్సరముగనే చెప్పెను. ప్రసిద్ధికి రాకున్నను నలనీలాదులజన్మవృత్తాంతములును ఇట్టివియే యని గ్రహింపవచ్చును.

ఈసందర్భమున మఱియొకయంశము గమనింపఁదగియున్నది. భర్త దూరదేశమం దుండఁగా అంజనాదేవి మానవరూపమును పొంది సర్వాభరణభూషితయై, అంతఃపురమునందు కాక, పర్వతశృంగమున వనవిహారము చేయుచుండుట పొరపాటనియే చెప్పవలసియున్నది. అది కేవలము చాపలమే. అదృష్టవశమున ఆమెకు వాయుదేవునివలన సత్పుత్త్రుఁడు కలిగెను. లేకున్నచో ఉగ్రసేనునిభార్యను వలె, ఏరాక్షసుఁడైనను కామించి భోగించినచో, కంసునివలె, దుష్టుఁడైన పుత్రుఁడు కలిగియుండెడివాఁడు. అందువలన పతివ్రతలైన స్త్రీలు భర్తలు వెంట లేనప్పుడు సర్వాభరణభూషితలై సౌందర్యమును ప్రకాశింపఁజేయుచు ఒంటరిగా తిరుగుచుండుట అనర్థకర మని గుర్తింపవలసియున్నది.

ఋక్షరజసునియనంతరము మంత్రులు వాలిని తండ్రియొక్క పదమునందును సుగ్రీవుని వాలియొక్క పదమునందును నెలకొల్పి రనుటవలన వాలికి రాజ్యమువచ్చినప్పుడే సుగ్రీవునకు యౌవరాజ్యము కూడ వచ్చె ననుట స్పష్టము. వాలి సుగ్రీవుని తఱిమివేసినప్పుడు, సుగ్రీవుఁడు యౌవరాజ్యమునే కాక, వాలియనంతరము రాఁదగిన రాజపదవిని కూడ కోల్పోయి నట్లయ్యెను. అందువలన సుగ్రీవుఁడు తాను రాజ్యమును కోల్పోయినట్లు రామునితో చెప్పుకొనెను.

## 5. సాగరలంఘనము

ఆంజనేయుని సాగరలంఘనముతో సుందరకాండ మారంభ మగును. తక్కినకాండములనామములు వానియందలివిషయములకు

సంబంధించియున్నవి. రాముఁడు బాలుఁడుగా నున్నప్పటివృత్తాంతము బాలకాండముగ, అయోధ్యలో జరిగినవృత్తాంతము అయోధ్యాకాండముగ, అరణ్యములో జరిగినవిశేషములు అరణ్యకాండముగ, కిష్కింధలోని కథ కిష్కింధాకాండముగ, యుద్ధమునకు సంబంధించినవిషయము యుద్ధకాండముగ, పట్టాభిషేకమునకు ఉత్తరమున, అనఁగా తరువాత, జరిగినకథాభాగమంతయు ఉత్తరకాండముగ సార్థకముగా నున్నవి. సీతాదర్శనము ప్రధానవిషయముగా నున్న యీకాండమునకు సుందర కాండ మనుపేరు ఎట్లు సార్థక మను సందేహము కలుగుట సహజము. దీనికి అనేకులు పెక్కువిధముల సమాధానములు చెప్పిరి.

సుందరుఁ డనఁగా ఆంజనేయుఁ డనియు ఈకాండమున ఆంజనేయునిపరాక్రమవిశేషములే ప్రధానముగా నుండుటవలన దీనికి సుందర కాండ మనుపేరు వచ్చియుండు నని కొందఱు చెప్పుదురు. ఆంజనేయునకు సుందరుఁ డను నామాంతరము వాల్మీకి రామాయణమున ఎక్కడను కన్పించుట లేదు. అందువలన ఈహేతువు సమంజసముగా తోఁచుట లేదు.

సుందరహనుమన్మంత్ర మొకటి కల దని, అది యిందు నిక్షేపింపఁబడియున్న దని అందువలన దీనికి సుందరకాండ మనుపేరు వచ్చి యుండు నని మఱికొంద ఱందురు. అట్టిమంత్ర మొకటి యున్నను దానికి సంబంధించినయక్షరములను మహర్షి యిందు నిక్షేపించె ననుటకు ప్రమాణ మేదియును కన్పించుట లేదు

ధర్మాకూతమును రచించిన త్ర్యంబకమఖి, ఇందు తక్కిన కాండములలో కన్న సాహిత్యసౌందర్యము సమగ్రముగ రూపొంది యున్నది, కావున దీనికి సుందరకాండ మనుపేరు తగియున్న దని ప్రతిపాదించినాఁడు ఆయన ఈదృష్టితో ఈకాండమునందు ఎన్నో

అలంకారములకు గుణములకు రీతులకు రసభావములకు లక్ష్యములను నిరూపించినాఁడు. ఈదృష్టితో పరిశీలించినచో ఇతరకాండముల యందును ఇట్టిలక్ష్యములను చూడవచ్చును. మఱియును కవి తనకావ్యమున ఒకభాగమును సాహిత్యసౌందర్యమహిత మని తక్కిన భాగములు కావని భావింపఁడు. కావ్య మంతయు కవిదృష్టిలో ఏకరూపముగానే యుండును. అందువలన వాల్మీకి ఈకాండము మాత్రము సాహిత్యసౌందర్యముచేత మహనీయముగా నున్నట్లు భావించి సుందరకాండ మను పేరు పెట్టె ననుట సంభావ్యముగా తోఁచుట లేదు.

మఱికొందఱు ఇందు సాహిత్యసౌందర్యముతోపాటు విషయసౌందర్యము కూడ కల దని నిరూపింతురు. ఇందు ఆంజనేయుఁడు సీతాసౌందర్యమును రామునిసౌందర్యమును కడు రమణీయముగా వర్ణించినాఁడు. మహర్షి లంకానగరసౌందర్యమును అశోకవనశోభను కమనీయముగ వర్ణించెను అందువలన కూడ దీనిని సుందరకాండ మనుట సమంజస మని వా రందరు. కాని యితరకాండములలో పంపాసరోవరము వర్షఋతువు మొదలగునవి యింతను మనోహరముగా వర్ణింపఁబడియున్నవి. కావున వర్ణనముల సౌందర్యముచేత దీనికి సుందరకాండ మను పేరు తగియున్న దనుట కుదురదు.

కాండములకు ఈనామములను మహర్షి పెట్టనే దని, తరువాతివారు ఎవరో ఈనామములను ప్రసిద్ధికి తెచ్చి రని కొందఱు చెప్పుదురు; యుద్ధకాండమునకు లంకాకాండ మను నామాంతరము కల దనియు చెప్పుదురు. ఈనామములను కవి యుద్దేశింపక పోయినను మొదట వీనికి నామకరణము చేయఁబూనినవాఁడు మహనీయుఁడే అయి యుండును. మహర్షి కాకపోయినను, ఆమహనీయుఁ డైనను దీనిని ఏయభిప్రాయముతో సుందర మని వ్యవహరించియుండును?

మహాత్ములు భౌతికసౌందర్యమునకు ప్రాధాన్యము నొసంగరు. ఈకాండమునందు సుందరవిషయములు ఎన్నియున్నను వారు ఆవిషయములచే ఆకృష్టులై దీనిని సుందరకాండముగ వ్యవహరించియుండరు. ఇందు భౌతికసౌందర్యముతో పాటు ముఖ్యపాత్రలశీలసౌందర్యము అద్భుతముగా వర్ణింపఁబడినది. దాంపత్యధర్మసౌందర్యము ఇందు అనుపమానముగా నిరూపింపఁబడినది, రాక్షసులమధ్య బంధింపఁబడి వారిచే నిరంతరము తర్జింపఁబడుచున్నను సీతాదేవి ఒక్కక్షణమైనను రాముని విస్మరింపక ఆయననే ధ్యానించుచుండినది. అట్లే శ్రీరాముఁడు కూడ ఆమెయందే తలంపుకలవాఁడై యాహారనిద్రలను సైతము వర్జించుచున్నాఁడని ఆంజనేయుఁడు చెప్పెను. దాంపత్యముయొక్క పవిత్రత ఇంత యుదాత్తముగ మనోహరముగ మఱియెక్కడను నిరూపింపఁబడలేదు. ఇంతకన్నను మించినది సర్వోత్తమమైనది ఆంజనేయునిశీలసౌందర్యము. ఆయన బ్రహ్మచారి. ఆయనకు దాంపత్యసుఖము తెలియదు. అయినను సీతారాములపరస్పరప్రేమగాఢతను పవిత్రతను, ఆ పవిత్రతను నిల్పుకొనుటయందలికఠోరదీక్షను చూచి ముగ్ధుఁడై వారి కెట్లైనను సంయోగమును కలిగింపవలయు నని ఎంతో ప్రయత్నించుట పరోపకారపరత్వమునకు పరాకాష్ఠ యని చెప్పవలసియున్నది. ఆయన ఓషధీపర్వతమును దెచ్చి యుద్ధరంగమునందు ఇంతకన్నను ఎక్కువ ఉపకారము చేసె ననుట, ఆమహాకార్యము లన్నియు స్వామిసేవలో భాగము లనుట యథార్థమే. అయినను వానికి ప్రథమప్రకాశనము ఈకాండమునందే యుజ్జ్వలముగా సంభవించినది. నిజముగా రామునకు కృతజ్ఞతతో ఉపకారము చేయవలసినవాఁడు సుగ్రీవుఁడు. అతనిప్రమత్తతతో పోల్చినచో ఆంజనేయునియుపకారపరత్వమునందలి యుత్సాహము శతగుణముగా ప్రకాశించుచున్నది. స్వామియానతిదృష్టితో చూచినచో సీతను చూచి రమ్మని మాత్రమే

సుగ్రీవుఁ డాజ్ఞాపించెను; ఆమెను చూచి ముద్రిక నొసంగి చూడామణిని గైకొని యాంజనేయుఁడు తిరిగివచ్చి యావార్తను చెప్పినచో స్వామి యాజ్ఞ నిర్వహింపఁబడినట్లే యగును. సీతయొద్ద చూడామణిని గైకొని ఆయన బయలుదేరినతరువాత అశోకవనికాభంగమునుండి లంకానగరదాహమువఱకును జరిపిన కార్య మంతయు సాహసమే. అది కేవల మాయన యుత్సాహముతో చేసినదే. అందు ఇతరప్రేరణ మేమియును లేదు.

అన్నిటికన్నను మించినది ఆయనయింద్రియనిగ్రహము. రావణాంతఃపురము స్త్రీవనముగా నున్న దని మహర్షి వర్ణించెను. వివిధఫలపుష్పలతాసుభగమైన వనమువలె వివిధాభరణభూషితలైన సుందరీమణులతో ఆయంతఃపురము అమితమనోహరముగా నుండెను. వా రందఱు నిద్రించుచుండఁగా వారిమధ్యమున అంజనేయుఁడు సీత కొఱకు వెదకవలసివచ్చెను. ఎంత నిగ్రహశాలికైనను ఇది పెద్ద పరీక్షయే. స్వర్గాధికమనోజ్ఞమైన యాభోగసదనమున ఆయన ఏ మాత్రము వికృతి నొందకుండుట మనస్సౌందర్య సమున్నతికి పరసీమ.

ఇట్లు ఈమహాకావ్యమునందు నాయికానాయకులైన సీతారాముల యొక్క వారిభక్తులలో అగ్రేసరుఁడైన యాంజనేయునియొక్క శీల రామణీయకము సాహిత్యమున ఉత్తమసాధనమైన ధ్వనివిధానమున సుందరముగా ఈకాండమున వ్యక్తీకరింపఁబడుటచే ఇది సుందర మని ప్రసిద్ధమైన దని చెప్పుట సమంజసము.

అంజనేయుఁడు ప్రాఙ్ముఖుడై సూర్యేంద్రచతుర్ముఖులకు జనకుఁడైన వాయుభట్టారకునకు మహాభూతములకును అంజలించెను. పిమ్మట ఆయన దక్షిణాభిముఖుఁడై పైకి ఎగురుట కొఱకు బాహువులతో పర్వ

తాగ్రమును అదిమెను. ఆయొత్తిడికి పర్వతమునుండి నీరు బంగారు వెండి మొదలగునవి ద్రవములై స్రవించెను. గుహలలోని భూతములు ఘోషించెను. సర్పములు కుపితములై శిలలను కఱచుచుండఁగా విషము ప్రజ్వలింపఁజొచ్చెను. విద్యాధరులు స్త్రీలతో కూడ గగనమున కెగసి ఆంజనేయునివిక్రమమును తిలకింపఁజొచ్చిరి. ఆయన వాల మల్లార్చి మహానాద మొనర్చి హృదయమున ప్రాణములను నిరోధించి పై కెగసి పోవుచు ఋక్షవానరులతో నిట్లనెను. "శ్రీరాముని శరమువలె లంకకు పోవుచున్నాను. సీత లంకలో కన్పింపకున్నచో దేవలోకమునకు పోవుదును. అచ్చటను సీత కన్పింపకున్నచో రావణుని బంధించి తెచ్చెదను. ఆవశ్యక మని తోఁచినచో రావణునితో కూడ లంకను పెకలించి తెచ్చెదను.''

శ్లో॥ స సూర్యాయ మహేంద్రాయ పవనాయ స్వయంభువే।
భూతేభ్య శ్చాంజలిం కృత్వా చకార గమనే మతిమ్॥ 8

సుందరకాండ–సర్గ–1

హనుమంతుఁడు పై కెగిరినంతనే పెక్కు వృక్షములు లతలు సాగనంపుటకై బయలుదేరినబంధువులవలె, రాజువెన్నంటి పోవు సైన్యములవలె, ఆయనను పరివేష్టించి పోవఁజొచ్చెను పుష్పితములైన పాదపములతో హనుమంతుఁడు పర్వతమువలెనే కన్పించెను. లతాపాదపములు సాగనంపి వెనుకకు మరలెడు బంధువులవలె వెనుకఁబడెను. సముద్రముపైఁ జనుచున్న శరీరముతో పాటు క్రిందనీటియందు పోవుచున్నయాయననీడ తెఱచాపగాలితో కొనిపోఁబడుచున్న నౌకవలె తోఁచెను. ఆయన పోవుచున్నమార్గమందు సముద్రము ఉన్మత్తమైనట్లు చలింపఁజొచ్చెను. పదియోజనములవెడల్పు ముప్పది యోజనములపొడవు గలిగి ఆయననీడ చారుతరముగా నుండెను. మేఘములలోనికి పోవుచు వెలికివచ్చుచు హనుమంతుఁడు చంద్రునివలె

ప్రకాశింపఁజొచ్చెను. రామకార్యార్థసిద్ధికై పోవుచున్నయాయనను సూర్యుఁడు తపింపఁజేయలేదు. వాయువు చల్లగా వీచెను. ఋషులు ప్రశంసించిరి. గంధర్వులు స్తుతిగీతముల నాలపించిరి.

శ్లో॥ దశయోజనవిస్తీర్ణా త్రింశద్యోజన మాయతా।
ఛాయా వానరసింహస్య జవే చారుత రాభవత్॥ 74

సుందరకాండ–సర్గ- 1

అప్పుడు సముద్రుఁడు, "నేను సాగరులచే వృద్ధినొందితిని. ఇక్ష్వాకువంశ్యుఁడైన రామునకు సాయ మొనర్చుటకై పోవుచున్న యీతనికి సాయ మొనరింపకున్నచో నేను లోకనిందకు గుఱియగుదును" అని తలంచి మైనాకుని జూచి "నీవు పైకి లేచి హనుమంతునకు విశ్రాంతిని కలిగింపుము. ఇతఁడు రామకార్యార్థియై పోవుచున్నాఁడు" అని చెప్పెను. వెంటనే మైనాకుఁడు బంగారుశృంగములతో మహాద్రుమలతాపరివృతుఁడై పైకివచ్చెను. ఆకస్మికముగా పైకి వచ్చుచున్నయా పర్వతమును జూచి హనుమంతుఁడు, 'ఇది దారి నడ్డగించుటకు వచ్చుచున్న' దని తలంచుచు దానిని వేగమున వక్షముతోఁ దాఁకెను. ఆతాఁకునకు దాని శిఖరములు కొన్ని భగ్నము లయ్యెను. అయినను మైనాకుఁడు హనుమంతునివేగమునకు సంతసించుచు మానవరూపమున సర్వాధికొన్నతమైన శిఖరముపై నిలిచి స్వాగతము పలికి యిట్లనెను. "సాగరులచే వర్ధిల్లిన సముద్రుఁడు నిన్ను అర్చింప నన్ను పంపినాఁడు. నీవు నాశిఖరములయందు విశ్రమించి కందమూలఫలములను భుజించి మార్గశేషమును సుఖముగా తరింపుము. నాకు కూడ నీతో సంబంధము కలదు. పర్వతములఱెక్కలను ఇంద్రుఁడు వజ్రముతో ఖండించుచున్నప్పుడు మీతండ్రి వాయుభట్టారకుఁడు నన్ను గొనివచ్చి నముద్రమునం దుంచి రక్షించెను. నిన్ను పూజించినచో ఆయనను పూజించినట్లే యగును. కావున మాయాతిథ్యమును స్వీకరించి నాకును సాగరునకును ప్రీతి కలిగింపుము.

కృతజ్ఞతసంగతి యట్లుండనిమ్ము. పామరుఁడు కూడ అతిథిగా వచ్చినవాఁడు, పండితున కైనను పూజార్హుఁడే యగును. ఇంక నీవంటి వాఁడు అతిథిగా వచ్చినప్పుడు ధర్మమును తెలిసికొనఁగోరుచున్న నావంటి వానికి పూజార్హుఁ డని చెప్పవలసిన దే మున్నది?"

శ్లో॥ అతిథిః కిల పూజార్హః ప్రాకృతోఽపి విజానతా।
ధర్మం జిజ్ఞాసమానేన కింపున ర్యాదృశో భవాన్॥ 112

సుందరకాండము సర్గ-1

సాగరమైనాకుల కృతజ్ఞత గమనింపఁ దగియున్నది. లక్షల యేండ్ల క్రిందట రామునిపూర్వులు అంజనేయునిజనకుఁడును తమకు చేసినయుపకారములను ఇప్పుడు వారు స్మరించుచున్నారు. ఎంతకాలము గడచినను మహాత్ములు తాము పొందినయుపకారమును విస్మరింపరు. వారు తమకు ఉపకారము చేసినవారికే గాక వారిసంతతియందును కృతజ్ఞతతో వర్తింతురు.

అంజనేయుఁడు ఆశ్చర్యమును ఆనందమును పొంది, "నేను నీ యాదరవచనములచేతనే ప్రీతి నొందితిని. మీరు నాకు ఆతిథ్య మిచ్చినట్లే అయినది. నేను ఇప్పుడు నిలువఁజాలనందులకు మీరు ఖేదము నొందకుఁడు. ప్రొద్దు గడచుచున్నది. కావున ఆగుటకు వీలు లేదు" అని మైనాకుని చేతితో స్పృశించి సాగరమైనాకుల యాశీస్సులను పొంది ఆకాశమున నింకను పైకి పోయెను. ద్వితీయమైన యాపరాక్రమమును జూచి దేవతలు విస్మితులై హర్షము నొందిరి. దేవేంద్రుఁడు సంతోషముతో మైనాకుని జూచి, "నీవు రామదూతయైన హనుమంతునకుఁ గావించిన సత్కృతికి సంతసించితిని. ఇంక నీకు నావలన భయము ఉండదు. యథేష్టముగా నుండుము" అని పలికెను.

దేవతలు ఈసంఘటనమును అంజనేయుని ద్వితీయమైన పరాక్రమముగా తలంచిరి. మొదటిపరాక్రమ మేమి? మహేంద్రపర్వతశిఖర

ముల నదిమి అమితవేగముతో ఆకాశమునఁ జొచ్చుటయే మొదటిపరాక్రమము. మైనాకుని శిఖరములపై నిలువకుండఁ బోవుటలో విశేష మేమున్నది? అది మఱియొక పరాక్రమము ఎట్లైనది? వక్షముతో తాకి మైనాకుని శిఖరములను భంగమొందించుట, అంతదూరము ఆకాశమున వచ్చినను అలుపు నొందకుండుట రెండవపరాక్రమము.

దీనిని చూచుచున్న సిద్ధగంధర్వాదులకు కుతూహలము కలిగెను. "ఈ వేగముతో ఇతఁడు సముద్రమును సులభముగనే తరింపఁగలఁడు. కాని ఘోరపరాక్రములైన రాక్షసులు కోట్లకొలఁదిగా నున్న లంకలో ప్రవేశించినతరువాత వారితో సంఘర్షణము సంభవించినచో నెగ్గిరాఁగల పరాక్రమము ప్రజ్ఞ ఇతనికి ఉన్నవా?" అని వారు కుతూహలము నొంది నాగమాతయైన సురసయొద్దకు పోయి "హనుమంతుని బలమును పరీక్షింపు" మని కోరిరి. ఆమె సరే యని భయంకరమైన రాక్షసీరూపముతో ఆంజనేయుని దారి కడ్డముగా నిలిచి, "నీవు నాకు భక్ష్యమవు. నానోటియందు ప్రవేశింపుము. ఇది నాకు బ్రహ్మయిచ్చిన వరము" అని గద్దించెను. ఆంజనేయుఁ డామెను గమనించుచు నెమ్మదిగా నిట్లనెను. "నేను రామకార్యార్థినై పోవుచున్నాను. తద్విషయవాసినివైన నీవు ఆయనకు సాయము గావింపవలె. లేదా రామకార్యమును నిర్వహించినపిమ్మట నీనోటియందు ప్రవేశింతును." ఆమె "నానోటియందు ప్రవేశింపకుండ నెవ్వఁడును తప్పించుకొనుటకు వీలు లేదు" అని పట్టుఁబట్టెను. ఆంజనేయుఁడు అగ్రహించి ఆలోచించి తనశరీరమును దశయోజనములుగా పెంచెను. ఆమె తననోటిని తెఱచి ఇరువదియోజనముల వెడల్పుగా పెంచెను. వెంటనే మారుతి అంగుష్ఠమాత్రశరీరుఁడై ఆమెనోటిలోనికి పోయి వెలికివచ్చి "అమ్మా! నీ మాట నెఱవేర్చితిని; ఇంక పోయివత్తును. నీకు నమస్కారము" అనెను. ఆమెయు సంతోషించి స్వరూపమును పొంది ఆశీర్వదించెను.

తృతీయమైన యీహనుమద్విక్రమమునకు సకలభూతములు సాధువాదములు గావించెను.

శ్లో॥ తస్యా స్స్వకాశం దూతోఽహం గమిష్యే రామశాసనాత్।
కర్తు మర్హసి రామస్య సాహ్యం విషయవాసిని॥ 147
సుందరకాండము-సర్గ-1

తి. టీక:-రామస్య విషయవాసినీతి-తస్యసర్వాధిపతిత్వాత్।

గో. టీక;-విషయవాసినీ రామరాజ్యవాసినీ।

ఆంజనేయుఁడు సురసతో, "తద్విషయవాసినివైన నీవు ఆయనకు సాయముఁ గావింపవలె" అని చెప్పెను. విషయ మనఁగా దేశము లేక రాజ్యము. విషయమున నివసించు స్త్రీ విషయవాసిని. ఒకదేశమున నివసించువారు ఆదేశపరిపాలకునియొక్క పాలనసామర్థ్యముచేత సుఖముగా నుందురు. కావున వారు ఆవశ్యక మైనప్పుడు ఆరాజునకు సాయము చేయుట ధర్మము. కాని సురస నివసించుచున్నసముద్రము రామునివిషయ మగునా? సాగరుఁడు చెప్పినట్లు ఆసముద్రము రాముని పూర్వులైన సగరచక్రవర్తికుమారులవలన రూపొందెను. అందువలన అది సగరునకు ఆయనవంశీయులకు చెందును. కావున అది రాముని దేశమే యగును. కావున సముద్రపర్యంతమైన భూమియే కాక సముద్రము, దానియందలిదీవులు కూడ రాముని రాజ్యము క్రిందికి వచ్చుననుట స్పష్టము. అసమర్థులైన దశరథునివంటివారు ఆయధికారమును వహింపచున్నను రామునివంటివారు తమవంశాధికారమును వహించుట సహజమని దీనివలన వ్యక్త మగుచున్నది.

ఆంజనేయుఁడు కొంతదూరము పోయినతరువాత ఒకచోట సింహిక యనురాక్షసి ఆయనను జూచి చిరకాలమునకు మంచిభోజనము

లభించె నని సత్వరయై ఆయననీడను ఆకర్షింపఁ జొచ్చెను. ఎదురు గాలిచే నౌకాగమనమువలె హనుమంతునివేగము కుంటుపడెను. ఆయన అటునిటు పరికించి సింహికను చూచి, సుగ్రీవుఁడు చెప్పినఛాయా గ్రాహిణియైన రాక్షసి యిదియే యని గ్రహించి, తనశరీరమును పెంచఁ జొచ్చెను. అదియును తననోటిని తెఱచుచు అంతకన్న అధికముగా పెంచఁజొచ్చెను. పెద్దగా తెఱచినదానినోటిలోనుండి దానిహృదయ స్థానమును పరికించి హనుమంతుఁడు చిన్నశరీరముతో అమితవేగ మున దానినోటినుండి లోనికి పోయి దానిహృదయమును పెకలించి గ్రేవులతో మాంసపిండమును వెలుపలికి విసరివైచెను.అది మరణించి నంతనే ఆయన మరల పైకెగసెను. ఈ నాల్గవవిక్రమమును చూచి ఖేచరులు ప్రశంసించిరి.

## 6. లంకాప్రవేశము

సముద్రమును దాఁటుచుండఁగనే హనుమంతుఁడు తీరమునందు వనములను ఉపవనములను చూచుచు అక్కడ దిగెను. రాక్షసులు తన్ను జూచి శంకింతు రని శరీరమును తగ్గించి సాధారణవానరరూప మును పొందెను. ఆయన నూఱుయోజనములసముద్రమును లంఘించి యును పరిశ్రాంతి నొందలేదు; నిట్టూర్పునైన విడువ లేదు. "నేను పెక్కువందలయోజనములైన ఇట్లే పోఁగలను నా కీ నూఱుయోజన ములు లెక్క ఏ మున్నది?" అని ఆయన అనుకొనెను.

అప్పటికి సాయంకాల మయ్యెను. అప్పు డాయన కుతూహలం ముతో దాపున నున్న త్రికూటశిఖరముపైకి పోయి లంకను కలయఁ జూచెను. అది వనములతో పరివృతమై యుండెను. శైలశిఖరముపై విస్తృతమైయున్న యా నగరమునందు ఇండ్లు ఏడు ఎనిమిది అంత స్తులు గలవియై కొండలవలె నుండెను. సీతాపహారణనిమిత్తముగా

శత్రువులదాడిని శంకించుచు రావణుఁడు నగరరక్షణమును మిగుల కట్టుదిట్టము గావించెను. ధనుర్ధరులైన యుగ్రరాక్షసయోధులు అన్నివైపులఁ దిరుగుచు నగరరక్షణముఁ గావించుచుండిరి.

శ్లో॥ అనిశ్వసన్ కపి స్తత్ర న గ్లాని మధిగచ్ఛతి॥ 3

శ్లో॥ శతా న్యహం యోజనానాం క్రమేయం సుబహూ న్యపి।
కిం పున స్సాగర స్యాన్తం సంఖ్యాతం శతయోజనమ్॥ 4

శ్లో॥ సీతాపహరణా ర్త్తేన రావణేన సురక్షితామ్।
సమంతా ద్విచరద్భి శ్చ రాక్షసై రుగ్రధన్విభిః॥ 15
సుందరకాండము–సర్గ–2

నగరమును నగరరక్షణమును చూచుచు హనుమంతుఁ డిట్లను కొనెను. "ఈసముద్రమును దాఁటి యిక్కడి కెంతమంది రాఁగలరు? నాతో కూడ అంగదుఁడు నీలుఁడు సుగ్రీవుఁడు మొత్తము నల్వురే కదా! రాముఁ డెట్లైనను ఇక్కడికి చేరఁగలిగినను ఏమి చేయఁగలఁడు? ఇప్పు డీయాలోచన యెందులకు? సీతను చూచినతరువాత అప్పటి సంగతి ఆలోచింపవచ్చును. ఇప్పుడు నేను రాక్షసులకు అగపడకుండ ఏకాంతమున సీత నెట్లు చూడఁగలను? నేను రాక్షసులకంటఁ బడినచో కార్యమంతయు భగ్న మగును. రాక్షసరూపమును వహించినను గుర్తింపఁబడకుండుట అసంభవము. ఇచ్చట వాయుదేవుఁడు కూడ అజ్ఞాతముగ చరింపలేఁడు. కావున చీఁకటిపడినతరువాత హ్రస్వరూపముతో నగరమున ప్రవేశించి వెదకెదను.

శ్లో॥ న హి శక్యం క్వచిత్ స్థాతు మవిజ్ఞాతేన రాక్షసైః।
అపి రాక్షసరూపేణ కి ముతాన్యేన కేనచిత్॥ 41

శ్లో॥ వాయు ర ప్యత్ర నాజ్ఞాత శ్చరే దితి మతి ర్మమ। 42
సుందరకాండము–సర్గ–2

ఆయన యిట్లనుకొనుచుండఁగా సూర్యుఁ డస్తమించెను. సంజ చీఁకటులు అలముకొనఁజొచ్చెను. అప్పు డాయన పిల్లియంతయాకార ముతో వానరరూపముననే నగరమున ప్రవేశించుటకై స్వర్ణప్రాకార మును చేరెను. ఇంతలో లంకానగరాధిదేవత లంక యను రాక్షసి వికృతాననయై హనుమంతునియెదుట నిలిచి, "ఎవరు నీవు? ఇక్కడి కెందులకు వచ్చితివి? నీవు లోనికి పోవుటకు వీలు లేదు" అని గర్జిం చెను. ఆంజనేయుఁడు నెమ్మదిగా నిట్లనెను. "నాసంగతిని చెప్పెదను. ముందు నీవు ఎవరో చెప్పుము. ఇట్లు విరూపనేత్రవై పురద్వారమం దేల యున్నావు?" అందులకు క్రుద్ధయై ఆరాక్షసి "నన్ను అడుగుటకు నీవు ఎవఁడవు? నేను లంకాధిదేవతను. నాపేరు లంక. ఈనగరము నంతను నేను రక్షించుచున్నాను. ఇంక నీసంగతి చెప్పుము" అనెను. హను మంతుఁడు సాధారణాకృతిగా శరీరమును పెంచి దృఢముగ నిలిచి "నేను వానరుఁడను చూచుచున్నావు గదా! ఈనగరములోని చిత్ర కాననములను విచిత్రగృహములను చూచిపోవుటకు వచ్చితిని" అనెను. అందుల కది, "ఓరీ! దుర్బుద్ధీ! నన్ను జయింపకుండ నీవు లంకలోనికి అడుగిడఁజాలవు" అనుచు రయమున వచ్చి ఆయనను అఱచేతితో చఱ చెను. హనుమంతుఁడు కుపితుఁ డయ్యెను. స్త్రీ యను దాక్షిణ్యముచేత ఎడమచేతి పిడికిలితో ఆమెను మెల్లగా పొడిచెను. అంతమాత్రముననే అది వికృతనేత్రయై క్రిందఁబడి భయముతో నిట్లు ప్రార్థించెను. "నన్ను చంపకుము. సత్పురుషులు మర్యాదను పాటింతురు; స్త్రీలను సంహ రింపరు. నేను ఎప్పుడు వానరునిచే జయింపఁబడుదునో అప్పుడు లంక లోనిరాక్షసులకు భయము కలుగు నని బ్రహ్మదేవుఁడు చెప్పెను అది యిప్పుడు జరిగినది. ఇంక సీతానిమిత్తముగ రాక్షసక్షయము తప్పదు. సరే! నీవు నీయిచ్చవచ్చినట్టు పురములోనికి పోయి కార్యమును చక్కఁ బెట్టుకొనుము."

## 7. సీతాన్వేషణము

లంక వెడలిపోయినంతనే ఆంజనేయుఁడు మరల పిల్లియంత యాకారమును పొంది నగరమునందు ద్వారములోనుండి ప్రవేశింపక ప్రాకారముపైకి లంఘించి, శత్రుమూర్ధమున ఉంచినట్లుగా, దానిపై వామపాదము నుంచెను. అటనుండి క్రిందికి దూఁకి రత్నమయద్వార వేదికలతో ప్రకాశించుచున్న పురవైభవమును చూచుచు విస్మితుఁడై "కుముదాంగదసుషేణాదుల కైనను ఈలంక నాక్రమించుట అశక్య" మని తలంచుచు రామలక్ష్మణులపరాక్రమమును స్మరించుచు మరల నూరట నొందుచు ముందుకు పోఁజొచ్చెను. అట్లాయన ముందుకు పోయి కొన్నియెడల సంగీతవిశేషములను కొన్నియెడల స్వాధ్యాయ పరుల వేదమంత్రములను వినెను. కొన్నిచోట్ల దీక్షితులు జటిలులు ముండితశిరస్కులు గవాజినాంబరవసనులు దర్భముష్టిప్రహరణులు అగ్నికుండాయుధులును అయిన రాక్షసులను పెక్కుమందిని మధ్యమగుల్మమున చూచెను.

శ్లో॥ అద్వారేణ మహాబాహుః ప్రాకార మవపుప్లువే।
నిశి లంకాం మహాసత్త్వో వివేశ కపికుంజరః॥ 2

శ్లో॥ ప్రవిశ్య నగరీం లంకాం కపిరాజహితంకరః।
చక్రేఽథ పాదం సవ్యం చ శత్రూణాం స తు మూర్ధని॥ 3

శ్లో॥ శుశ్రావ జపతాం తత్ర మంత్రాన్ రక్షోగృహేషు వై।
స్వాధ్యాయనిరతాం శ్చైవ యాతుధానాన్ దదర్శ సః॥ 13

శ్లో॥ దదర్శ మధ్యమే గుల్మే రాక్షసస్య చరాన్ బహూన్।
దీక్షితాన్ జటిలాన్ ముండాన్ గోఽజినాంబరవాససః॥ 15

తి. టీక:— మధ్యమే గుల్మే మధ్యమ కక్ష్యా ప్రదేశే। చరాన్ నగరవృత్తాంతవేదక గూఢచరాన్। దీక్షితజటిలముండా గృహీవవి

యతయః। గోఽజినం గవాజినం (వృషభచర్మ) తద్వాసనః। అంబర వాసనః వివాసనః।

శ్లో॥ దర్భముష్టిప్రహరణా నగ్నికుండాయుధాన్ తథా। 16

తి. టీక:- అరిష్టనివారణపూర్వక మనుష్ఠాననిర్వాహాయ దర్భ ముష్టి ప్రహరణత్వం కేషాంచిత్। "యథా వజ్రం హరేః పాణౌ తథా విప్రకరే కుశః"। కృత్యా ద్యుత్పాదనద్వారా శత్రుమారకతయా అగ్ని కుండానా మాయుధత్వమ్।

దీక్షితు లనఁగా అగ్న్యాధానమును గావించిన యాహితాగ్ను లైన గృహస్థులు. జటిలు లనఁగా జడలుగలిగినవానప్రస్థులు; ముండిత శిరస్కులు యతులు. వీరు మూఁడు ఆశ్రమములకు చెందినవా రనుట స్పష్టము. గవాజినాంబరవసను లనఁగా, గోవుయొక్కచర్మము (వృషభ చర్మము) వసనముగా కలవారు, అంబరము వసనముగా కలవారు అనఁగా దిగంబరులు. దర్భలను పిడికిలియందు కలిగి, అవశ్యకమై నప్పుడు ఆదర్భయందు మంత్రశక్తి నావహించి అస్త్రములనుగా ప్రయో గించువారు దర్భముష్టిప్రహరణులు. అగ్నికుండములనుండి కృత్యలను పుట్టించి వానిని ఆయుధములుగా ప్రయోగించువారు అగ్నికుండా యుధులు.

దీనినిబట్టి లంకయందు వేదవిహితమైన సామాజికవ్యవస్థయే యున్న దనుట స్పష్టము. ఉత్తరకాండయందు ఇంద్రజిత్తు అశ్వ మేధాంతముగా పెక్కు క్రతువులను చేసె నని వర్ణింపఁబడియున్నది. ఇది యంతయు వైదికనాగరికతయే. రావణాదిరాక్షసులు ద్రావిడు లని రామాదులు ఆర్యు లని కొందఱు తలంచుట అసంబద్ధము. అప్రమాణ మని గ్రహింపవలసియున్నది.

అంజనేయుఁడు అమధ్యమగుల్మమునుండి నానారూపులను వివి ధాయుధధారులను బహువిధాలంకారులను చూచుచు ముందునకు పోయి

లక్షమందిభటులచే రక్షింపఁబడుచున్న రావణాంతఃపురమును చూచెను. అది ఒకశైలశిఖరముపై పుండరీకశోభితములైన పరిఖలతో రథగజ హయాదిసంకులములైన ప్రాకారములతో స్వర్గతుల్యముగా నుండెను. ప్రాకారము అర్కవర్ణముగ నుండెను.

ఇచ్చట పంచమసర్గలో చంద్రశోభావర్ణన మున్నది. ఇందు అనేకవిశేషవృత్తములు ఆధునికకావ్యములశైలిలో రచింపఁ బడి యున్నవి. ఇది మహర్షిరచనముగా తోఁచుటలేదు. కాళిదాసుతో సమానుఁడైన యొకానొక మహాకవి యెవరో దీనిని మనోహరముగ రచించెనని చెప్పవచ్చును.

హనుమంతుఁడు రావణుని యంతఃపురప్రాకారమునుండి ప్రహస్త మహాపార్శ్వకుంభకర్ణవిభీషణమేఘనాదాదుల భవనములపైకి దుముకుచు పోయి, వానిని చూచి, మరల రావణుని యంతఃపురమునకు వచ్చెను. ఏడవసర్గలో రావణునిభవనము విశేషవృత్తములలో విపులముగ వర్ణింపఁబడినది. అందు పుష్కరిణులు సరోవరములు వైడూర్యాదిరత్నమయవిహంగచిత్రములు, పద్మహస్తయైనలక్ష్మీదేవి విగ్రహము వర్ణింపఁబడినవి. ఎనిమిదవసర్గయందు విశేషవృత్తములలో పుష్పకవిమానము వర్ణింపఁబడినది. తొమ్మిదవసర్గలో మరల రావణ భవనము పుష్పకము వర్ణింపఁబడియుండుటచే సప్తమాష్టమసర్గలు ప్రక్షిప్తము లని తోఁచుచున్నది.

రావణునిభవనములలో మధ్య పుష్పకవిమాన ముండెను. హనుమంతుఁడు దానిపైకి ఎక్కెను. పానభక్ష్యాన్నములనుగంధము ఉత్తమ బంధువును ఇటు రమ్మని ఆహ్వానించుచున్నట్లుండెను. దానిచేత ఆకర్షింపఁబడి హనుమంతుఁడు పుష్పకమునుండి దిగి ఆవాసన ననుసరించి రావణునిశయనమందిరమునకు చేరెను.

అది పంచేంద్రియములకు పరితర్పణముఁ గావించుచు, "ఇదియే స్వర్గము; దేవలోక మిదిమే; తపస్సునకు పరమసిద్ధియును ఇదియే- అన్నట్లుండెను. మహాధూర్తులచేత జయింపఁబడి దిగులుపడి నిశ్చేష్టులైన ధూర్తులవలె ఆమందిరమున ప్రదీపములు కదలకుండ వెలుఁగుచుండెను. అచ్చట రావణునిభార్యలు నిద్రించుచుండిరి. అందు రాజర్షికన్యలు రాక్షసయువతులు విప్రదైత్యగంధర్వస్త్రీలును ఉండిరి. యుద్ధకాముఁడైన రావణుఁడు జైత్రయాత్రలలో వారిలో పెక్కుమందిని హరించి తెచ్చెను. కొందఱు కామవశంవదలై అతనివెంట వచ్చియుండిరి. వివిధవస్త్రాలంకారభూషితలై వారు నిద్రించుచుండఁగా ఆ మందిరము స్త్రీవనమువలెనే యుండెను.

తొమ్మిదవసర్గయొక్క అంతమున "జనకాత్మజ తప్ప అక్కడనున్న రావణునిభార్యలలో, అంతకుపూర్వము ఇతరునియందు కామము కలది కాని ఇతరునకు భార్యగా ఉన్నది గాని ఎవతెయును లేదు." అని చెప్పఁబడియున్నది. (న చాన్యకామాఽపి న చాన్యపూర్వా వినా వరార్హాం జనకాత్మజాం తామ్.) ఇది పైనఁజెప్పఁబడినదానికి విరుద్ధముగా నున్నది. కావున సర్గాంతవిశేషవృత్తములు నాల్గు ప్రక్షిప్తములై యుండును.

శ్లో॥ స గంధ స్తం మహాసత్త్వం బంధు ర్బంధుమి వోత్తమమ్। 20

శ్లో॥ ఇత ఏ హీత్యువా చేవ తత్ర యత్ర సరావణః॥ 21

శ్లో॥ ఇంద్రియా ణీంద్రియార్థై స్తు పంచ పంచభి రుత్తమైః॥ 28

శ్లో॥ తర్పయామాస మాతేవ తదా రావణపాలితా।
స్వర్గోఽయం దేవలోకోఽయం ఇంద్రస్యాపి పురీ భవేత్।
సిద్ధి ర్వేయం పరా హి స్యా ది త్యమన్యత మారుతిః॥ 30

శ్లో॥ ప్రధ్యాయత ఇవాపశ్య త్ప్రదీపాం స్తత కాంచనాన్।
ధూర్తా నివ మహాధూర్తైః దేవనేన పరాజితాన్॥ 31

శ్లో॥ రాజర్షి పిత్రు దైత్యానాం గంధర్వాణాంచ యోషితః।
రాక్షసానాం చయాః కన్యాః తస్య కామవశం గతాః॥ 68

శ్లో॥ యుద్ధకామేన తా స్సర్వాః రావణేన హృతా స్త్రియః।
సమదా మదనే నైవ మోహితాః కాశ్చి దాగతాః॥ 69

సుందరకాండము–సర్గ–9

పిమ్మట హనుమంతుఁడు రావణునిపర్యంకమును జూచెను. అందు మహానాగమువలె నిశ్వసించుచున్నరావణుని జూచి మిగుల నుద్వేగమును పొంది హనుమంతుఁడు మెల్లగా పర్యంకమును సమీపించి మెట్లమీఁదుగా దగ్గరనున్న యొక వేదికపై కెక్కి చూడఁ జొచ్చెను. రావణుని రెండుబాహువులు మందరపర్వతాంతరమున నిద్రించుచున్న రెండుమహాసర్పములవలె నుండెను. మకుటము జాతి కుండలోజ్జ్వలితమైన యాతనియాననము ప్రకాశించుచుండెను. అతఁడు భుజంగాకారమున పోసిన మినుములరాశివలె, గంగాతీరమున తెల్లనియిసుకపై నిద్రించుచున్నయేనుఁగువలె నుండెను. ఆపర్యంకమునకు చుట్టు ఆతని భార్యలు వీణావిపంచీమృదంగాదులను కౌఁగిలించుకొని నిద్రించుచుండిరి.

శ్లో॥ నిశ్వసన్తం యథా నాగం రావణం వానరోత్తమః।
ఆసాద్య పరమోద్విగ్నః సోఽపాసర్ప త్సుభీతవత్॥ 12

శ్లో॥ అథారోహణ మాసాద్య వేదికాన్తర మాశ్రితః।
క్షీబం రాక్షసశార్దూలం ప్రేక్షతే స్మ మహాకపిః॥ 13

శ్లో॥ దదర్శ స కపి స్తస్య బాహూ శయనసంస్థితౌ।
మందరస్యాన్తరే సుప్తౌ మహాహీ రుషితా వివ॥ 21

శ్లో॥ ముక్తామణివిచిత్రేణ కాంచనేన విరాజతా।
మకుటే నాపవృత్తేన కుండలోజ్జ్వలితాననమ్॥ 25

శ్లో॥ మాషరాశిప్రతీకాశం నిశ్వసన్తం భుజంగవత్।
గాంగే మహతి తోయాన్తే ప్రసుప్త మివ కుంజరమ్॥ 28

సుందరకాండము–సర్గ–10

రావణునిపర్యంకమునకు ప్రక్కగా నొకచోట హనుమంతుఁడు మహార్హాశయనమున గౌరవర్ణము కలిగి సువర్ణకాంతితో భూషణవిరాజితయై సుందరియైన మండోదరిని జూచెను. ఆమెను చూడఁగానే హనుమంతుఁడు సీత యనుకొని సంతోషముతో పరికించెను ఆయనయే మరల ఆలోచించి, రామవియుక్తయైన సీత తిని త్రావి యిట్లు రావణునిసమీపమున నిద్రించుట అసంభవ మని. అందువలన ఆమె సీత కాదని నిశ్చయించెను.

శ్లో॥ గౌరీం కనకవర్ణాభా మిష్టా మంతఃపురేశ్వరీమ్।
కపి ర్మందోదరీం తత్ర శయానాం చారురూపిణీమ్॥ 52

సుందరకాండము–సర్గ–10

అటనుండి ఆయన ప్రక్కనేయున్న పానశాలకు పోయెను. అచ్చట అనేకవిధములైన మాంసములను పానపాత్రలను శయనాసనములను నిద్రించుచున్న వనితాసహస్రమును చూచెను. ఎచ్చటను ఆయనకు సీత కన్పింపలేదు.

వారి నందఱను చూచుచుండఁగా అంజనేయునకు, పరదారావలోకనము ధర్మలోపమును కలిగింపదా, అనుచింత కలిగెను. కొంచెము సేపు ఆలోచించి ఆయన ఇట్లనుకొనెను. "వీరిని జూచుటవలన నామనస్సున నెట్టి వికారము కలుగ లేదు. ఇంద్రియప్రవర్తనమున మనస్సే కదా హేతువు. శుభాశుభకార్యవ్యవస్థయందు మనస్సే ప్రధానము. అది నాకు సువ్యవస్థితమై యున్నది. స్త్రీని స్త్రీలయందుఁ గాక లేళ్ళయందు వెదకనగునా?"

శ్లో॥ కామం దృష్టా మయా సర్వా విశ్వస్తా రావణస్త్రియః।
న తు మే మనసా కించి ద్వైకృత్య ముపపద్యతే॥ 41

శ్లో॥ మనో హి హేతు స్సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే।
శుభాశుభా స్వవస్థాసు త చ్చ మే సువ్యవస్థితమ్॥ 42

శ్లో॥ నాన్యత్ర హి మయా శక్యా వైదేహీ పరిమార్గితుమ్।
స్త్రియో హి స్త్రీషు దృశ్యన్తే సదా సంపరిమార్గణే॥ 43

సుందరకాండము-సర్గ-11

పానశాలనుండి బయలుదేరి పవనాత్మజుఁడు అంతఃపురములోని యన్నిగదులను వెదకెను. ఎచ్చటను సీతను గానక ఆయన పరిపరి విధముల ఆలోచింపఁజొచ్చెను. "సీతను చూడకుండ నేను తిరిగిపోయి నచో వానరు లే మందురు? వారి కందఱకును మహాదుఃఖము కలుగును. కావున నేను తిరిగి పోకుండ ఇక్కడనే ప్రాయోపవేశనము కావించుట మేలు. అయినను ఇంతమాత్రముననే నాకు ఇంత నిర్వేద మెందులకు? ఇది తగదు. అనిర్వేదము సంపదకు మూలము; అదియే పరమ సుఖము; సర్వకార్యప్రవర్తకము."

శ్లో॥ అనిర్వేద శ్శ్రియో మూల మనిర్వేదః పరం సుఖమ్॥ 10
అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః॥ 11

సుందరకాండము సర్గ-12

పిమ్మట హనుమానుఁడు తక్కినప్రదేశము లన్నియు వెదకెను. మరల పుష్పకవిమానముపై నెక్కి అటనుండి కలయఁజూచి, అక్కడనుండి ప్రాకారముపై దూఁకెను. అప్పటికి ఆయనకు చూడఁదగినప్రదేశములు ఇంకేమియు కన్పింపలేదు; సీతయు కన్పింప లేదు. అందువలన మరల నిర్వేదము పైకివచ్చి ఆయన చింతింపఁదొడఁగెను. "సీత ఇక్కడ ఎక్కడను లేదే! రావణుఁ డామెను పట్టుకొని వచ్చునప్పుడు సముద్రమునందు జాఱిపడిన దేమో? లేక రావణుని బాహువుల

పీడనముచేత మృతి నొందినదేమో? ఆమె తన్ను నిరాకరింపఁగా రావణుఁడే ఆమెను భక్షించెనో లేక మాత్సర్యవశమున ఆతనిభార్యలే భక్షించిరో? ఎట్లయిన నేమి సీత కన్పింపలే దని రామునకు ఎట్లు చెప్పుదును? చెప్పకున్నచో నెట్లు? చెప్పినచో రాముఁడు వెంటనే భిన్న హృదయుఁడై మరణించును. ఆవార్త నెఱిఁగినంతనే ఆయనకుల మంతయు నశించును. రామునితోపాటు సుగ్రీవాదులును నిర్జీవు లగుదురు. ఇందఱవినాశమునకు మూలముగా నే నచ్చటికి పోవుటకన్న నీటియందో నిప్పునందో పడి మరణించుట మేలు. మఱి సంపాతి సీత యిక్కడ నున్న దని చూచినట్లు చెప్పినాఁడు. ఆమె ఉన్నచో నాకు ఎందుకు కన్పడలేదు? నాకు కన్పింపకున్నను ఇక్కడనే ఆమె ఎక్కడనో యొకచోట నుండును లె మ్మని, ఆసంపాతిమాటలను నమ్మి, రాముని ఇక్కడికి తీసికొని వచ్చినచో, ఇక్కడ సీత కన్పింపనిచో ఆయన వానరుల నందఱ నిర్దహించును. సీత కన్పింపకున్న నేమి, రావణునే బంధించి తీసికొనిపోయి రామునకు అర్పింతునా యేమి?"

ఇట్లు ఆయన వితర్కించుకొనుచుండఁగా ఆయనదృష్టి అశోకవనముపై ప్రసరించెను. "ఇంతవఱకును దీనిని చూడలేదు ఇందైనను సీత కన్పించును గాక" అని ఆయన వసురుద్రాదిత్యవాయుభట్టారకాదులకు సీతారామలక్ష్మణసుగ్రీవాదులకును నమస్కారములు చేసి ఆ వనమునందు ప్రవేశించెను. రమణీయమైన యావనమున విచిత్రములైన శిఖరములుగల యొక కొండను, దానినుండి ప్రవహించుచున్న నదిని, దిగుడుబావిని, వేదికాపరివృతమైన యొకపెద్ద కాంచనశింశపావృక్షమును ఆయన చూచెను. ఆశింశపావృక్షముపై నెక్కి, "సీత జీవించి ఇక్కడ ఉన్నచో ఈవనమున విహరించుటకుఁ గాని, సంధ్యాకాలమున ఈనదిలో సంధ్యను ఉపాసించుటకొఱకుఁ గాని తప్పక వచ్చును." అని ఆయన తలంచెను.

శ్లో॥ సంధ్యాకాలమనా శ్శ్యామా ధ్రువ మేష్యతి జానకీ।
సదీం చేమాం శుభజలాం సంధ్యార్థే వరవర్ణినీ॥ 49

సుందరకాండము–సర్గ–14

తి. టీక:–సంధ్యాశబ్దే నాత్ర ప్రాతఃకాలో వివక్షితః। తత్ర కర్తవ్య స్నానాదౌ చాస్త్యేవ స్త్రీణా మప్యధికార ఇతి, కథం స్త్రీణాం సంధ్యావందన మితి పరాస్తం వేదితవ్యమ్। కించ సమ్యగ్భగవద్ధ్యాన స్యైవ సంధ్యాపదార్థత్వేన అస్త్యేవ తత్ర స్త్రియా అధికారః।

ఆయన రాత్రిపూట ఈవిధముగ అనుకొనుచున్నాఁడు. కావున ఆయన సంధ్య యనఁగా ప్రాతస్సంధ్యాకాలమునే యుద్దేశించె ననుట స్పష్టము. తెల్లవారువఱకును అక్కడనే నిరీక్షించుచున్నచో ఆమె ప్రాతస్స్నానసంధ్యావందనాదికముకొఱకు ఆనదియొద్దకు రావచ్చు నని ఆయన అభిప్రాయపడెను. మఱి స్త్రీలకు సంధ్యావందనాధికార మున్నదా? వారికి ఉపనయనము లేకపోవుటచే వేదమంత్రములతో సంధ్యావందనము చేయునధికారము లేకపోవచ్చును. కాని సంధ్యా వందన మన్నంతమాత్రమున వేదమంత్రపూర్వకమైనదనియే గ్రహింప నక్కఱ లేదు. గోవిందరాజస్వామి వ్యాఖ్యానించినట్లుగా సంధ్యావంద నము అనఁగా సంధ్యాకాలమునందు భగవంతునకు వందనముచేయుట అని గ్రహింపవచ్చును. భగవద్ధ్యానమునకు స్త్రీశూద్రాదులైన సకల మానవులకును అధికారము కలదు. అంతే కాదు. వైదికమైన వర్ణా శ్రమవ్యవస్థకుఁ జెందిన స్త్రీలు శూద్రులును తప్పక ఉభయసంధ్యల యందును పౌరాణికశ్లోకములతో సూర్యునకు అర్ఘ్యప్రదానము భగవ ద్ధ్యానము చేయవలయు నని దీనివలన గ్రహింపవలసియున్నది. భగ వత్స్తోత్రము లన్నియు ఇందులకే రచింపఁబడినవి. వానిని ఇతరసమ యములలో ఎప్పుడైన చదువుకొనుచున్నను సంధ్యాకాలమునందు వానిని పఠించుట మనశ్శాంతికి జ్ఞానపరిణతికి ఆవశ్యక మని గ్రహింప

వలసియున్నది. సంస్కృతశ్లోకములను చక్కఁగా పఠింపలేనివారు తెలుగు తమిళము మొదలుగా తమ మాతృభాషలలోఁ గల స్తోత్రములను ఉభయసంధ్యలయందు అర్థమును భావించుచు భగవంతుని ధ్యానించుచు పఠించుచుండవలయును.

ఆంజనేయుఁడు అవనము నంతయును కలయఁజూచుచు తనకు దాపుననే యున్నతమైనయొక చైత్యప్రాసాదమును గాంచెను. అది స్తంభసహస్రముతో కైలాసపాండురమై యుండెను. అది ప్రవాళములతో నిర్మింపఁబడినసోపానములతో, తప్తకాంచనవేదికలతో శోభించుచుండెను.

శ్లో॥ స దదర్శావిదూరస్థం చైత్యప్రాసాద మూర్జితమ్।
మధ్యే స్తంభసహస్రేణ స్థితం కైలాసపాండురమ్॥ 18

సుందరకాండము–సర్గ–15

తి. టీకః–చైత్యం వర్తులాకారత్వాత్ బుద్ధాయతన మివ ప్రాసాదమ్,

గో. టీకః–చైత్యప్రాసాదం, చైత్యం బుద్ధమందిరం తదాకారం ప్రాసాదమ్.

చైత్య మనఁగా బుద్ధదేవునికొఱకు అమతస్థులు నిర్మించునట్టి గుండ్రనియాకారముగల మందిర మని, అట్టియాకృతి కల ప్రాసాదము చైత్యప్రాసాద మని టీకాకారు లిరువురును వివరించిరి. దీనినిబట్టి బౌద్ధుఁచైత్యములు ప్రసిద్ధములైనతరువాత అట్టిచైత్యప్రాసాదమును అశోకవనమున నున్నట్లు వాల్మీకి వర్ణించె నని, అందువలన క్రీస్తుకు పూర్వము కొన్నిశతాబ్దములక్రిందట మతప్రవక్తగా జీవించియుండిన గౌతమబుద్ధునకు తరువాత చాలకాలమునకు బుద్ధునకు చైత్యమందిరములు నిర్మింపఁబడుచున్నసమయమున వాల్మీకిమహర్షి ఈకావ్యమును

రచించియుండు నని కొందఱు చరిత్రపరిశోధకులు తలంపవచ్చును. ఇంకను సాహసు లగువారు రామాయణకథయే గౌతమబుద్ధునకు తరువాత క్రీస్తుశకారంభమున, అనఁగా ఇప్పటికి, సుమారు రెండువేల యేండ్లక్రిందట జరిగియుండు నని చెప్పవచ్చును. కాని యివి కేవలము అపోహలు.

బుద్ధుఁ డనఁగా క్రీస్తుకు పూర్వము కొన్నిశతాబ్దములకు ముందున్నవాఁడే యని గ్రహింప నక్కఱలేదు. పురాణములలో పూర్వయుగములలో కూడ వేదవిరుద్ధముగా బుద్ధమత మొకటి యున్నట్లు చెప్పఁబడియున్నది. రాక్షసులలో అట్టిమతము నవలంబించినవారు కొంద ఱుండవచ్చును. అందువలన రామునికాలమునకు ముందుకూడ బౌద్ధులు బౌద్ధచైత్యములును ఉండవచ్చును. అప్పుడు కూడ చైత్యనిర్మాణము బౌద్ధులవల్లనే యారంభమై యుండు నని చెప్ప నక్కఱలేదు. ప్రాసాదనిర్మాణశిల్పము అత్యంతము ప్రాచీనము. ప్రాసాదములు అనేకరూపములతో నిర్మింపఁబడుచుండఁగా, బౌద్ధులు వర్తులాకారముగల భవననిర్మాణములను ఎక్కువగా ఆదరించియుందురు. వారి నిర్మాణములను చూచి వేదధర్మపరాయణులు ఆపద్ధతిని వర్ణించియుందురు. కావున ఇట్టివర్ణనములనుబట్టి రామాయణకథాకాలమును కాని రచనాకాలమును గాని యూహింపఁబూనుట యుక్తము కాదు.

ఆప్రాసాదముచెంత ఆంజనేయుఁడు శుక్లపక్షచంద్రరేఖవలె, ధూమజాలనిబద్ధయైనయగ్నిశిఖవలె నున్న సీతను చూచెను. ఆమె సందిగ్ధమైనస్మృతివలె, పతన మొందినసంపదవలె, విహతమైనశ్రద్ధవలె, భగ్నమైన యాశవలె, విఘ్నములతో కూడినసిద్ధివలె, సకలుషమైన బుద్ధివలె, అపవాదుచేత విపతితమైన కీర్తివలె, అభ్యాసము లేకపోవుటచే ప్రశిథిలమైన యామ్నాయవిద్యవలె, సంస్కారహీనమై యర్థాంతరము నొందినవాక్కువలె నుండెను.

శ్లో॥ తాం స్మృతీ మివ సందిగ్ధాం బుద్ధిం నిపతితా మివ।
విహతా మివ చ శ్రద్ధా మాశాం ప్రతిహతా మివ॥ 33

శ్లో॥ సోపసర్గాం యథా సిద్ధిం బుద్ధిం సకలుషా మివ।
అభూతే నాపవాదేన కీర్తిం నిపతితా మివ॥ 34

శ్లో॥ అమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలా మివ॥ 38

శ్లో॥ సంస్కారేణ యథా హీనాం వాచ మర్థాంతరం గతామ్॥ 39

మహర్షి ఇచ్చట వర్ణనవ్యాజమున ప్రతిపనియందును శ్రద్ధ ఆవశ్యక మని, అభ్యాసము లేకున్నచో విద్య చాల శిథిల మగు నని, వ్యాకరణసంస్కారము లేకుండ వాక్కును ఉపయోగించినచో, అది మన మనుకొన్న యర్థము నొసంగక వేఱొకయర్థము నిచ్చు నని హెచ్చరించుచున్నాఁడు.

ఆంజనేయుఁడు ఆమెను చూచుచు రాముఁడు చెప్పిన గుర్తులను బట్టి ఆభరణస్థానచిహ్నములనుబట్టి ఆమె సీతయే యని గ్రహించెను. ఆమె ఋశ్యమూకముపైనుండి వచ్చునప్పుడు ఆభరణములను మూటఁ గట్టి సుగ్రీవాదులచెంత పడునట్లు వేసినది. అప్పుడు సుగ్రీవాదులతో పాటు ఆంజనేయుఁడు కూడ కుతూహలముతో ఆమెవంకఁ జూచు చుండెను. తరువాత వారు ఆనగలను కూడ పరిశీలించియుందురు. ఆమె అట్లు నగలను మూటఁగట్టివైచిన దనఁగా, తన్ను గుర్తించుటకు సాధనములుగా అవి యుపయోగపడవలయు ననియే ఆమె అట్లు చేసి యుండు నని వారు గ్రహించియుందురు. అందువలననే సుగ్రీవుఁడు ఆనగలను భద్రముగా దాఁచియుంచెను. ఆసందర్భమున ఆమెరూప మును ఆనగలను చూచియుండిన యాంజనేయుఁడు ఇప్పుడు ఆ రూపమునందు ఆనగలు లేనిస్థానములను, వానిని చిరకాలము ధరించుట వలన ఏర్పడినగుర్తులను గమనించుచు ఆమె సీతయే యని గుర్తించెను.

శ్లో॥ పింగాక్ష స్త్రాం విశాలాక్షీం నేత్రై రనిమిషై రివ॥ 4
విక్రోశన్తీం తదా సీతాం దదృశు ర్వానరోత్తమాః॥ 5

అరణ్యకాండ-సర్గ-54

అప్పు డాంజనేయుఁడు సీతారాములనుగూర్చి యిట్లు భావింపఁ జొచ్చెను. "ఈమెకొఱకే గదా రాముఁడు, స్త్రీ ప్రణష్ట యయ్యె నని కారుణ్యముచేత, తన్ను ఆశ్రయించినది యిట్లయ్యె నని దాక్షిణ్యము చేత, ధర్మపత్ని యే మయ్యెనో యని శోకముచేత, ప్రియురాలు దూర మయ్యెనే యని మన్మథునిచేత, నాల్గువిధముల పరితపించుచున్నాఁడు. ఈమెకు దూరుఁడై రాముఁడు శోకముచేత నశింపక యింకను దేహమును ధరించుచున్నాఁ డనఁగా ఎంతో దుష్కరమైనకార్యమును చేయుచున్నాఁడు. రాముఁడీ మెకొఱకు సముద్రపరివృతయైన యీవసుంధరనే కాదు సకల జగత్తును తలక్రిందులు కావించినను, అది యుక్తమే యనుకొందును. త్రైలోక్యసామ్రాజ్యము సైతము ఈమెలో ఒక్కపాలునకు కూడ పోలదు."

శ్లో॥ ఇయం సా యత్కృతే రామ శ్చతుర్భిః పరితప్యతే।
కారుణ్యే నానృశంస్యేన శోకేన మదనేన చ॥ 49

శ్లో॥ స్త్రీ ప్రణష్టేతి కారుణ్యా దాశ్రితే త్యానృశంస్యతః।
పత్నీ న ష్టేతి శోకేన ప్రియేతి మదనేన చ॥ 50

శ్లో॥ దుష్కరం కృతవాన్ రామో హీనో య దనయా ప్రభుః।
ధారయ త్యాత్మనో దేహం న శోకే నావసీదతి॥ 53

సుందర-సర్గ-15

శ్లో॥ యది రామ స్సముద్రాంతాం మేదినీం పరివర్తయేత్।
అస్యాః కృతే జగచ్చాపి యుక్త మిత్యేవ మే మతిః॥ 18

శ్లో॥ రాజ్యం వా త్రిషు లోకేషు సీతా వా జనకాత్మజా।
త్రైలోక్యరాజ్యం సకలం సీతాయా నాప్నుయాత్ కలామ్॥ 14
సుందర–సర్గ–16

"రాముఁడు ప్రియురాలు దూర మయ్యె నని మన్మథునిచేత బాధపడుచుండె" నని (ప్రి యేతి మదనేన చ) అని హనుమంతుఁడు భావించుటనుబట్టి రాముఁడు వనవాసమునందు సీతతో శృంగారభోగముల ననుభవించె నని తలంపరాదు. వనవాసదీక్షకు బ్రహ్మచర్యము ముఖ్యమైనయంగము. జడలను ధరించి క్షురకర్మను వర్జించుట యిందుల కొక చిహ్నము. అందువలన ఆయన పదునాల్గుసంవత్సరములు నాగరికములైన సకలభోగములను వర్జించె ననుట స్పష్టము. ఈదీక్షవలననే ఆయన ఏపురమునందును, కిష్కింధయందుఁ గాని, లంకయందుఁగాని ప్రవేశింప లేదు. అప్పుడు ఆయనకు స్త్రీభోగము కూడ నిషిద్ధమే అట్లయినచో ఆయన మన్మథునిచే బాధపడె ననుటకు ఏమి యర్థము? భోజనపదార్థము లన్నియు చక్కఁగా వంటఁజేయఁబడి భద్ర మొనర్పఁబడిన తరువాత దేవతానివేదనము బ్రాహ్మణసమారాధనము పితృతర్పణము మొదలగువానివలన ఎంతకాలము జరుగుచున్నను, అవి యన్నియు పూర్తియైనతరువాత చక్కఁగా భుజింపవచ్చు నను తలంపు గల యజమానునకు ఆభోజ్యపదార్థములనుగూర్చినయభిలాష తీవ్రముగా నుండదు. యజ్ఞయాగాదులందు, తపస్సులందును దీక్ష వహించు వారికి సహజముగనే మనోనిగ్రహ ముండును. కాని ఆభోజ్యపదార్థములు ఎవనిచే నైనను హరింపఁబడినచో, హరించినవానిపై కోపము ఎట్లు కలుగునో అట్లే ఆపదార్థములనుగూర్చినయభిలాషయు అనేకవిధముల నుద్బుద్ధ మగును. అట్లే రాముఁడు ఆమెతో కూడి వనవిహారములు చేయుచున్నప్పుడు, వనవాసదీక్ష పూర్తియైనంతనే ఆమెతో సకలభోగములను అనుభవింపవచ్చు నను తలంపుతో నుండెను. అట్టియెడల

ఆమె హరింపఁబడినంతనే ఆమెపై శృంగారభోగాభిలాష అనేకవిధములుగా ప్రబలమై ఆయనకు సంతాపమును కలిగించుచుండె నని గ్రహింపవలసియున్నది.

అట్లు ఆంజనేయుఁడు తలంచుచుండఁగా ఆయనకు సాయము చేయువాఁడువలె చంద్రుఁడు ప్రకాశింపఁజొచ్చెను ఆమె కూర్చుండిన వృక్షమూలమునకు కొంచెము ఎడముగా ఒంటికన్ను ఒకచెవి చట్టిముక్కు మొదలుగా పెక్కు వైరూప్యములను కలిగి యున్న రాక్షసస్త్రీలు మాంసములను తినుచు సురాపానము చేయుచు ఒడలిపై పోసికొనుచు భయంకరముగా నుండిరి. వారిమధ్య కృశించి యాభరణహీనయై దీనయై యున్న సీత రావణునిచే భంగపడక పవిత్రముగా నున్న దని గ్రహించి యాంజనేయుఁడు ఆనందము నొంది అశ్రువులు స్రవించుచుండ రాముని లక్ష్మణుని స్మరించి నమస్కరించెను.

## 8. సీతాసందర్శనము

ఆంజనేయుఁడు జానకిని చక్కఁగా చూచి గుర్తించునప్పటికి తెల్లవారుజా మయ్యెను. షడంగవేదవిద్వాంసులు క్రతుప్రవరయాజకులును అయిన రాక్షసులయొక్క వేదఘోషము అశోకవనములోనికి వినఁబడఁజొచ్చెను. అప్పుడు మంగళవాదిత్రనాదములతో రావణుఁడు మేల్కొని సీతను స్మరించి సర్వాభరణభూషితుఁడై, అంగనాశత మనుగమింపఁగా అశోకవనమునకు వచ్చెను. రావణుని చూడఁగానే, "వీనినే కదా నిద్రించుచుండఁగా చూచితిని. ఇతఁడు రావణుఁడే" అని యాంజనేయుఁడు గుర్తించి యాతనితేజమునకు వెఱఁగుపడి రూపమును ఇంకను కుంచించుకొని వెనుకకు జరిగి యాకులలో దాఁగెను. కొంతసేపైనతరువాత సంభ్రమము వీడి హనుమంతుఁడు రావణుని చక్కఁగా చూచుటకై నెమ్మదిగా క్రిందికొమ్మలపైఁ జేరెను.

శ్లో॥ తథా విప్రేక్షమాణస్య వనం పుష్పితపాదపమ్।
విచిన్వత శ్చ వైదేహీం కించి చ్ఛేషా నిశాభవత్॥ 1

శ్లో॥ షడంగవేదవిదుషాం క్రతుప్రవరయాజినామ్।
శుశ్రావ బ్రహ్మఘోషాన్ స విరాత్రే బ్రహ్మరక్షసామ్॥ 2

శ్లో॥ స తథా ప్యుగ్రతేజాః స నిర్ధూత స్తస్య తేజసా।
పత్రే గుహ్యాంతరే సక్తో మతిమాన్ సంవృతోఽభవత్॥ 31

సుందర–సర్గ –18

ఆంజనేయుఁడు సహజముగా ఉగ్రమైనతేజస్సు కలవాఁడు. అట్టివాడు కూడ రావణుని తేజమును చూచి జంకెను. నిజమునకు ఆయన భయపడవలసిన హేతు వేమియును లేదు. అప్పటికే ఆయన పిల్లియంతయాకారముతో కొమ్మలమధ్య దాఁగియుండెను. అట్టియెడల తన్ను ఎవరైనఁ జూతు రేమో అనుభయమునకు అవకాశము లేదు. అయినను ఆకస్మికముగా భయంకరుఁడైనవ్యక్తి గోచరించినప్పుడు తొలిక్షణమున మనస్సునందు కలుగు సంచలనమువంటి సంభ్రమమే (instnctive disturbance) హనుమంతునకు కలిగెను. ఆయనకు కూడ అట్టిసంభ్రమము కలిగె నన్నచో రావణుని తేజ మెంతదో యూహింపవచ్చును.

సీత రావణుని చూచినంతనే, పెద్దగాలికి అరఁటిచెట్టువలె, కంపింపఁజొచ్చెను. ఆమె ఉపవాసముచేత, శోకముచేత, ధ్యానము చేత, భయముచేత పరిక్షీణమై యుండియు తపస్సుచే ప్రకాశించు చుండెను. అల్పాహారయై కృశాంగియై దీనయై యుండినయామెను జూచి రావణుఁ డిట్లనెను. "జానకీ! నన్ను చూచి భయపడెద వేల? నా వలన నీకు భయము కలుగుచున్నచో దానిని తొలఁగింపఁగలవా రెవ్వరును లేరు. పరస్త్రీలను బలాత్కరించి యైనను పొందుట రాక్షసులకు స్వధర్మము. అయినను నాయందు కోర్కిలేని నిన్ను నేను తాఁకను.

కాముఁడు నాశరీరమున యథేష్టముగ ప్రవర్తించి తాపమును కలిగించును గాక! నిన్ను జూచుచున్నకొలఁదియు నాకు కామపారవశ్యము పెరుగుచున్నది. నీకు ఈయుపవాసాదికము తగదు. హాయిగా అలంకరించుకొని తినుచు త్రావుచు నన్ను పొందుము. నీవు కావలయు నన్నచో ఈభూమి నంతను జయించి మీతండ్రికి జనకునకు నొసంగెదను. ఆ రాముని మఱచిపొమ్ము అతఁడు నిన్ను చూడనైనఁ దలంపలేఁడు.''

శ్లో॥ ఉపవాసేన శోకేన ధ్యానేన చ భయేన చ।
పరిక్షీణాం కృశాం దీనా మల్పాహారాం తపోధనామ్॥ 20

తి. టీక: -అల్పాహారామ్–జలమాత్రాహారామ్, అస్నాతయా అన్నస్య గ్రహీతు మశక్యత్వాత్, దేవరాజతః పాయసలాభేన తదనపేక్షణాచ్చ।

సుందర–సర్గ–19

శ్లో॥ స్వధర్మో రక్షసాం భీరు సర్వ థైవ న సంశయః।
గమనం వా పరస్త్రీణాం హరణం సంప్రమథ్య వా॥ 5

శ్లో॥ ఏవం చైవ మకామాం త్వాం న చ స్ప్రక్ష్యామి మైథిలి।
కామం కామ శ్శరీరే మే యథాకామం ప్రవర్తతామ్॥ 6

సుందర–సర్గ–20

ఉపవాసముచేత పరిక్షీణయై యున్న దని చెప్పి వాల్మీకి వెంటనే అమె అల్పాహారగ నున్న దనుట ఎట్లు కుదురును? ఉపవాస శబ్దమునకు ముఖ్యార్థము కేవలము నిరాహారముగా నుండుట కాదు. ధ్యేయమైన దేవతకు సమీపమునందు మనస్సును ఉంచుటయే ఉపవాసము. (ఉప=సమీపే; ధ్యేయదేవతాయాః సమీపే; వాసః=మనసః వాసః; ఉపవాసః). ఏకాదశి శివరాత్రి మొదలగుదినములయందు ఉపవసించుట అనఁగా అదిన మంతయు విష్ణుదేవునిసమీపముననో శివునిసమీపము

ననో మనస్సు నుంచుట యనియే యర్థము. నిరాహారముగా నుండుట లోకవ్యవహారమునకు దూర మగుటకు లక్షణము. నిరాహారముగా ధ్యేయదేవతావిగ్రహమునకు సమీపమునందు శారీరకముగా నుండి అర్చనచేయుచు మనస్సును ఆదేవతయందే నిలుచునట్లు చేయుట ఉపవాసము. మనస్సును నిలుపుటకు నిరాహారముగా నుండుటకు అశక్తులైనవారు అల్పాహారమును స్వీకరింతురు. సీతాదేవి ఉపవాస మొనర్చుచున్న దనఁగా మనస్సునందు రాముని నిలుపుకొని ఆయనసమీపమునందే యుండుచున్న దని యర్థము అంతమాత్రమున ఆమె కేవలము నిరాహారముగా నున్న దని తలంపరాదు. నెలలకొలఁది జలమును గైకొనకున్నచో శరీరము నిలువదు. అట్లు శరీరము పడిపోయినచో అది ఆత్మహత్యయే యగును. అందువలన నిరాహారదీక్ష నవలంబించినవారు కూడ అప్పు డప్పుడు జలమును స్వీకరింపక తప్పదు. అందువలన ఆమె మనస్సునందు రామునిసన్నిధిని కల్పించుకొని ఉపవసించుచున్నను వా సవుఁడు పంపుచున్న యాహారమును జలమును స్వీకరించుచు అల్పాహారయై యున్న దని గ్రహింపవలసియున్నది.

పరస్త్రీలను బలాత్కరించి యైనను పొందుట రాక్షసులకు స్వధర్మ మని రావణుఁడు చెప్పుట గమనింపఁదగియున్నది రాక్షసులు వేదాధ్యయనము చేయుచు యజ్ఞయాగాదుల ననుష్ఠించుచుండి రని వెనుకనే గ్రహించియుంటిమి. అట్టియెడల వీరికి వేదవిహితమైన ధర్మము కాక వేఱుగా ధర్మ మేమున్నది? లంకయందు పరిపాలన మిట్లే జరుగుచున్నదా? ఒకరాక్షసుని భార్యను మఱియొకఁడు హరించినచో రావణుఁడు ఊరకుండునా? కుంభీనసిని మధువు హరించినప్పుడు, వాఁడును రాక్షసుఁడే కదా. వానిధర్మమునే వాఁడు ఆచరించె నని రావణుఁడు ఎందులకు ఊరకుండ లేదు? వానిని శిక్షించుటకై ఇతఁ డేల దండెత్తి పోయెను? దొంగ లందఱును ఒకచోట చేరి యితరుల సొత్తును దొంగి

లించుట మాకు స్వధర్మము, ఇతరులు మా పతము మాసొత్తును హరింప రా దని చెప్పుట ఎట్టిదో యిదియు అట్టిదే. రావణునిదుష్టత్వము ఏ స్థాయియం దున్నదో దీనినిబట్టి గ్రహింపవచ్చును.

అప్పుడు సీత యొకగడ్డిపరకను రావణునిముందు వేసి దాని వంకఁ జూచుచు ఇట్లనెను. "నీవు నాపై తలంపును వీడి నీభార్యలతో రమింపుము. నీభార్యలను ఇతరులు హరింపరా దని నీవెట్లు తలంతువో ఇతరులును తమభార్యలవిషయమున అట్లే తలంతు రని నీ వేల గ్రహింపవు? నీభార్యలు నీకు ఎట్లు రక్షించుకొనఁదగినవారో ఇతరుల భార్యలు కూడ అట్లే రక్షింపఁదగినవారు కదా! ఇక్కడ సత్పురుషులే లేరా? ఉన్నను వారిమాటలను నీవు వినుట లేదా? దుర్బుద్ధివైన నీవలన రాక్షసు లందఱును నశింతురు. నీవు బ్రతుకఁదలఁచుకొన్నచో నన్ను రామున కొసంగి ఆయనతో మైత్రి చేసికొనుము. త్వరలోనే రామలక్ష్మణులు లంక నాక్రమించి రాక్షసులను సంహరించి నన్ను గొనిపోఁగలరు. జనస్థానమున రాక్షసు లందఱు నశింపఁగా చూచి వారియెదుటఁబడుటకు భయపడి గదా నీవు వారులేనిసమయమున నన్ను దొంగిలించి తెచ్చితివి! నీకు వారిని మార్కొనుటకు సాహస మెక్కడిది? శార్దూలములయెదుట కుక్కవలె వారిగాలి సోఁకినను నీవు నిలువఁజాలవు. త్వరలోనే నీకు రామునిచేత చావు తప్పదు."

శ్లో॥ యథా తవ తథాన్యేషాం రక్ష్యా దారా నిశాచర। 7

శ్లో॥ ఆత్మాన ముపమాం కృత్వా స్వేషు దారేషు రమ్యతామ్॥ 8

శ్లో॥ ఇహ సన్తో న వా సన్తి సతో వా నానువర్తసే।
తథా హి విపరీతా తే బుద్ధి రాచారవర్జితా॥ 9

శ్లో॥ న హి గంధ ముపాఘ్రాయ రామలక్ష్మణయో స్త్వయా।
శక్యం సందర్శనే స్థాతుం శునా శార్దూలయో రివ॥ 31

సుందర–సర్గ–21

రావణుఁడు ఆమాటలకు క్రుద్ధుఁడై యిట్లనెను. ''తమకు వశుఁడై ప్రియముగా మాటాడువానిని స్త్రీలు పరిభవించుచుందురు. కామము నాక్రోధమును నిగ్రహించుచున్నది. కామము విపరీతగామి. అది ఎవరియందు నిబద్ధ మగునో అది వారియందు దయను స్నేహమును కలిగించుచున్నది. అందువలన నీవు పలికిన యొక్కొక్క మాటకు నిన్ను సంహరింపవలసియున్నను నిన్ను చంపను. నీకు నేను ఇచ్చిన గడువు రెండుమాసములు మిగిలియున్నది. అంతలోపల నీవు నాకు భార్యవు కాకున్నచో వంటవాండ్రు నిన్ను నాప్రాతఃకాలభోజనము కొఱకు ముక్కలు ముక్కలుగా తఱుగుదురు.'' ఆమాటలకు అతని వెంట వచ్చిన దేవగంధర్వాదిస్త్రీలు విషాదము పొందిరి.

శ్లో॥ ద్వాభ్యా మూర్ధ్వం మాసాభ్యాం భర్తారం మా మనిచ్ఛతీమ్,
మమ త్వాం ప్రాతరాశార్థే సూదా శ్ఛేత్స్యన్తి ఖండశః॥ 9
సుందర-సర్గ 22

వేదములు అభ్యసించియు తపస్సులు చేసియు రావణుఁడు ఎంతపశుత్వమునకు దిగజాఱెనో ఈమాటలవలన గ్రహింపవచ్చును. ప్రాతఃకాలముననే భోజనము చేయుటయే కాక అందు మనుష్యమాంస మును కూడ తిందు నని అతఁడు చెప్పుచున్నాఁడు.

సీత ఇట్లనెను. "ఇచ్చట నీకు హితము కోరి నిన్ను నివారించువాఁ డెవఁడును ఉన్నట్లు లేదు. నీవు ఎక్కడికి ఎగిరిపోయినను రాముని బాణములనుండి తప్పించుకొనఁజాలవు. ఏనుఁగునకు కుందేటికి ఎంత యంతరము కలదో నీకును రామునకును అంత అంతరము కలదు. కుబేరునిసోదరుఁడవై సేనాబలసమన్వితుఁడవై రాముని వంచించి దారచౌర్యమునకు ఎట్లు పాల్పడితివి?

శ్లో॥ శూరేణ ధనదభ్రాత్రా బలైః సముదితేన చ,
అపోహ్య రామం కస్మాద్ధి దారచౌర్య మిదం కృతమ్॥ 22
సుందర-సర్గ-22

రావణుఁడు క్రుద్ధుఁడై "సూర్యుఁడు సంధ్యనువలె నిన్నిప్పుడే నాశ మొనర్తును" అని యామెపైకి పోఁజొచ్చెను. అప్పుడు ధాన్య మాలిని యను రాక్షసవనిత అతనిని కౌఁగిలించుకొని. "వివర్ణయు కృపణయునైన యీమానుషితో నేమి? నాతో క్రీడింపుము. అకామ యైనస్త్రీవలన తాపమే కాని సుఖ ముండదు. సకామయైన వనితయే ప్రీతిని కలిగించును" అని చెప్పుచు వెనుకకు మరలించెను. అతఁడు మరలిపోవుచు ఏకాక్షి ఏకకర్ణ మొదలుగా కావలియున్న రాక్షసస్త్రీలను జూచి, ''ఎట్లైనను ఈమె నాకు త్వరలో వశపడునట్లు చేయుఁడు'' అని చెప్పి ధాన్యమాలిని తన్ను బలవంతముగా లాగుచుండ పకపక నవ్వుచు నటనుండి వెడలిపోయెను.

పిమ్మట ఏకజట హరిజట మొదలైన రాక్షసస్త్రీలు రావణుని ప్రశంసించుచు అతనికి భార్యవు గమ్మని సీతకు నయమున భయమున బోధింపఁజొచ్చిరి. ఆమె దుఃఖించుచు, "మానుషి రాక్షసునకు ఎట్లు భార్య యగును? మీరు చెప్పినట్లు చేయను. మీ రందఱు నన్ను భక్షిం పుఁడు. దీనుఁ డైనను రాజ్యహీనుఁ డైనను ఎట్టివాఁ డైనను నాభర్తయే నాకు ప్రియుఁడు. సూర్యునియందు సువర్చల, వసిష్ఠునియం దరుంధతి సావిత్రి సత్యవంతునియందు. నలునియెడ దమయంతి, ఎట్లుండిరో అట్లే నేనును రామునియందు అనురక్తురాలనై యున్నాను." అని దృఢముగా చెప్పెను. ఆమాటలకు వా రింకను కోపించి తీవ్ర ముగ బెదరింపఁజొచ్చిరి. ఆమె యుద్విగ్నయై యటనుండి హను మంతుఁ డున్నశింశపావృక్షమూలమును చేరెను. వారు కూడ ఆమె ననుసరించిరి. అక్కడ వినత వికట మొదలగువారు మరల బెదరించి అప్పుడే ఆమెను ఖండించి ముద్దలుచేసి పంచుకొని సురను సేవించుచు నికుంభిలయొద్ద నృత్యము చేయుచు భక్షింత మని పలుకఁ

జొచ్చిరి. ఆమె మరల "ఏ మైనను నేను మీరు చెప్పినట్లు చేయనే చేయను. మీయిష్టము వచ్చినట్లు నన్ను భక్షింపుఁడు" అని చెప్పెను. వారు చేయునది లేక విశ్రమించిరి.

శ్లో॥ సురా చానీయతాం క్షిప్రం సర్వశోకవినాశినీ। 44

శ్లో॥ మానుషం మాంస మాసాద్య నృత్యామోఽథ నికుంభిలామ్। 45

గో. టీక.—నికుంభిలా నామ లంకాయాః పశ్చిమద్వారప్రదేశ వాసినీ భద్రకాళీ।

సుందర—సర్గ—24

లంకానగరపశ్చిమద్వారసమీపమున ఒకవనమునందు భద్రకాళీ దేవత కలదు. ఆమెకు నికుంభిల యను పేరు. ఆమెవలన ఆవనము నికుంభిలావన మని ప్రసిద్ధ మయ్యెను.

ఆరాక్షసస్త్రీలశబ్ద మణఁగిన తరువాత వారు వినుచుండఁగా సీత బంధుజనమును స్మరించి దుఃఖింపఁజొచ్చెను. "అకాలమున మృత్యువు కూడ దుర్లభమే యను లోకప్రవాదము సత్యమే. రాముని కు దూరమై రాక్షసీపరివృతనై కూడ చావకున్నాను కదా! జన్మాంతర మున నేమి పాపమొనర్చితినో ఇప్పు డిట్టి ఘోరదుఃఖము నొందు చున్నాను. ఛీ! ఈమనుష్యత్వ మేమి? ఈపరతంత్రత యేమి? యథేష్ట ముగా శరీరమును వీడుట కైనను స్వేచ్ఛలేకున్నది గదా! నాహృద యము అశ్మసారమో అజరామరమో అయియుండవలె. లేకున్నచో ఇంత దుఃఖమున కూడ విశీర్ణము కాకుండునా? నేను ఆరావణుని ఎడమ కాలితో నైనఁ దాఁకను; వానిని కామించు టేమి? వాఁడు నాతిరస్కృతిని గాని, తన్ను తనకులమును గాని యెఱుంగక నృశంసుఁడై నన్ను గోరుచున్నాఁడు; నన్ను ఛేదించినను చీల్చినను పగులఁగొట్టినను నిప్పులలో కాల్చినను నేను రావణుని చేరను. మీరు ఏమి చెప్పినను లాభము లేదు.

ఏకారణముచేతనో రాముఁడు నాయునికిని గుర్తింపలేకున్నాఁడు. గుర్తించినమఱుక్షణముననే లంక నంతయు ధ్వంస మొందింపఁగలఁడు. ధర్మకాముఁడు రాజర్షియు నైనయాయనకు నాతో ప్రయోజనము లేకున్న దేమో! ఎదుట నున్నప్పు డున్నప్రీతి పరోక్షమున నుండదు. కృతఘ్నులు అట్లుందురు. కాని రాముఁ డట్టివాఁడు కాఁడు. అయ్యో! ఇంత దుఃఖమున కూడ నాకు మృత్యువు కలుగుట లేదే! ఎవరికి ప్రియా ప్రియములు లేవో అట్టి జితాత్ములైన మహాత్ములే ధన్యులు. ఎవరికి ప్రియవియోగమున దుఃఖము, అప్రియసంయోగమున అధికదుఃఖము కలుగదో అట్టి మహాత్ములకు నమస్కారము."

శ్లో॥ లోకప్రవాద స్సత్యోఽయం పండితై స్సముదాహృతః।
అకాలే దుర్లభో మృత్యుః స్త్రియా వా పురుషస్య వా॥ 12

శ్లో॥ కీదృశం తు మహాపాపం మయా దేహాన్తరే కృతమ్।
యే నేదం ప్రాప్యతే ఘోరం మహాదుఃఖం సుదారుణమ్॥ 18

శ్లో॥ ధి గస్తు ఖలు మానుష్యం ధి గస్తు పరవశ్యతామ్।
న శక్యం యత్పరిత్యక్తు మాత్మచ్ఛందేన జీవితమ్॥ 20

సుందర - సర్గ–25

శ్లో॥ చరణే నాపి సవ్యేన న స్పృశేయం నిశాచరమ్।
రావణం కిం పున రహం కామయేయం విగర్హితమ్॥ 8

శ్లో॥ ప్రత్యాఖ్యానం న జానాతి నాత్మానం నాత్మనః కులమ్।
యో నృశంసస్వభావేన మాం ప్రార్థయితు మిచ్ఛతి॥ 9

శ్లో॥ ఛిన్నా భిన్నా ప్రభిన్నా వా దీప్తా వాగ్నౌ ప్రదీపితా।
రావణం నోపతిష్ఠేయం; కిం ప్రలాపేన వ శ్చిరమ్॥ 10

శ్లో॥ అథ వా న హి తస్యార్థో ధర్మకామస్య ధీమతః।
మయా రామస్య రాజర్షే ర్భార్యయా పరమాత్మనః॥ 38

శ్లో॥ దృశ్యమానే భవే త్ప్రీతిః సౌహృదం నా _స్త్యపశ్యతః।
నాశయ న్తి కృతఘ్నా స్తు; న రామో నాశయిష్యతి॥ 39

శ్లో॥ ధన్యాః ఖలు మహాత్మానో మునయ స్సత్యసమ్మతాః।
జితాత్మానో మహాభాగా యేషాం న స్తః ప్రియాప్రియే॥ 45

శ్లో॥ ప్రియా న్న సంభవే ద్దుఃఖ మప్రియా దధికం భవేత్।
తాభ్యాం హి తే వియుజ్య న్తే నమ _స్తేషాం మహాత్మనామ్॥46

సుందర...సర్గ–26

సీతయొక్క ఈవిలాపప్రసంగమున వాల్మీకి ధన్యులు మహాత్ములు అయినవారు ఎట్లుందురో నిరూపించినాఁడు. సత్యసమ్మతులై జితేంద్రియు లగుటవలన ఎవరికి ప్రియము అప్రియము కలుగుట లేదో వారు ధన్యులు మహాత్ములును అగుదురు. వారికి ప్రియములైన భార్యాపుత్రధనాదులవలన వియోగము కలిగినప్పుడు దుఃఖము గాని, అప్రియములైన అపకీర్తి అవమానము రోగము మొదలగునవి వచ్చినప్పుడు అధికమైన దుఃఖము కాని కలుగదు. అనఁగా వారికి ప్రియసంయోగమువలన సుఖము ఎట్లు కలుగదో, అట్లే ప్రియవియోగమున దుఃఖము గాని అప్రియసంయోగమున అధికదుఃఖము గాని కలుగదన్న మాట. ప్రియవిషయమువలన ఎవరికి సుఖము కలుగునో వారికి అప్రియవిషయములవలన దుఃఖము కలుగక తప్పదు. సుఖదుఃఖములను రెండింటిని మనస్సునందు చేరకుండునట్లు చేసికొనుటయే ధన్యత; అదియే మహత్త్వము. ఈస్థితి యెట్లు కలుగును? ఎవఁడు శరీరేంద్రియములే తనస్వరూప మనునభిమానము కలవాఁడై వ్యవహరించుచున్నాఁడో వాఁడు సశరీరుఁడు. అట్టివానికి ప్రియాప్రియములవలన సుఖము దుఃఖము రెండును తప్పవు. సశరీరత్వము, అనఁగా శరీరేంద్రియములే నాస్వరూపము అనునభిమానము, ఉన్నంతవఱకు ప్రియాప్రియములవలన సుఖదుఃఖములు కలుగుచునే యుండును. "శరీరేంద్రి

యములు నాస్వరూపము కాదు, నాస్వరూపము సత్యజ్ఞానానందఘనము" అని ఎవఁడు తెలిసికొని శరీరేంద్రియమనస్సులపై నున్న యభిమానమును పరిత్యజించుచున్నాఁడో వాఁడు అశరీరుఁ డగును. అట్టివాఁడు శరీరమును వహించి ఇంద్రియమనోబుద్ధులతో వ్యవహరించుచున్నను, శరీరాదులయందు అభిమానము లేకపోవుటచే అశరీరుఁడే యగును. అట్లు అశరీరుఁడైనవానికి ప్రియాప్రియములు వానివలన సుఖదుఃఖములు కూడ ఉండవు. అప్పు డతఁడు లోకవ్యవహారమునం దున్నను తనకు సహజమైన ఆనందస్థితియందే యుండును. ఇట్టి యశరీరుఁడే జీవన్ముక్తుఁడు. ఈస్థితిని సంపాదించుకొనఁ గలుగుటయే సకలయోగ సాధనలకు లక్ష్యము. ఇట్టివాఁడే ధన్యుడు, మహాత్ముఁడు. ఇది సకల వేదాంతములకు సారము. దీనిని ప్రజాపతి ఇంద్రునకు ఇట్లు ఉపదేశించెను. "మహేంద్రా! ఈశరీరము మరణము నొందుస్వభావము కలది. ఇది మృత్యువుచేత ఎల్లప్పుడు పొందఁబడియే యున్నది. అమృతము అశరీరము అయిన ఆత్మకు ఈశరీరము అధిష్ఠానముగా నున్నది. సశరీరుఁడు ప్రియాప్రియములను పొందుచునే యుండును. సశరీరుఁడై యున్నంతవఱకును ప్రియాప్రియములు తొలఁగిపోవు. ఎవఁడు అశరీరుఁడై యుండునో వానిని ప్రియాప్రియములు స్పృశింపవు."

మంత్రము - మఘవన్ మర్త్యం వా ఇదం శరీర, మాత్తం మృత్యునా; త దస్యామృత స్యాశరీర స్యాఽఽత్మనోఽధిష్ఠాన; మాత్తో వై సశరీరః ప్రియాప్రియాభ్యాం; న వై సశరీరస్య సతః ప్రియాప్రియయో రపహతి ర; స్త్యశరీరం వావ సంతం న ప్రియాప్రియే స్పృశతః॥ 1

—ఛాందోగ్యోపనిషది – అష్టమాధ్యాయే – ద్వాదశఖండే—

ఇట్టి జ్ఞానమును పొంది అశరీరుఁడై వర్తించువానినే విదేహుఁ డందురు. సీతతండ్రియైన జనకుఁడు మొదలైన మిథిలారాజ్యాధిపతులు

తత్త్వవేత్తలై విదేహు లను ప్రసిద్ధిని పొందిరి. కావున వైదేహియైన సీత తత్త్వసారమును ఇట్లు స్మరించె ననుట ఎంతయో సముచితముగా నున్నది.

ఈవిలాపమును విని రాక్షసస్త్రీలు "నిన్ను భక్షింతు" మని ఆమెను మరల బెదరింపఁజొచ్చిరి అప్పుడు నిద్రనుండి మేల్కొనిన త్రిజట యను వృద్ధురా లిట్లనెను. "మిమ్ము మీరే భక్షింపుఁడు. మీరు సీతను భక్షింపఁజాలరు రాక్షసవినాశాత్మకము రామాభ్యుదయప్రద మును అయిన స్వప్నమును ఇప్పుడు చూచితిని." ఆస్వప్నమును చెప్పు మని వా రందఱు అడుగఁగా ఆమె యిట్లు చెప్పెను. "సీత శ్వేతపర్వతమున రామునితోఁ గూడి చతుర్దంతమైన మహాగజముపై నెక్కి చంద్రసూర్యులను చేతులతో నిమురుచుండెను సీతతో కూడ రామలక్ష్మణులు పుష్పకము నెక్కి ఉత్తరముగా చనుచుండిరి. రావ ణుఁడు ముండితశీర్షుఁడై తైలదిగ్ధాంగుఁడై పుష్పకమునుండి పడి కృష్ణాం బరుఁడు రక్తమాల్యానులేపనుఁడును అయి ఖరయుక్తమైన రథమున తైలముఁ ద్రావుచు దక్షిణముగా పోవుచుండెను. గర్దభముపైనుండి పడి పంకమగ్నుఁడైనరావణుని రక్తవస్త్రయైన కాళి కంఠమున త్రాటితోఁ గట్టి దక్షిణాభిముఖముగా లాగికొనిపోవుచుండెను. కుంభకర్ణేంద్రజిదాదు లందఱును అట్లే ముండితులై తైలసముక్షితులై దక్షిణముగా పోవు చుండిరి. విభీషణుఁ డొక్కఁడు మాత్రము చతుర్దంతమైన మహాగజ ముపై శ్వేతచ్ఛత్రముతో నలువురు సచివులతో విరాజిల్లుచుండెను. గోపురములు తోరణద్వారములు భగ్నము కాఁగా లంక సముద్రమున కూలెను. కావున రాముఁడు సీతను తప్పక పొందును. అప్పు డాయన రాక్షసులతోఁబాటు మిమ్ము కూడ చంపును. కాఁబట్టి యిప్పుడే మీరు ఈమెను శరణము పొందుఁడు. నమస్కారమాత్రముననే ఈమె ప్రసన్నురా లగును. ఈమె మనల నందఱను మహాభయమునుండి

రక్షింపఁగలదు. ఈమెయందు దుర్లక్షణము లేవియు కనిపించుట లేదు. కావున రావణవినాశము రామాభ్యుదయము తప్పక సంభవించును."

అది విని రాక్షసస్త్రీలు భయపడి ఆమెశరణమును గోరిరి. ఆమె కొంచెము సిగ్గుపడుచు, "అది నిజ మగుచో అప్పుడు నేను మీకు తప్పక శరణ మగుదును" అనెను.

ఆదిత్యమండలమును గాని చంద్రమండలమును గాని చేతులతో గ్రహించినట్లుగా స్వప్నమును పొందినవారికి గొప్పరాజ్యము ప్రాప్తించునని స్వప్నశాస్త్రమువలనఁ దెలియుచున్నది.

గో. టీక:–అత్ర స్వప్నాధ్యాయవచనమ్ – "ఆదిత్యమండలం వా తు చంద్రమండల మేవ వా, స్వప్నే గృహ్ణాతి హస్తాభ్యాం రాజ్యం సంప్రాప్నుయా న్మహత్॥" ఇతి–శ్లో.15.

శ్లో॥ ప్రణిపాతప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా।
అల మేషా పరిత్రాతుం రాక్షస్యో మహతో భయాత్॥ 39
సుందర–సర్గ–27

28, 29 సర్గలు విశేషవృత్తములతో రచింపఁబడి యున్నవి. వీనియందు పైసర్గలలోనివిషయమే పునరుక్తముగా నున్నది. ఈసర్గలను వదలి 27వసర్గనుండి ముప్పదియవసర్గను అందుకొన్నచో గ్రంథ మఖండముగనే సాగుచున్నది. కావున ఈరెండుసర్గలు ప్రక్షిప్తము లని చెప్పవచ్చును.

## 9. సీతాసంభాషణము

హనుమంతుఁడు రావణునిరాకనుండి సీతాదేవి రాక్షసస్త్రీలకు అభయము నిచ్చుటవఱకును అఖిలవృత్తాంతములను అరయుచుండెను.

అప్పు డాయన ఇట్లనుకొనెను. "ఈమెను ఓదార్పకుండ ఊరక చూచి పోయినచో, రాక్షసస్త్రీలు ఇట్లే తర్జించుచుండఁగా ఈమె రామునివిషయమున నిరాశ నొంది నిర్వేదముతో మరణించినచో నారాకయే వ్యర్థమగును. మఱి యీరాక్షసస్త్రీలమధ్య నున్న యీమెతో నెట్లు మాట్లాడనగును? సీత ఏమి చెప్పిన దన్నచో నేను రామున కేమి చెప్పుదును? ఈసూక్ష్మవానరరూపముతోనే ఈమెతో మాటాడవలె. సంస్కృతమున మాటాడినచో ఈమె నన్ను ద్విజాతియైన రావణునిగా భావించి భయపడును. కావున మనుష్యవ్యవహారభాషలోనే మాటాడెదను. నేను మాటాడ మొదలుపెట్టినంతనే ఈమె భయపడి కేకలుపెట్టినచో రాక్షసస్త్రీలు నన్ను చంపుటకో పట్టుకొనుటకో ప్రయత్నింతురు; లేదా నగరములోని రాక్షసుల నైనఁ బిలుతురు. నేను రాక్షసబలమును నిగ్రహింపఁగలిగినను సముద్రమును దాఁటుట సులభము కాదు. వీరు నన్ను వెన్నంటుదురు. యుద్ధమున జయము సంశయగ్రస్తము. నే నిక్కడ చిక్కుపడినచో మరల సముద్రమును దాఁటిరాఁగలిగినవాఁ డెవఁడును లేఁడు. మఱి మాటాడకుండ వెడలిపోయినచో ఈమె నిరాశతో మరణింపవచ్చును. కార్యవినాశము లేకుండ నేను గావించినసముద్రలంఘనము సార్థక మగుట ఎట్లు సంభవించును? ఈమె నామాటలను ఉద్వేగము లేకుండ ఎట్లు వినఁగలదు?''

శ్లో॥ యది వాచం ప్రదాస్యామి ద్విజాతి రివ సంస్కృతమ్।
రావణం మన్యమానా మాం సీతా భీతా భవిష్యతి॥ 18

శ్లో॥ అవశ్య మేవ వక్తవ్యం మానుషం వాక్య మర్థవత్। 19

గో. టీక:—అత్ర వాక్యస్య మానుషత్వం కోసలదేశవర్తి మనుష్యసంబంధిత్వం వివక్షితమ్, తాదృగ్వాక్యస్యైవ దేవీపరిచితత్వాత్।

శ్లో॥ ఏష దోషో మహాన్ హి స్యా న్మమ సీతాభిభాషణే।
ప్రాణత్యాగ శ్చ వైదేహ్యా భవే దనభిభాషణే॥ 36

శ్లో॥ న వినశ్యేత్కథం కార్యం వైక్లవ్యం న కథం భవేత్।
లంఘనం చ సముద్రస్య కథం ను న వృథా భవేత్॥ 39

సుందర–సర్గ–30

ఆంజనేయుఁడు ఇట్లు పెక్కువిధముల తర్కించుకొని "రాముని చరిత్రమును కీర్తించినచో ఈమె యుద్వేగము నొందక నామాటలను వినఁగలదు" అని నిశ్చయించుకొని రామునికథను సంగ్రహముగ మధురముగా మెల్లగా గానముచేసెను. పిమ్మట, "సుగ్రీవునియాదేశమున కపివీరులు సీతకై అన్నిదిక్కులయందును వెదకుచున్నారు. నేను సంపాతిమాటపై నూఱుయోజనములసముద్రమును దాఁటి యిచ్చటికి వచ్చి రాముఁడు చెప్పినలక్షణములు గల సీతను ఈవనమునందు చూచితిని" అని పలికి ఆయన యూరకుండెను.

ఆంజనేయునివితర్కమునుబట్టి సంస్కృతము ఆనాఁడు కూడ సకలజనవ్యవహారములో లేదని స్పష్ట మగుచున్నది. ద్విజాతులైనవారు, అనఁగా ఉపనయనసంస్కారములు పొంది వేదాధ్యయనము చేయునట్టి బ్రాహ్మణక్షత్రియవైశ్యులు సంస్కృతమున వ్యవహరించుచుండి రని యితరులు ఆయాప్రాంతీయభాషలలో మాటాడుకొనుచుండి రని గ్రహింపవలసియున్నది. ఆంజనేయుఁడు మానుషవాక్యమును గూర్చి తలంచినప్పుడు, ఆయన కోసలదేశమునందలి మనుష్యవ్యవహారభాషను ఉద్దేశించె నని, అది మాత్రమే ఆమెకు పరిచితమై యుండు నని గోవిందరాజస్వామి వివరించెను. సీతకు కోసలదేశభాష పరిచితమైనట్లే మైథిలీవ్యవహారభాష కూడ పరిచితమే యైయుండును. అందువలన ఆంజనేయుఁడు ఆరెండింటిలో దేని నైన ఉద్దేశించియుండవచ్చును. ఏ మైనను సాధారణప్రజలు దైనందినజీవితమున ఆయాప్రాంతములలోని వ్యవహారభాషల నుపయోగించుచుండి రనుట స్పష్టము. ద్విజాతులైనవారు కూడ సంస్కృతమును ప్రయత్నపూర్వ

కముగా నభ్యసించి చక్కఁగా మాటాడుచుండి రని యాంజనేయుని ప్రసంగమును శ్రీరాముఁడు ప్రశంసించినసందర్భమున వ్యక్తమైనది.

ఆంజనేయుఁడు తుదకు రామునిచరిత్రగానమును సంస్కృతమునఁ జేసెనా లేక ప్రాంతీయభాషలో చేసెనా అను విషయమును వాల్మీకిమహర్షి పేర్కొన లేదు. శ్రవణసుభగముగా మనోహరముగ నుండుటకు ఆంజనేయుఁడు సంస్కృతభాషయందే గానముచేసియుండు నని యూహింపవచ్చును. సంస్కృతభాషలో నున్నను, అది రాముని చరిత్రప్రశంస కావున,రావణుఁడు రాముని ప్రశంసించుట అసంభావ్యము కావున, గానము చేయుచున్నవాఁడు రావణుఁ డనుశంక ఆమెకు కలిగి యుండదు.

ఆగానమును రాక్షసస్త్రీలు వినియుండరా? అప్పటివఱకును రాత్రి యంతయు మేలుకొనియున్న రాక్షసస్త్రీలు తిని త్రావి కేకలుపెట్టి అలసిపోయి నిద్రపోయి రని గ్రహింపవలసియున్నది.

సీత ఆంజనేయుఁడు గావించిన రామచరిత్రగానమును విని విస్మితయై తల పైకెత్తి శింశపావృక్షమును కలయఁజూచి తెల్లని వస్త్రముతో విద్యుత్కాంతితో పింగళవర్ణమున ప్రకాశించుచు వినీతుఁడై యున్న హనుమంతుని చూచి భయపడి విలపించెను. కాని యతఁడు చిన్నయాకారముతో సౌమ్యుఁడై యుండుటను గమనించి ఆమె అది కల యగు నేమో యని తలంపఁజొచ్చెను. హనుమంతుఁడు చెట్టుపై నుండి మెల్లగా దిగి క్రిందికొమ్మపై నిలిచి శిరస్సున అంజలి ఘటించి వినయముతో ఇట్లనెను. "అమ్మా! నీవు దేవగంధర్వాదులలో ఎవ్వతెవు? నీభర్త యెవరు? నీలక్షణములను జూడఁగా రాజకన్యవుగ రాజమహిషివిగా తోఁచుచున్నావు. జనస్థానమునుండి రావణుఁడు హరించి తెచ్చిన సీత వైనచో నీకు భద్ర మగును గాక! నీదైన్యమునుబట్టి రూపవేషములనుబట్టి నీవు రామునిపత్ని వని తలంచుచున్నాను."

ఆమెను సీతనుగా రావణప్రసంగమువలన త్రిజటాస్వప్నకథనమువలన ఆంజనేయుఁడు గుర్తించియున్నను, అట్లు తనకు తెలిసినట్లుగా మాటాడినచో, ఆమె తన్ను రావణునిగా శంకించు నని తెలియనట్లే ప్రశ్నించెను. రామకథాగానమున ఆమెను తనకు అభిముఖముగా చేసికొని యిట్లు మాటాడుట ఆంజనేయునియసాధారణమైనప్రతిభకు వాక్చాతుర్యమునకు నిదర్శనములు.

సీత ఇట్లు చెప్పెను. "అయ్యా! నేను దశరథునికోడలిని; జనకునిదుహితను; రామునిభార్యను. నేను పండ్రెండేండ్లు రాఘవులయింట నుండి సకలభోగముల ననుభవించితిని. పదుమూఁడవసంవత్సరమున మామాముగారు రామునకు యౌవరాజ్యపట్టాభిషేక మొనర్పఁబూనెను. మాపిన్నత్తకైక దానిని భంగ మొనర్చెను. అభిషేకముకన్న ప్రియమైన పితృవచనమును రాముఁడు ముందు మానసమున స్వీకరించి తరువాత వాగ్రూపమున ప్రకటించెను. ప్రాణాపాయమునందైనను రాముఁడెవని కైనను ఏదైనను ఇచ్చునే గాని ఎవరివలనను దేని నైనను స్వీకరింపఁడు; సత్యమునే చెప్పును గాని యనృతమును చెప్పఁడు. రాముఁడు అడవికి బయలుదేరుచు నన్ను తనతల్లికి అప్పగింప నెంచెను. కాని నేను ఆయనకంటె ముందుగానే బయలుదేరితిని. లక్ష్మణుఁడును అట్లే బయలుదేరెను. మేము జనస్థానమునం దుండఁగా రావణుఁడు వారిని వంచించి నన్ను హరించి తెచ్చెను. ఆరాక్షసుఁడు పెట్టినగడువు ఇంక రెండు నెలలే యున్నది. ఆపైన జీవింపను."

శ్లో॥ సమా ద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే।
భుంజానా మానుషాన్ భోగాన్ సర్వకామసమృద్ధినీ॥ 17

శ్లో॥ తత స్త్రయోదశే వర్షే రాజ్యే చేక్ష్వాకునందనమ్।
అభిషేచయితుం రాజా సోపాధ్యాయః ప్రచక్రమే॥ 18

శ్లో॥ స రాజా సత్యవా గ్దేవ్యా వరదాన మనుస్మరన్।
ముమోహ వచనం శ్రుత్వా కైకేయ్యాః క్రూర మప్రియమ్॥22

శ్లో॥ తత స్తం స్థవిరో రాజా సత్యధర్మే వ్యవస్థితః।
జ్యేష్ఠం యశస్వినం పుత్రం రుదన్ రాజ్య మయాచత॥ 23

శ్లో॥ స పితు ర్వచనం శ్రీమా నభిషేకా త్పరం ప్రియమ్।
మనసా పూర్వ మాసాద్య వాచా ప్రతిగృహీతవాన్॥ 24

శ్లో॥ దద్యా న్న ప్రతిగృహ్ణీయాత్ సత్యం బ్రూయా న్న చానృతమ్।
అపి జీవితహేతో ర్హి రామ స్సత్యపరాక్రమః॥ 25

సుందర-సర్గ-32

పట్టాభిషేకభంగమునుగూర్చి సీతమాటలు గమనింపఁదగి యున్నవి. "సత్యవచనుఁడైన రాజు కైకేయికి ఇచ్చినవరమును స్మరించి. అప్రియము క్రూరము నైన యామెకోరికను విని మూర్ఛిల్లెను. పిదప వృద్ధుఁడైన యారాజు సత్యరూపమైన ధర్మమునందు నిలిచి రోదనము చేయుచు జ్యేష్ఠపుత్రుఁడైన రాముని రాజ్యమును గూర్చి యాచించెను. రాముఁడు అభిషేకముకన్న ప్రియమైన తండ్రి వచనమును ముందు మనస్సులో తరువాత వాగ్రూపమున ప్రతిగ్రహించెను." దశరథుఁడు రాజ్యముకొఱకు రాముని యాచించుట ఎందులకు? పూర్వదినమున ఆయన "నీకు రాజ్య మిత్తు" నని నిండుకొలువులో రామునితో చెప్పెను. అందువలన ఆయన రామునకు రాజ్యము నిచ్చినట్లే అయ్యెను. దానిని మరల ఆయన భరతునకు ఎట్లు ఇచ్చును? రాముఁడు "ఈరాజ్యము నాకు వలదు; నీవే తీసికొనుము" అని మరల తండ్రికి ఇచ్చినప్పుడే ఆయన దానిని భరతునకు ఈయఁగలఁడు. కాని ఆయన ఒకసారి తాను రామునకు ఇచ్చినరాజ్యమును, "నారాజ్యమును నా కిమ్ము నేను దానిని భరతునకు ఈయవలె" అని రాముని అడుగఁజాలక రోదన మొనర్చెను. ఆరోదనమువలన రాముఁడు తండ్రియభి

ప్రాయమును గ్రహించి రాజ్యమును వదలు కొనెను. అందువలన దశరథుఁడు రోదనముచేత రామునివలన రాజ్యమును యాచించిన ట్లయ్యెను. అట్టియెడల పితృవచనమును రాముఁడు ప్రతిగ్రహించుట ఎట్లు సంభవించెను? ఆయన రాము నేమియు అడుగలేదు; ఏమాట యును చెప్పలేదు. పితృవచన మనఁగా, తండ్రి కైకేయికి నొసంగిన మాట యని యర్థము.

ఆంజనేయుఁడు సీత చెప్పినమాటలకు దుఃఖితుఁడై ఆమె నోదార్చుచు ఇట్లనెను "అమ్మా! నేను రామునిసందేశమున వచ్చినదూతను. రాముఁడు కుశలియై యున్నాఁడు. నిన్ను కుశల మడుగు మనినాఁడు, లక్ష్మణుఁడు కూడ శోకసంతప్తుఁడై శిరము వంచి నీకు అభివాదనముఁ గావించినాఁడు." ఆమె రామలక్ష్మణుల కుశలవార్తను విని సంతోషించి యిట్లనెను. "బ్రతికియున్నచో నూఱేండ్ల కైనను పురుషుఁ డానందము నొందఁగలఁడు, అనెడు కళ్యాణగాథ యథార్థ మనియే తోఁచుచున్నది."

శ్లో॥ కళ్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మే।
ఏతి జీవన్త మానందో నరం వర్ష శతా దపి॥ 6

సుందర–సర్గ–34

వారికి పరస్పరము విశ్వాసము కలుగఁజొచ్చెను. అందువలన హనుమంతుఁ డామెను సమీపింపఁజొచ్చెను. అది చూచి ఆమె యతనిని రావణుఁ డని శంకించుచు అశోకవృక్షశాఖను వీడి నేలపై కూర్చుండెను.

ఆమె ఆంజనేయుఁ డున్న శింశపావృక్షమునొద్దకు కదా వచ్చెను. ఆమె అశోకవృక్షశాఖను వీడె నని చెప్పుట ఎట్లు కుదురును? ఆమె శింశపావృక్షమునొద్దకే వచ్చెను. అయినను దానిసమీపముననే అశోకవృక్షముకూడ ఉండి దానిశాఖలు శింశపావృక్షశాఖలలో చేరి

యుండవచ్చును. అందువలన ఆమె శింశపావృక్షమునొద్దనుండి అశోక వృక్షముయొక్క శాఖను అవలంబించియుండవచ్చును.

ఆమెయభిప్రాయమును ఊహించి ఆంజనేయుఁడు ఆమెకు నమస్కరించెను. ఆమె నిట్టూర్చి, "నిశాచరా! నన్నేల యింకను బాధపెట్టెదవు? జనస్థానమున నిట్లే వంచించితివి" అని పలికి కొంతసేపైన తరువాత మరల నిట్లనెను. "అయినను నామనసు నీయందు ప్రీతి నొందుచున్నది. నీవు రామదూత వైనచో రామునిగుణములను ప్రశంసింపుము. ఇది కలయా! నేను రామునిదూతను చూచుచున్నానా! కలలో వానరమును చూచిన అశుభము కలుగును. కాని రామదూతదర్శనమువలన నాకు శుభమే కలిగినదే! ఇది నాకు చిత్తమోహమా! వాతవికారమా! ఉన్మాదమువలనివిభ్రమమా!" ఇట్లు పలుకుచు ఆమె తుద కతఁడు రావణుఁడనియే తలంచి మాఱుమాట మాటాడ లేదు.

ఆమెయభిప్రాయము నెఱింగి ఆంజనేయుఁడు రాముని గుణములను ప్రశంసించి, "వానరప్రభువైన సుగ్రీవుఁడు నిన్ను కుశల మడిగినాఁడు నీవు త్వరలోనే రామలక్ష్మణులను చూడఁగలవు. నేను సుగ్రీవుని సచివుఁడను, హనుమంతుఁడను. నేను సముద్రమును దాఁటి లంక ప్రాకారముపై అడుగుపెట్టితిని నన్ను శంకింపకుము."

సీత నెమ్మదిగా ఇట్లనెను. "నీకు రామునితో సంసర్గము ఎట్లు ఎక్కడ కలిగినది? లక్ష్మణుని ఎట్లెఱుంగుదువు? నరవానరులకు సమాగమ మెట్లు కలిగినది? రామలక్ష్మణులయొక్క లక్షణములను చెప్పుము?"

హనుమంతుఁడు రామునిగుణములను శరీరలక్షణములను విపులముగా వర్ణించి, లక్ష్మణుఁడు కూడ అట్టివాఁడే అని చెప్పి, రాముఁడు శ్యామవర్ణుఁ డని లక్ష్మణుఁడు స్వర్ణవర్ణుఁ డని వచించి, అంతవఱకును జరిగినవృత్తాంతమును వివరించి, "నాసాగరలంఘనము వ్యర్థము కాలేదు

త్వద్దర్శనకృతమైన యశస్సును పొందుచున్నాను. రాముఁడు త్వరలో రావణుని సంహరించి నిన్ను పొందఁగలఁడు.'' అని పలికెను. సీత అప్పటికి హనుమంతుని విశ్వసించి ఆనందబాష్పములు రాల్చెను.

## 10. అభిజ్ఞానవినిమయము

అప్పుడు ఆంజనేయుఁడు ''అమ్మా! నీకు అంతయును చెప్పితిని. ఇంక ఏమి చేయు మందువు? నేను ఏ ప్రకారముగా తిరిగివెళ్లుట నీకు ఇష్టమో చెప్పుము. నీకు విశ్వాసమును కలిగించుటకై రాముఁ డొసంగిన నామాంకితమైన యంగుళీయక మిదిగో గైకొనుము; ఊరడిల్లుము." అని చెప్పుచు అంగుళీయకము నొసంగెను

శ్లో॥ ఏత త్తే సర్వ మాఖ్యాతం సమాశ్వసిహి మైథిలి।
కిం కరోమి కథం వా తే రోచతే ప్రతియా మ్యహమ్॥ 87

సుందర—సర్గ—35

సీత అంగుళీయకమును గైకొని భర్తయే తనయొద్దకు వచ్చినట్లు సంతసించి యిట్లనెను, "ఆంజనేయా! నీవు చాల సమర్థుఁడవు; ప్రాజ్ఞుఁడవు; శతయోజనవిస్తీర్ణమైనసాగరము గోష్పదమువలె దాఁటి యొంటరిగా లంకలో ప్రవేశించితివి; రావణునివలన భయము గాని సంభ్రమము గాని పొందకుంటివి. నీవు ప్రాకృతవానరుఁడవు కాదు. రామునిదూతవు కావున నీతో నెంతయో మాటాడవలసియున్నది. రామలక్ష్మణులు కుశలముగా నున్నారు గద! రాముఁడు నాకొఱకు తపించుచున్నాఁడా? నన్ను ఇటనుండి విడిపించుకొనిపోవునా? కౌసల్యా సుమిత్రాభరతాదులయొద్దనుండి కుశలవార్తలు వచ్చుచున్నవా? నా కొఱకు భరతుఁడు సచివాధిష్ఠితమైన యక్షౌహిణీ సైన్యమును పంపునా? వానరసేనలతో సుగ్రీవుఁడు బయలుదేరివచ్చునా? రామబాణములచే నిహతుఁడైన రావణుని అల్పకాలముననే చూడఁగల్గుదునా?"

హనుమంతుఁ డిట్లనెను. "అమ్మా! నీ విక్కడ నున్నట్లు రామునకు తెలియదు. నామాట విన్నంతనే రాముఁడు ఋక్షవానరసైన్యములతో ఇచ్చటికి వచ్చి, ఎవ రడ్డమైనను అందఱను సంహరించి రావణుని సబాంధవముగ నిర్మూలించి నిన్ను గైకొనును. నీవియోగమున రాముఁడు మిగుల పరితపించుచున్నాఁడు; మాంసమును గాని మధువును గాని సేవించుట లేదు; వన్యాహారమును ఏసాయంవేళకో కొంచెము తీసికొనుచున్నాఁడు. ఆయన నిన్నే ధ్యానించుచు తన శరీరముపై ప్రాకుచున్న దంశమశకకీటాదులను కూడ గమనించుట లేదు. నిద్ర ఆయనకు దూర మైనది. ఎప్పు డైనను కొంచెము నిద్రించినను వెంటనే 'సీతా' అని పలుకుచు మేల్కొనుచుండును.

సీత నిట్టూర్చుచు ఇట్లనెను. "రాముఁడు అన్యవనితాసక్తుఁడు కా లే దని నన్ను స్మరించుచు శోకతప్తుఁడై యున్నాఁ డని నీవు చెప్పుచున్నమాటలు విషముతో కూడిన యమృతమువలె నున్నవి. ఐశ్వర్యాభిముఖముగాఁ గాని దారుణవ్యసనములోనికిఁ గాని విధియే పురుషుని త్రాటితో బంధించి లాగినట్లు కొనిపోవుచుండును. దైవము ప్రాణుల కపరిహార్యము. రామలక్ష్మణులు నేనును ఎట్లు దుఃఖముచేత పీడింపఁబడుచున్నామో చూడుము. రాముని త్వరపడు మని చెప్పుము. ఇంక రెండుమాసములే నాకు రావణుఁ డేర్పఱచినయవధి యున్నది. ఆపైన నేను జీవింపను.

విభీషణుఁడు నన్ను రామున కొసంగు మని అన్నకు ఎన్నో విధముల బోధించెను, వాఁడు మృత్యువశుఁడై తమ్ముని మాటలను వినుట లేదు. అవింధ్యుఁ డను రాక్షసవిద్వాంసుఁడు కూడ రాముని వలన రాక్షసులకు క్షయము కలుగు నని రావణునకు గట్టిగా చెప్పెను. ఆదురాత్ముఁ డాతనిహితమును గూడ వినలే దఁట. విభీషణుని పెద్ద కూఁతురు అనల, తల్లి పంపఁగా ఇచ్చటికి వచ్చి, నా కీ విషయములు

చెప్పినది. రామునిమహిమ నాకుఁ దెలియును. ఆయన శరజాలముచేత రాక్షససముద్రమును క్షణములో శోషింపఁజేయఁగలఁడు.

శ్లో॥ జ్యేష్ఠా కన్యానలా నామ విభీషణసుతా కపే।
తయా మ మైత దాఖ్యాతం మాత్రా ప్రహితయా స్వయమ్॥ 11
సుందర—సర్గ-37

దీనినిబట్టి విభీషణుఁడే కాక, అతనిభార్య కూఁతురు కూడ ధర్మానురక్తలై సీతయందు ఆదరము చూపుచుండి రని వ్యక్తమగుచున్నది.

ఆంజనేయుఁ డిట్లనెను. "రాముఁడు తప్పక రాఁగలఁడు. అంతవఱ కెందులకు? నీవు నావీఁపుపై నెక్కుము. ఇప్పుడే నిన్ను రాముని యొద్దకు చేర్చెదను. ఎట్లు వచ్చితినో అట్లే పోఁగలను. ఈలంకావాసులెవరును నావేగమును అందుకొనఁజాలరు." ఆమాటల కామె విస్మితయై నవ్వుచు, "ఇంత యల్పశరీరముతో నన్ను అంతదూర మెట్లు తీసికొని పోఁగలవు? ఇదియే నీకపిత్వ మనుకొందును." అని పలికెను.

ఆమె యిట్లు మాటాడుట ఆశ్చర్యకరము. ఆయన నూఱుయోజనములసముద్రమును దాఁటి వచ్చె నని ఆమె నమ్మినది. అంత యల్పమైన శరీరముతోనే ఆయన సముద్రమును దాఁటి రాక్షస నిలయమైన లంకలో ప్రవేశించె నని ఆమె యనుకొనుట అనాలోచితము. ఖరాదిసంహారమును కనులారఁ జూచియు మారీచుఁడు కేకపెట్టి నంతనే మహావీరుఁడైన రాముఁడు దీనుఁడై తన్ను పిలిచె నని ఆమె తలంచుటయు ఇట్టిదే. ఎంతవారి కైనను ఒక్కొక్కప్పుడు తటాలున ఆలోచనభ్రంశము సంభవించు నని దీనివలన గ్రహింపవలసియున్నది.

శ్లో॥ హనుమన్ దూర మధ్వానం కథం మాం నేతు మిచ్ఛసి।
తదేవ ఖలు తే మన్యే కపిత్వం హరియూధప॥ 31

శ్లో॥ కథం వాల్పశరీర స్త్వం మా మితో నేతు మిచ్ఛసి।
సకాశం మానవేంద్రస్య భర్తు ర్మే ప్లవగర్షభ॥ 32
సుందర–సర్గ -37

ఆమాటలకు హనుమంతుఁడు అది తనకుఁ గలిగిన తొలిపరిభవ మునుగా తలంచుచు రోషముతో, "నాసత్త్వమును ప్రభావమును చూడుము" అని చెట్టుపైనుండి క్రిందికి దూఁకి శైలసంకాశముగా శరీరమును పెంచి "నిన్నే కాదు, ఈలంక నంతయుఁ గైకొనిపోఁగలను" అని పలికెను.

శ్లో॥ సీతాయా స్తు వచ శ్శ్రుత్వా హనుమాన్ మారుతాత్మజః।
చింతయామాస లక్ష్మీవాన్ నవం పరిభవం కృతమ్॥ 33
సుందర–సర్గ –37

సీత యాంజనేయునివిజృంభణమును చూచి విస్మయహర్షములతో ఇట్లనెను. "నీశరీరమును ఉపసంహరింపుము. నీబలమును తెలిసికొంటిని. వాయువేగమును అగ్నితేజమును నీయందుఁ గలవు. ప్రాకృత వానరుఁడు సముద్రమును దాఁటి యిటకు రాఁగలఁడా? కాని నీపై అధిష్ఠించి వచ్చినచో నీవేగము నన్ను మూర్ఛితను గావింపవచ్చును; నేను నిలువఁజాలక దొర్లిపోవచ్చును. నన్ను గైకొని పోవు నిన్ను జూచి ఎవ రైనను కళత్రవంతునిగా తలంపవచ్చును. రాక్షసులు నీపైకి రావచ్చును. నీవు వారితో పోరాడుచు నన్ను ఎట్లు రక్షింపఁగలవు? జయపరాజయములు అనవస్థితములు. అదియును గాక నీవు సర్వ రాక్షసనిగ్రహసమర్థుఁడవై విక్రమించి నన్ను గొనిపోయినచో రాముని యశస్సు కుంఠిత మగును. భర్తృభక్తిపరాయణనైన నేను బుద్ధిపూర్వకముగా నీశరీరమును స్పృశింప నిచ్ఛగింపను. రావణశరీర స్పర్శము నాకు నేను అవశనై యుండుటచే సంభవించినది. కావున

సబాంధవముగా రావణుని నిర్మూలించి నన్ను గైకొనిపోవుటయే రామున కుచితము."

శ్లో॥ న చ శక్ష్యే త్వయా సార్థం గన్తుం శత్రువినాశన।
కళత్రవతి సందేహ స్త్వయి స్యా ద సంశయమ్॥ 43

శ్లో॥ భర్తు ర్భక్తిం పురస్కృత్య రామా దన్యస్య వానర।
నాహం స్ప్రష్టుం స్వతో గాత్ర మిచ్ఛేయం వానరోత్తమ॥ 62
సుందర–సర్గ–37

"మనమనస్సు నిర్మలముగా నున్నచోఁ జాలదా? బహిరంగము లైన యాచారములను పాటింపకున్నచో నష్ట మేమి?" అని కొందఱు తలంతురు. అట్లనుకొనుట అసమంజస మని సీతాదేవి చెప్పినమాటల వలన స్పష్ట మగుచున్నది. ఆంజనేయునియందు ఆమెకు పుత్రభావనయే యుండవచ్చును. అయినను అతఁడు పరపురుషుఁడే. అందువలన ఆయనశరీరస్పర్శను ఆపదయం దైనను బుద్ధిపూర్వకముగా అంగీకరించుట తగ దనియే ఆమె నిశ్చయించినది. అంతే కాదు. "మనము ధార్మికులముగా ఉన్నచో చాలును. లోకము ఏమి అనుకొన్నను మన కేమి?" అని తలంచుటయు యుక్తము కాదు. ధార్మికులు తమవిషయమున లోకులకు అపోహ కలుగకుండునట్లు కూడ జాగరూకత వహింపవలసియే యున్నది. ఆంజనేయుని వీఁపుపై సీత కనిపించినచో క్రొత్త వారికి ఎవరికైనను ఆమె ఆయనకు భార్యయై యుండవచ్చు నను తలంపు కలుగుట సహజము. దానివలన లోకాపవాదమే కలిగినచో పరిణామము తీవ్రముగా నుండును. స్త్రీపురుషులు తమ వర్తనములలో లోకులకు అపోహ కలుగకుండునట్లు జాగరూకత వహించుట ఆవశ్యకము.

ఆంజనేయుఁడు ఆమెమాటలకు సంతోషించి యిట్లనెను. "నీవు పాతివ్రత్యమునకు తగినట్లు పల్కితివి. రాముని తప్ప నన్యుని స్పృశింప నని నీ వనుట రామపత్నికి తగినట్లున్నది. సముద్రము

దుస్తర మగుటచేత, లంక దుష్ప్రవేశ మగుటచేత, నేను సమర్థుఁడ నగుటచేత, నిన్ను త్వరలో రామునియొద్దకు చేర్చి మీదుఃఖమును తొలఁగింపవలయు నను భక్తిచేతను ఇట్లంటిని; మఱియొక విధమునఁ గాదు. నీవు వచ్చుటకు ఇష్టపడవేని ఏదేని ఒకవస్తువును నీకు గుర్తుగా నొసంగుము."

సీత ఇట్లు చెప్పెను. "చిత్రకూటమున జరిగినయొక వృత్తాంతమును చెప్పెదను. అది శ్రేష్ఠమైన యభిజ్ఞాన మగును. ఒకనాఁడు రాముఁడు చిత్రకూటమున ఈశాన్యభాగమున మందాకినియందు జలక్రీడఁ గావించి శ్రాంతుఁడై ఒక వృక్షచ్ఛాయలో నాయొడియందు నిద్రించెను. శక్రునిపుత్రుఁడు జయంతుఁడు కాకియై వచ్చి నన్ను ముక్కుతో పొడవఁజొచ్చెను. మట్టిపెడ్డలను విసరుచున్నను పోకుండుటచే నేను కోపించి యొడ్డాణమును తీసి వానిని కొట్టఁబోయితిని. ఆ వేగముచేత నావస్త్రము జాఱెను. నిద్రమేల్కొని రాముఁడు చూచి నవ్వెను. నేను కోపించి మాటాడకుండ ఆయనయొడియందే శయనించితిని. ఆయన నన్ను ఓదార్చెను. పిమ్మట ఆయన నాయొడియందు విశ్రమించెను. అప్పుడు మరల ఆకాకి వచ్చి నాస్తనాంతరమునఁ జీల్పఁజొచ్చెను. రక్తపుబొట్లు పడఁగా రాముఁడు లేచి రక్తార్ద్రమైన ముక్కుతో నున్నయాకాకిని చూచి క్రుద్ధుఁడై మేము కూర్చుండటకై పఱచుకొన్నదర్భలలో నొకదానిని గైకొని దానియందు బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. ఆదర్భ జ్వలించుచు కాకిని వెన్నంటెను. ఆ కాకి తండ్రిచే ఇతరలోకపాలకులచేతను నిరాకరింపఁబడి మూఁడులోకములు తిరిగి మరల రామునే శరణుఁజొచ్చి కుడికన్ను అస్త్రమునకు బలిగా నొసంగి వెడలిపోయెను. కాకిపైననే అస్త్రమును ప్రయోగించినవాఁ డిప్పు డేల యీరాక్షసు నుపేక్షించుచున్నాఁడో కదా! రాముని యాదేశమున లక్ష్మణుఁ డైనను నన్నేల రక్షింపఁ దలంచుట లేదు?" ఇట్లనుచు ఆమె విలపింపఁజొచ్చెను.

హనుమంతుఁ డామె నోదార్చుచు నిట్లనెను. "అమ్మా! నీవు కన్పింపక పోవుటచే వారు పరితపించుచున్నారు. ఇప్పటికి ఎట్లో కన్పించితివి. ఇంక వారు తప్పక విక్రమింతురు. నీవు దుఃఖింప నక్కఱ లేదు. వారు నీకొఱకై లోకములనైన భస్మీకరింపఁ గలరు. రామలక్ష్మణ సుగ్రీవులకు ఏమి చెప్పు మందువు?"

సీత ఇట్లనెను. "ఆంజనేయా! నాకు మాఱుగా శిరము వంచి రామునకు నమస్కరించి కుశల మడుగుము. తల్లిదండ్రులను సకల భోగములను విడి మావెంటవచ్చినలక్ష్మణుని కుశల మడుగుము. అతఁడు రాముని తండ్రివలె నన్ను తల్లివలె సేవించుచుండెను. రాముఁడు ఏపని చెప్పినను వెంటనే అతఁడు నిర్వహించును. రామునకు నాకంటెను అతఁడు ప్రియుఁడు. అతనిని జూచుచు రాముఁడు తండ్రిని స్మరింపకుండెను. ఈనిర్బంధమున ఇంకొక్క మాసమునకు పైన జీవింపఁ జాల నని రామునితో చెప్పుము. ఆయనకు ఈయాభరణమును కూడ గుర్తుగా నొసంగుము." ఇట్లు చెప్పుచు ఆమె వస్త్రమునందు ముడివైచి యుంచిన చూడామణిని విప్పి హనుమంతున కొసంగెను.

శ్లో॥ పితృవ ద్వర్తతే రామే మాతృవ న్మాం సమాచరన్।
ప్రియమాణాం తదా వీరో న తు మాం వేద లక్ష్మణః॥ 58

శ్లో॥ మత్తః ప్రియతరో నిత్యం భ్రాతా రామస్య లక్ష్మణః।
నియుక్తో ధురి యస్యాం తు తా ముద్వహతి వీర్యవాన్॥ 60

సుందర–సర్గ–38

లక్ష్మణుని అకారణముగా నిందించి ఆశ్రమమునుండి పంపివైచి తత్ఫలముగా రావణునిచే హరింపఁబడినసీత లక్ష్మణునివిషయమున, "నేను పొరపాటున అతనిని నిందించితిని. తత్ఫలముగా ఇంత కష్టము కలిగినది" అని పశ్చాత్తాపమును ప్రకటింపకుండుట ఆశ్చర్య

కరము. పొరపాటును ఒప్పుకొనఁగల్గుట మహనీయుల కైనను ఎంత దుర్ఘటమో దీనివలన గ్రహింపవచ్చును.

రాముఁడు అంగుళీయకమును పంపఁగా సీత తాను కూడ వెంటనే చూడామణిని ఆంజనేయున కొసంగక కాకివృత్తాంతమును చెప్పుట ఎందులకు? ఆమెకున్న యెన్నో నగలలో చూడామణి యొకటి. దానిని వివాహసమయమున జనకుఁడు తనకు ఇచ్చె నను నొకవిశేషము దానియం దున్నను, దానిచేత రాముఁడు తన్ను గుర్తించినను, తన యందు ఆయనవిశేషమైన శ్రద్ధను చూపుటకు అది సమర్థమైన సాధనము కా దేమో అని ఆమె తలంచియుండును. కాకియొక్క వృత్తాంతము రామునియందు పూర్వప్రేమస్మృతులను ఉద్బుద్ధము లగునట్లు చేయుటయే కాక, ధర్మపత్నిని కాకినుండియే రక్షించుటకు బ్రహ్మాస్త్రమును ప్రయోగించినవిషయమును జ్ఞప్తికిఁ దెచ్చి రాక్షసనిర్మూలమునకు వెంటనే పూనుకొనునట్లు చేయుటకు మిక్కిలి దోహద మొనర్చునని యామె తలంచియుండును. అందువలన ముందుగా ఆవృత్తాంతమును చెప్పి ఉంగరమునకు మాఱుగా చూడామణిని కూడ ఇచ్చెను.

ఆంజనేయుఁ డప్పుడు సూక్ష్మరూపుఁడై యుండుటచే చూడామణిని భక్తితో గ్రహించి చేతిౘ్రేలికి తొడుగుకొని సీతను చూచి మాటాడి యభిజ్ఞానమును పొందితిని గదా అనుసంతోషముతో రామలక్ష్మణులను స్మరించుచు ప్రక్కఁగా నిలుచుండెను.

సీత యిట్లనెను. "ఆంజనేయా! ఈ చూడామణిని చూడఁగానే రాముఁడు వివాహసందర్భమును మాయమ్మను మాతండ్రిని మామామగారిని స్మరించును. ఇంక ఈకార్యమున జరుగవలసిన దేమో ఆలోచింపుము; నాదుఃఖమును తొలఁగింపుము. రామలక్ష్మణులను సుగ్రీవుని అమాత్యులను వానరవృద్ధులను కుశల మడిగితి నని చెప్పుము నేను

బ్రతికియుండఁగా రాముఁడు నన్ను ఆదరించునట్లు రామునకుఁ జెప్పి, వాగ్రూపమైన సాహాయ్యముచేత ధర్మమును పొందుము (వాచా ధర్మ మవాప్నుహి)."

ఆంజనేయుఁ డిట్లు చెప్పెను. "దేవీ! రాముఁ డసమానవిక్ర ముఁడు. ఆయన సూర్యపర్జన్యవైవస్వతులను గూడ జయింపఁగలఁడు. దుఃఖింపకుము. నీవు త్వరలో భర్తృసంయోగమును పొందఁగలవు. ఇంక నాకు సెలవిమ్ము, పోయివత్తును."

ఆతనిసుభాషితమును విని యామె సంతోషించి యిట్లనెను. "నీవు ఉచిత మనుకొన్నచో ఒక్కదిన మిచ్చట నెచ్చటనైన రహస్య ముగ నుండి విశ్రాంతిఁ గైకొని రేపు బయలుదేరుము. నీసాన్నిధ్య మున నాకు దుఃఖము కొంత యుపశమింపఁగలదు మఱి నా కొక సందేహము కలుగుచున్నది. ఈసాగరమును వాయుదేవుఁడు వైన తేయుఁడు నీవును తప్ప నితరులు దాఁటలేరు. మఱి ఋక్షవానరులు రామలక్ష్మణులు ఇక్కడికి ఎట్లు రాఁగలరు? దీని కేమి యుపాయము నాలోచిఁచుచున్నావు? ఈకార్యమును సాధించుటకు నీవే సమర్థుఁడవు. ఎట్లైనను రాముఁడు రావణుని సంహరించి నన్ను గొనిపోవుటయే యుచితము. అట్లు కార్యమును నీవే చక్కఁ బెట్టఁగలవు."

హనుమంతుఁ డిట్లనెను "అమ్మా సుగ్రీవునిసైన్యమున నాతో సమానులు నాకన్న అధికులు చాలమంది కలరు. ఈభూమి నంతను అనేకపర్యాయములు ప్రదక్షిణ మొనర్చినవారును కలరు. నాకన్న తక్కువ వాఁడు అక్కడ ఎవఁడును లేఁడు. పెద్దవారిని ఇట్టిపనులకు పంపరు. అందఱకన్నను చిన్నవాఁడను నేనే సులభముగా వచ్చితిని గదా! వారు వచ్చుటలో సందేహ మే మున్నది? వా రందఱు ఒక్కయంగలో సము ద్రమును దాఁటి రాఁగలరు. రామలక్ష్మణులు సూర్యచంద్రులవలె నా

వీఁపుపై నెక్కి వచ్చి రావణుని సంహరింపఁగలరు. త్వరలో నీవు శ్రీరామచంద్రుని జూడఁగలవు; నిశ్చింతగా నుండుము.''

శ్లో॥ మద్విశిష్టా శ్చ తుల్యా శ్చ స న్తి తత్ర వనౌకసః।
మ త్తః ప్రత్యవరః కశ్చి న్నా స్తి సుగ్రీవసన్నిధౌ॥ 38

సుందర–సర్గ- 39

''నాకన్న తక్కువ వా రెవరును సుగ్రీవునియొద్ద లే'' రని హనుమంతుఁడు అసత్యమునే చెప్పె ననుట స్పష్టము. అయినను ఈయసత్య వచనము పాపహేతువు కాకపోవుటయే కాక పుణ్యప్రదము కూడ అగుచున్నది. ''అంగదుఁడు కూడ సముద్రమును దాఁటఁజాలక పోఁగా నేను మాత్రమే ఈపనికి సమర్థుఁడనై వచ్చితిని'' అని ఆంజనేయుఁడు సత్యమునే చెప్పియున్నచో ఆమెకు ఎంతో నైరాశ్యము కలిగి జీవిత సంశయము తటస్థింపవచ్చును. అందువలన అత్యంతము దీనురాలై యున్న యామెకు అసత్యము నైనను ప్రియమును దృఢముగా చెప్పి ఆమె జీవితమును రక్షించుటయే ధర్మము. అప్పు డామెకు యథార్థమును చెప్పుట ధర్మము కాదు. ధర్మవ్యాధుఁడు కౌశికునకు ఈధర్మసూక్ష్మము నిట్లు బోధించెను ''ధర్మంబు బహుప్రకారంబై యుండుఁ; దదీయ సూక్ష్మగతి దురవబోధంబు; గావున శ్రుతిప్రమాణంబులవలనను వృద్ధాచారనిదర్శనంబులను నెఱింగికొనునది. 61

ఉ॥ భూతహితంబుగాఁ బలుకుబొంకును సత్యఫలంబు నిచ్చుఁద
ద్భూతభయాస్పదంబగు ప్రభూతపుసత్యము బొంకునట్లు; ప్రా
ణాతురుఁడై నచోఁ బరిణయంబునయందును బల్కుబొంకు స
త్యాతిశయంబ యండ్రు మహితాత్మక యిట్టివి ధర్మసూక్ష్ముల్॥62

శ్రీమదాంధ్రమహాభారతము–అరణ్యపర్వము–ఆశ్వాసము–5

ఆంజనేయుఁడు అసత్యము నైనను ప్రియముగా దృఢముగా చెప్పుటవలననే సీత, ''ప్రియవక్తవైన నిన్నుఁ జూచి మొలకెత్తిన

పంటభూమి వర్షమును పొందినట్లుగా నేను ప్రహర్షమును పొందు చున్నా" నని పలికినది. ఆపరిస్థితిలో ఆంజనేయుఁ డేమాత్ర మైనను సంశయించుచున్నట్లు ఆలోచింపవలసినట్లు మాటాడియున్నచో ఆమె రాక్షసులబెదిరింపులకు మాయలకు నిరాశనొంది మరణించుటయు సంభ వింపవచ్చును. అట్లు కాకుండ ఆమెకు తమయందు దృఢవిశ్వాసమును ఆశాభావమును సమకూర్చి ప్రహర్షము కలుగునట్లు మాటాడుట ఆంజ నేయుని ధర్మజ్ఞతకు వాక్చాతుర్యమునకు నిదర్శనము.

శ్లో॥ త్వాం దృష్ట్వా ప్రియవక్తారం సంప్రహృష్యామి వానర।
అర్ధసంజాతస స్యేవ వృష్టిం ప్రాప్య వసుంధరా॥ 2

సుందర–సర్గ–40

ఆంజనేయుఁడు బయలుదేరుచుండఁగా సీత మరల నిట్లనెను "ఆంజనేయా! నే నిచ్చినయభిజ్ఞానమును రామున కొసంగుము. కాకిపై నస్త్రమును ప్రయోగించుట ఆయనకు గుర్తుచేయుము. నాకు తిలకము జాఱిపోఁగా రాముఁడే యొకసారి మనశ్శిలాద్రవముతో నాచెక్కిలి యందు తిలకము నుంచెను. దానిని స్మరింపు మనుము. మాసమునకు పైన జాగుచేసినచో జీవింప నని చెప్పుము." ఇట్లు చెప్పి ఆమె కనుల నీరు కారుచుండఁగా, "రామలక్ష్మణులను సుగ్రీవుని అమాత్యులను అందఱను అనామయ మడిగితి నని చెప్పుము. ఎట్లైనను రాముఁ డీ దుఃఖసముద్రమునుండి నన్ను ఉద్ధరించునట్లు చేయుము" అని మరల చెప్పెను

"దేవీ! నీకు భయము లేదు. నీవు చెప్పినట్లు చేయుదును. నిశ్చింతగా నుండుము" అని చెప్పి ఆంజనేయుఁడు ఆమెయొద్ద సెలవు గైకొని బయలుదేరెను.

## 11. రాక్షససంహారము

ఆంజనేయుఁడు సీతయొద్దనుండి యవ్వలకు పోయి యిట్లు ఆలోచించెను "సీతను చూచితిని. కార్యశేషము అల్పమే. ఇంక రాక్షసుల బలాబలములను రావణునిహృదయమును ఎఱుంగవలయును. పూర్వకార్యమునకు అవిరోధముగా పెక్కు కార్యములను సాధించుచు లక్ష్య పరిజ్ఞానమును బహువిధముల సమకూర్చుకొనువాఁడే సమర్థుఁడు. ఈ యశోకవనము నందనతుల్యముగా నున్నది. దీనిని భగ్న మొనర్చినచో రావణుఁడు క్రుద్ధుఁ డగును. అతఁడు రాక్షసులను నాపైకి పంపును అప్పుడు వారిబల మెఱుంగవచ్చును." ఇట్లు నిశ్చయించి ఆయన వెంటనే ఆవనమును ధ్వంస మొనరించెను.

వృక్షభంగమువలనిమహాధ్వనిచేత లంకావాసు లందఱు సంభ్రాంతు లైరి. రాక్షస వినాశసూచకములైన నిమిత్తములు పెక్కు కన్పించెను. సీతచెంత నిద్రించుచున్న రాక్షసస్త్రీలు మేల్కొని హనుమంతుని చూచిరి. వారిని చూడఁగానే హనుమంతుఁడు వారి కింకను భయము కలుగునట్లు శరీరమును పెంచెను. వారు భయపడుచు నిర్భయముగా నున్న సీతాదేవిని చూచి సందేహించుచు హనుమంతునిగూర్చి యడిగిరి. ఆమె, "నా కెట్లు తెలియును? అతఁ డెవరో కామరూపుఁడైన రాక్షసుఁడై యుండును. పాములజాడలు పాములకే తెలియునట్లు మీజాడలు మీకే తెలియవలె. ఆతఁ డెవరో నాకు తెలియదు. నాకును భయముగనే యున్నది." అని పలికెను.

ఇచ్చట సీత కూడ అసత్యమునే చెప్పినది. కుటిలవర్తనుల యందు ఆర్జవము నీతి కాదు. రావణుఁడు ఆమెను వంచింపఁగా ఆమె మాత్రము తనకు రక్షకుఁడుగా వచ్చినవానివిషయమున వారికి నిజము చెప్పవలసినయక్కఱ లేదు. ఆంజనేయునియభిప్రాయ మేమో ఆమెకు

తెలియదు. ఆయన "నేను రామదూత" నని ప్రకటింప నున్నాఁడు. ఆ విషయము ఆమెకు తెలిసియున్నచో యథార్థమే చెప్పియుండవచ్చును. తాను యథార్థమును చెప్పినచో కార్యభంగ మగు నేమో యని ఆమె అట్లు మాటాడినది.

ఆంజనేయుఁడు బయలుదేరుచున్నప్పుడు అతఁడు రాముని యొద్దకు పోవుచున్నాఁ డనియే ఆమె తలంచినది. ఆయన తాను లంకలో చేయఁదలఁచుకొన్నదానిని మాటమాత్రముగా నైన చెప్పియున్నచో అసత్యమును చెప్పవలసినపరిస్థితి ఆమెకు ఏర్పడియుండదు. ఆమె దగ్గర సెలవుతీసికొని పోవుచున్నప్పుడు రాక్షసులబలము తెలిసికోవలయు నను తలంపు ఆయనకు లేకపోవచ్చును. ఆవిధముగా నిశ్చయించినతరువాతనైన ఆయన ఆమెదగ్గరకు వచ్చి ఆవిషయమును చెప్పియుండవచ్చును. కాని ఆమెతో ఆయన ఆవిషయమును ప్రస్తావించినచో, స్త్రీసహజమైన భీరుత్వముచేత, ఆమె వల దని వారింపవచ్చును. ఆమె కాదన్నతరువాత ఆమెమాటను ధిక్కరించి తనయిష్టము వచ్చినట్లుగా ప్రవర్తించుట ఆయనకు సమంజసము కాదు. అందువలన ఆమెతో ఆ విషయమును ప్రస్తావించుటకే ఆయన పూనుకొనలేదు. కాని సీతాదేవి రాక్షసస్త్రీలతో అన్నట్లుగా ఆమెకు కూడ వనభంగమువలన రాక్షసులతో పోరు సంభవించిన అది ఎట్లు పరిణమించునో యని ఎంతో ఆందోళనము భయము నిజముగానే కలిగియుండును. కాని ఆంజనేయుఁడు దేనిని లెక్కపెట్టలేదు తనయిష్టప్రకారము వర్తింప నిశ్చయించుకొన్నప్పుడు ఆయన ఆవిషయమును పెద్దలతో చర్చింపఁబూనుకొనఁడు. అది వారికి ఇష్టము కా దని తెలియుచున్నను, తాను చేయఁదలఁచుకొన్నపనిని చేసి, వారు ఊహించినదానికన్న అధికమైనఫలమును చూపించును. ఇది యీయనస్వభావములో ఒకవిశేషము. ఈస్వభావముచేతనే సీతను చూచి మాటాడినంతనే వెంటనే పోక, రామసుగ్రీవులు గాని, అంగ

దాదులు గాని యూహింపని వనభంగాదికార్యములకు ఆయన పూను కొనెను. ఈకథలో ఆంజనేయుఁడు మొదట ప్రవేశించినప్పుడే వాల్మీకి ఈయనయందలి యీస్వభావవిశేషమును స్పష్టముగా నిర్దేశించెను. రామలక్ష్మణులయొద్దకు ప్రాకృతుని వేషమున పొమ్మని సుగ్రీవుఁడు ఆదేశింపఁగా ఈయన శఠబుద్ధితో ("శఠబుద్ధితయా కపిః"-శ్లో.2, సర్గ. 3-కిష్కింధాకాండ భిక్షురూపమున పోయెను. ఈస్వభావముచేతనే సీతతో మాటమాత్రమైన చెప్పకుండ రాక్షసులపై విజృంభించెను.

ఆరాక్షసస్త్రీలలో కొందఱు రావణునియొద్దకు పరువెత్తుకొని పోయి ఇట్లు చెప్పిరి. "ఎవఁడో భీమకాయుఁడైన వానరుఁడు సీతతో మాటాడి అశోకవనమును నాశమొనర్చినాఁడు. వాఁడు వాసవుని దూతయో వైశ్రవణునిచారుఁడో తెలియదు; లేదా రామునిదూతయే యైయుండవచ్చును వాఁడు సీత యున్నప్రదేశము ఆమెయాశ్రయించి యున్నశింశపావృక్షము తప్ప తక్కిన వన మంతయు నాశమొనర్చెను. ఇంతచేసినవానికి ఆవృక్షమును భంజించుట ఎంతపని? ఆమెను రక్షించుటకొఱకే ఆవృక్షమును వాఁడు వదలెను. కావున వానిని ఉగ్రముగ దండింపుము" రావణుఁడు మండిపడి కింకరులను వారిని ఎనుబదివేల మందిరాక్షసయోధులను హనుమంతుని నిగ్రహించుటకై పంపెను.

ఒక్కనిని పట్టుకొనుటకై రావణుఁడు ఎనుబదివేలమందిని పంపుట ఆశ్చర్యకరము. వనభంగమునుగూర్చి విన్నంతనే రావణుఁడు, సముద్రమును దాఁటి సాహసించి లంకలో ప్రవేశించి యట్లు చేయఁగలిగినవాఁడు ప్రాకృతవానరుఁడై యుండఁడని యూహించి, పదునాలుఁగు వేలమందిని అల్పకాలముననే సంహరించినరామునిపరాక్రమమును వాలివిక్రమమును స్మరించి, ఇతఁడును అట్టివాఁడే అగు నని జాగరూకతతో ఎనుబదివేలమందిని పంపెను.

కింకరులు గదాపరిఘాద్యాయుధములతో అశోకవనముయొక్క తోరణద్వారమందున్న హనుమంతుని చుట్టుముట్టిరి. హనుమంతుఁడు పర్వతసన్నిభుఁడై తోఁకతో నేలపైఁ గొట్టి లంకను ప్రతిధ్వనింపఁ జేసి, "అతిబలుఁడైన రాముఁడు మహాబలుఁడైన లక్ష్మణుఁడును జయించుచున్నారు. రాఘవునిచేత పాలింపఁబడుచున్న రాజైన సుగ్రీవుఁడు జయించుచున్నాఁడు. కోసలేంద్రుఁడైన రామునకు నేను దాసుఁడను; శత్రుసైన్యములకు సంహారకుఁడను; మారుతాత్మజుఁడను; హనుమంతుఁడను. యుద్ధమునందు వేలకొలఁది రావణులు కూడ, వేలకొలఁది శిలలతో వృక్షములతో ప్రహరించు నన్ను మార్కొనఁజాలరు. నేను లంకను మర్దించి సకలరాక్షసులు చూచుచుండఁగా మైథిలికి నమస్కరించి సమృద్ధమైన కార్యసాఫల్యము కలవాఁడనై వెడలిపోవుదును." అని మహానాద మొనర్చెను.

శ్లో॥ జయ త్యతిబలో రామో లక్ష్మణ శ్చ మహాబలః।
రాజా జయతి సుగ్రీవో రాఘవే ణాభిపాలితః॥ 33

శ్లో॥ దాసోఽహం కోసలేంద్రస్య రామ స్యాక్లిష్టకర్మణః।
హనుమాన్ శత్రుసైన్యానాం నిహన్తా మారుతాత్మజః॥ 34

శ్లో॥ న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్।
శిలాభి శ్చ ప్రహరతః పాదపై శ్చ సహస్రశః॥ 35

శ్లో॥ అర్దయిత్వా పురీం లంకా మభివాద్య చ మైథిలీమ్।
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్॥ 36

సుందర—సర్గ-42

ఆంజనేయుఁడు తన్నుగూర్చి "నేను కోసలేంద్రునకు దాసుఁడను" (దాసోఽహం కోసలేంద్రస్య) అని ప్రకటించుకొనుట గమనింపఁదగియున్నది. సుగ్రీవునకు సచివుఁడైన యాంజనేయుఁడు

అతనికి మిత్రుఁడైన రామునకు కూడ సచివుఁడో, సచివసమానుఁడో, సహాయుఁడో అగుట సహజము. అంతే కాని ఆయన తన్ను రాము నకు దాసునిగా ప్రకటించుకొనుట యేమి? సుగ్రీవునివిషయమున ఆయన యిట్టిభావమును ఎప్పుడును ప్రకటింపలేదు. పైఁగా రామలక్ష్మణులను జూచి సుగ్రీవుఁడు పరువెత్తుచున్నప్పుడు, "ఓహో నీశాఖామృగత్వము చక్కఁగా వ్యక్తమగుచున్నదే" అని పరిహసించుటకు కూడ ఆంజ నేయుఁడు వెనుకాడలేదు. కాని ఆయన రామలక్ష్మణులను మొదట చూచినంతనే వారు మహానుభావు లని వెంటనే గుర్తించెను. కావుననే వారికి నమస్కరించెను తనదృష్టికి మహానుభావుఁడుగా గోచరించు చున్నలక్ష్మణుఁడు అన్ననుగూర్చి "ఈయన దశరథపుత్రులలో జ్యేష్ఠుఁడు, గుణవత్తముఁడు, సర్వభూతములకు శరణ్యుఁడు ఈయన తండ్రిమాటను సత్య మొనరింపఁబూనినవాఁడు కృతజ్ఞుఁడు బహు విషయజ్ఞుఁడును అయిన ఈయనకు నేను తమ్ముఁడను. నా పేరు లక్ష్మ ణుఁడు. అంత మాత్రమే కాదు. ఈయనయందున్న గుణములచేత నేను ఈయనదాస్యమును పొందితిని" అని చెప్పుట ఆంజనేయుని మనస్సునందు రామునిమహత్త్వమును గాఢముగా ముద్రించెను. అంత వఱకును ఆంజనేయుఁడు అట్టి ధర్మపరాయణులైన సోదరులను చూచి యుండలేదు మహానుభావుఁడైన లక్ష్మణుఁడే ఎవనిగుణసంపదకు వశుఁడై దాసుఁడై యున్నాఁడో, ఆరాముఁడు తనకు కూడ ఆరాధ్యుఁడే యని, తాను కూడ ఆయనకు దాస్యమును కావింపవలయు నని, అదియే తనజన్మకు చరితార్థత యని ఆంజనేయుఁడు నిశ్చయించుకొనెను. ఆ భావము కలుగుటవలననే ఆయన వారి నిరువురిని తనవీఁపుపై నెక్కించు కొని సుగ్రీవునియొద్దకుఁ దీసికొనివచ్చెను.

శ్లో॥ శరణ్య స్సర్వభూతానాం పితు ర్నిర్దేశపారగః।
జ్యేష్ఠో దశరథ స్యాయం పుత్త్రాణాం గుణవత్తమః॥ 9

శ్లో॥ అహ మ స్యావరో భ్రాతా గుణై ర్దాస్య ముపాగతః।
కృతజ్ఞస్య బహుజ్ఞస్య లక్ష్మణో నామ నామతః॥ 12
కిష్కింధా–సర్గ–4

లక్ష్మణుఁడు గాని ఆంజనేయుఁడు గాని తాము స్వయముగా పరాక్రమశాలులై గుణవంతులై యుండి, రాముఁడు ఎంతగొప్పవాఁడైనను అగును గాక, ఆయనకు మేము దాసుల మని చెప్పుకొనుట యేమి? ఇది యాత్మన్యూనతాభావన మను దోషము (Inferiority Complex) కాదా? నీచత్వమునకు అలవాటుపడుట (Habituation of meanness) కాదా! స్వాతంత్ర్యమును వ్యక్తిత్వమును (Freedom; Individuality) పాశ్చాత్యసంస్కారప్రాబల్యమువలన, నిరతిశయములైన గుణములనుగా భావించుచున్న వారికి దాస్య మనుభావమే వెగటుగాఁ దోఁచుట సహజము. కాని మానవుల నుద్ధరించుటకు వేదము ప్రతిపాదించిన ముఖ్యధర్మములలో ఇది ప్రముఖమై యున్నది. వ్యక్తిత్వాభిమానము స్వాతంత్ర్యము మొదలగునవి సమానులవిషయమున యుక్తములే కాని పెద్దలయెడఁ జెల్లవు ఇట్టిభావములకు మూలము అహంకారము (Egoism) ధర్మవర్తనకు తత్త్వజిజ్ఞాసకు ఇది పరమ శత్రువు. విద్యాభ్యాసమునందు బాలురవ్యక్తిత్వమునకు స్వాతంత్ర్యమునకు ఎట్లు అవకాశము లేదో అట్లే పెద్దలకు కూడ శాస్త్ర పరిజ్ఞాన విషయమున వ్యక్తిత్వస్వాతంత్ర్యములు పనికిరావు. మానవులు, ఎంతవారైనను, శాస్త్రవిజ్ఞానవిషయమున శిశువులే. రసాయనశాస్త్రము (Chemistry) మొదలైన భౌతికశాస్త్రములను అభ్యసించునప్పుడు వ్యక్తులమహత్త్వములకు స్వాతంత్ర్యమునకు ఎట్టిప్రసక్తియు లేదు కదా! ఆశాస్త్రములలో ఒకపదార్థముయొక్క గుణము లిట్టివి యని నిర్దేశింపఁబడియున్నచో వాని నట్లే గ్రహింపవలె కాని, భిన్నముగా గ్రహించుటకు వీలు లేదు. ఈ ప్రయోగము (Experiment) ఇట్లు

చేయవలయు నని వర్ణింపఁబడియున్నచో దాని నట్లే చేయవలయును గాని ఎవఁడును తనయిష్టము వచ్చినట్లు చేయుటకు వీలు లేదు. తీవ్ర గుణమైన గంధకద్రావకమును (Concentrated sulphuric Acid) జలసమ్మిశ్రితముఁ గావింపవలయు నన్నచో ఒకపాత్రలో జలము నుంచి దానియందు ఒక్కొక్క బొట్టుగా తీవ్రగుణమైనద్రావకము పడునట్లుగా చేసి జలమిశ్రితద్రావకమును (Diluted Acid) తయారుచేసికోవల యును. అట్లు గాక ఇంతయాలస్య మెందుల కని తీవ్రగుణమైనద్రావక మునందు నీరు పోసినచో తత్క్షణమే ఆద్రావకము ఉత్ప్లవనము నొంది ఆ పాత్రపగిలి ద్రావకము శరీరముపై పడుట సంభవించును. ఈభౌతికశాస్త్ర విషయములలో మనవ్యక్తిత్వమునకు స్వాతంత్ర్యమునకు ఎట్లు సంబం ధము పనికిరాదో ధర్మశాస్త్రమునందును తత్త్వశాస్త్రమునందును ఇవి పనికిరావు." శాస్త్రము యథార్థమే చెప్పుచున్నది; దానిని బోధించుచున్న యాచార్యుఁడు శాస్త్రార్థమునే వివరించుచున్నాఁడు" అనుభావన లేకు న్నచో భౌతికశాస్త్రాధ్యయనము సాగదు. శాస్త్రమునందు ఆచార్యుని యందును ఉండవలసిన విశ్వాసమునే శ్రద్ధ యందురు. శ్రద్ధావంతునకే జ్ఞానము లభించును. భౌతికశాస్త్రములయందు ఎట్టి శ్రద్ధను కలిగి యున్నామో అట్టిశ్రద్ధయే ధర్మశాస్త్రతత్వశాస్త్రములయం దున్నప్పుడే మనకు ఆ విజ్ఞానము, తత్ఫలములైన యభ్యుదయనిశ్శ్రేయసములును సంభవించును.

అభ్యుదయమును శ్రేయస్సును కోరుమానవుఁడు తల్లిని తండ్రిని, ఆచార్యుని, అతిథిని, ప్రత్యక్షదేవతలనుగా పూజింపవలయు నని వేదము నిర్దేశించుచున్నది. ఒక్కొక్కప్పుడు తల్లిదండ్రులను అట్లు సేవించుటకు అవకాశము లేకున్నచో ఆచార్యునైనను అట్లుసేవించుచు నుండ వచ్చును. మతంగశిష్యులు శబరియు అట్లే ఉత్తమలోకములను పొందిరి. ఇట్లు ఆచార్యులను సేవించునప్పుడు వారియనుగ్రహమున అభ్యుదయనిశ్శ్రేయసములను పొందవలయు నన్నచో వారియెడల

దాసభావమును లేక కింకరభావమును పొందకతప్పదు. యజ్ఞసంరక్షణము జరిగినతరువాత మఱునాఁడు రామలక్ష్మణులు విశ్వామిత్రునియొద్దకు వచ్చి నమస్కరించి యిట్లనిరి. "మునివర్యా! ఇరువురము కింకరులము వచ్చినాము. నీశాసనము ఏది చేయవలసియున్నచో ఆజ్ఞాపింపుము'''

శ్లో॥ ఇమౌ స్మ మునిశార్దూల కింకరౌ సమపాగతౌ।
ఆజ్ఞాపయ మునిశ్రేష్ఠ శాసనం కరవావ కిమ్॥ 4

బాలకాండ–సర్గ–31

"తమకు నేను ఏమి సేవ చేయుదును?" అని మాటమాటికి అడుగుచు సేవ చేయుటయే భాగ్యముగా తలంచువాఁడు కింకరుఁడు. చెప్పిన పనిని మాఱుమాట చెప్పకుండ వెంటనే చేయువాఁడు దాసుఁడు. ఈ రెండింటియందును వ్యక్తిత్వాభిమానమునకు స్వాతంత్ర్యమునకు ఏ మాత్రమును అవకాశము లేదు. ఇట్లు పెద్దలయెడ వినయముతో వర్తించునప్పుడు మనస్సు ఎప్పుడును ఆజ్ఞాబద్ధమై (Disciplined) యుండును. అట్టివానికి పెద్దలయనుగ్రహము దానివలన అభ్యుదయ నిశ్శ్రేయసములును క్రమముగా సిద్ధించును. అట్లు ఆజ్ఞాబద్ధతకు అలవాటుపడినవాఁడు పెద్దవాఁడైనతరువాత కూడ ప్రతి వ్యవహారమునందును శాస్త్రము ఎట్లు చెప్పినదో తెలిసికొని అట్లే వర్తించుచు ఐహికముగా ఆముష్మికముగా అభ్యున్నతిని పొందును. శ్రీకృష్ణభగవానుఁడు అర్జునునకు ''ఇది చేయవలసినది, ఇది చేయరానిది అనువ్యవస్థయందు నీకు శాస్త్రమే ప్రమాణము; శాస్త్రోక్తమైన విధానమును తెలిసికొని ఇచ్చట కర్మలను నిర్వహింపవలసియున్నది" అని యుపదేశించెను.

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి॥ 5
భగవద్గీత-అధ్యాయ 4

ఇట్లు శాస్త్రవిధేయమైనవర్తనము ఏర్పడవలయు నన్నచో గురుశుశ్రూష తప్ప వేఱు సాధనము లేదు. దాసభావముతో పెద్దలను సేవించునప్పుడు అహంకారము క్రమముగా క్షీణించును. దానితోపాటు దానికి మూలమైనయజ్ఞానము కూడ నశించును. అజ్ఞానము నశించినంతనే తత్త్వజ్ఞానము కలుగును. దానివలన రాగద్వేషములు అణఁగిపోయి సంచితాగామికర్మలు భస్మీభూతములై, సకలమానవులకు దేవతలకు కాంక్షణీయమైన బ్రహ్మానందము ప్రాప్తించును. అందువలన అభ్యుదయనిశ్శ్రేయసములను కోరువారు మహాపురుషులను అన్వేషించి వారికి శిష్యులై కింకరులై దాసులై యభ్యున్నతిని పొందఁగోరుచుందురు. ఆశ్రయింపఁదగిన మహాపురుషుఁడు లభించుట అనేకపూర్వజన్మల సుకృతములకు ఫలము. ఆంజనేయునకు అప్పటివఱకును రామునివంటి ధర్మమూర్తి ఎవరును తటస్థపడలేదు. అందువలన మహాపురుషుఁడైన రాముఁడు కన్పించినంతనే ఆంజనేయుఁడు ఆయనకు దాసుఁడై శుశ్రూష చేయుటకు నిశ్చయించుకొనెను.

ధర్మానుగతమై పరమప్రేమరూపమైన యీదాస్యము ఆత్మోద్ధారక మగుటచే భక్తి యని ప్రశంసింపఁబడుచున్నది. అర్థానుగతమై భయనిర్బంధాత్మకమైన దాస్యము (slavery) ఆత్మహననప్రాయ మగుటచే తుచ్ఛమే యగును. యుద్ధమునందు ఓడిపోయి శత్రువులకు చిక్కినవారు తల్లిదండ్రులచే అమ్మఁబడినబాలబాలికలు, పేదఱికముచేతనో భోగాభిలాష వలననో తమమనశ్శరీరశక్తులను ఇతరుల కధీనము గావించి వృత్తుల నవలంబించు భృత్యులు (Servants) మొదలగువారు అర్థదాసులు. అర్థదాస్యము నికృష్టము. అది పరిహరింపఁదగి

నదే. ఈయోడిగమునకు భక్తికిని ఎట్టి సంబంధము లే దని గ్రహింప వలసియున్నది. ఈసందర్భమున లక్ష్మణుఁడు, గుణములచే ఈయనకు నేను దాసుఁడ నైతిని" (గుణైర్దాస్య ముపాగతః) అని చెప్పియుండుట గమనింపఁదగియున్నది.

ఆంజనేయుఁడు కావించినయామహానినాదమునకు నగరము దద్ద రిల్లెను. కింకరులు భయము నొందియు రావణునియాజ్ఞకు వెఱచి హను మంతునిపై ఆయుధములను విసరిరి. ఆయన తోరణద్వారమునందున్న పెద్దయినుపపరిఘమును గైకొని గగనమున తిరుగుచు వారి యాయుధ ముల కందక వారిని సంహరించెను. హతశేషులు రావణునకు చెప్పు టకై పరుగిడిరి.

హనుమంతుఁడు అటునిటు చూచుచు, "వనము భగ్నమైనది. కాని చైత్యప్రాసాద మట్లే యున్నది. దీనిని కూడ విధ్వంస మొన ర్తును" అని దానిపై దూఁకి శిఖరముపై కెక్కి లంక ప్రతిధ్వనించునట్లు మరల రామాదులజయమును తనపరాక్రమమును ఉద్ఘోషించుచు పర్వ తాకారుఁ డయ్యెను ఆచైత్యపాలకులు నూఱుమంది గదాపరిఘావ్యా యుధములను ఆయనపై విసరఁజొచ్చిరి, హనుమంతుఁడు ఒకచైత్య స్తంభమును పెఱికి గిరగిరఁ ద్రిప్పెను. దానితాఁకిడికి తక్కిన స్తంభ ములయందు నిప్పు పుట్టి ప్రాసాదము దగ్ధ మయ్యెను. పిదప ఆంజ నేయుఁడు చైత్యపాలకులను సంహరించి, "నావంటివారు వేలమంది భూమి యంతయు తిరుగుచున్నారు. హస్తిసహస్రబలాఢ్యులు, వాయు వేగులైన ఋక్షవానరకోటులతో సుగ్రీవుఁడు వచ్చును. ఇంక లంక యుండదు; మీ రుండరు; రావణుఁ డుండఁడు" అని యుద్ఘోషించెను.

ఈయుద్ఘోషములవలన ఆంజనేయుఁడు రాక్షసులశక్తిని యుద్ధో త్సాహమును క్రుంగఁదీసె ననుట స్పష్టము.

వనము ధ్వంస మగుచుండఁగా దానియందే యున్న చైత్య పాలకులు కింకరులకు ముందే. అంజనేయుని ఏల ప్రతిఘటింప లేదు? వనరక్షణము వారికర్తవ్యము కాదు. వారు చైత్యప్రాసాదరక్షణమునందు నియోగింపఁబడుటవలన దానిని రక్షించుట మాత్రమే వారికర్తవ్యము. ఒకచోట నియోగింపఁబడినవారు, రాజాజ్ఞ లేకుండ, తమకర్తవ్యభార మును మఱియొకరికి అప్పగింపకుండ, ఏపరిస్థితియందును అస్థానమును (Post of duty) వదలిపెట్టి మఱియొకచోటికి పోరాదు. అందువలన వారు తమనియోగస్థానమునుండి వనరక్షణమునకై బయలుదేరలేదు.

ఇంతలో రావణునియాదేశమున ప్రహస్తుని పుత్త్రుఁడు జంబు మాలి ఖరయుక్తమైనరథమున వచ్చి, తోరణస్తంభములపై పావుర ములకొఱకు నిర్మింపఁబడిన గూడునందు కూర్చుండిన హనుమంతుని జూచి ఆయనశిరస్సున వదనమున బాహువులందును బాణముల నేసెను. హనుమంతుఁడు ఆగూటినుండి క్రిందికి దూఁకి ఒకపెద్దగండశిలను వానిపై విసరెను. వాఁడు దానిని భగ్న మొనర్చెను. అంజ నేయుఁడు పెద్దసాలవృక్షమును వానిపై ప్రయోగింపఁగా, వాఁడు దానిని ఛేదించి ఆయనశరీరమును బాణములతో నింపెను. ఆయన క్రుద్ధుఁడై పరిఘము నెత్తి గిరగిర త్రిప్పి వానిపై వైచెను. దానితో వాఁడు రథాశ్వసహితముగా రూపురేఖలు లేకుండ నుగ్గునూచగా నయ్యెను,

శ్లో॥ తస్య చైవ శిరో నాస్తి న బాహూ జానునీ నచ,
న ధను ర్న రథో నాశ్వా స్తత్రాదృశ్యన్త నేషవః॥ 17

సుందర–సర్గ-44

పిమ్మట రావణుఁడు మంత్రికుమారులను ఏడుగురును పంపెను. ఆమాట విని వారితల్లులు బంధువులును దుఃఖింపఁజొచ్చిరి. మంత్రుల కుమారులు యౌవనోద్రేకమున ఒకరిని మించి యొకరు జయమును

పొందవలయు నను తొందఱతో పెద్దసైన్యముతో బయలుదేరి వచ్చి హనుమంతునిపై బాణవర్షమును కురిపించిరి. హనుమంతుఁడు పైకెగిరి వారిబాణములకు దూరుఁడై ఆకాశమున విహరించుచు అకస్మికముగా వచ్చి వారిపై బడి కాళ్ళతో చేతులతో పిడికిళ్ళతో నఖముఖములతో కొందఱను సంహరించెను.ఆయనగావించినశబ్దమునకే కొందరు గుండెలు పగిలి కూలిరి. సైన్యము పారిపోయెను. గుఱ్ఱములు ఏనుఁగులు హనుమంతుఁడు విసరిన శిలావృక్షాదుల ఘాతములకు అఱచుచు నేలఁగూలెను. వీథులందు రక్తము ప్రవహింపఁజొచ్చెను.

ఈవార్త విని రావణుఁడు కలుగుచున్న భీతిని కప్పుకొనుచు (సంవృతాకారః) ధైర్యము నవలంబించి విరూపాక్ష యూపాక్ష దుర్ధర ప్రఘసభాసకర్ణు లను నైదుగురును సేనానాయకులను బిలిచి యిట్లనెను. "మీతో కూడి నేను దేవగంధర్వాదులను జయించితిని. వారు ఆ పగఁ దీర్చుకొనుటకై పూనియుందురు. ఇంద్రుఁడో, లేక దేవగంధర్వ మహర్షులలో ఎవఁడైనను, మనచేత పరాజితుఁడైనవాఁడు, తపఃప్రభావమున ఈమహాభూతమును సృష్టించియుండును. ఇతఁడు సామాన్య వానరుఁడు కాఁడు. నేను వాలి సుగ్రీవ జాంబవన్నీల ద్వివిదాదులను జూచితిని. వారి కెవ్వరికిని ఇంతగా కాయమును పెంచుశక్తి గాని వేగము గాని లేదు. మీరు సర్వాయుధసన్నద్ధులై సేనాపరివృతులై బయలు దేరుఁడు. మీముందు ఇంద్రాదులును నిలువలేరు. మీరు జాగరూకులై ఆత్మరక్షణము గావించుకొనుచు వానిని నిగ్రహింపుఁడు."

రావణుఁడు వాలితో సఖ్యము గావించుకొని కిష్కింధలో నెల రోజు లున్నప్పుడు, అంతకుముందే వాలిచే సుగ్రీవుఁడు తఱుమఁబడి యుండుటచే వానితో కూడ ఆంజనేయుఁడు కిష్కింధకు దూరమై యుండెను. అందువలన ఆంజనేయునివిషయము రావణునకు తెలియుటకు అవకాశము కలుగలేదు, అందువలననే ఆంజనేయునకు కూడ

అప్పుడు రావణుని చూచుట తటస్థింపలేదు. సీతను హరించి తీసికొని పోవుచున్నప్పుడు ఋష్యమూకమున క్షణకాలము సుగ్రీవాదులతో ఆంజనేయుఁడు కూడ రావణుని చూచినను అతఁడు ఆకాశమునందు ఎత్తుగా వేగముగా పోవుచుండుటచే చక్కఁగా చూచుట తటస్థింపలేదు. అందువలన లంకలో మొదటిసారి చూచినప్పుడు ఆంజనేయుఁడు విస్మితుఁడగుట సంభవించెను.

మఱి సుగ్రీవుఁడు కూడ అప్పుడు కిష్కింధలో లేఁడుకదా! సుగ్రీవునిగూర్చి తెలిసినట్లు రావణుఁడు ఎట్లు ప్రస్తావించెను? సుగ్రీవుఁడు అప్పుడు కిష్కింధలో లేకున్నను, అతఁడు యువరాజు అగుటచే వానినిగూర్చి వినియుండును

విరూపాక్షాదులైదుగురును రథగజాదులతో సన్నద్ధులై పోయి తోరణద్వారమందున్న హనుమంతుని చూచి నలువైపుల నిలిచి ఆయుధములను ప్రయోగింపఁజొచ్చిరి. దుర్ధరుఁడు అయిదునారాచములను హనుమంతునితలపై నేసెను. హనుమంతుఁడు భయంకరముగా అఱచుచు పైకెగిరి శరీరమును పెంచి పర్వతమువలె వచ్చి వానిరథముపైఁబడెను. వానియష్టాశ్వమైన రథము మథితమై వాఁడు నేలఁగూలెను. విరూపాక్షయూపాక్షులు హనుమంతుని ముద్గరములతో తాడించిరి సాలవృక్షమును గైకొని మారుతి వారి నిద్దఱను చావమోదెను. ప్రఘసుఁడు పట్టిశముతో భాసకర్ణుఁడు శూలముతో హనుమంతుని ప్రహరించిరి. హనుమంతుఁడు గిరిశృంగమును తెచ్చి వారిపై వైచి వారిని సైన్యమును విధ్వంస మొనర్చెను. ఆప్రదేశము హయనాగరాక్షసకళేబరములతో భగ్నరథములతో ప్రకీర్ణమై మార్గనిరోధము కలిగెను.

యూపాక్షవిరూపాక్షాదులు రామరావణయుద్ధమునందు పాల్గొనినట్లు యుద్ధకాండమునందున్నది. వారు వేఱని, ఇట్టినామములు కలవారు చాలమంది యుండవచ్చు నని గ్రహింపవలసియున్నది.

నలువదియేడవసర్గ మంతయు విశేషవృత్తములతో నున్నది. ఇందు రావణునికుమారుఁడు అక్షుఁడు హనుమంతునితో మహాయుద్ధ మొనర్చి మరణించుట వర్ణింపఁబడియున్నది. అక్షునిమరణమును నలువదియెనిమిదవసర్గలో రావణుఁడు ఇంద్రజిత్తుతో మాటాడుచు ప్రస్తావించుటచే నలువదియేఁడవసర్గయందలివిషయము ప్రక్షిప్త మనుటకు వీలులేదు. గ్రంథమున ఇక్కడ కొంతభాగము లోపించియుండఁగా ఈ సర్గను విశేషవృత్తములతో ఏమహాకవి యైనను కూర్చియుండవచ్చును. నలువదియెనిమిదవసర్గలో కూడ పెక్కుతావులలో విశేషవృత్తములు కలవు. కాని వానిని వదలి చదివినచో సందర్భము అనుస్యూతముగా సరిపోవుచునే యున్నది. కావున నలువదియెనిమిదవసర్గలోనివిశేషవృత్తములు ప్రక్షిప్తము లనియే చెప్పవచ్చును.

అక్షుఁడు హతుఁడైనతరువాత రావణుఁడు ఇంద్రజిత్తును బిలిచి యతనిబలపరాక్రమములను ప్రశంసించి కింకర జంబుమాలి మంత్రి సేనానాయకులు అక్షుఁడును హనుమంతునిచే సంహరింపఁబడి రని చెప్పి యిట్లనెను. "ఈపరిస్థితియందు అవానరుని నిగ్రహింప నీవు తప్ప సమర్థుఁ డెవ్వఁడును లేఁడు. గృహస్థధర్మదృష్టితో నేను నిన్ను పంపుట మేలైన యాలోచన కాదు. కాని ఇది రాజధర్మపరుఁడైన క్షత్త్రియునకు యుక్తమే. రణవిజయమును కాంక్షించుచు నీవు సర్వశస్త్రాస్త్రప్రయోగవిశేషములను స్మరింపవలసియున్నది.

శ్లో॥ న ఖల్వియం మతి శ్శ్రేష్ఠా య త్త్వాం సంప్రేషయా మ్యహమ్।
ఇయం చ రాజధర్మాణాం క్షత్త్రస్య చ మతి ర్మతా॥ 13

సుందర–సర్గ-48

రావణుఁడు మహర్షిసంభవుఁడే యైనను మాతామహవంశపరంపర ననుసరించి క్షత్త్రియుఁడే యయ్యెను. మాల్యవంతుఁడు, సుమాలి, మాలి బ్రహ్మనుగూర్చి తపస్సు చేసి 'మేము ప్రభువులము కావలయు'

నని వరమును కోరియుండిరి. వారు లంక నాక్రమించి రాక్షసుల నందుఁ జేర్చి వారికి పరిపాలకులై యుండిరి. విష్ణువుచేత పరాజితులైన తరువాత వారు మరల ప్రభుత్వమును వహించుటకై యవకాశము కొఱకు ఎదురు చూచుచుండిరి. తమజాతికి తగిననాయకుఁడై ప్రభువు కాఁదగినవానిని పొందవలయు నను తలంపుతోనే సుమాలి కైకసిని విశ్రవసునొద్దకు పంపించెను. అందువలన కైకసియందు కలిగిన రావణాదులు విశ్రవసుఁడుకోరినసంతానము కాదు. సుమాలిప్రేరణమున కైకసికోరినసంతానము. అందువలన రావణుఁడు లంకయందు పట్టాభిషిక్తుఁడై క్షత్త్రియత్వమును పూర్తిగా అవలంబించెను. యుద్ధమునకు రాజు తనవా రుండఁగా వారిని పంపక తాను బయలుదేరుట రాజనీతి కాదు.

## 12. హనుమద్రావణసమాగమము

ఇంద్రజిత్తు సేనాపరివృతుఁడై చని హనుమంతునిపై శరవర్షమును కురిసెను. ఆంజనేయుఁడు పై కెగురుచు ఆతనిలక్ష్యమును తప్పించుకొనుచు ఇంద్రజత్తుపైఁ బడ నుంకించుచుండెను. ఎంతసేపు పోరినను ఒకరి నొకరు ప్రాణాంతముగ ప్రహరించుట కవకాశము దొరకలేదు. తుదకు ఇంద్రజిత్తు అస్త్రమును ప్రయోగింపఁదలంచెను. వానిలో కూడ ఇతరాస్త్రములకు అతఁడు లొంగఁ డని గ్రహించి యింద్రజిత్తు బ్రహ్మాస్త్రమును స్మరించెను. దానికి కూడ ఆంజనేయుఁ డవధ్యుఁ డని యూహించి మేఘనాదుఁడు ఆయనను బంధించుటకై యాయస్త్రమును ప్రయోగించెను.

శ్లో॥ తతః పైతామహం వీరః సోఽస్త్రమస్త్రవిదాం వరః।
సందధే సుమహాతేజా స్తం హరిప్రవరం ప్రతి॥ 36

శ్లో॥ అవధ్యోఽయ మితి జ్ఞాత్వా త మస్త్రే ణాస్త్రతత్త్వవిత్।
నిజగ్రాహ మహాబాహుం మారుతాత్మజ మింద్రజిత్॥ 37

సుందర–సర్గ–48

వ్యక్తితో కొలఁదిపరిచయముతోనే ఆతనిశక్తిని అంచనావేయఁ గల్గుట సామాన్యమైన బుద్ధిశక్తి కాదు. ఆంజనేయునితో కొంతసేపు పోరాడినంతనే అతఁడు బ్రహ్మాస్త్రమునకుఁ గాని లొంగఁ డని బ్రహ్మాస్త్రము కూడ వానిని వధింపఁజాల దని గుర్తింపఁగల్గుట మేఘనాదుని ప్రతిభకు అస్త్రతత్త్వవేత్తృత్వమునకు గొప్పనిదర్శనము. అవధ్యుఁడైనవానిపై వధింపవలసినదిగా ప్రయోగించినచో ఆయస్త్రము తనకు మించిన లక్ష్యమునందు ప్రవర్తింపఁజాలక తిరిగివచ్చి ప్రయోగించినవానినే బాధించును. అందువలన మేఘనాదుఁడు బ్రహ్మాస్త్రమును హనుమంతునివధకై ప్రయోగింపక బంధించుటకై ప్రయోగించెను.

బ్రహ్మాస్త్రముచేత బద్ధుఁడై హనుమంతుఁడు నిశ్చేష్టుఁడై నేలపైఁ బడెను. వెంటనే ఆంజనేయుఁడు తన్ను బ్రహ్మాస్త్రము బంధించె నని గ్రహించి, బ్రహ్మదేవుఁ డొసంగినవరమును స్మరించి, "అస్త్రబద్ధుడనైనను నాకు భయము కలుగుట లేదు. బ్రహ్మేంద్రవాయుభట్టారకులచే రక్షింపఁబడుచున్న నా కేమి భయము! ఈయస్త్రబంధము ఇప్పుడే తొలఁగిపోఁగలదు. అయినను బంధింపఁబడినట్లుగా రాక్షసులకు చిక్కినచో వీరు నన్ను రావణునియొద్దకు తీసికొనిపోఁగలరు. అప్పుడు రావణునితో మాటాడుటకు అవకాశము కలుగును." అని నిశ్చయించుకొని నిశ్చేష్టుఁడుగనే యుండెను. క్రిందఁబడి కదలకుండినహనుమంతుని చూచి రాక్షసులు సంతోషముతో కేకలుపెట్టుచు జనపనారత్రాళ్ళతో చెట్లనారపట్టలతో పేనినత్రాళ్ళతోను బంధించిరి. వెంటనే హనుమంతుఁడు అస్త్రబంధమునుండి ముక్తుఁ డయ్యెను.

అస్త్రబంధము అన్యబంధమును సహింపదు. రజ్జుబంధము ఏర్పడి నంతనే బ్రహ్మాస్త్రము తొలఁగిపోయెను. అప్పులు ఒకకార్యమునందుఁ బ్రవేశించినచో అంతకుముందు అందు పని చేయుచున్న పెద్దలు వారితో కూడి పనిచేయుటకు ఇష్టపడక తొలఁగి పోవుదురు. అట్లే బంధించుటకు రజ్జువులు సమకూడినంతనే బ్రహ్మాస్త్రము తోలఁగిపోయెను. అస్త్రబంధము నుండి ఆంజనేయుఁడు విముక్తుఁడయ్యెను, రజ్జుబంధమును క్షణములో త్రెంపఁగలిగియుండియు, అశక్తుఁడై లోఁబడినట్లే కదలకుండెను.

శ్లో॥ స బద్ధః స్తేన వల్కేన విముక్తోఽస్త్రేణ వీర్యవాన్।
అస్త్రబంధ స్స చాన్యం హి న బంధ మనువర్తతే॥ 48

సుందర–సర్గ–48

రాక్షసులు మిగుల సంతోషముతో జయనాదములు గావించుచు ఆంజనేయుని లాగికొనిపోయి రావణునకు చూపిరి. అప్పుడు రావణుఁడు రత్నచిత్రతమైన స్ఫటికాసనమున దశశీర్షములతో వింశతి భుజములతో నానాభూషణవిరాజితుఁడై మంత్రులు సచివులు పరివేష్టింపఁ గొలువుతీరియుండెను. తాను ఎంతమందిని సంహరించినను రావణుఁడు స్వయముగా బయలుదేరి రాక కుమారునిచే తన్ను బంధింపఁజేసి కొలువునకుఁ దెప్పించుకొన్నరావణుని దిట్టతనమునకు హనుమంతుఁడు విస్మితుఁ డయ్యెను. ఎట్లైనను రావణుఁడు యుద్ధమునకు వచ్చినచో వానికి శృంగభంగము గావించి నీతి నుపదేశించి పోవలయు నని ఆంజనేయుఁడు తలంచెను; కాని అది కొనసాగలేదు; తుదకు తానే బంధితుఁడుగా రావణునిసముక్షమునకు పోవలసివచ్చెను. అందువలన ఆంజనేయుఁడు రోషతామ్రాక్షుఁడై రావణునివంకఁ జూచెను.

శ్లో॥ తత స్స కర్మణా తస్య విస్మితో భీమవిక్రమః।
హనుమాన్ రోషతామ్రాక్షో రక్షోఽధిపతి మైక్షత॥ 1

సుందర–సర్గ–49

గో. టీక.-యుద్ధార్థం రావణో నాగన్తవ్య మితి మయా యత్నః కృతః, స తు నీతిజ్ఞః ఆసనస్థ ఏవ ఇంద్రజి న్ముఖేన మాం నిబధ్య ఆనీతవా నితి ఆనయనకర్మణా జాతవిస్మయః ఇత్యర్థః॥

ఆంజనేయుఁడు విభ్రాజమానమైన రావణుని తేజమును చూచి వెఱఁగంది, "అహో ఈ రాక్షసరాజుయొక్క రూప మేమి! ధైర్య మేమి! సత్త్వ మేమి! సర్వలక్షణలక్షితుఁడు కదా యితఁడు! ఈతనియందు బలిష్ఠమైన యధర్మమే లేకున్నచో నితఁడు సేంద్రమైనసురలోక మునకు ప్రభువుగా నుండఁదగినవాఁడు గదా! క్రూరములు కుత్సితములు నృశంసములైనకర్మలచే నితఁ డన్నచో దేవతలు దానవులు కూడ భయపడుచున్నారు" అని యనుకొనెను.

శ్లో॥ అహో రూప మహో ధైర్య మహో సత్త్వ మహో ద్యుతిః,
అహో రాక్షసరాజస్య సర్వలక్షణయుక్తతా॥ 17

సుందర-సర్గ-49

అక్షకుమారునిమరణమునుగూర్చి యైనను రావణుఁడు కొంచెము కూడ దిగులుపడినట్లు కన్పింపక ధైర్యముతో నుండుట హనుమంతునకు కలిగినయాశ్చర్యమునకు కారణములలో ఒకటియై యుండవచ్చును. అప్పటికి శవదహనము కూడ అయియుండదు.

రావణుఁడు ఆంజనేయుని చూచినంతనే రోషావిష్టుఁ డయ్యెను, "కైలాసమున నాచే పరిహసింపఁబడి నన్ను శపించిన భగవంతుఁడైన నంది కాఁడు గదా యితఁడు! వానరాకృతి నొంది బాణాసురుఁడే యిట్లు రాలేదు గదా!" అని వెఱఁగందియు ప్రహస్తుని చూచి "ఈ దురాత్ముఁడు నానగరమున కెచ్చటినుండి ఎందులకు వచ్చెనో యడుగుము. వనభంగమున రాక్షసతర్జనమున సంగరమువలన వీని కేమి ప్రయోజనమో తెలిసికొనుము" అని యాదేశించెను. ప్రహస్తుఁడు

హనుమంతుని చూచి, "ఓయీ! వానరా! ఊరడిల్లుము; భయపడకుము; నీకు మే లగును. ఇంద్రవరుణయమకుబేరాదు లెవరైన నిన్ను చారునిగా పంపిరా? లేక విష్ణువే విజయకాంక్షియై నిన్ను దూతగా పంపెనా? ఎట్లయినను నీవు రూపముననే వానరుఁడవు కాని తేజముచేఁ గాదు. యథార్థమును చెప్పుము; అనృతమును పలికినచో బ్రతుకవు" అని పలికెను.

ఆంజనేయుఁడు ప్రహస్తునితో ఇట్లనెను. "నేను ఇంద్రాదుల వారుఁడను కాను; విష్ణువుదూతను కాను. నేను వానరుఁడనే. రాజదర్శనము నొందుటకై వనభంగ మొనర్చి ఆత్మరక్షణకై రాక్షసుల సంహరించితిని. దేవదానవు లెవ్వరును నన్ను ఏయస్త్రపాశములచే నైనను బంధింపఁజాలరు. రాజును చూచుటకొఱకే నేను అస్త్రబద్ధునివలె నుంటిని. రాక్షసులచే పీడింపఁబడినంతనే నేను అస్త్రముక్తుఁడ నైతిని."

పిదప ఆంజనేయుఁడు రావణుని జూచి యిట్లనెను. "మహారాజా! నేను శ్రీరామచంద్రునికార్యముకొఱకు నీయొద్దకు వచ్చితిని. నేను ఆయన దూతను. పథ్యమైన నామాటను వినుము. నేను సుగ్రీవునిసందేశమును గొనితెచ్చితిని. సోదరుఁడైన సుగ్రీవుఁడు నిన్ను కుశల మడిగి నీ కీ విషయమును చెప్పు మనినాఁడు.

ధార్మికులైన రామలక్ష్మణులు సీతతో దండకలో నుండఁగా ఒకనాఁడు సీత కన్పింపలేదు. రాముఁడు లక్ష్మణసహితుఁడై ఋష్యమూకమునకు వచ్చి సుగ్రీవునితో సఖ్యముఁ గావించుకొని వాలిని సంహరించి కపిరాజ్యమును సుగ్రీవున కిచ్చెను. వాలిని నీవు కూడ ఎఱుంగుదువు. అట్టి వాలిని రాముఁ డొక్కబాణమునఁ గూల్చినాఁడు. సుగ్రీవుఁడు సీతను వెదకుటకై వానరులను అన్నిదిక్కులకు పంపినాఁడు. వాయుపుత్రుఁడనైన నేను సముద్రమును దాఁటి వచ్చి యిచ్చట సీతను వెదకుచు నీయశోకవనమున చూచితిని.

నీవు ధర్మజ్ఞుఁడవు. నీవంటి ప్రాజ్ఞులు అపాయభూయిష్ఠములైన యధర్మకార్యములకు పాల్పడరు. రామునకు అప్రియ మొనర్చి యింద్రుఁడును సుఖింపలేఁడు. నీ వనఁగ నెంత? కావున హితమును తలంచి సీతను రాముని కొసంగుము. నీవు సీతను జీర్ణించుకొనఁజాలవు. కష్టార్జితమైన తపఃఫలమును ఏల యీవిధముగా నశింపఁజేసికొందువు? నీవు వరబలమున అవధ్యుఁడ నని తలంచుచున్నావు. నీవు దేవదానవులకు అవధ్యుఁడ వైనను నరవానరులకు కాదు. మఱి సుగ్రీవుఁడు వానరుఁడు; రాముఁడు మానవుఁడు. వారినుండి చావు నెట్లు తప్పించుకొనఁ గలవు? ఇంతవఱకును నీతపోరూపమైన ధర్మఫలము నీయధర్మాచరణమువలన కలుగుచున్న పాపమును, ఫలము నీయకుండునట్లు, నిలుపుచుండినది. ఇప్పటికి నీవు ధర్మాచరణమువలన కలిగినపుణ్యఫలమును సుఖభోగరూపమున చక్కఁగా పొందితివి. ఇంక త్వరలోనే యధర్మాచరణముయొక్క పాపఫలమును నీవు పొందుదువు. ఖరాదులనిధనమును వాలివధను ఆలోచించి హితమును గుర్తింపుము. నేను ఒక్కఁడనే ఈ లంక నంతను నాశ మొనర్పఁగలను. కాని రాముని యభిప్రాయము అది కాదు. ఆయనయే స్వయముగా సీత నపహరించినవానిని వధింపఁ బ్రతినఁ బూనియున్నాఁడు. ఆసీత నీకు కాలపాశము; రాక్షసజాతికి కాలరాత్రి. ఆమెయొక్క పాతివ్రత్యాగ్నిచే లంక దగ్ధ మైనట్లే తలంపుము. మనోహరమైన లంకను ఇంతమంది బంధువులను మిత్రులను భార్యాపుత్రులను వినాశ మొందింపకుము. నామాట వినుము. ముల్లోకములలో రామునివంటి ప్రతాపశాలి లేఁడు. ఆయనకు అప్రియముఁ గావించి నీవు జీవించుట దుర్ఘటము."

హనుమంతునిప్రసంగమును విని రావణుఁడు క్రుద్ధుఁడై ఆయనను సంహరింప నాజ్ఞాపించెను. విభీషణుఁడు అందులకు అంగీకరింపక యిట్లనెను. "ఇది ధర్మవిరుద్ధము; లోకవృత్తమున నింద్యము. నీ

వంటివానికి ఈవానరుని సంహరించుట యుక్తము కాదు. నీవంటి విచక్షణులు కూడ రోషమునకు లోనైనచో శాస్త్రపాండిత్యసంపాదనము కేవలము శ్రమయే యగును. కావున యుక్తాయుక్తములు నిశ్చయించి దూతకు తగినదండనమును విధింపుము. ఇతఁడు సాధువు గాని యసాధువు గాని పరులయాదేశమున వారు చెప్పుమన్న మాటలను చెప్పినాఁడు. ఇట్టి దూత వధార్హుఁడు కాఁడు. ఇతనిని పంపినవారిని శిక్షింప యత్నింపుము."

శ్లో॥ గృహ్యన్తే యది రోషేణ త్వాదృశోఽపి విచక్షణః।
తత శ్శాస్త్రవిపశ్చిత్త్వం శ్రమ ఏవ హి కేవలమ్॥ 8
సుందర–సర్గ–52

గో. టీక:—శాస్త్రవిపశ్చిత్త్వం–వివిధం పశ్యతీతి విపశ్చిత్। తస్య భావః విపశ్చిత్త్వమ్। శాస్త్రవిషయే వివిధజ్ఞానోపేతత్వ మితి యావత్।

ఏఁబదిరెండవసర్గయందును కొన్నివిశేషవృత్తములు కలవు. అవి ప్రక్షిప్తములుగనే తోఁచుచున్నవి.

రావణుఁడు తమ్మునిమాటను మన్నించి, "వానరులకు వాలము ఇష్టము కావున దానిని దహింపుఁడు; దగ్ధపుచ్ఛుఁడై విరూపుఁడైన వీనిని వీని బంధుమిత్త్రులందఱును చూతురు గాక! వీని నిక్కడ దగ్ధపుచ్ఛముతో మన వా రందఱను వినోదముగా చూచుటకై నగర మంతయుఁ ద్రిప్పుఁడు'' అని భటుల కాజ్ఞాపించెను.

ఆంజనేయుని ప్రసంగము విని రామునివలె రావణాదులు ఆంజనేయుని పాండిత్యమును ప్రశంసింపకుండుట గమనింపఁదగియున్నది. రామునియొద్ద ఆంజనేయునిపాండిత్యము మాత్రయే ప్రకటిత మైనది. అందువలన రాముఁడు పాండిత్యమునకు ముగ్ధుఁడై దానిని ప్రశంసించెను.కాని యిక్కడ పాండిత్యమునకు ముందు ఆంజనేయుని పరా

క్రమము ప్రకటిత మైనది. అందువలన ప్రహస్తుఁడు ఆంజనేయుని తేజోవిశేషమును మాత్రమే ప్రశంసించెను. అదియును గాక ఆంజనేయునివలన రాక్షసులకు గొప్పవినాశము సంభవించెను. దానివలన రోషావిష్టుఁడై యుండుటచే అతనికి ఆంజనేయుని పాండిత్యమును గుర్తించుటకు అవకాశము లేకపోయినది అదియును గాక అనేకులను సంహరించి అపరాధియై సభకు తీసికొనిరాఁబడినవానినిగూర్చి మహారాజు గాని యితరులు గాని ఏవిధముగ నైనను ప్రశంసించుట సంభావ్యము కాదు.

ఈసందర్భమున విభీషణుఁడు అన్నకు హితము నుపదేశింప కుండుటయు గమనింపఁదగియే యున్నది. సీత ఆంజనేయునితో చెప్పిన మాటలనుబట్టి విభీషణుఁడు సీతను తెచ్చినంతనే అన్నకు హితము నుపదేశించినట్లు వ్యక్త మైనది. అయినను పరులదూతను సమర్థించుచు ఆదూతయెదుట సభలో రామునకు సీత నొసంగు మని అతడు అన్నకు హితోపదేశమును గావింపఁబూనుట అనుచితము. అందువలన విభీషణుఁడు అప్రసంగమును చేయలేదు.

## 13. లంకాదహనము

రావణుఁ డాదేశించినదే తడవుగా రాక్షసులు క్రోధమూర్ఛితులై హనుమంతునివాలమునకు జీర్ణవస్త్రములను చుట్టి వానిని నూనెతో తడిపి నిప్పు ముట్టించిరి. ప్రదీప్తమైన వాలముతో ఆయన వారిని తఱిమెను. మరల వా రందఱు కూడుకొని ముందుకు వచ్చిరి. స్త్రీబాలవృద్ధనిశాచరు లందఱును ఆయనను చూచి సంతోషింపఁజొచ్చిరి. అప్పు డాయన యిట్లనుకొనెను; "బద్ధుఁడనై యున్నను నన్ను వీరు ఏమి చేయఁగలరు? ఈబంధనములను త్రెంపుకొని వీరి నందఱను సంహరింపఁగలను. వీరు తమరాజుయొక్క ఆజ్ఞచే నన్ను బంధించినను, తోఁకకు నిప్పు

ముట్టించినను, నేను వీరికిఁ గావించినవినాశములో శతాంశము కూడ నిష్కృతిని చేయులేకపోయిరి. వీరి నందఱు నిప్పుడు చంపఁగలిగి యున్నను అది ప్రయోజనకరము కాదు. వీరితోఁ గూడ మహోత్సవ మున లంక యంతయుఁ దిరుగుటయే మేలు. సీతాన్వేషణమునందలి తొందరవలన రాత్రి నగరమును చక్కఁగా చూడలేదు. ఇప్పుడు పగటి వెలుఁగులో ఇందలిదుర్గస్థానములను సేనానివేశనములను చూడవలె. ఈనిప్పువలన ఈరాక్షసులవలన బాధ కలిగినను రామభద్రునికార్యము కొఱకు సహింపవలసియే యున్నది.''

ఇట్లు తలంచి యుదాసీనుఁడై యున్న యాంజనేయుని రాక్షస భటులు పట్టుకొని శంఖభేరీమృదంగ నినాదములతో నగరముసఁ ద్రిప్పఁ జొచ్చిరి. ఆయన రథ్యోపరథ్యాశృంగాటకాదులను చక్కఁగా గమ నించుచు వారిచే లాగఁబడుచు ఈడ్వఁబడుచు తిరుగఁజొచ్చెను.

కొందఱు రాక్షసస్త్రీలు పోయి సీత కీవిషయమును చెప్పిరి. తన యపహరణముతో సమానమై క్రూరమైన యామాటను విని యామె శోకసంతప్తయై, "నేను పతిశుశ్రూష చేసియున్నచో, నాయందు ఏక పత్నీత్వ మున్నచో, ఓయగ్నిదేవా! హనుమంతునకు చల్లఁగా నగుము" అని యగ్నిభట్టారకుని ప్రార్థించెను. ఆమెకు శుభమును సూచించు చున్నట్లుగా వాయువు చల్లఁగా వీచెను.

శ్లో॥ యద్యస్తి పతి శుశ్రూషా యద్యస్తి చరితం తపః॥ 26
యది వా త్వేకపత్నీత్వం శీతో భవ హనూమతః॥ 27

సుందర-సర్గ-53

అప్పుడు హనుమంతుఁడు అగ్నివలన తనకేమాత్రము తాపము కలుగకుండుటకు విస్మయము నొంది, "వాలాగ్రమున అగ్ని మహా జ్వాలతో నుండియు నాకు మంచుగడ్డ నుంచినట్లున్నది. ఇది రాముని

ప్రభావమే. సముద్రుఁడు మైనాకుని పంపినట్లే అగ్నియును నాయందెల సౌహార్దమును చూపఁడు? సీతయొక్క దాక్షిణ్యముచేత రాముని తేజమువలన నాతండ్రియందలి స్నేహమువలనను పావకుఁడు నన్ను దహింపకున్నాఁడు'' అని తలంచెను.

శ్లో॥ సీతాయా శ్చానృశంస్యేన తేజసా రాఘవస్య చ।
పితు శ్చ మమ సఖ్యేన న మాం దహతి పావకః॥ 33

సుందర-సర్గ-53

పిదప మహోత్సాహముతో రాక్షసులవెంట నగరమునఁ దిరుగుచు కొంతసేపైనతరువాత మరల నిట్లనుకొనెను. ''నావంటివాని కీ రాక్షసాధములచే బంధన మేమి? నేనే స్వయముగా ఈనగరము నంతయుఁ జూతును. వీరు గావించినయీయవమానమునకు తగిన ప్రతిక్రియ కూడ చేయవలసినదే.''

ఇట్లు తలంచి ఆయన మహానాదముతో పై కెగిరి పురద్వారముపై నిలిచి శరీరమును పెంచి వెంటనే కుంచితాంగుఁ డయ్యెను. కట్టు త్రాళ్ళు వానియంతట నవియే జాఱిపోయెను. అంతట ఆయన పర్వతాకారుఁడై తోరణద్వారమందున్నపరిఘమును గై కొని ద్వారరక్షకులను చావమోఁదెను. ''వనము మథిత మైనది. సైన్యమున నొక భాగము నశించినది. ప్రకృష్టులైన రాక్షసవీరు లనేకులు హతులైరి. ఇంక మిగిలినది దుర్గవినాశమే. దుర్గవినాశమును కూడ కావించితి నేని నా సీతాన్వేషణశ్రమ సఫల మగును. నా వాలాగ్రమున తేజరిల్లుచున్న హవ్యవాహనునకు ఈ గృహోత్తమములతో తర్పణము గావించుట న్యాయ్యము.'' అని ఆయన తలంచెను.

శ్లో॥ యో హ్యయం మమ లాంగూలే దీప్యతే హవ్యవాహనః।
అస్య సంతర్పణం న్యాయ్యం కర్తు మేభి ర్గృహోత్తమైః॥ 15
సుందర–సర్గ–54

న్యాయమునుండి తొలఁగనిది న్యాయ్యము. న్యాయ మనఁగా తర్కశాస్త్రము. తర్కమునకు నిలుచునది న్యాయ్యము. అగ్నిదేవుఁడు వాలాగ్రమున ప్రజ్వలించుచుండియు తన్ను దహింపలేదు. అట్లు ఉపకారియై తనచెంతనున్నవానికి ఆతిథ్యమొసంగి సంతర్పణము గావించుట న్యాయ్యము, అనఁగా తగినయాహుతి నొసంగుట యుక్తియుక్తము

ఇట్లు తలంచి ఆయన, విభీషణునిగృహమును తప్పించి, ప్రహస్తవజ్రదంష్ట్రశుకసారణ కుంభకర్ణాదుల సౌధములపైకి లంఘించి వానికి నిప్పుముట్టింపఁజొచ్చెను. మేడలు భగ్నములై కూలఁ జొచ్చెను. మహోర్హములైన భవనములు కూలి కాలి బూడిద కాఁజొచ్చెను. స్త్రీలు పురుషులు పసిబిడ్డలతో ముక్తకేశములతో రోదనము చేయుచు ఇండ్లనుండి వీథులలోనికి పరువెత్తఁ జొచ్చిరి. హనుమంతుఁడు రావణుని భవనమునకు పోయి దానిని కూడ దగ్ధమొనర్చెను. రోదనధ్వానముతో నగరమంతయు సంక్షుభిత మయ్యెను. రుద్రుఁడు త్రిపురములను దహించినట్లు హనుమంతుఁడు లంకను దహించి సంతృప్తుఁడై సముద్రమునందు వాలమును చల్లార్చుకొనెను.

అన్నివైపుల దగ్ధమగుచున్న లంకను హనుమంతుఁడు సముద్రతీరమునుండి వెనుతిరిగి చూచుచు సీతను స్మరించి భయకంపితుఁడై యిట్లనుకొనెను. "నీటిచేత నిప్పును చల్లార్చునట్లుగా ప్రజ్వలించుచున్న కోపమును ఎవరు బుద్ధిచే నిగ్రహింపఁగలరో అట్టిమహాత్ములు కదా ధన్యులు! క్రుద్ధుఁడు ఏపాపమును చేయఁడు? క్రోధవశుఁడైనవాఁడు సాధువుల నధిక్షేపించును; గురువులను కూడ సంహరించును. అట్టివానికి వాచ్యావాచ్యములు, కార్యాకార్యములును తోఁపవు. క్షమచేత క్రోధ

మును నిరసించువాఁడే పురుషుఁడు. ఛీ! దుర్బుద్ధినై నే నెంత పని చేసితిని? ఈనగరదాహమున సీత కూడ దగ్ధ యైనచో నాగతి యేమి? నేను రామలక్ష్మణసుగ్రీవుల నెట్లు చూతును? సీతామరణవార్తచే సంభవించు వారివినాశమును చూచుటకన్న నే నిచ్చట సముద్రముననే పడి మరణించుట మేలు.''

శ్లో॥ ధన్యాః ఖలు మహాత్మానో యే బుద్ధ్యా కోప ముత్థితమ్।
నిరుంధన్తి మహాత్మానో దీప్త మగ్ని మి వాంభసా॥ 3

శ్లో॥ క్రుద్ధః పాపం న కుర్యా త్కః క్రుద్ధో హన్యా ద్గురూ నపి।
క్రుద్ధః పరుషయా వాచా నర స్సాధూ నధిక్షిపేత్॥ 4

శ్లో॥ య స్సముత్థితం క్రోధం క్షమ యైవ నిరస్యతి।
యథోరగ స్త్వచం జీర్ణాం, స వై పురుష ఉచ్యతే॥ 6

సుందర–సర్గ–55

ఇట్లు హనుమంతుఁడు చింతించుచుండ శుభశకునములు తోఁచెను. అప్పు డాయన యిట్లనుకొనెను. ''రామునిప్రభావముచేత సీతయొక్క సుకృతముచేతనే కదా నావాలము దగ్ధము కాకుండెను. అట్టియెడల అగ్ని సీత నెట్లు దహింపఁగలదు?''

శ్లో॥ అథ వా చారుసర్వాంగీ రక్షితా స్వేన తేజసా।
న నశిష్యతి కళ్యాణీ నాగ్ని రగ్నౌ ప్రవర్తతే॥ 22

శ్లో॥ య ద్వా దహనకర్మాఽయం సర్వత్ర ప్రభు రవ్యయః।
న మే దహతి లాంగూలం కథ మార్యాం ప్రధక్ష్యతి॥ 26

శ్లో॥ తపసా సత్యవాక్యేన అనన్యత్వా చ్చ భర్తరి।
అసౌ వినిర్దహే దగ్నిం న తా మగ్నిః ప్రధక్ష్యతి॥ 28

సుందర–సర్గ–55

ఇంతలో అంతరిక్షమున "హనుమంతుఁ డెంతపని కావించెను! లంక యంతయు దగ్ధ మైనది. కాని సీత సురక్షితయై యున్నది." అను చారణుల ప్రశంసావాక్యములు వినఁబడెను. ఆమాటలను విని హనుమంతుఁడు ప్రహర్షము నొందెను.

పిదప ఆంజనేయుఁడు శింశపా వృక్షమునొద్దకు పోయి యక్షత గాత్రయై యున్న సీతను జూచి నమస్కరించెను. ఆమె వెనుకటివలెనే "నీ విక్కడ నెక్కడ నైన ఒక్కరోజు దాఁగియుండి విశ్రాంతిఁ గైకొని పొమ్ము. నీ వున్నచో నాకు కొంచెము దుఃఖము ఉపశమించును. సముద్రమును దాఁటి రామలక్ష్మణు లెట్లు రాఁ గలరు! దీనికి తగునుపాయము నీవే సూచింపుము. రాముఁడు రావణుని సంహరించి నన్ను గైకొనిపోవుటయే ఆయనకు ఉచితము." అని చెప్పెను. "రాముఁడు రావణాదులను సంహరించి నిన్ను త్వరలోనే తీసికొనిపోఁ గలఁ" డని ఆయన ఆమె నోదార్చి యటనుండి బయలుదేరెను.

## 14. వృత్తాంతనివేదనము

ఆంజనేయుఁడు అరిష్ట మను పర్వతము నెక్కి శరీరమును పెంచి పై కెగురుటకు దాని శిఖరము నదిమెను. పదియోజనముల విస్తృతి ముప్పదియోజనములయెత్తు గలిగినయాపర్వతము క్షణములో మహానాదముతో భూమిలోనికి అణఁగిపోయి చదును ప్రదేశమయ్యెను. ఆంజనేయుఁడు వాయుపథమున బయలుదేరి సాగరమును దాఁటుచు మధ్యలో మరల మైనాకుని ప్రీతితో స్పృశించి మహానాద మొనర్చుచు ఉత్తరతీరమును చేరెను. జాంబవంతుఁ డానాదమును దూరముననే విని వానరుల నందఱను బిలిచి. "హనుమంతుఁడు విజయశాలియై వచ్చుచున్నాఁడు; లేకున్నచో అట్లు గర్జింపఁడు." అని పలికెను. వా రందఱును పాదపాగ్రములు శిఖరాగ్రములు చేరి వస్త్రములు వీవఁ దొడం

గిరి. వచ్చుచున్న యాంజనేయుని చూచి వా రందఱును ప్రాంజలులై యాయన దిగుచున్న వైపునకు చేరిరి. ఆయన ఱెక్కలులేనిపర్వతమో యనునట్లుగా వచ్చి మహేంద్రపర్వతముపై వ్రాలెను. వారు ప్రహృష్టులై ఆయనకు ఫలములు మూలములు కానుకల నొసంగుచు వృక్ష శాఖల నాసనార్థముఁ గొనితెచ్చిరి.

ఆంజనేయుఁడు జాంబవదాదివృద్ధులకు అంగదునకు నమస్కరించి, "చూచితిని దేవిని" (దృష్టా దేవీ) అని సంగ్రహముగా విషయమును చెప్పెను. పిదప అంగదునిహస్తమును గైకొని మహేంద్రపర్వతమున నొకరమణీయప్రదేశమున కూర్చుండి హనుమంతుఁడు వానరు లడుగుచుండఁగా ఇట్లు చెప్పెను. "అశోకవనమున రాక్షసస్త్రీలచే రక్షింపఁబడుచు ఏకవేణీధర మలినాంగి ఉపవాసకృశ అనిందిత రామదర్శనలాలసయు నై యున్న జానకిని చూచితిని." అది విని వానరు లందఱు కిలకిల శబ్దములతో నృత్యము చేయఁజొచ్చిరి.

అంగదుఁ డిట్లనెను, "ఆంజనేయా! సత్త్వమున వీర్యమున నీతో సమానుఁడు లేఁడు. నీవు మా కందఱకును ప్రాణదాన మొనర్చితివి. నీప్రసాదమున మే మింక సిద్ధార్థులమై శ్రీరాముని జూడఁగలము. అహో! ఏమి నీస్వామిభక్తి! ఏమి వీర్యము! ఏమి ధైర్యము! ఇంక రాముఁడు సీతావిరహశోకమునుండి ముక్తుఁ డగును."

శ్లో॥ త్వత్ప్రసాదా త్సమేష్యామ స్సిద్ధార్థా రాఘవేణ హ।
అహో స్వామిని తే భక్తి రహో వీర్య మహో ధృతిః॥ 47

సుందర–సర్గ–57

జాంబవంతుఁడు ఆంజనేయుని సాదరముగా చూచుచు ఇట్లు అడిగెను. "నీవు సీత నెట్లు చూచితివి? ఆమె ఎట్లున్నది? ఆమె విషయమున క్రూరుఁడైన రావణుఁడు ఎట్లు ప్రవర్తిచుచున్నాఁడు? ఆమె నెట్లు

కనుగొంటివి? ఆమె నీతో నేమి చెప్పినది? విషయ మంతయు విన్న తరువాత అనంతరకార్యమునుగూర్చి ఆలోచింతము. మనము రామునకు చెప్పఁదగినది ఏది? దాఁచదగిన దేది? వివరింపుము."

శ్లో॥ తస్యాం చాపి కథంవృత్తః క్రూరకర్మా దశాననః।
తత్త్వత స్సర్వ మేత న్నః ప్రబ్రూహి త్వం మహాకపే॥ 4

శ్లో॥ య శ్చార్థ స్తత్ర వక్తవ్యో గతై రస్మాభి రాత్మవాన్।
రక్షితవ్యం చ య త్తత్ర తద్భవాన్ వ్యాకరోతు నః॥ 6

సుందర-సర్గ-58

ఈప్రశ్నలలో జాంబవంతునిలోకజ్ఞత నిశితమైనయాలోచనము చక్కఁగా వ్యక్త మగుచున్నవి. సీతను చూచినంతమాత్రమున ప్రయోజనము సిద్ధించినట్లు కాదు. ఆమె సుశీలయై అక్షతగాత్రయై యుండుటయు చాల ముఖ్యము ఆమె కేదేని భంగపాటు కలిగినచో అది రామునకు తెలుపవచ్చునా? అట్టివార్తచే ఆయన ఖిన్నుఁడై గతసత్త్వుఁడు కావచ్చును. రామునకు సీతవిషయము ఎంత ముఖ్యమో రావణశిక్షణము అంతకన్నను ముఖ్యము. క్షత్రియుఁడుగా మహారాజుగా వనితాపహారకుని శిక్షించుట ఆయనకు ముఖ్యధర్మము. కావున ఎట్లైనను రాముఁడు రావణుని శిక్షించునట్లు చేసి తరువాత అట్టివార్త ఆయనకు తెలియునట్లు చేయవచ్చును. ఇది జాంబవంతుని దూరదృష్టి, నీతి. కాని ఆంజనేయుఁడు దీని నూహించి ముందుగనే సీత ఏకవేణీధరయై మలినాంగియై ఉపవాసకృశయై అనిందితయై యున్న దని చెప్పెను కాని ఆమెకు భంగపాటు సంభవించినతరువాత కూడ ఆదోషపరిహారార్థమై ఆమె తపస్సునకు పూనుకొని యీలక్షణములను కలిగియుండవచ్చును. అందువలన ఆంజనేయుఁడు ఆమె భంగపడలే దని విశేషణముల మూలమున సూచించినను ఆవిషయమునే ఆయనవలన స్పష్టముగా నిస్సంశయముగా చెప్పించుటకొఱకు జాంబవంతుఁ డిట్లు ప్రశ్నించెను

అందఱును కుతూహలముతో తనవంకఁ జూచుచు, తన్ను అంగదుని జాంబవంతుని పరివేష్టించి విశాలములైన శిలలయందు కూర్చుండి యుండఁగా ఆంజనేయుఁడు ప్రహర్షముతో సీత నుద్దేశించి నమస్కరించి తాను మహేంద్రపర్వతమునుండి బయలుదేరినది మొదలుకొని జరిగిన దంతయు చక్కఁగా వివరించి ఇట్లు ముగించెను. "రాఘవుని ప్రసాదమున మీయందఱయొక్క తేజమున సుగ్రీవునికార్యముగా ఇది యంతయుఁ జేసితిని. ఇం కేమి చేయఁదగునో మీరు నిశ్చయింపుఁడు. రామసుగ్రీవులప్రయత్నము ఫలించినది. దేవిశీలమును చూచినతరువాత నామనస్సు ప్రహృష్ట మైనది. ఆమె తనతపస్సుచే లోకములను ధరించుటకుఁ గాని, కుపిత యైనచో నిర్దహించుటకుఁ గాని సమర్థురాలు. ఆమె గాత్రమును స్పృశించియు నశింపలే దన్నచో రావణుఁడు నిజముగా తపస్సుచే అతిప్రకృష్టుఁడే. కాని ఆమె క్రుద్ధురాలై వానిని శపింపఁ బూనుకొన్నచో ఆమెవలె అగ్నిశిఖయును దహింపఁజాల దనుకొందును.

ఇంతపని జరిగినతరువాత ఇంక మనము సీతను గైకొనిపోయి రాజపుత్రుల కప్పగించుటయే న్యాయ మనుకొందును. జాంబవత్ప్రముఖులైన మీ రందఱును అనుమతించినచో నే నొక్కఁడనే పోయి రావణుని సపరివారముగా సంహరించి సీతను తీసికొనిరాఁగలను. మనలో తక్కువ వీరు లెవరున్నారు? సాగరము వేల నతిక్రమించినను, మందరము చలించినను, శత్రుసైన్యము జాంబవంతుని కదలింపఁజాలదు. అసలు అంగదుఁ డొక్కఁడే సర్వసంహారమునకు చాలును. నీలుని యూరువేగమున మందరమే శీర్ణ మగుచున్నచో రాక్షసుల లెక్కయేమి? మైందద్వివిదులకు ప్రతియోద్ధ లోకమున నెవఁ డున్నాఁడు?

రామలక్ష్మణసుగ్రీవుల జయమును నా పేరును లంకానగరవీథులలో చాటితిని. సీతస్థితియే శోచనీయముగా నున్నది. శింశపామూలమున రాక్షసస్త్రీపరివృతయై రామధ్యానపరాయణయై రావణునివలని

భయమున మరణమే శరణముగా తలంచుచున్నది. ఆమె సహజముగనే తన్వంగి; ఇప్పు డింకను రామునివియోగమున సంతప్తయై ప్రతిపత్పాఠ శీలునివిద్యవలె కృశించియున్నది. ఈస్థితియందు ఏమి చేయఁదగునో నిశ్చయింపుఁడు.''

శ్లో॥ రాఘవస్య ప్రసాదేన భవతాం చైవ తేజసా।
సుగ్రీవస్య చ కార్యార్థం మయా సర్వ మనుష్ఠితమ్॥ 168

శ్లో॥ ఏత త్సర్వం మయా తత్ర యథావ దుపపాదితమ్।
తత్ర య న్న కృతం శేషం త త్సర్వం క్రియతా మితి॥ 169

సుందర–సర్గ–58

శ్లో॥ తపసా ధారయే ల్లోకాన్ క్రుద్ధో వా నిర్దహే దపి। 3

శ్లో॥ సర్వ థాతిప్రకృష్టోఽసౌ రావణో రాక్షసేశ్వరః।
యస్య తాం స్పృశతో గాత్రం తపసా న వినాశితమ్॥ 4

శ్లో॥ న త దగ్నిశిఖా కుర్యాత్ సంస్పృష్టా పాణినా సతీ।
జనకస్య సుతా కుర్యాత్ య త్క్రోధకలుషీకృతా॥ 5

శ్లో॥ సా ప్రకృత్యైవ తన్వంగీ తద్వియోగా చ్చ కర్శితా।
ప్రతిపత్పాఠశీలస్య విద్యేవ తనుతాం గతా॥ 31

సుందర–సర్గ–59

ప్రతిపత్తు అనఁగా పాడ్యమి. అది అనధ్యయనదినములలో నొకటి. అందువలన ఆదినమునందు గురువునొద్ద అధ్యయనము చేయరాదు. అట్లు చేయువానికి విద్య క్షీణించును. అనధ్యయనదినములలో గురువునొద్ద క్రొత్తపాఠమును అధ్యయనము చేయరాదు. కాని, వెనుక చదివిన పాఠములను వల్లెవేసికోవచ్చును; మననము చేసికొనవచ్చును. మనము పాశ్చాత్యసంస్కృతివలన శనివారమున ఆదివారమునను

చదువులు మానుకొని అనధ్యయనదినములలో పాఠశాలలను కళాశాల లను జరుపుచుండుట శోచనీయము.

అనంతరకార్యమునుగూర్చి ఆంజనేయుఁడు జాంబవదాదులతో చర్చించుట ఆవశ్యకము కాదు. రాముఁడే రావణుని సంహరించి తన్ను తీసికొనిపోవలయు నని సీత అనేకపర్యాయములు అనంతరకార్యమును నిశ్చయించి చెప్పినది. ఆమెయభిప్రాయమునే ఆంజనేయుఁడు వారికి చెప్పియుండవలసినది. అప్పుడు చర్చయే యుండదు. అదియును గాక జాంబవదంగదాదు లందఱును సముద్రమును దాఁటుటకు తమకు శక్తి లేదని యింతకుముందే చెప్పియుండిరి. అయినను వారి నందఱను ఆంజనేయుఁడు తనవీఁపుపై లంకయొద్దకు చేర్పఁగలఁ డనుకొన్నను, వారు రాక్షసులను జయింపఁగలిగినను అది సీతయొక్క అభిప్రాయ మునకు విరుద్ధ మగుటచే ప్రయోజనకరము కాదు. అది రామసుగ్రీవుల కును శోభావహము కాదు. కావున ఇదియంతయు నెఱింగినయాంజ నేయుఁడు ఇట్లేల ప్రసంగించెను? సీతాన్వేషణమునకై తనతో పాటు జాంబవదంగదాదులు బయలుదేరి వచ్చి యుండఁగా, తానొక్కఁడే సము ద్రమును దాఁటి సీతను చూచివచ్చిన ఖ్యాతిని ఆంజనేయుఁడు పొందెను. అందువలన వారి కెవరి కైనను మనస్సులలో, "మన కట్టి సామర్థ్యము లేకపోయెనే! కీర్తి నంతయు ఆంజనేయుఁడే దోఁచుకొనుచున్నాఁడు" అను తలంపులు కలుగవచ్చును. అట్టితలంపులతో వారికి మనస్సులలో ఏమాత్రము కొఱఁత కలుగుటకు అవకాశము కలుగకుండ వారిని ప్రశం సించుచు సంతోషమును కలిగించుటకై ఆంజనేయుఁ డీప్రసంగమును గావించె నని గ్రహింపవలసియున్నది. కావున ఈప్రసంగమునకు అంతకును తనవినయమును ప్రకటించుకొనుచు వారికి సంతోషమును కలిగించుటయే ఆంజనేయునితాత్పర్యము. ఈవిషయమునే ఆయన

ఆరంభముననే, "రాఘవుని ప్రసాదమున మీయందఱ యొక్క తేజమున సుగ్రీవునికార్యముగా ఇది యంతయు చేసితిని" (భవతాం చైవ తేజసా) అని చెప్పుచు స్పష్ట మొనరించెను. ఇది ఆయనయొక్క వినయశీలమునకు లోకజ్ఞతకును గొప్ప నిదర్శనము.

అంగదుఁడు ఇట్లనెను. "మైందద్వివిదులు మహాపరాక్రమవంతులు. దేవసైన్యమును మథించి వీరు అమృతమును త్రావిరి. వీరిద్దఱు లంకను ధ్వంసము గావింపఁగలరు. మీ రందఱు ఇటనే యుండుఁడు, నే నొక్కఁడనే రావణుని సంహరింపగలను. ఇంక మీ రందఱు కూడి వచ్చినచో చెప్పవలసిన దేమున్నది? ఒక్కయాంజనేయునివలననే లంక దగ్ధమైనది కదా! విఖ్యాతపౌరుషులైన మీ రందఱు, "సీత కన్పించినది, కాని తీసికొని రాలేదు" అని రాజపుత్రులకు నివేదించుట యుక్తము కా దనుకొందును. కావున అందఱమును లంకపై దండెత్తి రాక్షసులను సంహరించి జానకిని గైకొనిపోయి రామలక్ష్మణుల ముందుంచుటయే కర్తవ్యము."

ఈప్రసంగమున అంగదునియాలోచనముకన్న ఆత్మాభిమానమే అధికముగా ద్యోతక మగుచున్నది. నాయకుఁడుగా నున్న తనశక్తిసామర్థ్యములను అనుచరులు తక్కువగా గ్రహింపరా దను తలంపుతోనే అంగదుఁడు, "నే నొక్కఁడనే రావణుని సంహరింపఁగల" నని చెప్పె ననుట స్పష్టము.

అప్పుడు జాంబవంతుఁడు సాలోచనముగా ఇట్లు చెప్పెను, "అంగదా! నీనిశ్చయము సరియైనది కాదు. మనము దక్షిణదిశయందు సీతను వెదకుటకు మాత్రమే నియుక్తుల మైతిమి. సుగ్రీవుఁడు గాని రాముఁడు గాని ఆమెను తె మ్మని చెప్పలేదు. మన మెట్లో రాక్షసులను జయించి సీతను తీసికొనిపోవుట రామునకు రుచింపదు. వానరముఖ్యుల సమక్షమున ఆయన స్వయముగా సీతావిజయమును సాధింప ప్రతిజ్ఞ

చేసెను. ఆ ప్రతిజ్ఞ మిథ్య యగునా? మనము చేసినపని ఆయనకు సంతోషమును కలిగింపక విఫల మగును. మీ రందఱును వ్యర్థముగా పరాక్రమప్రదర్శనము చేసినవా రగుదురు. కావున రామలక్ష్మణసుగ్రీవులకు ఇంతవఱకు జరిగినదానిని నివేదించుటయే మనకు కర్తవ్యము.''

## 15. చూడామణిసమర్పణము

అందఱును జాంబవంతునియాలోచనమును ప్రశంసించి హనుమంతుని పరివేష్టించి మహోత్సాహముతో కిష్కింధకు పయనించిరి. కిష్కింధదాపున వారికి మధువనము కన్పించెను. దానిని చూడఁగానే అందఱకును మధువును సేవింప కోర్కి కలిగెను. అది గమనించి ఆంజనేయుఁడు, "మీరందఱు యథేష్టముగా మధువును సేవింపుఁడు; అడ్డువచ్చినవారిని నేను వారింతును'' అని పలికెను. వారు అంగదుని వంకఁ జూచిరి. అంగదుఁడు, "కృతకార్యుఁడైన హనుమంతునివాక్యము అకార్య మైనను అవశ్యకర్తవ్యమే; ఇట్టివాక్యమును మన్నింపవలయునని వేఱుగా చెప్పవలసినది యే మున్నది? మీ రందఱు నిశ్చింతగా మధువును సేవింపుఁడు" అని యనుజ్ఞ నొసంగెను.

వానరులు ప్రహృష్టులై యథేష్టముగా మధువులు సేవించుచు వనములో క్రీడింపఁజొచ్చిరి వనపాలకులు వచ్చి వారింపఁగా మధుమత్తులైన వానరులు వారిని ప్రహరించి తఱిమివైచిరి. వారి కధిపతి యైన దధిముఖుఁడు కోపముతో ఒక మహావృక్షమును గైకొని వచ్చుచుండెను. అంగదుఁడు వానిని చూచి మదాంధుఁడై వానిపైదూఁకి రెండు చేతులతో నెత్తి నేలపైఁ గొట్టెను.

దధిముఖుఁడు సుగ్రీవునకు మేనమామ. అతఁడు తనయనుచరులతో కూడ సుగ్రీవునియొద్దకు పోయి జరిగినవృత్తాంతమును చెప్పెను. వారిసంభాషణమును వినుచున్న లక్ష్మణుఁడు "దధిముఖుఁ డేమి చెప్పు

చున్నాఁ" డని సుగ్రీవు నడిగెను. సుగ్రీవుఁ డిట్లనెను "అంగద ప్రముఖులైన వీరులు మధువనమున యథేష్టముగ మధువును సేవించుచున్నా రఁట. అనఁగా వారు కార్యమును సాధించియే వచ్చి యుందురు. లేకున్నచో వా రిట్టిపనికి పూనుకొనరు. హనుమంతుఁడే కార్యమును సాధించియుండును. వారు మధువును సేవించుచున్నా రన్నచో సీత కన్పించిన దన్నమాటయే." ఆమాట విని రామలక్ష్మణులు మిగుల సంతోషించిరి. సుగ్రీవుఁడు దధిముఖుని జూచి, "వారు ఒకమహాకార్యమును సాధించుకొని వచ్చియుందురు. వారివిషయమున నేను సంతుష్టుఁడనైతిని. వారి నిటకుఁ బంపి నీవు మధువనమును రక్షించుచుండుము" అని పలికెను.

దధిముఖుఁడు సంతుష్టుఁడై పోయి అంగదాదులను చూచి ప్రాంజలియై, "తెలియక వనపాలకులు మిమ్ము అడ్డగించినారు. ఈ వనము నీది. నీవు యథేష్టముగా అనుభవింపవచ్చును. మీరు వచ్చి మధువు త్రావుచున్నా రని విని మీపినతండ్రి హర్షముతో మిమ్ము పంపుమని చెప్పినాఁడు" అని చెప్పెను. అంగదుఁడు తక్కినవారిని చూచి, "మీయభిప్రాయ మేమి? నేను యువరాజునైనను కృతకార్యులైన మిమ్ము బలవంతముగ నియోగించుట యుక్తము కాదు" అని పలికెను. వారు అంగదుని మెచ్చి యిట్లనిరి. "ప్రభుఁడవై యుండి యిట్లు పలుకుట నీకే తగియున్నది. ఐశ్వర్యమదమత్తుఁడు అంతయు తనపై నున్నట్లే గర్వించుచుండును. ఈవినయము నీభావిశుభ యోగ్యతను సూచించుచున్నది. మేమును సుగ్రీవునియొద్దకు పోవలయు ననియే కోరుచున్నాము, నీయనుజ్ఞ లేకుండ మే మొక్కఁడుగైనను ముందుకుఁబెట్టము" అని పలికిరి.

నాయకులయొక్క అనుచరులయొక్క సంబంధము ఇట్లు గదా ఉండవలె!

శ్లో॥ ఏవం వక్ష్యతి కో రాజన్ ప్రభు స్సన్ వానరర్షభ।
ఐశ్వర్యమదమత్తో హి సర్వోఽహ మితి మన్యతే॥ 19

శ్లో॥ తవ చేదం సుసదృశం వాక్యం నాన్యస్య కస్యచిత్।
సన్నతి ర్హి త వాఖ్యాతి భవిష్య చ్ఛుభయోగ్యతామ్॥ 20

సుందర–సర్గ–64

అంగదహనుమంతులను ముందుంచుకొని వారు సుగ్రీవుఁ డున్న ప్రస్రవణశైలమునకు పోయిరి హనుమంతుఁడు రామసుగ్రీవులకు శిరస్సు వంచి నమస్కరించి. "కన్పించినది దేవి" (దృష్టా దేవీ) అని ముందుగా చెప్పి తరువాత ఆమె నియతయై అక్షతయై యున్నదని నివేదించెను. లక్ష్మణుఁడు. "హనుమంతునియందు నీ వుంచిననమ్మకము నిజ మైన" దని సుగ్రీవుని ప్రీతితోఁ జూచెను.

రాముఁడు పరమప్రీతితో హనుమంతుని జూచుచు సీతనుగూర్చి విశేషములు చెప్పఁ డనెను. హనుమంతుఁ డిట్లు చెప్పెను. "నేను సాగరము దాఁటి రావణాంతఃపురమున రాక్షసస్త్రీలచే తర్జింపఁబడుచు నిన్నే చింతించుచు ఉగ్రమైన తపస్సు చేయుచున్న సీతను చూచితిని. ఇక్ష్వాకువంశమును కీర్తించి ఆమెకు నెమ్మదిగా నమ్మకమును కలిగించి మీకు సుగ్రీవునితో నేర్పడిన సఖ్యమును చెప్పితిని. ఆమె చాల సంతోషించి వాయసవృత్తాంతమును మనశిల్యాతిలకవిషయమును గుర్తులనుగా చెప్పినది. ఈచూడామణియు నొసంగినది. 'నీవిచ్చిన యంగుళీయకమును జూచుకొనుచు ఒకమాసము జీవింతును, ఆపైన బ్రతుకను' అని ఆమె చెప్పినది. కావున వెంటనే సముద్రతరణమునకై ఆజ్ఞాపింపుము.

ఆంజనేయునివలన చూడామణిని గైకొని రాముఁడు హృదయమున నుంచుకొని రోదన మొనర్చెను, కొంతసేపైనతరువాత ఆయన సుగ్రీవునితో ఇట్లనెను. "వివాహసమయమున మామామగారు దీనిని

సీత కొసంగెను. దీనిని చూచినంతనే మాతండ్రిగారిని మామామగారిని చూచినట్లయినది. దీనిని చూచుచు ఆమెయే వచ్చినట్లు తలంచుచున్నాను." పిదప ఆయన హనుమంతుని చూచి, "ఆమె ఏమన్నదో వివరముగ చెప్పుము. ఆమెయునికి తెలిసియు నే నింకను దూరముగా నుండఁజాలను. నన్ను గూడ అక్కడికి తీసికొనిపొమ్ము. ఆ రాక్షసుల మధ్య ఆమె ఎంతదీనయై యున్నదో గదా! ఒక్కమాస మామె జీవించునదో చిరకాలము జీవింపఁగలదు. ఆమె అక్కడ ఎట్లు బ్రతుకుచున్నదో చెప్పుము" అని యడిగెను.

ఆంజనేయుఁడు కాకాసురునివృత్తాంతమును వివరించి యిట్లనెను. "సీత ఇట్లు చెప్పినది. 'అంత పరాక్రమశాలియైన రాముఁడు ఇట్లు ఉపేక్షించుటకు కారణము నాదుష్కృతమే.' రామలక్ష్మణులు తప్పక రావణుని సంహరించి త్వరలోనే నిన్ను ఉద్ధరింతు రని నే నామె నోదార్చితిని. చూడామణిని గైకొని నేను బయలుదేరుచుండఁగా చూచి ఆమె, "రామలక్ష్మణులను చూడఁబోవుచున్న నీవు ధన్యుఁడవు గదా!' అనెను. అప్పుడు నేను, ''అమ్మా! నావీఁపుపై నెక్కి రమ్ము. ఇప్పుడే రామునియొద్దకు నిన్ను చేర్చెదను' అని చెప్పితిని. అందులకు ఆమె అంగీకరింపక, 'నాకై నేను నీవీఁపుపై నెక్కి వచ్చుట ధర్మము కాదు. రావణునిస్పర్శ యన్నచో అది యవశత్వమువలన కలిగినది. రామలక్ష్మణులను సహామాత్యుఁడైన సుగ్రీవుని కుశల మడుగుము. నన్ను ఈశోకసాగరమునుండి రాముఁడు ఎట్లు ఉద్ధరించునో అట్లు చెప్పుము. నీ వీదినము ఇక్కడ ఉండి విశ్రాంతి గైకొని రేపు పొమ్ము. నీవున్నచో నాకు కొంచెము శాంతిగా ఉండును. మఱి యీసాగరము నెవరు దాటఁగలరు? దీనికి నీవే యుపాయ మాలోచింపుము. ఎట్లైనను రాముఁడు రావణుని సంహరించి నన్ను గైకొనిపోవునట్లు చేయుము. అదియే ఆయనకు సదృశము' అని చెప్పెను. నే నామెను ఊరడించుచు

ఇట్లంటిని. "అమ్మా! అక్కడ నన్ను మించినవారు చాలమంది కలరు. త్వరలోనే రామలక్ష్మణులు నాభుజస్కంధములపై ఇచ్చటికి వచ్చి రాక్షసుల నిర్మూలింపఁగలరు. నీతోఁ గూడి రాముఁడు అయోధ్యలో త్వరలోనే యభిషిక్తుఁ డగును."

ఆంజనేయుఁడు అంగదజాంబవదాదులతో అన్నివృత్తాంతములను చెప్పెను; గాని రామునితో వనభంజనరాక్షససంహారాదివృత్తాంతములను చెప్ప లేదు. రాముఁడు సీతావిషయముననే ఆసక్తుఁడై యుండుటచేత, ఆసాహసకృత్యములు రామసుగ్రీవులచే ఉద్దేశింపఁబడకపోవుటచేత, ఆత్మప్రశంసాత్మకము లగుటచేత ఆంజనేయుఁడు వనభంజనాద్యమై లంకాదహనాంతమైన వృత్తాంతమును వారితో చెప్పలే దని గ్రహింపవలసియున్నది.

హనుమంతునిమాటలను విని రాముఁడు చాల సంతోషించి ఇట్లు ప్రశంసించెను. "ఇతరులు మనస్సులో కూడ అనుకొనుటకు వీలులేని మహాకార్యమును హనుమంతుఁడు సాధించినాఁడు గరుడుఁడు, వాయువు, హనుమంతుఁడుతప్ప ఇంకొకఁడు సముద్రమును దాఁటలేఁడు. రావణపాలితమైన యాలంకలో సాహసించి ఎవఁడు ప్రవేశింపఁగలఁడు? మరల ఎవఁడు వారికి తెలియకుండ తిరిగిరాఁగలఁడు? సీతాదర్శనముచేత ఇక్ష్వాకువంశము రక్షితమైనది. ఇంతమహాకార్యమును నిర్వహించి ఇట్టిప్రియమును చెప్పుచున్నయీతనికి నే నిప్పు డేమి యీయఁగలను? సర్వస్వభూతమైన నాపరిష్వంగము నొసంగుదును" అని హనుమంతుని గాఢముగా కౌఁగిలించుకొనెను.

శ్లో॥ కృతం హనుమతా కార్యం సుమహ ద్భువి దుర్లభమ్।
మనసాపి య దన్యేన న శక్యం ధరణీతలే॥ 2

శ్లో॥ ఇదం తు మమ దీనస్య మనో భూయః ప్రకర్షతి।
య దిహాస్య ప్రియాఖ్యాతు ర్న కుర్మి సదృశం ప్రియమ్॥ 12

శ్లో॥ ఏ ష సర్వస్వభూత స్తు పరిష్వంగో హనుమతః।
మయా కాల మిమం ప్రాప్య దత్త స్తస్య మహాత్మనః॥ 13
యుద్ధ–సర్గ–1

పిమ్మట రాముఁడు సుగ్రీవాంజనేయులను జూచి, "సీతాన్వేషణము చక్కఁగానే జరిగినది. సముద్రమును తలంచినప్పుడు మరల నాకు మనస్సు వికల మగుచున్నది. ఈవానరులు సముద్రము నెట్లు దాఁటఁగలరు?" అనెను. దీనుఁడై యున్నరాముని జూచి సుగ్రీవుఁ డిట్లు ప్రోత్సహించెను. "ప్రాకృతునివలె తపింతు వేమి? సంతాపము నొందఁదగిన కారణ మేదియు నాకు కన్పించుటలేదు. సీతావృత్తాంతము శత్రుస్థానము కూడ తెలిసినది కదా! ఎట్లైనను సముద్రమును దాఁటి లంకను జేరి శత్రుసంహారముఁ గావింతుము. సముద్రమున సేతువు నెట్లు కట్టవలయునో ఆలోచింపుము. సేతు వేర్పడి వానరులు లంకఁ జేరినచో రాక్షసులు హతు లైనట్లే భావింపుము; శోకమును వీడుము; సత్త్వము నవలంబింపుము; శత్రువుపై కోపమును పూనుము. నిశ్చేష్టు లైన క్షత్త్రియులు మందు లగుదురు. ఎల్లరును చండస్వభావునకు భయపడుదురు."

శ్లో॥ త దలం శోక మాలంబ్య క్రోధ మాలంబ భూపతే।
నిశ్చేష్టాః క్షత్త్రియా మందాః సర్వే చండస్య బిభ్యతి॥ 19
యుద్ధ–సర్గ–2

రాముఁడు సుగ్రీవునిమాటలచే ఉత్సాహమును పొంది ఆంజనేయునితో ఇట్లనెను. "ఆంజనేయా! సేతువుచేఁ గాని, తపోబలమున జలమును శోషింపఁజేసి కాని సముద్రమును సైన్యముతో కూడ దాఁటఁ గలను. ఇంక లంకయొక్క దుర్గరక్షణాదికమును వివరింపుము."

శ్లో॥ తపసా సేతుబంధేన సాగరోచ్ఛోషణేన చ,
సర్వథాపి సమర్థోఽస్మి సాగర స్యాస్య లంఘనే॥ 2
యుద్ధ-సర్గ-3

హనుమంతుఁ డిట్లు చెప్పెను. "మత్తద్విపరథసమాకులమైన లంకయందు రాక్షసు లందఱు ప్రహృష్టులు, దానికి దృఢకవాటములతో పెద్దద్వారములు నాలుగు గలవు. వానిపై పరిఘములు బలిష్ఠములైన గొప్పశిలాయంత్రములు, కాలాయసమయములైన శతఘ్నులును వందల కొలఁదిగాఁ గలవు. మణివిద్రుమవైడూర్యముక్తావిరచితాంతరమైన పెద్ద బంగారుప్రాకారము కలదు. దానికి చుట్టును మొసళ్ళతో అగాధము లైన పరిఖలు కలవు. ద్వారముల కెదురుగా ఆపరిఖలపై విశాలములై యంత్రాత్మకములైన వంతెనలు కలవు. ఆవంతెనలను రక్షించు భటుల గృహములవరుసలు కూడ అచ్చటనే యున్నవి. ఆవంతెనలలో నొకటి కాంచనస్తంభములతో వేదికలతో మహాదృఢమై అకంప్యముగా నున్నది. (గో. టీక:-ఏకః ఉత్తరద్వారస్థః।యుద్ధ-సర్గ-3; శ్లో-8) సముద్రముచే జలదుర్గమై, పర్వతములచే గిరిదుర్గమై, వనములచే ఆవృతమై వన దుర్గమై, ప్రాకారసంవరణముచేత కుడ్యదుర్గమై, లంక చతుర్విధముల దుర్గమమై దేవతలకు కూడ చేర శక్యము కానిదిగా ఉన్నది. అది సముద్రమున దూరముగా నుండుటయే కాదు, అచ్చటికి నౌకామార్గము కూడ లేదు; ప్రదేశవిభాగమైనను కానరాదు. అది నిటారుగానున్న శైలాగ్రమున నిర్మింపఁబడియుండుటచే పైకెక్కుట కూడ సులభము కాదు.

రావణుఁడు అప్రమత్తుఁడై ప్రతిదినము సైన్యపర్యవేక్షణము గావించుచు సర్వదా యుద్ధోద్యతుఁడై యున్నాఁడు. పదివేలమంది తూర్పుద్వారమును, లక్షమంది దక్షిణద్వారమును పదిలక్షలమంది

పశ్చిమద్వారమును, ఒక న్యర్బుదము ఉత్తరద్వారమును చతురంగబల ములతో రక్షించుచున్నారు. ఒకకోటిపాతికలక్షలమంది నగరమధ్యమ స్కంధమును రక్షించుచున్నారు.

అవంతెనలను నేను పగులఁగొట్టి పరిఖలను భగ్నసాధనశిలా దికముతో నింపి, ప్రాకారములను భేదించి, నగరమును తగులఁబెట్టితిని. ఏదే నొకవిధమున సముద్రమును దాఁటినచో వానరులు లంకను హత మొనర్చినట్లే. తక్కినబలములతో నేమి? అంగదద్వివిదమైందజాంబ వత్పనసనీలులే ఎగిరిపోయి లంకను ధ్వంస మొందింపఁగలరు. సరి యైన ముహూర్తమును చూచి సైన్యప్రస్థానమును ఆజ్ఞాపింపుము."

ఉత్తరద్వారమును న్యర్బుదసంఖ్యాకమైన సైన్యము రక్షించు చున్నది. ప్రాచీనుల సంఖ్యాగణమున అర్బుద మున్నది, న్యర్బుదము లేదు. అర్బుదమునకు పైసంఖ్యయైన అబ్జమునకు ఇది నామాంతరము కావచ్చును. అట్లయినచో న్యర్బుద మనఁగా నూఱుకోట్లు అగును. అయు తము = పదివేలు; నియుతము = ఒకలక్ష; ప్రయుతము = పదిలక్షలు; కోటి = నూఱులక్షలు; అర్బుదము = పదికోట్లు. ఇట్లు వీనికిపైన ఒకదాని కన్న నొకటి పదిరెట్లుగా అబ్జము, ఖర్వము, నిఖర్వము, మహాపద్మము, శంకువు, జలధి అంత్యము, మధ్యము, పరార్ధము అనునవి పేర్కొనఁ బడి యున్నవి.

శ్లో॥ ఏక దశ శత సహస్రాయుత లక్ష ప్రయుత కోటయః క్రమశః।
అర్బుద మబ్జం ఖర్వ నిఖర్వ మహాపద్మ శంకవ స్తస్మాత్॥

శ్లో॥ జలధి శ్చాన్త్యం మధ్యం పరార్ధ మితి దశగుణో త్తరా స్సంజ్ఞాః।
సంఖ్యాయాః స్థానానాం వ్యవహారార్థం కృతాః పూర్వైః॥

[P. 106, A Higher Sanskrit Grammer - Chapter V Numerals and their Declension.]

ఇచ్చట వ్యాఖ్యాతలు కూడ న్యర్బుదసంఖ్యను వివరింపలేదు. ఏమైనను రావణుఁడు తూర్పుద్వారమునుండి రక్షకభటులసంఖ్యను పెంచుచు ఉత్తరద్వారమున అత్యధికమైనసంఖ్యలో సైనికుల నుంచుట వలన, ఎప్పటికైనను లంకపై దాడి ఉత్తరమునుండియే జరుగు నని యూహించుచుండె ననుట స్పష్టము

గద్యము

ఆపస్తంబసూత్ర కౌండిన్యసగోత్ర
వేంకటనరసాంబా వేంకటనారాయణామాత్యపుత్ర
హనుమజ్జానకీరామశర్మప్రణీతంబైన
శ్రీరామాయణతరంగిణియందు
అష్టాదశంబైన హనుమత్తీర్థము
సమాప్తము

# 19. శరణాగతితీర్థము.

## 1. జైత్రయాత్ర

అంజనేయుఁడు లంకావృత్తాంతము నంతయు చెప్పినతరువాత రాముఁడు సుగ్రీవునితో ఇట్లనెను. "ఈదినము ఉత్తరాఫల్గుని. రేపు హస్త. ఇప్పుడు సూర్యుఁడు గగనమధ్యమునకు వచ్చియున్నాఁడు. ఇది విజయముహూర్తము. ఈముహూర్తమున మనము బయలుదేరి నచో రావణుఁడు ఎక్కడికి పోయినను చావు తప్పించుకొనఁజాలఁడు. మనప్రస్థానమును విన్నచో సీత కూడ ఆశతో జీవించుచుండఁగలదు. శుభశకునములును కన్పించుచున్నవి. లక్షసైన్యముతో నీలుఁడు మార్గ

శోధన మొనర్చుచు ముందు చనును గాక! ఫలమూలజలసంపన్న మైన త్రోవలో సైన్యము పయనింపవలె. శత్రువులు మూలఫలోదకములను పాడుచేయుదు రేమో గమనించుచుండవలె. అక్కడక్కడ గూఢముగ వైరులు బలముల నుంచి రేమో పరిశీలింపవలె. బాలుర వృద్ధులు దుర్బలులు కిష్కింధలోనే యుందురు. అగ్రభాగమున గజ గవయగవాక్షులు, దక్షిణపార్శ్వమున ఋషభుఁడు, ఎడమవైపున గంధ మాదనుఁడు మహాసైన్యములతో చనుదెంతురు. నేను మధ్యభాగమున హనుమంతునిపై, లక్ష్మణుఁడు అంగదునిపైనను ఎక్కి వచ్చెదము. జాంబవత్సుషేణవేగదర్శులు కుక్షిభాగమును రక్షించుచు వెనుకవత్తురు."

ఈదినము ఉత్తరాఫల్గుని అని రాముఁ డనుటవలన ఫాల్గునపూర్ణిమ నాఁడు మధ్యాహ్నము పండ్రెండుగంటలకు సైన్యప్రస్థానము ఆరంభ మైన దన్నమాట. ఫల్గునీనక్షత్రయుక్తమైనపూర్ణిమగల మాసము ఫాల్గు నము. కాఁబట్టి సాధారణముగా పూర్ణిమాదినముననే ఫల్గునీ నక్షత్రము కూడ నుండును. రావణసంహారమైనంతనే రాముఁడు పదునాల్గవ సంవత్సరము పూర్తి యగు చున్న దని చైత్రశుక్లపక్షారంభమున లంక నుండి అయోధ్యకు బయలుదేరియుండుటచే ఫాల్గునపూర్ణిమదినమున సైన్యములు కిష్కింధనుండి బయలుదేరి యుండు ననుట సమంజసము.

గో. టీక:–అత్రోత్తరాఫల్గునీ త్యనేన స దివసః ఫాల్గునపౌర మాసీ త్యవగమ్యతే। ఇద ముత్తరత్ర ప్రతిపాదయిష్యతే।—శ్లో–.6 సర్గ–4-యుద్ధకాండ.

'మధ్యభాగమున నేను హనుమంతునిపై, లక్ష్మణుఁడు అంగ దునిపై నెక్కి వచ్చెదము'' అని రాముఁడు సుగ్రీవునితో చెప్పినప్పుడు "నీవు మాతో కూడ మహారాజోచితముగా శిబికయందు బయలుదేరి రమ్ము" అని చెప్పినట్లే గ్రహింపవలసియున్నది. (గో. టీక:–శ్లో. 20–సర్గ–4)

రాముఁడు చెప్పినట్లే వెంటనే సుగ్రీవుఁడు సైన్యప్రస్థానమును ఆజ్ఞాపించెను. రామునిశాసనమున సాగరమువలె నున్న వానరసైన్యము నగరములకు జనపదములకు దూరముగా పయనింపఁజొచ్చెను. లక్ష్మణుఁడు త్రోవలో అనుకూలవాయువు సప్తర్షిమండలవిమలత్వము మొదలైన శుభనిమిత్తములనుగూర్చి చెప్పుచు రామునకు ఉత్సాహమును కలిగించెను. ఆసైన్యము రాత్రిందివములు పయనించుచు సహ్యమును మలయమును దాఁటి మహేంద్రపర్వతమునకు చేరెను. అటనుండి అది సముద్రమును చేరెను.

పూర్ణిమ పగలు రాత్రి, ఫాల్గుణబహుళప్రతిపత్తు పగలు అంతయు ప్రయాణము చేసి సాయంకాలమునకు ఆసైన్యము సముద్రమునకు చేరె నని గ్రహింపవలసియున్నది.

ఆకాశముతో సమానముగా అనంతముగానున్న సముద్రమును జూచి రాముఁడు సుగ్రీవునితో "ఇచ్చట సైన్యమును విడియింపుము. సాగరతరణమునుగూర్చి యింక ఆలోచింపవలసియున్నది. ఎవ్వరును తమతమసైన్యములను వీడిపోరాదు." అని చెప్పెను. అట్లే సైన్యమంతయు విడిసెను. నీలుఁడు సర్వసైన్యాధిపతిగా, మైందద్వివిదులు అన్నివైపులను దిరుగుచు సైన్యరక్షణము గావించుచుండిరి. రాముఁడు సాగరమును చూడఁగానే సీతను స్మరించి దుఃఖించుచుండఁగా సూర్యుఁడస్తమించెను. రామలక్ష్మణులు సంధ్య నుపాసించిరి.

## 2. విభీషణహితోపదేశము

లంకను దహించి ఆంజనేయుఁడు వెడలిపోయిన మఱునాఁడు రావణుఁడు రాక్షసముఖ్యులను సమావేశమొనర్చి సిగ్గుచే కొంచెము తలవంచుకొని యిట్లనెను. "ఒక్కవానరమాత్రుఁడు వచ్చి సీతను జూచి చైత్యప్రాసాదమును అశోకవనమును ధ్వంస మొనరించి లంకను

కాల్చిపోయెను. ఇప్పుడు ఏమి చేసిన మే లగునో చెప్పుఁడు. విజయము మంత్రమూలము. మంత్రు లందఱును శాస్త్రదృష్టితో విచారించి ఐకమత్యమున ఒకనిర్ణయమునకు వచ్చుట ఉత్తమము. తలకొకవిధముగా ఆలోచించి తుదకు ఎట్లో ఒకనిర్ణయమునకు వచ్చుట మధ్యమము. ఎవరిమతమును వారు దృఢముగా అవలంబించి ఐక్యమునకు ఇష్టపడకుండుట అధమము. కావున మీ రందఱు ఐకమత్యమున కార్యనిశ్చయము గావింపుఁడు. రాముఁడు సముద్రమును శోషింపఁజేసియో మఱియొకవిధముననో తప్పక సైన్యములతో వచ్చి లంకను ముట్టడింపఁగలఁడు. ఇందులకు మనము చేయఁదగిన ప్రతిక్రియయేమి?"

అప్పుడు రాజుయొక్క మెప్పుకొఱకు బుద్ధిహీనులు నీతిబాహ్యులు నైన రాక్షసులు కొందఱు ఇట్లనిరి. "నీబలము సామాన్యమైనది కాదు. నీవు భోగవతిని జయించితివి; కుబేరుని ధిక్కరించి పుష్పకమును హరించితివి; యముని సైతము మార్కొంటివి. నీకు అసాధ్య మే మున్నది? అసలు నీదాఁక ఎందులకు? ఇంద్రజిత్తునొక్కని బంపుము. అతఁడు సర్వశత్రుసంహారమును గావించును. నీవు చింతింప నక్కఱ లేదు."

పిమ్మట ప్రహస్తుఁడు దుర్ముఖుఁడు నికుంభుఁడు వజ్రహనుఁడు మొదలగువారు తాము ఒక్కొక్కరే పోయి హనుమంతుఁడు కావించిన పరిభవమునకు ప్రతీకారముగా సర్వశత్రుసంహారము గావించి వత్తుమని, హనుమంతుఁడు వచ్చినప్పుడు తాము ప్రమత్తులై యుండుటచే అంతపని జరిగిన దని వీరాలాపములు పలికిరి. పిదప వా రందఱును ఆయుధములఁ గైకొని అప్పుడే బయలుదేరు చున్నట్లు లేచిరి.

వారిని వారించి విభీషణుఁడు అన్నతో ఇట్లు చెప్పెను. "సామదానభేదోపాయములను ప్రయోగించి చూచి కడపటనే విక్రమమునాశ్ర

యింపవలె. శత్రువు ప్రమత్తుఁడైనప్పుడు, మఱియొక శత్రువుతో పోరాడుచున్నప్పుడు, దైవహతుఁడై యున్నప్పుడు విక్రమము సిద్ధించును. మఱి రాముఁడు అప్రమత్తుఁడై సహాయసంపన్నుఁడై ధర్మబలముతో తేజరిల్లుచున్నాఁడు. శత్రుబలమును తక్కువగా తలంచుట తగదు. అసలు రాముఁడు మన కేమి యపకారము చేసినాఁడు? ఖరాదులు తనపైకి రాఁగా ఆత్మరక్షణకై వారిని సంహరించినాఁడు. ఏ ప్రాణి యైనను యథాశక్తి ఆత్మరక్షణము గావించుకొనవలయును గదా! నీవు రామునిభార్యను తెచ్చుటయే ఈవిపత్తునకు మూలము. నిన్ను ప్రార్థించుచున్నాను. ప్రసన్నుఁడవై నామనవి మన్నించి, లంక నాశ మొందకముందే సీతను రామున కొసంగుము. నేను తథ్యమును హితమును చెప్పుచున్నాను." ఇది విని రావణుఁడు సభను వీడి గృహమున కేగెను.

మఱునాఁ డుదయము విభీషణుఁడు ధర్మనిశ్చితుఁడై యగ్రజుని భవనమునకు పోయెను. అక్కడ పుణ్యాహఘోషమును గావించుచు పుష్పాక్షతములు దధిసర్పిష్పాత్రములను గైకొనియున్న విప్రులను జూచుచు అతఁడు లోనికి పోయెను. అచ్చట మంత్రులు మాత్రమే యున్న యేకాంతప్రదేశమున అతఁడు అనునయపూర్వకముగా అన్నతో నిట్లు చెప్పెను. "అన్నా! నీవు వైదేహిని తెచ్చినప్పటినుండియు పెక్కు దుర్నిమిత్తములు కన్పించుచున్నవి. మంత్రములతో వేల్చుచున్నను అగ్నిహోత్రుఁడు స్ఫులింగములతో ధూమములతో చక్కఁగా ప్రజ్వలించుట లేదు. పాకశాలలో అగ్నిహోత్రగృహములలో వేదాధ్యయనశాలలలో సర్పములు, హవ్యములందు చీమలును కన్పించుచున్నవి. ఆవు లెండిపోయినవి. గజములు మదమును గోల్పోయినవి. గుఱ్ఱములు దీనముగా సకిలించుచున్నవి. కాకులు గుంపులు గుంపులుగా సౌధోపరిభాగములందు చేరి కూయుచున్నవి. గ్రద్దలును గుంపులుగట్టి

నగరముపై దిరుగుచున్నవి. ఉభయసంధ్యలందును నక్కలు భయంకరముగా కూయుచున్నవి. పురద్వారములందు క్రూరమృగములనినాదములు విన్పించుచున్నవి. ఈయశుభనిమిత్తములకు సీతను రామునకొసంగుటయే పరిహారము. వీనిని ఈమంత్రు లందఱును ఎఱుంగుదురు. అయినను నీకు అప్రియమును చెప్పుటకు వెఱచి యూరకున్నారు. నేను తమ్ముఁడను కావున నీహితముకొఱకు విన్నదానిని చూచినదానిని నీకు చెప్పుట ధర్మము గాన చెప్పుచున్నాను. నీవు చక్కఁగా ఆలోచించి కార్యమును నిశ్చయింపుము."

శ్లో॥ పుణ్యాన్ పుణ్యాహఘోషాం శ్చ వేదవిద్భి రుదాహృతాన్।
శుశ్రావ సుమహాతేజా భ్రాతు ర్విజయసంశ్రితాన్॥ 8

శ్లో॥ పూజితాన్ దధిపాత్రై శ్చ సర్పిభి స్సుమనోఽక్షతైః।
మంత్రవేదవిదో విప్రాన్ దదర్శ స మహాబలః॥ 9

## యుద్ధ–సర్గ–10

రావణుఁడు మైథిలీమోహమున పాపాచరణతాపమున కృశించి యుండెను. విభీషణుఁడు ఇట్లు చెప్పినప్పుడు మంత్రు లెవ్వరును ఆతనిమాటలను ఖండింపలేదు. అనఁగా వా రందఱును పైకి చెప్పకున్నను విభీషణునియభిప్రాయమునే అంగీకరించి తన్ను అనాదరించుచున్నా రని రావణుఁడు గ్రహించి యింకను బాధపడెను. అప్పటికే జరుగఁగూడని దంతయు జరిగిపోయి యుద్ధము సిద్ధమై యుండెను. అయినను విభీషణునివాదము ప్రబలకుండునట్లు చేయుటకై అమాత్యసుహృన్మంత్రిబాంధవ సహితమైనసభలో మంత్రణము గావించి తనయభిప్రాయమును ప్రబల మొనర్చుట ఆవశ్యక మని రావణుఁడు తలంచెను. అందువలన అతఁడు విభీషణునకు సమాధానము చెప్పక వెంటనే రథముపై

సభాభవనమున కరిగి సింహాసనమున కూర్చుండి ముఖ్యుల నందఱను పిలుచుకొని రండని దూతల నాజ్ఞాపించెను.

శ్లో॥ స బభూవ కృశో రాజా మైథిలీ కామమోహితః।
అసమ్మానా చ్చ సుహృదాం పాపః పాపేన కర్మణా॥ 1
యుద్ధ–సర్గ–11

గో. టీక:–అసమ్మానాత్ అనాదరాత్। సుహృదాం భీషణాది దీనాం కర్తరి షష్ఠీ। విభీషణోక్తే తూష్ణీం స్థితత్వేన ప్రహస్తాదీనా మపి అనాదరః సిద్ధః ఏవ।

వెంటనే వా రందఱును రథగజహయాదివాహనములపై వడి వడిగా వచ్చి వాహనములు దిగి సభలోనికి నడచిపోయి రాజునకు నమ స్కరించి కొందఱు పీఠములపై కూర్చుండిరి; మఱికొందఱు శ్రోత్రి యులు దర్భాసనములపై కూర్చుండఁగా కొందఱు నేలపైఁ గూర్చుం డిరి. రావణుఁడు సభను కలయఁజూచి ప్రహస్తుని గాంచి నగరరక్షఁ గావింపు మనెను. ప్రహస్తుఁడు పోయి నగరద్వారములయొద్ద సభాభవ నమునకు చుట్టును సైన్యములను సన్నద్ధములై నిలువ నియమించి రావణునియొద్దకు వచ్చి "లోపల వెలుపల నగరరక్షణమునకు ఏర్పాట్లు గావించి వచ్చితిని. ఇంక నీయభిప్రాయమును నిశ్చింతుఁడవై చెప్పుము" అనెను.

రావణుఁడు సభలో నందఱను చూచుచు ఇట్లు చెప్పెను. "నా ప్రియాప్రియములు లాభనష్టములు హితాహితములు అన్నియు మీరు తెలిసికోఁదగినవారు. మీతోఁ గూడి యాలోచించి నేను గావించిన పను లెప్పుడును విఫలములు కాలేదు. జరిగినవిషయ మంతయు మీకు చెప్ప వలయు ననియే తలంచుచుంటిని. ఆఱుమాసములుగా నిద్రించుచున్న కుంభకర్ణుఁ డిప్పుడే లేచెను. అందువలన ఇప్పుడు చెప్పుచున్నాను.

ఖరాదులను సంహారించిన రామునిపత్నియైన సీత నిచ్చటికిఁ గొనివచ్చితిని. ఆమె నాశయన మారోహింప నిష్టపడుట లేదు. మూఁడు లోకములందును సీతవంటి సుందరి లేదు. ఆమెను చూచినంతనే నేను కామవశుఁడ నైతిని. ఆమె సంవత్సరకాలము నన్ను గడువు కోరినది, నేను అంగీకరించితిని.

ఆరామలక్ష్మణులు గాని వానరులు గాని సముద్రము నెట్లు దాఁటి రాఁగలరు? కాని యొక్క వానరమాత్రుఁడు వచ్చి గొప్ప యుద్ధము చేసి పోయినాఁడు గదా! కార్యగతులు ఎట్లుండునో చెప్పఁజాలము. మీకుఁ దోఁచినదానిని చెప్పుఁడు. మనుష్యులవలన మనకేమి భయము? అయినను మీరు విమర్శింపుఁడు. మీతోకూడి నేను దేవతలను కూడ జయించితివి. సీతను వెదకుచు రామలక్ష్మణులు సుగ్రీవాదులతో సముద్రము నొద్దకు చేరినారు. ఏమైనను సరే సీత నీయకుండ రామలక్ష్మణుల సంహారించునుపాయ మేదియో ఆలోచింపుఁడు. సాగరమును దాఁటి వచ్చి నన్ను జయింపఁగలవాఁ డెవ్వఁడును లేఁడు. కావున జయము నాదే."

శ్లో॥ అదేయా చ యథా సీతా వధ్యౌ దశరథాత్మజౌ।
భవద్భి ర్మన్త్ర్యతాం మన్త్ర స్సునీతం చాభిధీయతామ్॥ 25

యుద్ధ–సర్గ–12

రావణుఁడు ఎంతో తెలివితో మాటాడి వారి నందఱను ప్రశంసించుచు వారికి తనకృత్యమునందు సానుభూతి కలుగునట్లు చేయుటకు ప్రయత్నించుచున్నాఁడు. అప్పటికి ఆంజనేయుఁడు నగరమును దహించి అన్ని కుటుంబములను అవస్థలపాలు చేసినాఁడు. అవినాశ మంతయు రావణుఁడు సీతను తీసికొని వచ్చుటవలననే సంభవించిన దని నగరములో ఎల్లరకును తెలిసినది. అప్పటివఱ

కును సీతను అతఁడు తెచ్చినవిషయము అంతఃపురరహస్యముగనే యుండినది. కాని ఆంజనేయుఁడు గావించినవీరఘోషమువలన ఆ సీతానిమిత్తముగ లంకకు చేటు సంభవింప నున్న దని యందఱకును తేటతెల్ల మయ్యెను. తమప్రాణములు కుటుంబములు అందఱకును ఇష్టమే. అందువలన అందఱును సీతను రామున కిచ్చి యీవిపత్తును తప్పించుకొనుటయే మంచి దని తలంచుట సహజము. రావణుఁడు చెప్పినమాటలనుబట్టి చారులవలన రామలక్ష్మణసుగ్రీవులు మహాసైన్యములతో సముద్రతీరమునకు చేరినా రనువార్తయు లంకకు చేరినది అని స్పష్టమగుచున్నది. అందువలన పౌరులకు సేనలకు కూడ భయము కలుగుచుండుట సహజము. ఇది గమనించి రావణుఁడు వారి యందు భయమును తొలఁగించి తనదృఢనిశ్చయము ద్వారా వారిని యుద్ధోన్ముఖులను గావించుటకు ప్రయత్నించుచున్నాఁడు.

కాని యేకొంచెము ఆలోచింపఁగలవాఁ డైనను రావణునిప్రసంగము ఎంత అసంగతముగా నున్నదో గ్రహింపఁగలఁడు. అన్ని విషయములను వారితో సంప్రదించియే తాను చేయుచున్నట్లు, ఇప్పుడు మాత్రము కుంభకర్ణుఁడు ఆఱునెలలుగా నిద్రించుచుండుటవలన సీతావిషయమును చెప్పుటకు వీలు కలుగ లే దని చెప్పుచున్నాఁడు. ఇట్లు చెప్పుచు నతఁడు కుంభకర్ణునిపై అభిమానమును ప్రకటించుచు వారిని మోసగించుచున్నాఁడు ఈయభిమానప్రకటనమువలన కుంభకర్ణుఁడు తనయభిప్రాయము నిరాకరింపక, విభీషణు ననుసరింపక, తన కనుకూలింపవలయు నని యతనియభిప్రాయము. కాని అతఁడు చెప్పిన యీకారణము కేవలము అసత్యము. అతఁడు సీతను తెచ్చి ఇంచుమించుగా పదినెల లైనది ఆమెను తెచ్చునప్పుడు ఎవ్వరికిని తెలియకుండ రహస్యముగా ఒంటరిగా పోయెను. ఆఱునెలలక్రిందట నిద్రించుటకు పూర్వము ఒకదినము కుంభకర్ణుఁడు మేల్కొనియుండెను. ఆత

నితో చెప్పఁదలఁచుకొన్నచో అప్పుడే సభ చేసియుండవచ్చును. కావున అతనితో కూడ అతఁడు చెప్పఁదలఁచుకొన లేదనుట స్పష్టము. ఇప్పుడు లంక తగులఁబడి శత్రువులు సముద్రతీరమునకు చేరినతరువాత ఆపదలో తన్ను ఆదుకొనుఁడని వారిని అభ్యర్థించుచు అతఁడు అంగలార్చుచున్నాఁడు.

కార్యాలోచనము చేయుటకు వారికి పెద్దఱికము కట్టఁబెట్టినట్లు మాటాడుచు, "సీత నీయకుండ రామలక్ష్మణులను చంపునుపాయమును మాత్రము చెప్పఁడు" అని కార్యనిశ్చయమును కూడ అతఁడే చేసినాఁడు. శత్రువులు వచ్చిపడుచుండఁగా, సీత నీయకున్నచో, ఇంకఁ జేయఁదగిన దేమున్నది! యుద్ధమే కదా! అట్టియెడల కార్యాలోచనమే వ్యర్థము.

సీత సంవత్సరకాలము గడువు కోరిన దనుటయు అసత్యమే. ఆమహాపతివ్రత, "నా కొక్క సంవత్సరము గడువు ఇమ్ము. తరువాత నిన్ను పొందుదు" నని చెప్పునా? ఇతఁడే శాపములకు వెఱచి, ఆమెను బలాత్కరించినచో చత్తునేమో అనుభయముతో, ఎట్లైనను ఆమెను లోఁబఱచుకొనవలయు ననుతలంపుతో గడువు నిచ్చెను.

అసంగతమైన యగ్రజుని యీపరిదేవనమును విని కుంభకర్ణుఁడు మండిపడి యిట్లనెను. "మహారాజా! నీవు చేసినది యనుపమానమైన యకృత్యము. ఈపని చేయుటకు ముందే నీవు మాతో ఆలోచించియుండ వలసినది. ఎవఁడు రాజకార్యములను న్యాయముగ ఆప్తులతో ఆలోచించి యాచరించునో వాఁడు పశ్చాత్తాపమును పొందఁడు. నీవు అనాలోచితముగా పెద్ద యకార్యమును ఆరంభించితివి. విషమిశ్రితమైన యామిషమువలె అప్పుడే రాముఁడు నిన్ను సంహరింపకుండుటు నీ యదృష్టము. ఎట్లైన నేమి నీవు ఆరంభించిన యీవిషమకార్యమును నేను చక్కఁజేయుదును. శత్రసూర్యులు గాని కుబేరవరుణులు గాని

ఎవరు వచ్చినను నీశత్రువుల నందఱను నేను సంహరింతును. రాముఁ డొకబాణము నేసి రెండవబాణమున నన్ను హతుని గావించులోపలనే నేను వానిరక్తమును త్రావుదును. కావున ఊరడిల్లుము.''

శ్లో॥ సర్వ మేత న్మహారాజ కృత మప్రతిమం తవ।
విధీయేత సహాస్మాభి రాదా వే వాస్య కర్మణః॥ 29

శ్లో॥ త్వ యేదం మహ దారబ్ధం కార్య మప్రతిచింతితమ్।
దిష్ట్యా త్వాం నావధీ ద్రామో విషమిశ్ర మి వామిషమ్॥ 34

యుద్ధ—సర్గ—12

అన్నదమ్ము లిరువురును శూర్పణఖావిషయమును ప్రస్తావింప కుండుట గమనింపఁదగియున్నది. శూర్పణఖ రాముని కోరుట, ఆమెను రాముఁడు నిరాకరించుట మొదలగువిషయములు అప్పటికే లంకయందు ఇంటింటికి ప్రసరించియుండును. ఇంద్రజిత్తు మరణించినతరువాత రాముఁడు గాంధర్వాస్త్రమున ఎంతోమంది రాక్షసులను అల్పకాలమున సంహరింపఁగా, రాక్షసస్త్రీలు గుంపులు కూడి శూర్పణఖావిషయమును చెప్పుకొనుచు ఆమె లోకవధ్యురా లని; ఆమెవలననే యింత విపత్తు కలిగిన దని విలపించినారు. అందువలన ప్రతియింటను శూర్పణఖా విషయమును చెప్పుకొనుచునే యుండి రని గ్రహింపవలసియున్నది. అదియునుగాక ఆమెవిషయమును పైకిఁ దెచ్చినచో మహారాజసోదరికి అంత అవమానము జరిగినప్పుడు దండయాత్రచేసి శత్రువుల నెందు లకు దండింపలేదు, అను ప్రశ్న పైకి వచ్చును. అందువలన వారు శూర్పణఖావిషయమును ప్రస్తావింపలేదు.

కుంభకర్ణుఁడు పరస్త్రీని అపహరించుట తప్పన లేదు. అంత అపాయకరమైన విషయమును తనతో ముందుగా చెప్ప లే దనుటయే ఆతనికోపమునకు కారణము. కావున అతఁడు ధర్మబుద్ధితో అన్నను మందలింప లేదు.

"నీవు చేసినది యనుపమానమైన యకృత్యము" అని తమ్ముఁడు తన్ను నిండుసభలో మందలించినంతనే రావణుఁడు సమాధానము చెప్పలేక క్రోధముతో నిశ్వసింపఁజొచ్చెను. ప్రభువుయొక్క దుస్థితి గమనించి మహాపార్శ్వుఁడు ప్రియముగా ఇట్లనెను. "మహారాజా! అడవిలో తిరిగి తిరిగి తేనెను సంపాదించి త్రావకున్నవానివలె సీత నేల బలాత్కరించి యనుభవింపవు? నిన్ను కాదనువాఁ డెవఁడు? శత్రువులు వచ్చినప్పుడు కుంభకర్ణుఁడు ఇంద్రజిత్తు మొదలుగా మేమందరము వారిని సంహరింతుము." ఆమాటలకు రావణుఁ డెంతయు సంతోషించి యిట్లనెను. "మహాపార్శ్వ! నీవు చెప్పినది నిజమే. కాని పూర్వ మొకప్పుడు పుంజికస్థల అనునప్సరస బ్రహ్మభవనమునకు పోవుచుండఁగా చూచి ఆమెను బలాత్కరించి రమించి వివస్త్రను గావించితిని. అది యెట్లో బ్రహ్మదేవునకు తెలిసెను. నేను ఆయనను జూచుటకు పోయినప్పుడు ఆయన నన్ను జూచి, 'ఇఁకనుండి పరస్త్రీని బలాత్కరింతు వేని నీతల నూఱు వ్రక్క లగును' అని శపించెను. అందువలన నేను సీతను బలాత్కరించుటకు జంకుచున్నాను. నన్ను కాదనువాఁ డెవఁడు? నాశక్తి నెఱుంగక రాముఁడు వచ్చుచున్నాఁడు. వానిని నిర్జింతును."

రంభవిషయమున నలకూబరుఁడు శపించుట ముందు జరిగి తరువాత బ్రహ్మ శపించుట సంభవించె నని గ్రహింపవలసియున్నది. అట్లయినను నలకూబరుని శాప ముండఁగా రావణుఁడు పుంజికస్థల నెట్లు బలాత్కరింపఁగలిగెను? శాపముల ప్రభావము ఇచ్చినవారితపస్సామర్థ్యము ననుసరించి యుండును. అల్పమైనతపస్సు కలవాఁడు ఇచ్చిన శాపము తపస్సుచేత అధికుఁడైనవానియందు పనిచేయదు. ఈకారణముచేతనే భృగుమహర్షి తొందరపడి విష్ణుదేవుని శపించి తపస్సుచేత తనకన్న అధికుఁడైన యాదేవుఁడు తపశ్శక్తిచే ఆశాపమును నిరాకరించు

నేమో యని, అట్లయినచో తనమాట అసత్య మగు నని భయపడి, ఆయననుగూర్చి తపస్సు చేసి తన శాపమును యథార్థ మగునట్లు చేయు మని ప్రార్థించెను. కావున అల్పతపస్కుఁడైన నలకూబరుని శాపము మహాతపస్సు చేసి బ్రహ్మచే ఈశ్వరునిచే వరములను పొందిన రావణునియందు ప్రవర్తింపలేకపోయె నని గ్రహింపవలసియున్నది. నలకూబరునిశాపమునకు అతఁడు భయపడకపోయినను బ్రహ్మదేవుని శాపమునకు మాత్రము భయపడుచునేయుండెను. బ్రహ్మ శపించిన నాఁటినుండియు అతఁడు పరస్త్రీలను బలాత్కరింపక అప్పటికి సంపాదించిన స్త్రీలతో తృప్తిపడియుండె నన్నమాట. అందువలననే అతఁడు నలకూబరుని శాపమును లెక్కపెట్టక బ్రహ్మశాపమునే ప్రస్తావించెను.

ఈపుంజికస్థలయే అంజనాదేవిగా జన్మించి కేసరికి భార్యయై వాయుదేవునివలన హనుమంతుని కని కుమారునిమూలమున రావణునిపై పగఁదీర్చుకొనె ననుట స్పష్టము.

మహారాజు నిండుసభలో పరస్త్రీని బలాత్కరించుటను గూర్చి నిస్సంకోచముగా ప్రసంగించుట, కుంభకర్ణుఁడు దానిని నీచ మని గర్హింపకుండుట గమనించినచో ఆరాక్షసులు భోగపరాయణులై సాధారణమైన ధర్మసంస్కారమునుండి ఎంతగా దిగజాఱియున్నారో వ్యక్తమగుచున్నది.

రావణునిప్రసంగమును కుంభకర్ణుని గర్జనములను విని విభీషణుఁ డిట్లనెను. "వానరులు వచ్చి లంకను ఆక్రమింపకముందే, రామబాణములు రాక్షసశీర్షములను హరింపకముందే సీతను రామున కొసంగుము. మహాపార్శ్వ మహోదరులు గాని కుంభకర్ణేంద్రజిత్తులు గాని రాము నెదుర్కొనఁజాలరు. నీవు ఎక్కడికి పోయి ఎవనిని శరణుఁజొచ్చినను రాముని బాణములనుండి తప్పించుకొనఁజాలవు."

"దేవదానవులవలననే ఎప్పుడును భయములేని మనకు నరుని వలన భయ మేమి?" అని ప్రహస్తుఁ డనెను.

విభీషణుఁ డిట్లనెను. "ధర్మప్రధానుఁడై మహారథుఁడైన రాముని ఈరాజు మొదలుగా మీ రెవ్వరును మార్కొనఁజాలరు. మీ రందఱును రాజునకు మిత్రురూపమున శత్రువులవలె అహితమును బోధించుచున్నారు. హితమును కోరువారు జుట్టుపట్టుకొని యైనను రాజును వినాశకరమైన మార్గమునుండి నివారింపవలె. నేను రెండుపక్షముల బలాబలములను విమర్శించి హితమును చెప్పుచున్నాను. రామునకు సీత నొసంగుటయే రాజునకు, లంకకు, రాక్షసుల కందఱకును హితము.

ఇంద్రజిత్తు ఇట్లనెను. "నీవు పిఱికివానివలె మాటాడుచున్నావు. మాకులమున నీవు తప్పఁబుట్టితివి. ఈకులమునందెల్ల శౌర్యధైర్యాది హీనుఁడవు నీ వొక్కఁడవే కన్పించుచున్నావు. మనుష్యులనుగూర్చి చెప్పి మమ్ము బెదిరింతువేమి? మహేంద్రునంతవాఁడు నాచే బంధింపఁబడినాఁడు. రామునిలెక్క యేమి?"

విభీషణుఁడు, "నీవు బాలుఁడవు; అపక్వబుద్ధివి. నీవు రాజునకు పుత్త్రరూపమున నున్న శత్రుఁడవు. రాజునకు ఇట్టి వినాశకరమైన యాలోచనమును చెప్పుచున్న నీవు వధ్యుఁడవు. నిన్ను ఈమంత్రాలోచనసభకు రానిచ్చినవాఁడు కూడ వధ్యుఁడే." అని యింద్రజిత్తును తిరస్కరించి రావణునితో ఇట్లనెను. "అన్నా! నామాట వినుము: వివిధవస్త్రాభరణరత్నాదులతో సీతను తీసికొనిపోయి రామున కొసంగి అభయమును వేఁడుము. అట్లయినచో అందఱము దుఃఖదూరులమై యుండఁగలము."

ఇక్కడ పదునాల్గవ పదునైదవ సర్గలు విశేషవృత్తములలో రచింపఁబడియున్నవి. పదునాఱవసర్గ రావణునియాగ్రహముతో ఆరంభ

మగుచున్నది. కథాసందర్భదృష్టితో ఈరెండుసర్గలలోనివిషయము ఆవశ్యకమే. ఈరెండుసర్గలలోనివిషయము లేకున్నచో రావణుని యాగ్రహమునకు కారణము కానరాదు. ఇక్కడ గ్రంథము శిథిలము కాఁగా ఎవరైనను పూరించియుండవచ్చును.

విభీషణుఁడు తన్ను మందలించుచున్నను రావణుఁడు సహించెను కాని కుమారుని ధిక్కరించుటను సహింపఁజాలకపోయెను. అతఁడు మండిపడి విభీషణు నిట్లు ధిక్కరించెను. "క్రుద్ధమైన పన్నగముతో నైన కూడియుండవచ్చును గాని మిత్రునివలె కన్పించు శత్రువుతో కూడి యుండరాదు. దాయాదులస్వభావము నాకు తెలియనిది కాదు. జ్ఞాతులు ఉన్నతుని శూరుని జూచి యసూయతో పరిభవింతురు; వానికి ఆపదలు కలిగినప్పుడు ఆనందింతురు. పూర్వము పాశహస్తులైన మనుష్యులను చూచి ఏనుఁగు లిట్లు తమలో అనుకొనెను. 'అగ్ని గాని శస్త్రములు గాని పాశములు గాని భయంకరములు గావు. స్వార్థపరులైన జ్ఞాతులే భయంకరులు. వారే మనలను బంధించుటకు శత్రువులకు ఉపాయము నుపదేశింతురు.' సకలభయములలో జ్ఞాతిభయము మిగుల కష్టమైనది. గోవులయందు సంపద, స్త్రీలయందు చాపల్యము, బ్రాహ్మణునియందు తపస్సు, జ్ఞాతులవలన భయము ఉన్నది. నేను లోకసత్కృతుఁడనై యున్నతుఁడనై యుఁడుట నీ కసహ్యముగా నున్నది. తామరాకులయందు నీరువలె అనార్యులయందు సౌహార్దము సంబద్ధమై యుండదు. గజస్నానము వలెనే అది తుదకు రజోధ్వస్త మగును. నీవలె మఱియొకఁడు ఎవఁడేని మాటాడియున్నచో ఈక్షణమే హతుఁడై యుండెడి వాఁడు. ఛీ! ఛీ! కులపాంసన!"

శ్లో॥ శ్రూయన్తే హస్తిభి ర్గీతాః శ్లోకాః పద్మవనే పురా।
పాశహస్తా న్నరాన్ దృష్ట్వా శృణుష్వ గదతో మమ॥ 6

శ్లో॥ నాగ్ని ర్నాన్యాని శస్త్రాణి న నః పాశా భయావహాః।
ఘోరాః స్వార్థప్రయుక్తాస్తు జ్ఞాతయో నో భయావహాః॥ 7

శ్లో॥ ఉపాయ మేతే వక్ష్యన్తి గ్రహణే నాత్ర సంశయః।
కృత్స్నా ద్భయాత్ జ్ఞాతిభయం సుకష్టం విదితం చ నః॥ 8

శ్లో॥ విద్యతే గోషు సంపన్నం విద్యతే జ్ఞాతితో భయమ్।
విద్యతే స్త్రీషు చాపల్యం విద్యతే బ్రాహ్మణే తపః॥ 9

యుద్ధ–సర్గ–16

"మానిషాద" అని మొదలగుచున్నశ్లోకమునకు పూర్వము లోకమున శ్లోకము లున్నవా? సూక్తులు నీతివాక్యములు విశిష్టరూపమున జనుల వ్యవహారములో వాల్మీకికి ముందు ఉండవచ్చును. వాలితో మాటాడుచు రాముఁ డుదాహరించిన మనుగీతములైన శ్లోకములు, సుందరకాండలో సీత యుదాహరించిన "కళ్యాణీ బత గాథేయమ్" అని మొదలగు శ్లోకము. విభీషణశరణాగతిసందర్భమున రాముఁ డుదాహరించు కండుమునిప్రోక్తమైన గాథయును, ఇట్టివే. అప్పటికి మనుస్మృతి కూడ ఇప్పు డున్నట్లు శ్లోకరూపగ్రంథముగానున్నదా? ఇప్పటిశ్లోకరూపమున మనుస్మృతి యుండియుండదు. కాని వేదములలో ఉన్నవచనములవలె, జనవ్యవహారముకన్న విశిష్టమైన వచనరీతిలో మనుస్మృతియే కాక జ్యోతిశ్శాస్త్రాదిగ్రంథములు కూడ ఉండవచ్చును. "త దేష శ్లోకో భవతి" అను మొదలగుస్థలములందు ఉపనిషత్తులలో "తత్–తత్ర ఏతస్మిన్నర్థే, ఏష శ్లోకః మన్త్రో భవతి" అని శంకరులవారు అర్థము చెప్పియున్నారు. (బృహదారణ్యక–అధ్యాయ–4 బ్రాహ్మణము2–మంత్రము–3) "పుణ్యశ్లోకో నలో రాజా" ఇత్యాది సందర్భములలో శ్లోక శబ్దమునకు ప్రశంస లేక కీర్తి యర్థమగును. నారదుఁడు సనత్కుమారునియొద్దకు ఆత్మవిద్యకొఱకు పోయినప్పుడు

తాను ఎన్నో శాస్త్రములను అధ్యయనము చేసినట్లు ఆయనతో చెప్పిన విధముగా ఛాందోగ్యోపనిషత్తునందు కలదు. అవి యన్నియు శ్లోక రూపగ్రంథములై యుండు నని తలంప నక్కఱ లేదు. అవి సూత్ర వివరణవ్యాఖ్యాప్రాయములైన వచనగ్రంథములుగా నుండి యుండును. వాల్మీకిరామాయణము ప్రచారములోనికి వచ్చినతరువాత ఆశాస్త్ర గ్రంథము లనేకములు ధారణసౌలభ్యముకొఱకు శ్లోకగ్రంథములుగా రచింపఁబడియుండును. నేఁటిభాషలలో సామెతలవలె విశిష్టములై సూత్రప్రాయములుగా నున్న సూక్తులను జనులు **గాథ** లని శ్లోకము లని వ్యవహరించుచు నుందురు. ఏవో గేయములను వ్రాయుచున్న వానిని చూచి కూడ పామరులు "ఆయన కవిత్వము కట్టుచున్నాఁడు" అని చెప్పుచుందురు. కావున సూక్తులు కూడ అవిధముగా జనవ్యవహారమున గాథలుగా శ్లోకములుగా ప్రసిద్ధములై యుండవచ్చును. వానిని వాల్మీకి తనకావ్యపద్ధతియందు అనుష్టుప్పులుగా రూపొందించి యుండును. అందువలన అవి యన్నియు అంతకు పూర్వము ఈరూపముననే యున్న వని తలంప నక్కఱ లేదు.

నిండుసభలో రావణుఁడు గావించినధిక్కారమును సహింపక విభీషణుఁడు గదాపాణియై నలువురు మంత్రులతో కూడ అంతరిక్షమున కెగిరి ఇట్లనెను. "నీవు అన్నవు; పితృసమానుఁడవు. నీయిష్టము వచ్చినట్లు మాటాడుము. కాని నీవు ధర్మమును తప్పితివి. నీవు కాలవశుఁడవై నాహితమును గ్రహింపవైతివి. నీవు రామబాణహతుఁడవై నేలఁగూలుటను నేను సహింపఁజాలక హితవు చెప్పితిని. అది పరుషమైనచో మన్నింపుము. నేను నీధిక్కృతి నింక సహింపఁజాలను. పురమును నిన్ను సర్వథా రక్షించుకొనుము. నీకు స్వస్తి; నేను పోవుచున్నాను. నన్ను వదలి సుఖింపుము."

శ్లో॥ త న్మర్షయతు య చ్చోక్తం గురుత్వా ద్ధిత మిచ్ఛతా।
ఆత్మానం సర్వథా రక్ష పురీం చేమాం సరాక్షసామ్।
స్వ స్తి తేఽ స్తు గమిష్యామి సుఖీ భవ మయా వినా॥ 25

యుద్ధ–సర్గ–16

విభీషణునియీసహనమునకు రావణుని దౌష్ట్యమును పోల్చినచో ఇద్దఱవ్యక్తిత్వములును స్పష్టము లగును. నిండుసభలో అక్షకుమారుఁడు చనిపోయి రెండురోజులు కూడ గడవకుండఁగనే, ఇంద్రజిత్తు వంటికుమారులసమక్షమున, 'సీతకొఱకై నేను తపించుచున్నా' నని, మహాపార్శ్వుఁడు చెప్పిన బలాత్కారరతిని శాపభయమున మానుకొంటి నని చెప్పఁగలుగుచున్నరావణుఁడు ఎంత నీచుఁడో స్పష్ట మగుచున్నది. అట్టి యగ్రజుఁడు తన్ను నిండుసభలో తీవ్రముగ ధిక్కరించినను విభీషణుఁడు అన్నను తిట్ట లేదు; కుంభకర్ణునివలె కూడ తీవ్రముగ విమర్శింపలేదు. మఱియొకఁడైనచో రావణునిశీలదోషముల నన్నింటిని ఏకరువుపెట్టియుండెడివాఁడు. శాశ్వతముగా అన్నను వీడ్కొని వచ్చునప్పుడు కూడ,అతఁడు "నీకు స్వస్తి" అనియే చెప్పివచ్చినాఁడు. ఇది యాతని ధర్మపరత్వమునకు సత్త్వస్థైర్యమునకు గొప్ప నిదర్శనము.

## 3. శరణాగతి

అన్నను పరుషముగ మందలించి విభీషణుఁడు ముహూర్తమాత్రమున లక్ష్మణునితో కూడియున్న రాముఁడున్నయెడకు వచ్చెను.

శ్లో॥ ఇత్యుక్త్వా పరుషం వాక్యం రావణం రావణానుజః।
ఆజగామ ముహూర్తేన యత్ర రామ స్సలక్ష్మణః॥ 1

యుద్ధ–సర్గ–17

విభీషణుని యీ వర్తనము ధర్మసమ్మతమా యను ప్రశ్న చిరకాలముగా చర్చింపఁబడుచునే యున్నది. గోవిందరాజస్వామి శరణాగతిలక్షణమును విభీషణుని వర్తనములోని సామంజస్యమును చక్కఁగా నిరూపించెను. ఆయన గావించిన ప్రతిపాదనమును ఇట్లు సంగ్రహముగా గ్రహింపవచ్చును—ఆశ్రయింపఁదగిన మహాపురుషుని విషయమున అనుకూల్యమును సంపాదించుటకై సంకల్పము అందులకు ప్రతికూలమైనదానిని వర్జించుట, ఆ మహాపురుషుఁడు తన్ను రక్షింపఁగలఁడనువిశ్వాసము, "నీవే నన్ను రక్షింపవలయు" నని ఆయనను రక్షకునిగా వరించుట, తన సర్వస్వమును ఆయనకు అధీనము కావించుట, "నావలన ఏమియు కాదు, నాభార మంతయు నీవే వహింపవలయును" అని కృపణత్వమును పొందుట—అని శరణాగతియందు ఆ అంశములు కలవు.

శ్లో॥ ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్।
రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వవరణం తథా।
ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతిః॥ 4

ఖరాదిదుష్టశిక్షణమువలన సుగ్రీవాదిశిష్టరక్షణమువలన శ్రీరామచంద్రుఁడు పరమేశ్వరుఁడే యని గుర్తించి విభీషణుఁడు ఆయన విషయమున ఆనుకూల్యమును సంపాదించుటకై సంకల్పించి అన్నకు అనేకవిధముల హితోపదేశమును గావించెను. అన్న శ్రీరామునివిషయమున ఏమాత్రము ప్రాతికూల్యమును వీడకుండుటవలన, "ఇంకొకఁడు ఇట్లు మాటాడినచో బ్రతికియుండఁడు" అని తన్ను మరణాంతముగ ధిక్కరించుటవలన విభీషణుఁడు శ్రేయస్సునకు ప్రతికూలుఁడైనవానిని వర్జించెను. శ్రీరాముఁడు తన్ను తప్పక రక్షింపఁగలఁడను మహావిశ్వాసముతో విభీషణుఁడు, అన్నచే పరిత్యక్తుఁడైన మఱుముహూర్తముననే శ్రీరామునియొద్దకు వచ్చెను. ఆయననే రక్షకునిగా వరించి తనసర్వస్వము నాయనకు అధీనముఁగావించి "నాభార మంతయు ఇంక

నీదే" అని విభీషణుఁడు కార్పణ్యమును పొందెను. ఇట్లు విభీషణుఁడు సమగ్రమైన శరణాగతిని గావించెను.

ఏపరిస్థితియందైనను పూజ్యుఁడైన యగ్రజుని ఆపత్కాలము నందు వదలుట ధర్మ మగునా? విశ్రవసుఁడు కైకసికి ఇచ్చినవరము చేత, బ్రహ్మదేవుఁడు విభీషణునకు ఇచ్చినవరముచేత కూడ విభీషణుఁడు ధర్మవర్తనుఁడై యుండవలెఁగదా! అట్టివాఁడు పితృసముఁడైన జ్యేష్ఠభ్రాతను బాల్యమునుండి పెంచిపెద్దచేసినవానిని శత్రువు సన్నిహితుఁడై యుండఁగా ఎట్లు వదలిపెట్టెను? వదలిపెట్టినను వానికి శత్రువైన రాము నెట్లు ఆశ్రయించెను? శత్రువును ఆశ్రయించినను అన్నయొక్క పదవి నెట్లు అభిలషించెను? రాజ్యమును అభిలషించినను అన్నయొక్క వధకు ఎట్లు సహాయుఁ డయ్యెను?

విభీషణుఁడు స్వార్థపరుఁడై తనకు తానుగా అన్నను పరిత్యజింపలేదు. అన్నయొక్క హితమును కోరి, రామునకు సీత నిమ్మని కర్తవ్యమును బోధించి, ఈయకున్నచో సర్వనాశ మగు నని నిరూపించి, ఆపత్కాలమున అన్నను వదలె నను నపకీర్తికి అవకాశము లేకుండ, పరుషముగానైనను ఎంతవఱకు చెప్పఁదగునో అంతవఱకును కర్తవ్యలోపము లేకుండ చెప్పి, అతఁడు తన్ను మరణాంతముగా ధిక్కరించిన తరువాతనే విభీషణుఁడు అతనిని వదలిపెట్టెను. తమ్ముఁడు నిండు సభలో తన్ను పరుషముగా మాటాడుటచేతనే కదా రావణుఁడు అతనిని ధిక్కరించెను! తమ్ముఁ డట్లు మాటాడవచ్చునా? విభీషణుఁడు, కుంభకర్ణునివలె, రావణుని శీలమును విమర్శించి దోషోద్ఘాటనము చేయలేదు; కేవలము అతనికి సంభవింపనున్న వినాశమునుగూర్చియే ప్రబోధించెను. రాజనీతి ననుసరించి తమపక్షముయొక్క దౌర్బల్యమును పరపక్షముయొక్క బలాధిక్యమును నిరూపించి సంధిచేసికొనుటయే హితమని విభీషణుఁడు దృఢముగా చెప్పెను. బాలుఁడైన యింద్రజిత్తు

అహితమునే హితమైనట్లు ఉద్ఘాటించునప్పుడు పినతండ్రిగా వానిని శిక్షించుటకై విభీషణుఁడు ధిక్కరించెను. ఇట్లు యథార్థమైన హితమును విభీషణుఁడు చెప్పుచుండుటయే, పైత్యరోగికి పంచదార చేదైనట్లు, రావణునకు పరుష మయ్యెను హితమును చెప్పఁబూనినప్పుడు జ్యేష్ఠత్వము ప్రయోజకము కాదు. హితమును బోధించునప్పుడు పెద్దవానిని కూడ చిన్నవానినిగానే భావించి చెప్పవలె. ''అంగిరసుఁడు తనపితరులకు అధ్యాపనము గావించుచు వారిని 'పుత్త్రకులారా!' అని సంబోధించెను. అజ్ఞుని బాలుఁ డని, మంత్రము నొసంగువానిని తండ్రి యనియు చెప్పుదురు" అని మనువు చెప్పెను.

శ్లో॥ పిత్రా నధ్యాపయామాస శిశు రాంగిరసః కవిః।
పుత్త్రకా ఇతి హోవాచ జ్ఞానేన పరిగృహ్యతాన్॥
(మనుస్మృతి–అధ్యా–2–శ్లో–153)

అజ్ఞం హి బాల మిత్యాహుః పితే త్యేవ చ మంత్రదమ్॥
(గో.టీక–యుద్ధ–సర్గ–17–శ్లో–1)

కావున అగ్రజునియందలిగౌరవముకన్న హితమును పరుషముగానైన బోధించుటయే ధర్మ మని గ్రహింపవలసియున్నది.

''గర్వితుఁడై కార్యాకార్యముల నెఱుంగక ధర్మమును తప్పి చరించుచున్నచో గురువు నైనను పరిత్యజింపవలయును'' అను స్మృతి ననుసరించి అత్యంతదుష్టుఁడైన యన్నను విభీషణుఁడు పరిత్యజించె నని కొందఱు చెప్పుదురు.

శ్లో॥ గురో రవలిప్తస్య కార్యాకార్య మజానతః।
ఉత్పథం ప్రతిపన్నస్య పరిత్యాగో విధీయతే॥
స్మృతి–?

వేదాంతవిద్యాగురువులు మాత్రము ఇట్లందురు. "బ్రహ్మదేవుని వరప్రసాదమున విభీషణుఁడు రాముని లోకానుగ్రహముకొఱకై యవతరించిన శ్రీమన్నారాయణునిగా నెఱిఁగెను. మందోదరివంటివారే యిట్లు తెలిసికొనిరి గదా! కావున తత్త్వజ్ఞానసంపన్నుఁడైన విభీషణుఁడు విశేషధర్మప్రాబల్యమును సామాన్యధర్మదౌర్బల్యమును గుర్తించి జేష్ఠానువర్తనరూపమైన సాధారణధర్మమును వీడి మోక్షపర్యవసాయియైన విశేషధర్మము నవలంబించెను. సకలధర్మములకు లక్ష్యము మోక్షమే. కొన్ని సాక్ష్యాత్సాధనములు కాఁగా, తక్కినవి పరంపరాసాధనము లగుచున్నవి. జ్యేష్ఠానువర్తనము అనుధర్మమునకు త్రివర్గఫలప్రాప్తిద్వారమున పరంపరగా పరమాత్మారాధనమున పర్యవసానమును పొందుటయే ఫలము. రామానువర్తనము సాక్షాత్పరమాత్మారాధన మగుటచే విశేషధర్మ మగుచున్నది. ఉభయవిధములైన ధర్మములకు విరోధము లేనప్పుడు రెండింటిని అవలంబింపవలసినదే. విరోధము ఏర్పడినప్పుడు సామాన్యధర్మమును వీడి విశేషధర్మమునే అవలంబింపవలె. కావుననే విభీషణుఁడు అగ్రజుని వీడకుండ రామానువర్తనము సంభవించు నేమో యని యథాశక్తి అన్నకు మాటిమాటికి హితోపదేశముఁ గావించెను. ఇంక ఏవిధముగానైనను అతఁడు రామవైరమును వదలఁడని నిశ్చితమైనతరువాత విభీషణుఁడు ఇంకను తాను అన్ననే అనుసరించియున్నచో ఆత్మవినాశకరమైన రామవైరము తనకును సంక్రమించు ననుభయమున సాక్షాన్మోక్షసాధనమైన రామానువర్తనరూపవిశేషధర్మమును అవలంబించె ననుట వలన ఆతనియందు కృతఘ్నత కల దను శంకకు అవకాశమే లేదు.

ఇతఁడు రాజ్యకాంక్షచే రాముని శరణుఁజొచ్చె ననుటయు సమంజసము కాదు. ఈతనియందు రాజ్యకాంక్ష కన్పించుట లేదు. శరణాగతిసమయమున "సతీసుతులను వదలి రాముని శరణమును

పొందుచున్నాను'' అని యితఁడు సంసారవిషయవైరాగ్యమును స్పష్టముగా వ్యక్తీకరించెను. తరువాత రామునిసన్నిధియందు విన్నపము చేసికొనునప్పుడు కూడ "నేను లంకను మిత్త్రులను ధనములను వీడి వచ్చితిని; నారాజ్యము జీవితము సుఖములును నీయధీనమై యున్నవి" అని యితఁడు సర్వపురుషార్థములను కలిగించుమహాత్మునిగా రాము నెఱింగి ఆశ్రయించుటకు వచ్చినట్లుగా చెప్పినాఁడు. అప్పుడు, ''రావణుని చంపి నిన్ను రాజును చేయుదు'' నని రాముఁడు చెప్పుట రాముని యనుగ్రహవిశేషమునే వ్యక్తీకరించును గాని విభీషణుని రాజ్యకాంక్షను సూచింపదు.

శ్లో॥ త్యక్త్వా దారాంశ్చ పుత్త్రాంశ్చ రాఘవం శరణం గతః॥ 16

యుద్ధ–సర్గ–17

శ్లో॥ పరిత్యక్తా మయా లంకా మిత్త్రాణి చ ధనాని చ। 15
భవద్గతం మే రాజ్యం చ జీవితం చ సుఖాని చ॥ 16

యుద్ధ–సర్గ–19

కాని హనుమంతుఁడు విభీషణునిగూర్చి, "రాజ్యమును గోరుచు నితఁడు బుద్ధిపూర్వకముగా నిచ్చటికి వచ్చియుండు" నని చెప్పెను. ఇట్లే రాముఁడు కూడ సుగ్రీవునకు నచ్చఁజెప్పుచు ''విభీషణుఁడు రాజ్యకాంక్షి'' అనెను. వీ రిరువురును లోకవృత్తమును రాజనీతిని అనుసరించి చెప్పిరే కాని, ఆతనితో మాటాడి ఆతనిహృదయము నెఱింగి చెప్పలేదు. ఆతఁడు రాజ్యమును కాంక్షించుచు వచ్చియుండవచ్చు నని వారు సందర్భమునుబట్టి యూహించి చెప్పిరి. అప్పటివఱకు వారి కాతనితో పరిచయము లేదు. అదియును గాక విభీషణుని హృదయమును గుర్తించుటకు ఆతనిమాటలకన్న ఆతనితో పరిచయములేని హనుమద్రాఘవులవాక్యములు ప్రమాణములు కావు.

శ్లో॥ ఉద్యోగం తవ సంప్రేక్ష్య మిథ్యావృత్తం చ రావణం।
వాలిన శ్చ వధం శ్రుత్వా సుగ్రీవం చాభిషేచితమ్।
రాజ్యం ప్రార్థయమాన స్తు బుద్ధిపూర్వ మి హాగతః॥ 64

యుద్ధ–సర్గ - 17

శ్లో॥ య స్తు దోష స్త్వయా ప్రోక్తో హ్యాదానేఽరిబలస్య చ।
తత్ర తే కీర్తయిష్యామి యథా శాస్త్ర మిదం శ్రుణు।
న వయం తత్కులీనా శ్చ రాజ్యకాంక్షీ చ రాక్షసః॥ 12

యుద్ధ–సర్గ - 18

విభీషణుని మాటలలో ధర్మమునందు అనురక్తి రామునియందు భక్తి ప్రధానముగా వ్యక్తమగుచున్నవి. శరణము కోరునప్పుడు అతఁడు, "నేను రావణుని తమ్ముఁడను అతనిచే అవమానింపఁబడితిని. సర్వభూతములకు శరణ్యుఁడవైన నిన్ను శరణుపొందితిని" అని చెప్పెను. రాముని గూర్చి సర్వభూతములకు శరణ్యుఁడవు అని చెప్పుట వలన విభీషణుఁడు రాముని పరాక్రమశాలియైన రాజమాత్రునిగా కాక పరమేశ్వరునిగా భావించుచున్నాఁ డని స్పష్ట మగుచున్నది. అప్పుడు "మాఅన్నను సంహరించి నాకు రాజ్యము నొసంగుము." అని విభీషణుఁడు అడుగలేదు. రాముఁడే స్వయముగా మీయన్నను సంహరించి నీకు రాజ్య మిత్తు" నన్నప్పుడు కూడ విభీషణుఁడు హర్షమును పొందక, "రాక్షసులయొక్క వధయందు లంకను జయించుటయందును యథాశక్తి సాయ మొనరింతును" అని మాత్రమే చెప్పెను. ఈమాటల యందు దుష్టశిక్షణ మను ధర్మకార్యమునందు అతనియొక్క కర్తవ్య దీక్షయే వ్యక్త మగుచున్నది; కాని రాజ్యకాంక్ష గోచరించుట లేదు.

శ్లో॥ అనుజో రావణ స్యాహం తేన చాప్యావమానితః॥
భవ న్తం సర్వభూతానాం శరణ్యం శరణాగతః॥ 4

శ్లో॥ రాక్షసానాం వధే సాహ్యం లంకాయా శ్చ ప్రధర్షణం।
కరిష్యామి యథాప్రాణం ప్రవేక్ష్యామి చ వాహినీమ్॥ 23
యుద్ధ-సర్గ-19

విభీషణుఁడు రాక్షసరాజ్యమును కాంక్షతోకన్న ధర్మకర్తవ్య దృష్టితోనే స్వీకరించె నని రాముని మహాప్రస్థానసందర్భమున వ్యక్త మగుచున్నది. అప్పుడు రాముఁడు, "ప్రజ లున్నంతకాలము లంకయం దుండి ప్రజలను ధర్మమును రక్షించుచుండుము. ఇది నాశాసనము" అని విభీషణుని నియమించుట గమనింపవలసియున్నది. రాముఁ డిట్లు శాసించె నన్నచో విభీషణుని విరక్తి యెంత గాఢ మైనదో యూహింప వచ్చును,

శ్లో॥ యావ త్ప్రజా ధరిష్యన్తి తావ త్త్వం వై విభీషణ।
రాక్షసేంద్ర మహావీర్య లంకాస్థ స్త్వం ధరిష్యసి॥ 24

శ్లో॥ శాసిత శ్చ సఖిత్వేన కార్యం తే మమ శాసనమ్।
ప్రజా స్సంరక్ష ధర్మేణ నోత్తరం వక్తు మర్హసి॥ 26
ఉత్తర-సర్గ-108

ఈవిషయమున విభీషణుఁడు లక్ష్మణునివంటివాఁడే. "నేను మహారాజును తండ్రినిగా భావించుట లేదు. నాకు స్వామి సోదరుఁడు బంధువు తండ్రియు రాఘవుఁడే" అని లక్ష్మణుఁడు కూడ శరీర మను నుపాధికి జనకుఁడైన దశరథుని వీడి నిరుపాధికముగా సకలవిధముల బంధువైన రామునే ఆశ్రయించి, "నీకు ముందుగా నేను నడచెదను; నీమార్గమును అకుతోభయ మగునట్లు చేయుదును; నీవు మేల్కొని యున్నప్పుడు నిద్రించుచున్నప్పుడు సకలోపచారములను గావింతును" అని పరిచర్యాఫలమునే ప్రార్థించుచు రాముని పాదములను పట్టుకొనెను. అనఁగా శరణాగతి చేసె నన్నమాట. అట్లే విభీషణుఁడు కూడ శరీరో పాధికి సంబంధించినసోదరుని వదలి కైంకర్యాపేక్షతో సర్వవిధముల

సహజబంధువైన రాముని శరణము నొందెను. కావున విభీషణుని యందు అధర్మమును శంకింప వీలులేదు.

శ్లో॥ అహం తావ న్మహారాజే పితృత్వం నోపలక్షయే।
భ్రాతా భర్తా చ బంధు శ్చ పితా చ మమ రాఘవః॥ 31

అయోధ్యా–సర్గ–58

శ్లో॥ స భ్రాతు శ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః। 2

శ్లో॥ అగ్రత స్తే గమిష్యామి పంథానం తవ దర్శయన్। 25

శ్లో॥ అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపత శ్చ తే॥ 27

అయోధ్యా–సర్గ–31

అట్లయినచో నాగపాశబంధనసమయమున విభీషణుఁడు, "నేను ఏయిరువురివీర్యము నాశ్రయించి ప్రతిష్ఠ నాకాంక్షించితినో వా రిరువురు సోలియున్నారు. నష్టరాజ్యమనోరథుఁడనై నేను బ్రతికియుండియు మృతుఁడ నైతిని; శత్రువైన రావణుఁడు ప్రతిన నిర్వహించుకొని సకాముఁడై యున్నాఁడు" అని రాజ్యనాశమునుగూర్చి విలపించుట యెట్లు సంభవించినది? ఇందులో ప్రతిష్ఠాశబ్దము కైంకర్యపరమే; రాజ్య శబ్దము కూడ కైంకర్యసామ్రాజ్యపరమే.

శ్లో॥ యయో ర్వీర్య ముపాశ్రిత్య ప్రతిష్ఠా కాంక్షితా మయా।
తా వుభౌ మమ నాశాయ ప్రసుప్తౌ పురుషర్షభౌ॥ 18

శ్లో॥ జీవ న్నపి విపన్నోఽస్మి నష్టరాజ్యమనోరథః।
ప్రాప్తప్రతిజ్ఞ శ్చ రిపు స్సకామో రావణః కృతః॥ 19

యుద్ధ–సర్గ–50

ఇది గోవిందరాజస్వామి విభీషణునివర్తనమును సమర్థించిన పద్ధతి.

ఇంకను మఱికొన్ని విశేషములను మనము గమనింపవచ్చును. విభీషణుఁడు రావణుని విడిచిపెట్టె ననుట యథార్థము కాదు. రావణుఁడే విభీషణుని నిండుసభలో ధిక్కరించి "కులపాంసన!" అని పేర్కొని, "ఇట్లు ఇంకొకఁడు మాటాడినచో బ్రతికియుండఁడు, నీవు మిత్రరూపముతో నున్న శత్రుఁడవు" అని తిట్టెను. ఇట్లనుటవలన రావణుఁడు, "నీ వింకను ఇట్లే మాటాడుచున్నచో నిన్ను చంపుదును," అని స్పష్టమొనర్చినాఁడు. కుటుంబవిషయములందు వధింతు ననుట పరిత్యాగముతో సమానమే. ఇది మఱియొక సందర్భమున దృఢముగా వ్యక్తమగుచున్నది. రావణుఁడు కుంభకర్ణ మరణానంతరము విలపించుచు "ధార్మికుఁడైన విభీషణుని పరిత్యజించినందులకు ఫల మిట్లు గలిగినది" అని అనుకొనెను. దీనినిబట్టి రావణుఁడే విభీషణుని పరిత్యజించె ననుట స్పష్టము. విభీషణుఁడే అన్నను వీడిపోయినచో, ఆపరిత్యాగమునకు కర్త విభీషణుఁడే యగును. అప్పుడు ఆపాపఫలమును అనుభవింపవలసినవాఁడు కూడ అతఁడే యగును. ఆపాపఫలము తనకు కలిగినట్లు రావణుఁడు భావించుటవలన పరిత్యాగమునకు కర్త రావణుఁడే అని గ్రహింపవలసియున్నది.

శ్లో॥ తస్యాయం కర్మణః ప్రాప్తో విపాకో మమ శోకదః,
యన్మయా ధార్మికః శ్రీమాన్ స నిరస్తో విభీషణః॥ 23

యుద్ధ–సర్గ–68

"రావణుఁడే విభీషణుని పరిత్యజించినను, విభీషణుఁడు అన్నయొక్క చావును గోరుచు రాముని చేర నక్కఱ లేదు; రాజ్యాపేక్షయే లేనిచో వనమునకు పోయి తపస్సు చేసికొనుచు నుండవచ్చునుగదా!" అని కొందఱు తలంపవచ్చును. అతఁడు ఆపరిస్థితిలో తపస్సు చేసికొనుటకై పోఁదలంచుట యుక్తము కాదు. అతఁడు చిన్నప్పటి నుండియు రావణునితోఁగూడి శస్త్రాస్త్రవిద్యలలో ఉత్తీర్ణుఁడై క్షత్రియ

వృత్తినే యవలంబించెను ధర్మాధర్మములకు సంఘర్షణము సంభవించినప్పుడు ధర్మపక్షమునకు సాయము చేయక ఉపేక్షించుట సమర్థుఁడైన క్షత్త్రియునకు ధర్మము కాదు. అంతకు పూర్వము అతఁడు రావణుని జైత్రయాత్రలలో పాల్గొనకుండుట, రావణుఁడు కావించిన పరదారాపహరణమును గర్హించియుండుట గమనింపఁదగియున్నది. ఇప్పుడు అన్నచే పరిత్యజింపఁబడినతరువాత అతఁడు స్వతంత్రుఁడయ్యెను. స్వతంత్రుఁడైన విభీషణుఁడు ధర్మపక్షమునకు సాయ మొనర్చుటయే క్షత్రియుఁడుగా తనకు ధర్మకర్తవ్య మని నిశ్చయించుకొని రాముని చేరెను. కావున విభీషణుఁనివర్తనమునకు ధర్మకర్తవ్యమే ప్రధానలక్షణము; రాజ్యఫలము అనుషంగికము. అధార్మికుఁడైన యన్న నిగ్రహింపఁబడినతరువాత తాను రాజై పరిపాలింపవచ్చు నని అతఁ డనుకొనుట అధర్మము కాదు. తల్లిదండ్రులకు శ్రద్ధతో సేవచేసిన వాఁడు వారియనంతరము వారియాస్తి తనకు లభింపవలయు నని పుత్రుఁ డనుకొన్నచో అధర్మ మెట్లు కాదో, ఇదియును అట్లే అధర్మము కాదు. "భూతములయందు ధర్మమునకు విరుద్ధము కాని కామము నాస్వరూపమే" అని భగవంతుఁడు అర్జునునకు చెప్పినట్లుగా, విభీషణునకు రాజ్యమునందు కాంక్ష యున్నచో, అది భగవత్స్వరూపమే అగును.

శ్లో॥ ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ॥ 11

భగవద్గీత-అధ్యా-7

అట్టికోరిక యున్నప్పుడు దాని కాలంబనముగా నున్నరామలక్ష్మణులను దుస్థితిలో చూచి అతఁడు దుఃఖించుట సహజము. రాముఁడు కూడ జటాయువు మరణించినప్పుడు, "రాజ్యమునుండి భ్రంశము వనమున నివాసము సంభవించినది" అని విలపించినాఁడు. అంతమాత్రమున కైకయందువలె రామునియందు రాజ్యలోభ మున్న దని శంకింపవచ్చునా?

విభీషణుని విషయమున కూడ ఇది యొక విచారమాత్రమే కాని రాజ్య లోభరూపమైన దోషము కాదు. కావున విభీషణుని వర్తనమున దోష మును శంకించుటకు వీలు లేదు.

విభీషణుఁడు నలువురు మంత్రులతో మేరుశిఖరమువలె ఆకాశ మార్గమున వచ్చుచుండఁగా చూచి సుగ్రీవుఁడు హనుమదాదులతో. "ఇతఁ డెవఁడో రాక్షసుఁడు సాయుధుఁడై మనపైకి వచ్చుచున్నాఁ" డనెను. వెంటనే వానరులు వృక్షములను గైకొని వానిని మార్కొను టకు అనుమతి నిమ్మనఁజొచ్చిరి. వారిని చూచి విభీషణుఁడు ఆకాశ మందే నిలిచి యెలుఁగెత్తి యిట్లనెను. "నేను విభీషణుఁడను; రావ ణునిసోదరుఁడను. సీతను రామున కిమ్మని అతనికి హితోపదేశమును గావించితిని. అతఁడు నామాట వినక నన్ను దాసునివలె అవమా నించెను. నేను భార్యాపుత్రులను వీడి రాఘవుని శరణము నొందు చున్నాను. మహాత్ముఁడు సర్వలోక శరణ్యుఁడు నైన రామునకు విభీషణుఁడు శరణార్థియై వచ్చె నని నివేదింపుఁడు."

శ్లో॥ త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః। 16

శ్లో॥ నివేదయత మాం క్షిప్రం రాఘవాయ మహాత్మనే।
సర్వలోకశరణ్యాయ విభీషణ ముపస్థితమ్॥ 17

యుద్ధ–సర్గ–17

సుగ్రీవుఁడు త్వరితుఁడై రాముని యొద్దకు పోయి యిట్లు చెప్పెను. "అనుకొనకుండ శత్రువు మనసైన్యమున ప్రవేశించు చున్నాఁడు. వానిని చేరనిచ్చినచో గుడ్లగూబ కాకులను సంహరించు నట్లు వాఁడు మనలను హత మొనర్చును. రాక్షసులు కామరూపులు; మాయావులు, అంతర్ధానము నొంది అపకారముఁ గావింపఁగలరు. రావ ణుఁడే వీనిని గూఢచారునిగ పంపియుండవచ్చును. ఆటవికాదిబల

మును గ్రహింపవచ్చును గాని రాజు శత్రుబలమును గ్రహింపరాదు. వీఁడు రావణునితమ్ముఁ డఁట విభీషణుఁడు; నలువురు మంత్రులతో నిన్ను శరణుఁగోరి వచ్చితి నని నీకు నివేదింపుమనుచున్నాఁడు. వీనిని నమ్ముటకు వీలులేదు. ఆ నృశంసునిసోదరుఁడైన వీఁడును నృశంసుఁడే యగును. కావున వీనిని సానుచరముగా వెంటనే వధించుటయే మనకు కర్తవ్యము."

రాముఁడు సుగ్రీవుఁడు చెప్పిన దంతయు సావధానముగా విని ఆంజనేయాదులను చూచి, "వానరవల్లభుఁడు సహేతుకముగా చెప్పినది మీరు వింటిరి కదా! ఇట్టి క్లిష్టపరిస్థితులయందు అభ్యుదయము నవలబించువాఁడు సమర్థునియుపదేశమును గొనుట యుక్తము. కావున మీకుఁ దోఁచినది చెప్పుఁడు'' అనెను.

వా రందఱును రాముని ప్రస్తుతించి యొక్కొక్కరుగా నిట్లు చెప్పిరి. అంగదుఁ డిట్లనెను. "వీనిని వెంటనే విశ్వసింపరాదు. వీనిని పరీక్షించి గుణాధిక్య మున్నచో పరిగ్రహింపవలె; దోషములున్నచో పరిత్యజింపవలె." ఒకగూఢచారిని పంపి పరీక్షించుటకు తగు నని శరభుఁ డనెను. వైరియైన రావణునుండి అకాలమున కానిచోటికి వచ్చి యుండుటచే వీనిని శంకింపవలసినదే యని జాంబవంతుఁ డనెను. వీనిని నెమ్మదిగా మధురముగా ప్రశ్నించి వీని హృదయము నెఱిఁగి దుష్టుఁ డగునో కాదో నిర్ణయింపఁదగు నని మైందుఁ డనెను.

తుదకు హనుమంతుఁ డిట్లు చెప్పెను. "రామచంద్రా! నిన్ను అతిశయించి మాటాడుటకు బృహస్పతి కైనను శక్యము కాదు. వాదముకోఱకుఁ గాని, సంఘర్షణమువలనఁ గాని, ఆధిక్యము కోఱకుఁ గాని నేను మాటాడుట లేదు. నీయందలిగౌరవముచేతను నీయానతి చేతను మాటాడుచున్నాను. వీరు చెప్పినదానిలో పరీక్షించుట యనునది కుదురదు. ఒకానొకకార్యమున వీనిని నియోగించినఁ గాని పరీక్షించుట

జరుగదు. క్రొత్తగా వచ్చినవానిని వెంటనే కార్యమున నియోగించుట దోషాస్పదము. గూఢచారుని వీనిని పరీక్షించుటకై నియోగించుటయు కానిపని. దూరదేశమున అప్రకటవర్తనుఁడైన శత్రువునుగూర్చి తెలిసి కొనుటకు చారుఁ డుపయోగపడును గాని, ప్రత్యక్షముగ తన వృత్తాంత మును తానే చెప్పుకొనుచున్నవానివిషయమున చారు నెట్లు నియో గింతుము? ఇతఁడు అకాలమున కానిచోటికి వచ్చినాఁ డన్నమాటయు కుదురదు. రావణునిదౌష్ట్యమును నీవిక్రమమును గుర్తించి తగిన సమయముననే శరణమునకు యోగ్యుఁడవైన నీయొద్దకు వచ్చినాఁడు. ఇంక అజ్ఞాతరూపులైనవారు పోయి ప్రశ్నించి యితనిహృదయమును కనుఁగొనవలయు ననుటయు సంభావ్యము కాదు. అట్లు ప్రశ్నింప మొదలుపెట్టినంతనే అతఁడు శంకింప మొదలుపెట్టును. మిత్రుఁడై వచ్చినవాఁడు కూడ ఉద్వేగము నొంది దోషాస్పదుఁడు కావచ్చును. అదియును గాక పరుని యంతరంగమును గుర్తించుట సులభము కాదు.

ఇంక సహజముగా నీతఁడు మాటాడుపైఖరినిబట్టి వీనియందు దుష్టత్వము తోఁచుట లేదు. ఈతనిముఖము ప్రసన్నమై యున్నది. శఠుఁడు ఇచ్చటికి నిశ్శంకముగా రాఁజాలఁడు. ఎంత దృఢముగా కప్పు కొనుటకు ప్రయత్నించినను, ఆకృతి వ్యక్తియంతరంగమును వ్యక్త మొనర్చుచునే యుండును. రావణుని మిథ్యాబలగర్వమును నీపరాక్ర మోత్సాహసమున్నతిని పరిశీలించి, వాలిసంహారమును సుగ్రీవాభిషేక మును నిదర్శనముగా గ్రహించి యితఁడు రాజ్యమును కోరి బుద్ధి పూర్వకముగనే వచ్చియున్నాఁడు. ఈవిషయములను చక్కఁగా ఆలో చించి వీనిని గ్రహింపవచ్చును. నేను నాబుద్ధికి అందినంతవఱకు ఈ రాక్షసుని యార్జవమునుగూర్చి చెప్పితిని. కర్తవ్యనిర్ణయమునకు నీవే ప్రమాణము."

రావణునిసభలో విభీషణుఁడు దూతవధ అధర్మమని యుద్ఘాటించినవిషయమును హనుమంతుఁడు ఈసందర్భమున ప్రస్తావింపకుండుట విచిత్రమే. వనభంజనరావణసంవాదలంకాదహనాది వృత్తాంతములను హనుమంతుఁడు రామసుగ్రీవులకు చెప్పలేదు. కాని అంగదజాంబవదాదుల కందఱకును చెప్పెను. వా రందఱును అప్పుడు రావణునిసభలో విభీషణుఁడు దూతవధను ఖండించి ధర్మమును చెప్పె నని విన్నవారే, కాని వారిలో ఒక్కఁడు కూడ ఆవిషయమును పైకితెచ్చి విభీషణునియార్జవమును సమర్థింప లేదు. అట్టియెడల తనకు మాత్రమే సంబంధించినయావిషయమును హనుమంతుఁడే ప్రస్తావించినచో, "నీకు ఉపకారము చేసినంతమాత్రమున అతఁడు నమ్మదగినవాఁ డని ఎట్లు విశ్చయింపవచ్చును? ఒక్క మంచిపని చేసినంతమాత్రమున సహజమైన రాక్షసత్వమును ఉపేక్షించి రాక్షసుని నమ్మవచ్చునా?" అని వారు అనవచ్చును. లేదా రాముఁడు గాని సుగ్రీవుఁడు గాని, "ఈ వృత్తాంతములను నీవు అప్పుడే ఎందుకు చెప్పలేదు?" అని యడుగవచ్చును. అందువలన ఆంజనేయుఁడు తనకు మాత్రమే సంబంధించి వివాదాస్పదమైన వృత్తాంతమును ప్రస్తావింపక కేవలము రాజనీతిని అవలంబించి తనయభిప్రాయమును నిరూపించెను. పూర్వపక్షములను చాల మృదువుగా సహేతుకముగా నిరాకరించి తనయభిప్రాయమును నిరూపించినపద్ధతిని గమనించినచో ఆంజనేయుఁడు రాజనీతియందు తర్కనిరూపణమునందును ఎంత నిపుణుఁడో వ్యక్తమగుచున్నది.

ఆంజనేయుఁడు చెప్పినతరువాత రాముఁ డిట్లనెను. "విభీషణుని గూర్చి నేను కూడ కొంత చెప్పవలసియున్నది నాశ్రేయస్కాములైన మీ రందఱును సావధానులై వినవలయు నని కోరుచున్నాను. ఇతఁడు మిత్త్రభావముతో వచ్చియున్నచో వీని నెట్లును త్యజింపను. వీనియందు మీ రన్నట్లు దోషమే యున్నను వీనిని పరిగ్రహించుటను సత్పురుషులు గర్హింపరు."

శ్లో॥ మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన।
దోషో యద్యపి తస్య స్యాత్ సతా మేత దగర్హితమ్॥ 3
యుద్ధ సర్గ–18

అంతట సుగ్రీవుఁ డిట్లనెను. "ఈరాక్షసుఁడు దుష్టుఁడైన నేమి, కాకున్న నేమి? ఇట్టియాపదయందు అన్నను పరిత్యజించినవాఁడు, ఇంక నెవ్వనిని పరిత్యజింపకుండును?''

రాముఁడు చిఱునవ్వుతో లక్ష్మణుని చూచి యిట్లనెను. "లక్ష్మణా! శాస్త్రముల నధ్యయన మొనర్పక వృద్ధులను సేవింపక యిట్లు సుగ్రీవుని వలె మాటాడుట ఎవనికిని శక్యము కాదు. భ్రాతృపరిత్యాగరూపమైన యీవిషయమున సూక్ష్మతరమైనయంశ మొకటి నాకు తోఁచుచున్నది. రాజులందు సాధారణముగా ఇది ప్రత్యక్షముగా లోకప్రసిద్ధముగా నున్నది. రాజులకు జ్ఞాతులు ఆసన్నదేశవాసులును శత్రువులు. వారు ఆపదలయందు గూఢముగ ప్రహరింతురు. అందఱును ఇట్లే యుండరు. పాపబుద్ధిలేనివారు పరస్పరహితమును గోరుచు తమవారిని మన్నించుచునే యుందురు. కాని రాజులకు సత్పురుషుఁడైన జ్ఞాతియు శంకనీయుఁడే యగును.''

పిమ్మట రాముఁడు సుగ్రీవుని చూచి యిట్లనెను. "శత్రుబలమును మనము స్వీకరింపరా దని నీవు చెప్పినదోషమువిషయమున నేను కూడ శాస్త్రము ననుసరించియే ఇది చెప్పుచున్నాను. వినుము మనము ఈతని కులము హరము కాము ఇతఁడు రాజ్యకాంక్షియు నగును. రాక్షసులందు పండితులును ఉండ వచ్చును. కావున విభీషణుఁడు మనకు పరిగ్రాహ్యుఁడే యగును. జ్ఞాతు లందఱును ఎల్లప్పుడును ప్రహృష్టులై స్నేహము కలిగియుండరు. స్వార్థమునకు అవకాశము కలిగినప్పుడు వైరమును పూనుదురు. బలవత్తరుఁడైన రావణునివలన ఈతనికి భయము కలిగియుండును. ఈతఁడు గావించు

చున్నయా ర్తనాదమునుబట్టియే అది వ్యక్త మగుచున్నది. కావున నితఁడు శరణమును గోరియే వచ్చియుండును. మిత్త్రిమా! సోదరు లందఱును భరతునివంటివారుగ, పుత్త్రులు నావంటివారుగా, స్నేహి తులు నీవంటివారుగను ఉండరు."

శ్లో॥ న సర్వే భ్రాతర స్తాత భవన్తి భరతోపమాః
మద్విధా వా పితుః పుత్త్రాః సుహృదో వా భవద్విధాః॥ 15
యుద్ధ-సర్గ-18

సుగ్రీవుఁడు లక్ష్మణునితో కూడ లేచి రామునకు ప్రణమిల్లి; "వీనిని రావణుఁడే పంపె నని యెఱుంగుము; వీనిని నిగ్రహించుటయే తగినపని; రాక్షసులు సహజముగ కుటిలబుద్ధులు; కావున నమ్మించి యితఁడు నిన్ను గాని నన్ను గాని లక్ష్మణుని గాని ప్రహరింపవచ్చి యుండును; నృశంసుఁడైన యారావణుని సోదరుఁడు గదా వీఁడు, కావున వీనిని సచివులతో కూడ సంహరింపవలసినదే" అని మౌనము వహించెను.

రాముఁడు ఇట్లుచెప్పెను. "ఈనిశాచరుఁడు దుష్టుఁడు గానీ కాకపోనీ నాకు రవ్వంతయు అపకారము చేయఁజాలఁడు. నేను అను కొన్నచో పృథివియందున్న సకలదానవయక్షరాక్షసులను అంగుళ్యగ్ర మున సంహరింపగలను. కపోతగాథను వినుచున్నాము గదా! శీతవాత క్షుధాపీడితుఁడై తనతావునకు వచ్చిన శత్రువును తనభార్యను హరించిన కిరాతుని, ఒకకపోతము అతిథిగా అర్చించి తనమాంసముచేతనే వానికి ఆహారము కల్పించె నఁట. ఇంక నావంటివాఁడు ఎట్లు వర్తింపవల యునో చెప్పుము. కణ్వపుత్రుఁడైన 'కండుమహర్షి'చేత చెప్పఁబడిన ధర్మిష్ఠమైన గాథను వినుము. 'అభయమును యాచించుచు ప్రాంజలియై దీనుఁడై శరణాగతుఁడైనవానిని శత్రువును కూడ దయఁదలంచి హతుని గావింపరాదు. శరణాగతుఁడు ఆర్తుఁడు గాని గర్వితుఁడు

గాని శత్రువే యైనను వానిని సమర్థుఁడు తనప్రాణములను పరిత్య జించి యైనను రక్షింపవలయును. వానిశత్రువులవలనిభయముచేఁ గాని, అజ్ఞానముచేఁ గాని, మఱియేదేని కోరికవలనఁ గాని శక్తి యున్నంతవఱకు శరణాగతుని రక్షింపనివాఁడు పాపమునే గాక లోక నిందను కూడ పొందును. అట్లు అరక్షితుఁడైనవాఁడు, ఎవనిని శర ణముకొఱకు ప్రార్థించి వానికనులయెదుటనే హతుఁ డయ్యెనో, వాని సుకృతము నంతయుఁ గైకొనిపోవును. కావున ప్రపన్నుని రక్షింప కుండుటవలన అస్వర్గ్యము అకీర్తికరము బలవీర్యవినాశకమును అయిన మహాదోషము కలుగును. కావున స్వర్గప్రదము యశస్కరము నైన కండుమహర్షి వచనమునే నేను అనుష్ఠింపఁదలంచుచున్నాను. 'నేను నీ వాఁడను' అని ప్రపన్నుఁడై యొక్కమాఱు యాచించినవానికైనను నేను సర్వభూతములనుండి యభయము నొసంగుదును. ఇది నాకు వ్రతము. వచ్చినవాఁడు విభీషణుఁడు గానిమ్ము, లేక రావణుఁడే గానిమ్ము. సుగ్రీవా! నేను వాని కభయ మొసంగితిని. వానిని తీసికొని రమ్ము."

శ్లో॥ స దుష్టో వా ప్యదుష్టో వా కి మేష రజనీచరః।
సూక్ష్మ మప్యహితం కర్తుం మమాశక్తః కథంచన॥ 22

శ్లో॥ పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం చైవ రాక్షసాన్।
అంగుళ్యగ్రేణ తాన్ హన్యా మిచ్ఛన్ హరిగణేశ్వర॥ 23

శ్లో॥ సకృ దేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే।
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ॥ 33

శ్లో॥ ఆన యైనం హరిశ్రేష్ఠ దత్త మస్యా భయం మయా।
విభీషణో వా సుగ్రీవ యది వా రావణ స్స్వయమ్॥ 34

యుద్ధ-సర్గ-8

రాముని మాటలు విని సుగ్రీవుఁడు ప్రహృష్టుఁడై, "లోకనాథ శిరోమణివైన నీవు ఇట్లు మాటాడుటలో చిత్ర మే మున్నది? చూడఁ జూడ నాయంతరాత్మకు కూడ విభీషణుఁడు యోగ్యుఁ డనియే తోఁచు చున్నది; కావున వెంటనే యితఁడు మాయందఱతో సమానుఁడై సఖ్యము నొందును గాక" అనెను. ఆమాటలు విని వెంటనే విభీష ణుఁడు ప్రహర్షము నొంది సానుచరముగా భూమికి దిగి రాముని యొద్దకు వచ్చి పాదములకు ప్రణమిల్లి ఇట్లు పలికెను. "రామచంద్రా! నేను రావణుని యనుజుఁడను; నన్నాతఁడు దాసునివలె అవమానిం చెను; లంకను మిత్త్రులను ధనములను వీడి సర్వభూతశరణ్యుఁడవైన నిన్ను శరణము నొందితిని; నారాజ్యము జీవితము సుఖములు అన్నియు నీయధీనమై యున్నవి." రాముఁ డాతనిని ప్రీతితో చూచుచు మధుర వాక్యములతో నూరడించుచు, "రాక్షసులబలాబలములనుగూర్చి చెప్పుము" అని యడిగెను.

విభీషణుఁడు రావణకుంభకర్ణప్రహస్తేంద్రజిదాదుల పరాక్రమ విశేషములను వివరించి లంకయందు దశకోటిసహస్రసంఖ్యాకులైన రాక్షసు లున్నా రని చెప్పెను. రాముఁ డది విని "ప్రహస్తాదులతో రావణుని సంహరించి నిన్ను రాజును చేయుదును. ఆరావణుఁడు పాతాళము జొచ్చినను బ్రహ్మయొద్దకు పోయినను నానుండి తప్పించు కొనఁజాలఁడు. సపుత్త్రిబాంధముగా వానిని సంహరింపక నేను అయో ధ్యలో ప్రవేశింపను. నాముగ్గురుతమ్ములపై ప్రమాణముచేసి చెప్పు చున్నాను" అని చెప్పెను. విభీషణుఁడు తలవంచి నమస్కరించి, "లంకను జయించుటలో రాక్షససంహారమునందును నేను సైన్యమున ప్రవేశించి యథాశక్తి సాయ మొనరింతును" అనెను.

రాముఁ డాతనిని కౌఁగిలించుకొని లక్ష్మణుని చూచి "లక్ష్మణా! నేను ఈతనియందు ప్రసన్నుఁడ నైతిని. కావున మహాప్రాజ్ఞుఁడైన

యీవిభీషణుని రాక్షసులకు రాజునుగా అభిషేకింపుము. సముద్రము నుండి జలమును తెమ్ము" అని ఆదేశించెను. లక్ష్మణుఁ డట్లే సాగర జలమును గొనివచ్చి ఋక్షవానరనాయకులమధ్యమున విభీషణుని సుఖాసీనుని గావించి రాజునుగా అభిషేకించెను. రాముని యనుగ్రహమును చూచి ఋక్షవానరు లందఱును సాధువాదములు గావించిరి.

శ్లో॥ ఇతి బ్రువాణం రామ స్తు పరిష్వజ్య విభీషణమ్।
అబ్రవీ ల్లక్ష్మణం ప్రీత స్సముద్రా జ్జల మానయ॥ 24

శ్లో॥ తేన చేమ్యం మహాప్రాజ్ఞ మభిషించ విభీషణమ్।
రాజానం రక్షసాం క్షిప్రం ప్రసన్నే మయి మానద॥ 25

యుద్ధ-సర్గ-19

విభీషణుని విషయమున రాముని యభిప్రాయమును ప్రతిఘటించినవారిలో ప్రముఖుఁడు సుగ్రీవుఁడు. లక్ష్మణుఁడు ఏమియు మాటాడకున్నను సుగ్రీవునిపక్షమునే అవలంబించి యుండెను. అందువలన వారి విషయములో విభీషణునకు, విభీషణుని విషయములో వారికిని ఎట్టిసంకోచమునకు అవకాశము లేకుండునట్లుగా రాముఁడు సుగ్రీవునే ఆహ్వానించువానినిగా చేసి లక్ష్మణునిచే అభిషేకము చేయించెను. అప్పటికప్పుడే విభీషణునకు అభిషేకము చేయించుట రాముని రాజనీతికి మంచినిదర్శనము. దీనివలన విభీషణునకు అతనియమాత్యులకు రామునియందు దృఢమైనవిశ్వాస మేర్పడుటయే కాక లంకలో నుండుయోధులకు జయమునందు నమ్మకము పోయి ఉత్సాహము క్షీణించుటకు అవకాశము కలిగినది

విభీషణుని చూచినవెంటనే రాముఁడు అతనినిగూర్చి మహాప్రాజ్ఞుఁ డని ప్రశంసించుటయే కాక ఆలింగనము కావించుకొనుట ఆశ్చర్యకరము. అప్పటివఱకు విభీషణునివిషయమును రాముఁడు వినికిడివల్లనైనను ఎఱింగియుండఁడు. అట్టియెడల అంత అనురాగము

కొంచెము సేపటిలోనే ఎట్లు ఏర్పడినది? విభీషణుఁడు అంతరిక్షమునం దున్నప్పుడే "సర్వలోకశరణ్యుఁడు మహాత్ముఁడునైన రాఘవునకు నన్నుగూర్చి నివేదింపుఁడు" అని వానరులతో చెప్పెను. ఆమాటను బట్టియే రాముఁడు విభీషణునియందు పరమధర్మరూపమైన శరణాగతిని గుర్తించెను. ఇట్లనుటవలన విభీషణుఁడు రామునియందలి పరమధార్మికత్వమును గుర్తించె ననుట స్పష్టము. "మూర్తీభవించిన ధర్మమే రాముఁడు" అని చెప్పినమారీచుడు కూడ ఇంతమాత్రము గుర్తించినట్లే. ఎదుటివానిమహత్త్వమును గుర్తించుట వేఱు; ఆత్మోద్ధరణమునకై సకలసంకోచములను వీడి ఆయనను ఆశ్రయించుట వేఱు. ఇట్లు ఆశ్రయించువాఁడు అంతరంగికభక్తుఁ డగును. అంతే కాదు. అన్నయొక్క అపరాధములను ఏకరువు పెట్టకుండుట, తన ధార్మికత్వమును సమర్థించుకొనకుండుట, రాజ్యమును కోరకుండుట, తనశక్తిసామర్థ్యములనుగూర్చి గొప్పగా చెప్పుకొనకుండుట, మితముగా మాటాడుట అనునంశములచేత కూడ రాముఁడు విభీషణుని మహాప్రాజ్ఞుఁ డని వెంటనే గుర్తించెను. ఆతనియాంతరంగికభక్తిని అంగీకరించుచు అతనికి ఆప్యాయనము కలిగించుటకై కౌఁగిలించుకొనెను ఈవిధముగా మహర్షి విభీషణుని నిగ్రహమును సమయోచిత ప్రసంగ శాలిత్వమును, శ్రీరాముని పరేంగితజ్ఞానపాటవమును చక్కఁగా వ్యక్త మొనర్చినాఁడు.

రాముఁడు ప్రకటించిన యీ శరణాగతత్రాణపరాయణత్వమును ఇటీవల చాలమంది రాజులు చక్కఁగా గ్రహింపక అదియే పరమధర్మముగా పరమమైన యాదర్శముగ భావించి ఘోరశత్రువులు ఓడిపోయి చిక్కినప్పుడు వదలిపెట్టియుండుట శోచనీయము. విజాతీయులకు ఇట్టిధర్మసంకోచములు లేవు. కృతజ్ఞతతో పరమతస్థుని సహించుట వారిదృష్టిలో ధర్మము కాదు. తమకు ఉపకారము చేసిన

వాని నైనను వంచనచేత నైనను వధించి తమమతమును వ్యాప్తి నొందించుట వారికి పరమధర్మము. అందువలన వారు తమకు బలము సమకూడినంతనే మరల మరల దండెత్తి వచ్చుచు హిందూరాజులు చిక్కినప్పుడు వారిని ఘోరముగ హింసించిరి. వారిదృష్టిలో తమ్ము వదిలిపెట్టిన హిందూరాజులు స్వధర్మమునందు శ్రద్ధలేనివారు. స్వధర్మ నిష్ఠలేని వారిని తమమతమునందు చేర్చుకొనుటకన్న వధించుటయే యుచిత మని వారు భావించిరి.

"నేను నీవాఁడను అని యొక్కమారు శరణుఁజొచ్చినవాని నైనను సకలభూతములనుండి రక్షింతును" అని యిట్లు ప్రకటించిన రాముని శరణాగతత్రాణపరాయణత్వము అందఱకు ఆదర్శము కాదా? కాదు. "ఇది నాకు వ్రత" మని (ఏత ద్వ్రతం మమ) ఆయనయే చెప్పెను. వ్రతము లెప్పుడును సార్వజనీనములు కావు. అవి వ్యక్తి సామర్థ్యము ననుసరించి యుండును. సన్న్యాసికి అహింసావ్రతము పరమధర్మము. కాని అది గృహస్థునకు చెల్లదు. ఇతరులు తనకుఁ గాని తనకుటుంబమునకుఁ గాని హాని తలపెట్టినప్పుడు. వారిని ప్రతి ఘటించి తన్ను తనకుటుంబమును రక్షించుకొనవలసినబాధ్యత గృహస్థున కున్నది. అట్లు చేయక శత్రువు నుపేక్షించుచు తన్ను తనకుటుంబ మును రక్షింపనివాఁడు అధర్మము చేసినవాఁడే యగును. ఈకారణము చేతనే కౌరవులవిషయమున ధర్మరాజు దాక్షిణ్యము చూపుట తగ దనుచు, "కౌరవులు పాములవలె ఎల్లవారికి వధ్యులు; నీ కేల కాతైరి" అని శ్రీకృష్ణుడు ప్రబోధించెను. అందువలన రాముఁడు ప్రకటించినవ్రతము అందఱకును ఆదర్శ మగుట కుదురదు.

"వచ్చినవాఁడు రావణుఁ డైనను కానిమ్ము, నేను శరణమిచ్చి తిని" అని రాముఁ డనుట ధర్మసమ్మతమా? లోకకంటకుఁ డైనవానికి

రాముఁ డైనను శరణ మీయవచ్చునా? అతఁడు యథార్థముగా తన యపరాధమును గుర్తించి సీత నొసంగి నన్ను రక్షింపు మని పాదములకు ప్రణమిల్లినచో వానికి అప్పటికి శరణమిత్తు ననియే రాముని యభిప్రాయము. అట్టిద్రోహి శరణమును పొందినతరువాత నమ్మించి మోస మొనర్చినచో ఏమి చేయవచ్చు నని సుగ్రీవుఁడు ప్రశ్నించి నప్పుడు, "నన్ను ఎవఁడును ఏమియు చేయలేఁడు. హరిగణేశ్వరా! సకలలోకములయందలిదైత్యదానవయక్షరాక్షసుల నందఱను నావ్రేలి కొనచేత సంహరింపఁగలను" అని రాముఁ డుద్ఘాటించుట గమనింపఁదగియున్నది. అట్టిసామర్థ్యము కలవానికే అట్టి వ్రతము తగును; ఇతరులకు తగదు. మహమ్మద్ ఘోరీని మహమ్మద్ గజనీని విడిచిపెట్టిన హిందూరాజులకు ఇట్టి సామర్థ్య మున్నదా? లేకయే కదా వారు పట్టువడి హింసింపఁబడిరి. అందఱకును ఈవ్రతము ఆదర్శము అగుటకు వీలు లేదు. వారు తమసామర్థ్యమును అనుసరించి తమప్రజలను శత్రువుల నుండి రక్షించుకోవలసినబాధ్యతను కలిగియున్నారు. అది వారికి పరమ ధర్మము. ఆధర్మమునకు ప్రతిబంధకమైన యేవ్రతము నైనను వదలుకోవలసినదే. ప్రజాపాలనముకొఱకు రాజులు కుమారు నైనను అపరాధి యైనచో దండింపవలసియేయుండును. ఇక్ష్వాకువంశమున అసమంజసుని అందులకే కదా తండ్రి పరిత్యజించినాఁడు! ఏదోషము లేకున్నను, కేవలము ప్రజాపవాదమును తొలఁగించుకొనుటకై రాముఁడు సీతను సైతము వదలుకొన్నాఁడు కదా! అట్టియెడల వ్యక్తిగతములైన కీర్తిప్రతిష్ఠలకొఱకు ప్రజాపాలన మను ధర్మమును భంగపఱచుట అధర్మ మనుట స్పష్టము.

రామునిప్రసంగమునందు రెండుభాగము లున్నవి. మొదటిభాగము సకలప్రభుత్వములకు వర్తించునట్టిరాజనీతి. రెండవది ఆయనకు మాత్రమే సంబంధించినవ్రతవిశేషము.

"ఇట్టి యాపదయందు అన్నను పరిత్యజించినయితఁడు ఇంక నెవ్వని పరిత్యజింపఁడు'' అని సుగ్రీవుఁడు విభీషణునిగూర్చి యాక్షేపింపఁగా, విభీషణునిచర్యను సమర్థించుచు రాముఁడు సర్వరాజ సాధారణమైన నీతిని ఇట్లు నిరూపించెను. "రాజులందు సాధారణముగా ఇది ప్రత్యక్షముగా లోకప్రసిద్ధముగా నున్నది. రాజులకు జ్ఞాతులు ఆసన్నదేశవాసులును శత్రువులు. వారు ఆపదలయందు గూఢముగ ప్రహరింతురు. అందఱును ఇట్లే యుండరు. పాపబుద్ధిలేనివారు పరస్పరహితమును గోరుచు తమవారిని మన్నించుచునే యుందురు. అయినను రాజులకు సత్పురుషుఁడైన జ్ఞాతియు శంకనీయుఁడే యగును. ఇతఁడు రాజ్యకాంక్షియు నగును. రాక్షసులందు పండితులును ఉండవచ్చును. కావున విభీషణుఁడు మనకు పరిగ్రాహ్యుఁడే యగును. జ్ఞాతు లందఱును ఎల్లప్పుడు ప్రహృష్టులై స్నేహము కలిగియుండరు. స్వార్థమునకు అవకాశము కలిగినప్పుడు వైరమును పూనుదురు. బలవత్తరుఁడైనరావణునివలన ఈతనికి భయము కలిగియుండును."

పై మాటలయందు రాముఁడు రాజు లందఱు పాటింపఁదగిన నీతిని చక్కఁగా నిరూపించినాఁడు. తనయభిప్రాయములకు విరుద్ధముగా మాటాడుచున్న విభీషణునివిషయమున రావణునకు సందేహము కలుగుట సహజము. రాజునకు సందేహము కలిగినతరువాత అతనివలన కీడును శంకించుట విభీషణునకు కూడ సహజమే. భయము కలిగినంతనే ఆత్మరక్షణకై పూనుకొనుట, అవకాశ మున్నచో సోదరుని రాజ్యమును అర్థించుచు అందులకై ప్రయత్నించుట అసహజము కాదు. ఇట్లు ప్రాణాతురుఁడై రాజ్యకాంక్షయు కలిగియున్నవానిని పరమదుర్మార్గునిగా భావించి తటస్థులు పరిత్యజింప పని లే దని వానికి శరణము నొసంగి వానిభయమును తీర్చి వీలైనచో వానికి జ్ఞాతుల సంపద సంక్రమించినట్లుగా చేయుట అధర్మము కా దని రామునియభిప్రాయము. విభీషణునియందున్న యీలక్షణ మంతయు సుగ్రీవుని

యందు కూడ కలదు. సుగ్రీవుఁడు సాహాయ్యమునకు అర్హుఁ డైన ప్పుడు విభీషణుఁడు మాత్రము ఏల కాఁడు?

సామాన్యులైన రాజులు సాధారణమైన రాజనీతిని అవలంబించి సోదరులనైన శంకించుట సహజ మని, అది ఆవశ్యక మని రాముని ప్రసంగమున స్పష్ట మగుచున్నది. తాను ఎవరిని నమ్మక తన్ను అందఱు నమ్మునట్లు వర్తించుచుండుట రాజనీతికి ప్రధానసూత్రము. సోదరులను సైతము గూఢముగ కనిపెట్టుచు వారివలన అపాయశంక గలిగినంతనే తఱిమివేయవలయు ననుట రాజనీతికి లక్షణ మైనప్పుడు విజాతీయుఁడు విధర్మీయుఁడు శరణాగతుఁ డైనంతనే వానిమాటలను నమ్మి వానికి శరణ మిచ్చుట సాధారణులైన రాజులకు తగ దనియే మనము గ్రహింపవలసియున్నది. "ఇది నాకు వ్రతము" అని ఆయన చెప్పినప్పుడే ఇది సర్వజనులకు వర్తించునది కా దని స్పష్ట మగు చున్నది.

అన్న తండ్రితో సమానుఁడు. అతఁడు దుర్మార్గుఁ డైనను ఆపదయందు అతనిని విడిచిపెట్టివచ్చుట తమ్మునకు ధర్మమా? అట్టివానిని మనము నమ్మవచ్చునా? అని సుగ్రీవునియాశంక. రావణునివలన జ్ఞాతిభయ మున్నట్లుగా విభీషణునకు రామునివలనఁ గాని సుగ్రీవునివలనఁ గాని భయములేదు. అందువలన అతఁడు తమ్ము వదిలిపెట్టు ప్రసక్తియే లే దని రామునియభిప్రాయము. ఇంక అన్నను ఆపదయందు పరిత్యజించుట ధర్మమా అన్న ప్రశ్నకు రాముఁడు నేరుగా సమాధానము చెప్పకుండ, "సోదరు లందఱును భరతునివంటివారుగ, పుత్త్రులు నావంటివారుగ, స్నేహితులు నీవంటి వారుగ నుండరు." అనెను. ఐహికములైన సంపదల నపేక్షింపక కేవలమైనధర్మమును అవలంబించి వర్తించు సోదరులు పుత్రులు లోక మున ఎప్పుడును అఱుదుగనే యుందురు. వారు ఋషితుల్యులు. ఈ

విషయమునే రాముఁడు కైకేయితో తన్నుగూర్చి చెప్పునప్పుడు, "కేవలమైనధర్మమునందు నిలిచియున్ననన్ను ఋషులతో సమానునిగా నెఱుంగుము'' (విద్ధి మాం ఋషిభి స్తుల్యం కేవలం ధర్మ మాస్థితమ్) అని స్పష్ట మొనరించెను రాముఁడు భరతుఁడు రాజ్యమును తృణప్రాయముగా చూడఁగలిగినట్లు అందఱును చూడఁజాలరు. అందఱును పరమ ధార్మికులుగా నుండవలయు ననుకొనుట అసంగతము. కొందఱు ఫల నిరపేక్షముగా ధర్మము నాచరించుచుండఁగా, కొందఱు ఫలాపేక్షతో ధర్మము నాచరించుచుందురు. మఱికొందఱు ధర్మవిషయమునే పట్టించు కొనక యథేష్టముగ వర్తించుచుందురు. కావున ధార్మికులైనవారు ఇతరులను ఈసడించుకొనక, వారు తమయొద్దకు వచ్చినప్పుడు, వారిపరిస్థితులను విచారించి, న్యాయములైన వారికోర్కెలను తీర్చి వారిని అప్పటికి వారున్నస్థితినుండి పైస్థాయికి కొనిపోవుటకు ప్రయత్నింపవలె. కావున విభీషణుఁడు అన్నను వీడి వచ్చుట సాధారణదృష్టితో తప్పే అయినను, అతఁడు శరణము కోరినప్పుడు అతనిని ఆదరించి అభయము నొసంగి అతనికోరిక న్యాయమైనచో తీర్చుట ధర్మమే యని రాముఁడు స్పష్ట మొనర్చెను. సుగ్రీవుని విషయమున ఆయన యీధర్మమునే అవలంబించెను.

'సోదరు లందఱు భరతునివంటివారు కారు' అని రాముఁ డన్నప్పుడు విభీషణుఁడు కాని సుగ్రీవుఁడు కాని భరతుని వంటివారుగా ఉండవలయు నన్నచో ఎట్లు వర్తించియుండ వచ్చునని ఆయన తలంచుచున్నాఁడు? సుగ్రీవుఁడు భరతునివలె కేవలధర్మమునే అవలంబించువాఁ డగుచో వాలియొద్దనుండి పాఱిపోయియుండఁడు. ప్రభువుకొఱకు యుద్ధమున ప్రాణములర్పించుయోధునివలె అన్నకొఱకు సుగ్రీవుఁడు వాలివలన వధమునైనను పొందియుండును. ''నేను అన్నయభీష్టముకొఱకు ఇంత త్యాగము చేయుచున్నా" నని యతఁడు తలంచుచు వాలివలన వధమును పొందినచో ఉత్తమధార్మికుఁడై యుండెడివాఁడు ఇట్ల

నుట రాముని యభిప్రాయమునకు విపరీతవ్యాఖ్యాన మని కొందఱు తలంప వచ్చును. కాని ఆయన ప్రకటించిన పితృభక్తి ప్రకారమును పరిశీలించినచో ఇది విపరీతవ్యాఖ్యానము కా దని స్పష్టము కాఁగలదు. ఆయన కైకేయి యొద్ద తండ్రియందు తనకుఁ గల శ్రద్ధను గూర్చి యిట్లు చెప్పెను. "తండ్రిగారు కోపించి యున్నచో ఆయనకు సంతోషము కలిగింపకుండ, ఆయనమాటను జరుపకుండ ముహూర్తమైనను జీవించుటకు ఇష్టపడను.... ఆయనయే కాదు నీవు చెప్పినను భరతునకు ధనములను. ప్రాణములను. రాజ్యమును, సీతను సంతోషముతో ఇచ్చియుందును. ఇంక తండ్రియే స్వయముగ నీప్రీతికొఱకు తన ప్రతిజ్ఞను నిర్వహించుకొనుటకై ఇమ్మని చెప్పినచో ఇత్తు నని వేరుగా చెప్పవలసిన దేమున్నది?"

శ్లో॥ అతోషయన్ మహారాజ మకుర్వ న్వా పితుర్వచః।
ముహూర్త మపి నేచ్ఛేయం జీవితుం కుపితే నృపే॥ 15

అయోధ్యా-సర్గ-18

శ్లో॥ అహం హి సీతాం రాజ్యం చ ప్రాణా నిష్టాన్ ధనాని చ।
హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతాయ ప్రచోదితః॥ 7

శ్లో॥ కిం పున ర్మనుజేంద్రేణ స్వయం పిత్రా ప్రచోదితః।
తవ చ ప్రియకామార్థం ప్రతిజ్ఞా మనుపాలయన్॥ 8

ఈప్రసంగములో రాముఁడు, "తల్లిని దేవతనుగా కలిగి యుండుము, తండ్రిని దేవునిగా కలిగియుండుము" (మాతృదేవో భవ, పితృదేవో భవ) అని వేదము విధించుచున్నయనుశాసనముయొక్క నిర్వహణమునందలి పరాకాష్ఠను నిరూపించుచున్నాఁడు. తల్లిదండ్రుల విషయము ఎట్టిదో అన్నవిషయము కూడ అట్టిదే. భరతుఁడు లక్ష్మణుఁడు రాముని విషయమున ఇట్లే వర్తించినారు. భరతుఁడు రాజ్య

సంపదలనే వదలుకొనఁగా లక్ష్మణుఁడు తుదకు ప్రాణములను వదలు కొనుటకు సిద్ధపడినాఁడు.

రాముఁడు పరమధార్మికుఁడు కాఁబట్టి భరతుఁడు లక్ష్మణుఁడు అట్లు వర్తించుట సహజమే. కాని సోదరుఁడు ధార్మికుఁడు కాకున్నచో వానివిషయమున అట్టివిధేయత ఉండనక్కఱ లేదని కొందఱు తలంప వచ్చును. కాని "మాతృదేవో భవ, పితృదేవో భవ" అని వేదము అనుశాసించినప్పుడు మాతాపితరులను నిర్విశేషముగానే పేర్కొన్నది. తల్లిదండ్రులు మంచివారైనప్పుడే వారిని దేవతలవలె ఆరాధింపవలె నని యావాక్యములకు అర్థము చెప్పుటకు వీలులేదు. ఏశరీరము నవలంబించి తాను ఇహమును పరమును సంపాదించుకొనుటకు మానవుఁడు పూనుకొనుచున్నాఁడో, ఆశరీరము నొసంగినవారు తల్లిదండ్రులు. అంతమాత్రముచేతనే వారు దేవతలుగా ఆరాధింపఁదగినవారు. అంతే కాని వారు గుణవంతులైనప్పుడే పూజ్యులగుదురు అని చెప్పుటకు వీలులేదు. లోకములో గుణవత్త్వము కాని ధర్మపరత్వము కాని నూటికి నూఱుపాళ్లు కలిగియుండువారు చాల అఱుదుగా నుందురు. సాధారణప్రజ లందఱును కామలోభాదిప్రయుక్తములైన దోషములను కలిగియే యుందురు. అట్టియెడల ఎన్ని గుణములు ఎట్టి ధర్మములు కలవారు పూజ్యులై ఎన్ని దోషములు ఎట్టి యధర్మములు కలవారు అపూజ్యు లగుదు రని ఎవరు ఎట్లు నిర్ణయింపఁగలరు? కావున ఇచ్చట గుణధర్మప్రసక్తి లేదు. ఒక్కొక్కనికి వానిపూర్వకర్మనుబట్టి మంచిదో చెడ్డదో శరీరము వచ్చినట్లే, దానితో పాటే తల్లి, తండ్రి, అన్న మొదలగు వారు ఏర్పడుచున్నారు. శరీరము మంచిదైనను చెడ్డదైనను ఎట్లు వదలు కొనుటకు వీలు లేదో, దానికి జనకులైన తల్లిదండ్రులను కూడ, వారు మంచివారైనను చెడ్డవారైనను వదలుకొనుటకు వీలు లేదు. ఇక్కడ పూజ్యతకు పితాపుత్రాదిసంబంధమే కారణము కాని గుణధర్మవత్త్వము

కాదు. గుణధర్మవత్త్వమే తండ్రిని పూజించుటకు నిమిత్తమైనచో రాముఁడు దశరథుని ఆరాధించుటయే కుదురదు. దశరథుఁడు సామాన్యుఁడు. ఆయనలో ఎన్నో దౌర్బల్యము లున్నవి. ఆయన కైకేయికి వశుఁడై పట్టమహిషియైనకౌసల్యను తక్కువఁగా చూచినాఁడు. రామునకు పట్టాభిషేకనిర్ణయముచేసినదినమున కూడ కౌసల్యను మన్నింపక కైకేయి యొక్క అంతఃపురమునకే పోయినాఁడు. విశ్వామిత్రునకు మాట ఇచ్చి తప్పించుటకు ఎంతో ప్రయత్నించినాఁడు. అట్లే రెండుసార్లు తన్ను ప్రాణాపాయమునుండి రక్షించి కైకేయి పొందినవరములను వెంటనే ఈయక తప్పించుకొనుటకు ఎంతో ప్రయత్నించినాఁడు. ఇంత యేల? "మాయమ్మను సరిగా చూడని తండ్రి నా కేమి పూజ్యుఁడు?" అని రాముఁడు కాక మఱియొకఁడైనచో అనుకొనియుండవచ్చును గదా! ఊహ ఎందులకు? లక్ష్మణుఁడట్లే అనుకొన్నాఁడు గదా! కాని రాముఁడు ఆభావనను అంగీకరింపలేదు. అంతే కాదు. భర్తకు ప్రాణాంతకములైన వరములను కోరి నిండుసభలో దశరథుని చేత సుమంత్రునిచేత వసిష్ఠునిచేత తిరస్కరింపఁబడినకైకేయినిగూర్చి రాముఁడు తాను ఒక్కమాట అనకపోవుటయే కాక భరతుఁడు కాని లక్ష్మణుఁడు కాని ఆమెను నిందించుటకు అంగీకరింప లేదు. ఆమెను తిరస్కరించునధికారము పెద్దలైనదశరథాదులకు ఉన్నది కాని, పుత్త్రులకు లే దనియే అయనయభిప్రాయము. కైకేయి ఎట్టిదైనను భరతాదులు పుత్త్రులుగా ఆమెను దేవతనువలెనే గౌరవింపవలె ననుట ఆయన నిశ్చయము. కావున పూజ్యతకు సంబంధమే కారణము కాని గుణధర్మవత్త్వము కాదు.

సంబంధమే పూజ్యతకు నిమిత్తమనువిషయము ఈగ్రంథమున అనేకసందర్భములలో ప్రతిపాదింపఁబడియున్నది. సీతానసూయల సంభాషణమున ఇది చక్కఁగా నిరూపింపఁబడియున్నది. అనసూయ

పతిభక్తినిగూర్చి ఇట్లు చెప్పినది. "ధనహీనుఁడైనను కామవర్తనుఁడైనను దుశ్శీలుఁడైనను భర్త ఆర్యస్వభావముగలస్త్రీలకు పరమదైవతము." దాని నంగీకరించుచు సీత ఇట్లు చెప్పినది. "నాభర్తయైన యితఁడు ఒకవేళ ఏకారణముచేతనైనను సద్వర్తనము లేనివాఁడైనచో, అప్పుడు కూడ ఈతనియెడల పూర్వమెట్లు వర్తించు చుంటినో ఆ వినయమునందు విధేయతయందును ఎట్టి భేదము కలుగకుండ వర్తింపవలసియే యున్నది."

శ్లో॥ దుశ్శీలః కామవృత్తో వా ధనైర్వా పరివర్జితః।
స్త్రీణా మార్యస్వభావానాం పరమం దైవతం పతిః॥ 24
అయోధ్యా–సర్గ–117

శ్లో॥ యద్యప్యేష భవే ద్భర్తా మమార్యే వృత్తవర్జితః।
అద్వైధ ముపచర్తవ్య స్తథా ప్యేష మయా భవేత్॥ 3
అయోధ్యా–సర్గ–118

దుశ్శీలుఁడు కామవర్తనుఁడు వృత్తవర్జితుఁడైనను భర్త ఎట్లు స్త్రీలకు పరమదైవతముగా పూజ్యుఁడగుచున్నాఁడో, అట్లే తల్లి, తండ్రి, అన్న మొదలగువారు ఎట్టివారైనను పురుషునకు పూజ్యులే యగుదురనుట స్పష్టము.

వాలివధసందర్భమున రాముఁడు "మావశమునందు మేము లేము" (న వయం స్వవశే స్థితాః) అని చెప్పినట్లుగా వేదముయొక్క దృష్టిలో అందఱును ధర్మానుశాసనబద్ధులే (Bound by the discipline of Dharma); ఎవరును స్వతంత్రులు కారు. ఈసూత్రము చిన్నవారికి మాత్రమే కాదు పెద్దవారికి కూడ వర్తించును. కాని పెద్దవారు తప్పు చేసినచో వారిని విమర్శించి శిక్షించి దండించునధికారము

వారికన్న పైవారికే యుండును కాని చిన్నవారికి లేదు. కైకేయిని దశరథవసిష్ఠాదులు నిందించి శిక్షింపవచ్చును కాని భరతాదులకు అట్టి యధికారము లేదు.

ఈచర్చకు సారాంశము నిట్లు గ్రహింపవచ్చును. వేదధర్మము సైనికశాసనము (Military Command) వంటిది. పైవానియాజ్ఞను క్రిందివాఁడు ధిక్కరించుటకుఁ గాని తుదకు విమర్శించి యాక్షేపించుటకు గాని వీలు లేదు. పైయధికారి మంచివాఁడా చెడ్డవాఁడా అను విచారణకే అవకాశము లేదు. అతఁడు అధికారి కాఁబట్టి వానియాజ్ఞను జరుపవలసినదే. అతఁడు కూడ తనపై యధికారికి అట్లే ఆజ్ఞాబద్ధుఁడు. అతఁడు తప్పుచేసినచో విచారించునధికారము పైయధికారికే యుండును కాని క్రిందియుద్యోగికి (Subordinate Officer) ఉండదు. వాని యాజ్ఞలవలన వర్తనమువలన కష్టము దుఃఖము అపాయము మొదలగునవి సంభవించినచో, వృత్తియందు అనివార్యములైన దుఃఖానుభవములుగా (Professional hazards) ఎట్లు సహింపవలసియే యుండునో, అట్లే తల్లి తండ్రి అన్న మొదలగువారివలన సంభవించు దుఃఖములను చిన్నవారు దైవికములైన దుర్ఘటనములను వలెనే (Accidents ordained by fate)సహింపవలసినదే కాని ఏపరిస్థితి యందును పెద్దలపై తిరుగఁబడరాదు; వారిని పరిత్యజింపరాదు. కావున "సోదరు లందఱును భరతునివంటివారుగా నుండరు" అని రాముఁడన్నప్పుడు, "మాఅన్నకు లేని సౌఖ్యము నాకును అక్కఱ లేదు" అని రాజ్యభోగములను వదలి వనవాసవృత్తి నవలంబించునంతటి సోదరానువర్తనశ్రద్ధ భరతునియందువలె సుగ్రీవునియందు ఎట్లు లేదో విభీషణునియందు కూడ అట్లే లే దని రామునియభిప్రాయము.

ఈసందర్భమున గోవిందరాజస్వామి తమవేదాంతగురువులయభిప్రాయమును చెప్పుటకు ముందు, 'గర్వితుఁడై కార్యాకార్యముల నెఱుం

గక యపమార్గమున వర్తించువానిని గురువు నైనను పరిత్యజించుట విధియే' అను స్మృతి ననుసరించి విభీషణుఁడు అన్నను వదిలిపెట్టె నని కొందఱందురు" అని చెప్పెను. ఈయభిప్రాయమును ఆయన విమర్శింప లేదు; ఖండింప లేదు. అందువలన దీనిని కొందఱు ప్రమాణముగా భావించుటకు అవకాశము కలదు. అందువలన దీనిని విమర్శింపవలసియున్నది. ఈశ్లోకము ఏస్మృతినుండి గ్రహింపఁబడినదో కూడ ఆయన చెప్పలేదు. ఈశ్లోకము నాల్గవపాదమునందలి కొలఁది మార్పుతో లక్ష్మణుని వాక్యముగా అయోధ్యాకాండయందు ఇట్లున్నది.

శ్లో॥ గురో ర ప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః।
ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనమ్॥ 13
అయోధ్యా-సర్గ-21

దీనిని స్మృతివాక్యముగా భావింపవచ్చునా? శ్రీశంకరభగవత్పాదులవారు మహాభారతములోని శ్లోకముల నుదాహరించునప్పుడు వానిని స్మృతివాక్యము లనియే పేర్కొనిరి. వేదముయొక్క తాత్పర్యమును స్మరించుచు మనువు మొదలగువారు రచించిన స్మృతిగ్రంథము లెట్టివో వ్యాసమహర్షిచే వేదతాత్పర్యనిరూపకముగా రచింపఁబడిన మహాభారతము కూడ అట్టి స్మృతిగ్రంథమే యని వారియభిప్రాయము. ఈదృష్టితో మహాభారతము ఎట్టిదో శ్రీమద్రామాయణము కూడ అట్టిదే. అందువలన దానిని స్మృతి యనుటకు సంకోచింప నక్కఱ లేదు. కాని సాక్షాద్ధర్మగ్రంథములైన మనుస్మృతి మొదలగువానికిని మహాభారతాది గ్రంథములకును భేదము కలదు. కథలు, పాత్రలు కలిగిన యీగ్రంథములలో ఎన్నో సన్నివేశములలో ఎందఱో ఎన్నో విధములుగా ప్రసంగించుచుందురు. వారిలో ధార్మికులు, అధార్మికులు గుణవంతులు గుణహీనులు అవివేకులు ఉందురు. ధార్మికులైనవారు కూడ ఒక్కొక్క సందర్భమున కామరోషాదివశులై మాటాడు

చుందురు. కావున అట్టిగ్రంథములలో వ్యక్తులప్రసంగము లన్నియు ప్రామాణికములు కానేరవు. భగవత్స్వరూపులైన శ్రీకృష్ణుఁడు కృష్ణ ద్వైపాయనుఁడు మహర్షులు మొదలగువారు వేదముయొక్క తాత్ప ర్యమును నిశ్చయించి యుపదేశించువాక్యములు మాత్రమే స్మృతి వాక్యములవలె ప్రమాణము లగును; తక్కినవి కావు. ఈదృష్టితో చూచినప్పుడు లక్ష్మణునియీవాక్యము కూడ ప్రమాణము కా దని గ్రహింపవలసియున్నది.

ఇందులకు అనేకహేతువులు కలవు. లక్ష్మణుఁడు క్రోధావేశ వశుఁడై అట్లు మాటాడుచుండుట మొదటికారణము. దానిని రాముఁ డామోదింపకుండుట రెండవకారణము. పైన చర్చించినట్లుగా "మాతృ దేవో భవ" అని మొదలుగా నున్న వేదధర్మానుశాసనమునకు ఇది విరుద్ధముగా నుండుట మూఁడవకారణము. ఇది కేవలము వేదవిరుద్ధ మైనచో రాముఁడు దీనిని ఎందులకు ఖండింపలేదు? అశ్లోకమునందున్న విషయము పుత్రులకు శిష్యులకు వర్తింపదు కాని పట్టాభిషిక్తుఁడైన పరిపాలకునియందు వర్తించును. ధర్మాసనముపైనుండి రాజు ధర్మము నతిక్రమించినవారిని శిక్షించునప్పుడు, అపరాధిగా నిరూపింపఁబడిన వాఁడు తనకు గురువే యైనను, అట్టిగురువులను శాసింపవలసియే యున్నది. భీష్మద్రోణాదులను పడఁగొట్టినందులకు ధర్మరాజు దుఃఖించు చుండఁగా భీష్ముఁడే ఈధర్మమును నిరూపించెను. దుర్యోధనుఁడు అపరాధియై యుండఁగా, వానిని శిక్షించునప్పుడు వానికి సహాయులుగా వచ్చినవారు గురువు లైనను శిక్షార్హులే యగుదురు. ఇది కుటుంబ సంబంధములందు వర్తింపదు. కౌసల్యాలక్ష్మణాదు లందఱును దుఃఖ క్రోధావేశవశులై యుండుటవలన అసందర్భమైన ఈధర్మసూక్ష్మ వివరణము అనావశ్యక మని రాముఁడు భావించియుండును. అందువలన ఆయన తనయభిప్రాయమును మాత్రమే నిశ్చితముగా చెప్పెను.

కావున లక్ష్మణునివాక్యమునందలిధర్మము విభీషణునకు ప్రమాణ మయ్యె నని తలంపరాదు. పైన నిరూపించినట్లుగా రావణుఁడే విభీష ణుని పరిత్యజించిన తరువాత. "సకలధర్మములను పరిత్యజించి, నన్ను ఒక్కనినే శరణము పొందుము. నేను నిన్ను సకలపాపములనుండి ముక్తుని గావింతును; శోకింపకుము" అని శ్రీకృష్ణభగవానుఁడు నిరూ పించిన భగవచ్ఛరణాగతి యను పరమధర్మము నవలంబించి విభీష ణుఁడు వర్తించె నని గ్రహింపవలసియున్నది.

గద్యము

ఆపస్తంబసూత్ర కౌండిన్యసగోత్ర పోలూరి
వేంకటనరసాంబావేంకటనారాయణామాత్యపుత్ర
హనుమజ్జానకీరామశర్మప్రణీతంబైన
శ్రీరామాయణతరంగిణియందు
ఏకోనవింశంబైన శరణాగతితీర్థము
సమాప్తము

# 20. సేతుబంధతీర్థము

## 1. దర్భశయనము

అభిషిక్తుఁడై విశ్రమించియున్న విభీషణుని యొద్దకు పోయి హనుమత్సుగ్రీవులు, "ససైన్యముగా మనము ఎట్లు ఈసముద్రమును దాఁటఁగలము?" అని ప్రశ్నించిరి. విభీషణుఁడు "సాగరులచే త్రవ్వఁ బడినయీసముద్రుఁడు సగరవంశీయునకు సాయము చేయును. కావున రాముఁడు సముద్రుని శరణుఁజొచ్చుట తగును" అని చెప్పెను.

సుగ్రీవుఁడు రాముఁ డున్నయెడకు వచ్చి విభీషణునియభిప్రాయమును చెప్పెను. [ఆజగామ మాథ సుగ్రీవో యత్ర రామో సలక్ష్మణః.]

యుద్ధ—సర్గ.

దీనినిబట్టి విభీషణునకు రాజ్యాభిషేకము జరిగినతరువాత, విభీషణుఁడు మంత్రులతో ఒకచోట విడిగా విడిది చేసె నని, అచ్చటికి సుగ్రీవుఁడు పోయి కార్యాలోచనముఁ గావించి రామునియొద్దకు తిరిగి వచ్చె నని మనము గ్రహింపవలసియున్నది. అనఁగా విభీషణునకు రాజమర్యాద ఏర్పడిన దన్నమాట. కావ్యరచనలో మహర్షి ఇట్టిచిన్న యంశములను కూడ చక్కఁగా సూచించును.

రాముఁడు సుగ్రీవునిమాటలను విని, "నాకును ఇది యిష్టము గనే యున్నది. నీకును లక్ష్మణునకు ఏది యభిమతమో చెప్పుఁడు" అనెను. వారు తమకు కూడ అదియే అభీష్ట మని చెప్పిరి. రాముఁడు వెంటనే సముద్రతీరమున యజ్ఞవేదియందు అగ్నిహోత్రునివలె, కుశాస్తరణమునందు సముద్రుని ప్రార్థించుచు కూర్చుండెను.

రావణునిచారుఁడు శార్దూలుఁ డనువాఁడు వానరసైన్య విస్తృతిని జూచి రావణునియొద్దకు పోయి "పదియోజనములమేరకు వ్యాపించి ఋక్షవానరసైన్యము సముద్రతీరమున విడిసియున్నది. సామదానభేదములలో ఏదే నొకయుపాయమును ప్రయోగింపుము" అని చెప్పెను.

ఆమాటను అంగీకరించి రావణుఁడు వెంటనే శుకుని పిలిచి సుగ్రీవునితో ఇట్లు చెప్పి రమ్మ అనెను. శుకుఁడు పక్షియాకృతితో సాగరమును దాఁటివచ్చి తీరమునందు సుగ్రీవునకు చేరువగా అంతరిక్షమునందు నిలిచి రావణుని సందేశము నిట్లు తెలిపెను. "సుగ్రీవా! నీవు మహారాజకులప్రసూతుఁడవు; ఋక్షరజసునిపుత్త్రుఁడవు. నీకు ఈదండయాత్రలో కావలసిన కార్యము గాని, తొలఁగించుకోవలసినయనర్థము

గాని ఏదియును లేదు. నీవు నాకు భ్రాతృసమానుఁడవు. నేను రాముని భార్యను హరించినచో నీ కేమి నష్టము వచ్చినది? కిష్కింధకు తిరిగి పొమ్ము. దేవగంధర్వు లైనను లంకను చేరలేరు. వానరులలెక్క యేమి?"

సుగ్రీవునిసమాధానముకొఱకు శుకుఁడు నిలిచియుండఁగా వానరులు అతనిపైఁబడి కొట్టుచు క్రిందికి తీసికొనివచ్చిరి. అతఁడు దూతను చంపరా దని, తన్ను రక్షింపు మని రామునకు మొఱపెట్టుకొనెను. అతనిపరిదేవనమును విని రాముఁడు అతనిని చంపవ ద్దని ఆజ్ఞాపించెను.

పిమ్మట శుకుఁడు అంతరిక్షమున నిలిచి రావణునకు ప్రతిసందేశ మే మని సుగ్రీవు నడిగెను. సుగ్రీవుఁ డిట్లు చెప్పెను. "ఓ రావణా! నిన్ను రామునినుండి రక్షింపఁగలవాఁ డెవ్వఁడును లేఁడు. వృద్ధుఁడైన గృధ్రరాజును చంపితివి కదా! మఱి రామలక్ష్మణులసమక్షమున సీతను నీవు హరింపలేదే! వారిసమక్షమున నీవు సీతను తాఁకియున్నచో ఆక్షణముననే హతుఁడవై యుండెడివాఁడవు. పరదారాపహరణమును గావించిన నీవు సబంధుమిత్రముగ వాలివలెనే రామునకు మాత్రమే కాదు నాకుఁ గూడ వధ్యుఁడవే.

అంగదుఁడు సుగ్రీవునితో ఇట్లనెను. "వీఁడు దూతవలె తోఁచుట లేదు; చారునివలె నున్నాఁడు నీచెంత నిలిచి మనసైన్యముల బలాబలములను గ్రహించుచున్నాఁడు. కావున వీనిని లంకకు పోకుండునట్లు చేయుటయే నా కభిమతము." సుగ్రీవునియాజ్ఞపై వానరులు మరల శుకుని బంధించి తాడింపఁజొచ్చిరి. వాఁడు మరల, "నాతెక్కలు కన్నులు పోవుచున్నవి; నేను మరణించినచో నేను పుట్టినప్పటినుండి చచ్చిపోవువఱకును చేసినపాప మంతయు నీకు సంక్రమించును'' అని రాము నుద్దేశించి యాక్రోశించెను. రాముఁ డింక వానిని వదలుఁ డని

చెప్పెను. వానరులు వానిని హింసించుట మానిరి, కాని బంధముక్తుని గావింపలేదు.

పిదప రాముఁడు దర్భాస్తరణమున ప్రాఙ్ముఖముగా కూర్చుండి సముద్రుని ప్రార్థించి యనంతరము పరమకాంతాభుజపరామృష్టమైన దక్షిణభుజమును ఉపధానముగా చేసికొని సముద్రమునకు అభిముఖముగా శయనించెను.

శ్లో॥ వరకాంచన కేయూరముక్తాప్రవరభూషణైః।
భుజైః పరమనారీణా మభిమృష్ట మనేకథా॥ 3

యుద్ధకాండ–సర్గ–21

ఇచ్చట రామునిభుజమును ఉత్తమస్త్రీలభుజములచే అనేకవిధముల స్పృశింపఁబడినదానినిగా వాల్మీకి వర్ణించుటచే కొందఱు రామునకు పెక్కుమంది భార్యలు కల రని యిట్లు వాదింతురు. పూర్వకథయందు వాల్మీకి రామునకు పెక్కుమంది భార్య లున్నట్లు సూచించినాఁడు. మంథర కైకతో రామునిపట్టాభిషేకమునుగూర్చి చెప్పునప్పుడు, "రామునియుత్తమస్త్రీలు హర్షము నొందుదురు; భరతునిక్షయమున నీ కోడండ్రు అప్రహృష్ట లగుదురు" అనెను. దీనినిబట్టి రామునకు భరతునకు కూడ చాలమంది భార్య లున్నట్లు వ్యక్త మగుచున్నది. సుందరకాండయందు కూడ సీత రాము నుద్దేశించి విలపించుచు తనమరణము లంకలో నిశ్చితమని తలంచుచు "నీవు తండ్రియాదేశమును వనవాసవ్రతమును ముగించుకొని విగతభయుఁడవు కృతార్థుఁడవై విశాలనయనలైన స్త్రీలతో క్రీడింపఁగలవని తలంతును" అనెను. కావున రామునకు చాలమంది భార్యలు కల రని వ్యక్త మగుచున్నది.

శ్లో॥ హృష్టాః ఖలు భవిష్యన్తి రామస్య పరమాః స్త్రియః।
అప్రహృష్టా భవిష్యన్తి స్నుషా స్తే భరతక్షయే॥ 12

అయోధ్యా–సర్గ–8

"ఉత్తమస్త్రీలచే స్పృశింపఁబడినరాముని భుజము" అను సందర్భమున రామాయణతిలకటీకాకారుఁడు ఇట్లు సమన్వయించెను. "రామునకు ఏకభార్యావ్రతముచేత ఇతరస్త్రీలప్రసంగము లేకపోవుటవలన ఉత్తమధాత్రీజనముయొక్క భుజములచే ఆయనభుజము అనేకవిధములుగా స్నానాలంకారాదిసందర్భములలో స్పృశింపఁబడినది అని అన్వయించుకోవలయును."

[తి. టీక:–పరమనారీణామ్–ఏకదారవ్రతత్వేన ఇతరస్త్రీప్రసంగాభావాత్, ఉత్తమధాత్రీజనానాం భుజైః అనేకధా స్నపనాలంకరణాదికాలే అభిమృష్టం స్పృష్టం బాహుభి రిత్యన్వయః।]

రామునకు ఏకభార్యావ్రత మున్నట్లు ఎచ్చటను రాముఁడు గాని వాల్మీకి గాని చెప్పలేదు. సాధారణమానవులకు వలె స్త్రీభోగమునందు ఆసక్తిలేకపోవుటచేతనే ఆయన, సీత ఉన్నప్పుడు లోకాంతరమునకు పోయినప్పుడు, మఱియొకస్త్రీని పరిగ్రహింప లేదని తలంపవలసియున్నది.

గోవిందరాజస్వామి దీనిని ఇట్లు విమర్శించెను. బాలకాండయందుఁ గాని తక్కినచోట్లఁ గాని ఎచ్చటను రామునకు బహుభార్యల ప్రస్తావన లేదు. బాలకాండమున తుదియందు భార్యాభోగవిహార ప్రస్తావన వచ్చినప్పుడు వాల్మీకి "రాముఁడు సీతతో కూడ బహు ఋతువులందు ఆమెయందే మనస్సు కలవాఁడై విహరించెను. ఆమెహృదయమునందు ఆయన నిత్యము అంకితుఁడై యుండెను" అనియే వర్ణించెను. కావున రామునకు సీత తప్ప మఱిమెవ్వరును భార్యలు లేరని స్పష్ట మగుచున్నది.

శ్లో॥ రామ స్తు సీతయా సార్ధం విజహార బహూ నృతూన్॥ 25
మనస్వీ తద్గత స్తస్యా నిత్యం హృది సమర్పితః॥ 26
బాలకాండ-సర్గ-77

ఇంక మంథరావాక్యమున, "రామునియొక్క ఉత్తమస్త్రీలు హర్షము నొందుదురు" అన్న సందర్భమున ఉత్తమస్త్రీ లనఁగా కౌసల్యను, సీతను, వారిధాత్రీజనమును గ్రహింపవలసియున్నది." నీ కోడండ్రు అప్రహృష్ట లగుదురు" అన్నమాటచేత కైకేయి కోడండ్రు అనఁగా, భరతునకు భార్యలు పెక్కుమంది కల రని గ్రహింపవచ్చునా? అతనికి పెక్కుమంది భార్య లున్నట్లు ఆధార మేమియును లేదు. కావున ఇక్కడ 'నీకోడండ్రు' అన్నప్పుడు బహువచనమును గౌరవార్థమున గ్రహింపవలసియున్నది. అట్లే "రామునియొక్క పరమస్త్రీలు" అనుమాటచేత కూడ సీతనే గ్రహింపవలయును. సీత విలపించుచు అన్నమాటలను కూడ ఆమె లోకరీతి ననుసరించి, తాను గతించినచో రాముఁడు మరల భార్యాపరిగ్రహము గావింపవచ్చు నను తలంపుతో పలికినట్లే గ్రహింపవలసియున్నది. పరమస్త్రీలచే పరిమృష్టమైనభుజము అన్నసందర్భమునందు అలంకారకారిణులైన స్త్రీలనే గ్రహింపవలసియున్నది. "రాముఁడు అశ్వమేధాదిక్రతువులను గావించినాఁడు కదా! అందు పత్ను లావశ్యకము గదా "అన్నచో ఉత్తరకాండమునందు రాముఁడు సీతాప్రతిమనే యుంచి యజ్ఞములు గావించినట్లు స్పష్టముగా ఉన్నది. ఆయనకు సీత కాక వేఱొకభార్యయే యున్నచో సీతాప్రతిమతో పని యే మున్నది? కావున రామునకు సీత తప్ప వేఱుగా భార్యలు లే రనుట స్పష్టము-ఇదిగోవిందరాజస్వామి గావించినసిద్ధాంతము.

మంథర రామునిభార్యలనుగూర్చి కైకేయికోడండ్రనుగూర్చి బహువచనము నుపయోగించుట సహజము. రామునకు భరతునకు

అప్పటికి ఒక్కొక్కభార్యయే యున్నను వారు తరువాత ఎంతోమంది భార్యలను పరిగ్రహించుటకు అవకాశము కలదు. రాజులకు పెక్కుమంది భార్య లేర్పడుట సామాన్యము; ఏర్పడకుండుట అపవాదము. దశరథునకు మూఁడువందలయేఁబదిమంది భార్య లున్నారు కదా! అట్లే రామునకు భరతునకు కూడ భవిష్యత్తులో చాలమంది భార్య లేర్పడుదు రని మంథర ఊహించుట సహజము. ఈపద్ధతియందే సీత కూడ విలపించునప్పుడు తాను పోయినతరువాత రాముఁడు చాలమంది భార్యలను పరిగ్రహించి సుఖపడవచ్చు నని యూహించి పరితపించినది. ఇవి యూహలే కాని యథార్థము ననుసరించి చెప్పఁబడినమాటలు కాదు.

రాముఁడు సముద్రమునకు అభిముఖుఁడై మౌనముగా శయనించి "నే నిప్పుడు సాగరము నైన తరింపవలె, లేక మరణము నైన పొందవలె" అను నిశ్చయముతో నుండెను. అట్లు మూఁడురాత్రులు రాముఁడుపాసించుచున్నను సముద్రుఁడు ప్రత్యక్షము కాలేదు. నాల్గవనాఁడు రాముఁడు క్రుద్ధుఁడై లక్ష్మణుని చూచి యిట్లనెను. "లక్ష్మణా! ఈ సముద్రునిగర్వమును చూడుము. ఇంతవఱకును వచ్చి కన్పింపలేదు. గుణరహితులయందు శమము క్షమ ఆర్జవము ప్రియవాదిత్వము అను సజ్జనులగుణములు నిష్ఫలములు. ఆత్మప్రశంసఁ గావించుకొనువానిని, దుష్టుని, అక్రమవృత్తియందు సాహస మొనర్చువానిని, ఎల్లరను భయపెట్టి తఱుమువానిని, గుణహీనులయందువలె గుణవంతులయందు కూడ దండమును ప్రయోగించువానిని ఈలోకము సత్కరించును. సామోపాయముచేత కీర్తిని గాని యశస్సును గాని, యుద్ధమున జయమును గాని పొందుట శక్యము కాదు. క్షమాయుక్తుఁడ నైన నన్ను ఈసముద్రుఁడు అసమర్థునిగ తలంచుచున్నాఁడు. ఛీ! ఇట్టివానియందు క్షమను చూపు టేల? శరచాపముల నొసంగుము. ఈసముద్రమును శోషింపఁజేయుదును. వానరులు నడచియే పోవుదురు గాక!"

శ్లో॥ అవలేప స్సముద్రస్య న దర్శయతి య స్స్వయమ్।
ప్రశమ శ్చ క్షమా చైవ ఆర్జవం ప్రియవాదితా॥ 14

శ్లో॥ అసామర్థ్యఫలా హ్యేతే నిర్గుణేషు సతాం గుణాః।
ఆత్మప్రశంసినం దుష్టం ధృష్టం విపరిధావకమ్॥ 15

శ్లో॥ సర్వత్రోత్సృష్టదండం చ లోక స్సత్కురుతే నరమ్।
న సామ్నా శక్యతే కీర్తి ర్న సామ్నా శక్యతే యశః॥ 16

శ్లో॥ ప్రాప్తుం లక్ష్మణ లోకేఽస్మిన్ జయో వా రణమూర్ధని॥ 17

శ్లో॥ క్షమయా హి సమాయుక్తం మా మయం మకరాలయః। 20
అసమర్థం విజానాతి ధిక్ క్షమా మీదృశే జనే॥ 21

## యుద్ధ–సర్గ–21

రాముని ప్రసంగమున రాజనీతియందలి యొకముఖ్యలక్షణము స్పష్ట మగుచున్నది. దుష్టులు ధృష్టులు అయినవారియెడ క్షమను వహించుట సామరస్యమును చూపుట తగదు. ఆ క్షమాగుణమును వారే కాదు సాధారణప్రజలు కూడ అసామర్థ్యముగనే భావింతురు. లోకులు బలప్రయోగమునకు భయపడినంతగా సౌజన్యమునకు లోఁబడరు. అందువలన ధర్మాధర్మములసంఘర్షణమునందు కూడ సాధారణప్రజలు ఎవఁడు బలవత్తరుఁడో వానినే ఆశ్రయించి యోగక్షేమపరాయణులై యుందురు. అందువలన ధర్మరక్షణము చేయఁగోరువారు, ముఖ్యముగా ప్రభువులు, దుష్టులను బలప్రయోగమున శిక్షించుటకే పూనుకొనవల యును గాని వారియెడల క్షమను గాని సామరస్యమును గాని చూప రాదు. దానివలన దుష్టులు లొంగరు; ధర్మము స్థాపింపఁబడదు. అందు వలననే భగవంతుఁడు ధర్మసంస్థాపనకై యవతరించునప్పుడు సాధువు పులను రక్షించుటయే కాక దుష్టవినాశమును కూడ నిర్వహించును. కావున ధర్మపాలకులైన ప్రభువులకు రాజకీయనాయకులకును ఇదియే

ఆదర్శముగానుండవలెను. ముఖ్యమైనయీధర్మమును గ్రహింపక విదేశీయుల దండయాత్రలసందర్భములందు మన పూర్వరాజులు, పదవులను సంపాదించుకొనుప్రయత్నములలో ఇప్పటిరాజకీయనాయకులు కూడ దుష్టులతో ధృష్టులతో ధర్మదూషకులతో సామరస్యము నవలంబించి వారిని సంతృప్తిపఱచుటకు ప్రయత్నించుటయే నీతిగా అవలంబించుట (Policy of appeasement) అనర్థకరము, శోచనీయము. వెనుకటిరాజులు తమ కనర్హమైన శరణాగతత్రాణ మనుపద్ధతిలో ధర్మదూషకులకు శరణ మొసంగి, ఇప్పటినాయకులు సందర్భశుద్ధిలేని శాంతి, అహింస, సామరస్యము అనువిధానములతో ధర్మభంజకులను సంతుష్టి నొందించుటకు ప్రయత్నించుచు (Pamperig), ధర్మము నుపేక్షించి ప్రజలను కడగండ్లపాలు గావించుట శోచనీయము.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥ 4

భగవద్గీత–అధ్యా–4

లక్ష్మణునివలన శరచాపములను గైకొని రాముఁడు సముద్రముపై బాణములను ప్రయోగించెను. వానివలన పాతాళవాసులైన దానవులతో కూడ సముద్రము సంక్షుభిత మయ్యెను. అయినను సముద్రుఁడు ప్రత్యక్షము కాలేదు. అప్పుడు రాముఁడు సముద్రు నుద్దేశించి, "నాశరములచే నీయందలి జలమును జంతువులను హరింతును; ఈ సముద్ర మంతయు ధూళిమయ మగును; వానరులు నడచియే పోఁగలరు; నీవు గర్వితుఁడవై నావలనఁ గలుగనున్నవినాశమును గ్రహింపఁజాలకున్నావు" అని పలికి బ్రహ్మాస్త్రమును సంధించెను. ప్రకృతి యంతయు సంక్షోభించెను. దృశ్యాదృశ్యములైన భూతము లన్నియు పెద్దగా ఆక్రోశించెను. ఒకయోజనముమేర సముద్రజలము వెనుకకు పోయెను. మఱియొకవైపున సముద్రజలము చెలియలికట్ట నతిక్రమిం

చెను. అట్లు వెనుకకు పోవుచున్న సముద్రముపై రాముఁడు బాణము ను ప్రయోగింపలేదు.

చిత్రకూటమున భరతుఁడు ప్రత్యుపవేశనము కావించినప్పుడు రాముఁ డది క్షత్రియులకు ఉచితము కా దనెను. మఱి రాముఁ డాపద్ధతినే యిప్పుడు ఎట్లు అవలంబించెను? భరతుఁడు కావించినది ప్రత్యుపవేశనము. రాముఁడు కావించినది ఉపాసనము. మానవుఁడైన రాముఁడు దివ్యుఁడైన సముద్రుని ఉపాసించుటలో తప్పు లేదు. ఉపాసనమునకు సముద్రుఁడు ప్రత్యక్షము కానప్పుడు రాముఁడు మరల క్షాత్రమునే యవలంబించెను.

శ్లో॥ స త్రిరాత్రోషిత స్తత్ర నయజ్ఞో ధర్మవత్సలః।
ఉపాసత తదా రామ స్సాగరం సరితాం పతిమ్॥ 11

యుద్ధ-సర్గ-21

## 2 సాగరదర్శనము

రాముఁడు బ్రహ్మాస్త్రమును సంధించినతరువాత సముద్రుఁడు ప్రత్యక్షమయ్యెను, దీప్తాస్యములైన సర్పములతో, స్నిగ్ధవైదూర్య సంకాశుఁడై, జాంబూనదవిభూషణములతో రత్నమాల్యాంబరధరుఁడై, సర్వపుష్పమయమైన దివ్యమాలికను శీర్షమున ధరించి, కౌస్తుభసహోదరమైన మణిని ఏకావళియందు ధరించి పైకివచ్చి రాముని సంబోధించి ప్రాంజలియై యిట్లనెను. "రామచంద్రా! పంచభూతములు తమ స్వభావమునందు ఎప్పుడును వర్తించుచుండును. అగాధముగా అలంఘ్యముగా నుండుటయే నాస్వభావము. గాధత్వము లంఘ్యత్వము నాకు వికృతి. నేను కామలోభభయములవలన ఎప్పుడైనను నాజలమును స్తంభింపఁజేయను. నీకు పోవుటకు మార్గ మేర్పడునట్లు నీసేన

యంతయు దాఁటిపోవువఱకును మొసళ్లు బాధింపకుండునట్లును నేను సహింపఁగలిగిన యొకపద్ధతిని చెప్పెదను."

రాముఁ డందులకు సంతోషించి "సరే! అమోఘమైన యీబాణమును ఎక్కడ వేయు మందువు?" అనియడిగెను. సముద్రుఁడు, "ఇక్కడనుండి యుత్తరముగా ద్రుమకుల్య మనుప్రదేశము కలదు; అందు ఉగ్రదర్శనులు ఉగ్రకర్ములును అయినదస్యులు కలరు; వారు నాజలమును త్రావుచుందురు; ఆపాపకర్ముల స్పర్శమును నేను సహింపలేకున్నాను; నీబాణమును వారియందు అమోఘముగ ప్రయోగింపుము" అనిచెప్పెను. సాగరుఁడు చూపుచున్నవైపుగా రాముఁడు బాణమును వదలెను. ఆబాణపాతమున ఆప్రదేశము బీటలువాఱి మహానాద ముద్భవిల్లెను. ఆబాణతాపమున అచ్చటనున్న జల మంతయు శోషితమై యది మరుకాంతార మనుపేర ప్రసిద్ధ మయ్యెను. మరుప్రదేశమైన యాసముద్రకుక్షి పశుహితమై అల్పరోగమై ఫలమూలరసోపేతమై క్షీరౌషధిసమృద్ధ మగునట్లు రాముఁడు వర మిచ్చెను. కావున అది మరుభూమి యయ్యును శోభనదేశమే యయ్యెను.

ఇది సేతువునకు ఉత్తర మనుటవలన నేఁటిరాజస్థానప్రాంతమైన థార్ ఎడారియై యుండవచ్చును. బాణపాతమున అప్పుడున్న దస్యులందఱు నశించినతరువాత కొంతకాలమునకు అందు కొన్నిప్రాంతములు సుభిక్షములై జనపదము లయ్యె నన్నమాట.

అట్లు ఆకుక్షిప్రదేశము దగ్ధమైన పిమ్మట సముద్రుఁ డిట్లనెను. "ఈ నలుఁడు విశ్వకర్మని పుత్త్రుఁడు; తండ్రివలన వరమును పొందినవాఁడు; తండ్రియంతటివాఁడే. ఇతఁడు జలమునందు సేతువును నిర్మించును గాక. దానిని నేను ధరింతును." ఇట్లు చెప్పి సముద్రుఁడు అంతర్ధానము నొందెను.

‘‘దానిని నేను ధరింతును’’ అని సముద్రుఁడు చెప్పుటవలన సేతునిర్మాణప్రదేశమున తాను గాధత్వమును పొంది, అనఁగా లోతు లేనివిధముగా మెరకయగునట్లు, ఉండు నని చెప్పినట్లయినది. లోతు లేనినీటియందు సేతువు చక్కఁగా నిలుచుటయే కాక మొసళ్ళు నిలువఁ జాలకదూరముగా పోవును.

అప్పుడు నలుఁడు లేచి రామునితో ఇట్లనెను. “ఇందు నేను సేతువును నిర్మింతును. సముద్రుఁడు చెప్పినది నిజము. మందరపర్వతమునందు నివసించునప్పుడు మాతండ్రియైన విశ్వకర్మ, ‘‘నావంటి పుత్త్రుఁడు నీకుఁ గలుగు” నని మాతల్లికి వర మొసంగెను విశ్వకర్మ నకు ఔరసపుత్త్రుఁడ నగుటచే నేను ఆయనకు సమానుఁడను. నన్ను మీరు అడుగకుండుటచే నాయంతట నేను నాగుణములను ప్రస్తావించుట యనుచిత మని ఊరకుంటిని. ఇప్పుడే వానరులు సేతునిర్మాణమునకు ఉద్యమింతురు గాక.’’ పిదప నలుఁడు వానరులతో ఇట్లనెను. “లోకమున దండోపాయమే శ్రేష్ఠ మని తలంతును. సముద్రునివంటియకృతజ్ఞులయందు క్షమ గాని సాంత్వనము గాని తగదు. ఈసాగరుఁడు దండభీతి కలిగినతరువాతనే కదా, సేతునిర్మాణము ఎట్లు జరుగునో చూడవలయు నను తలంపుతో, గాధప్రదేశమును రామున కొసంగెను.’’

శ్లో॥ దండ ఏవ పరో లోకే పురుష స్యేతి మే మతిః।
ధిక్ క్షమా మకృతజ్ఞేషు సాన్త్వం దాన మథాపి వా॥ 45

శ్లో॥ అయం హి సాగరో భీమః సేతుకర్మదిదృక్షయా।
దదౌ దండభయా ద్గాధం రాఘవాయ మహోదధిః॥ 46

యుద్ధ–సర్గ–22

దండమునకు లోకము లొంగినట్లుగా సామోపాయమునకు లొంగదని రామునియభిప్రాయమునే నలుఁడు మరల ఉద్ఘాటించినాఁడు. అంతే కాక సాగరుఁడు కృతజ్ఞత లేనివాఁడుగా వర్తించె నన్నియు నలుఁడు

సాగరుని ఆక్షేపించినాఁడు. విభీషణుఁ డాదిగా అందఱును సగరపుత్త్రుల వలన వర్ధిల్లినసాగరుఁడు రామునకు వెంటనే ప్రత్యక్షమై యుపకారము చేయు ననియే ఆశపడుచుండిరి. మూఁడు రాత్రులు రాముఁ డుపాసించినను సముద్రుఁడు కన్పింపనప్పుడు రామునితోఁబాటు నలునివలె సుగ్రీవాదులు కూడ సాగరునిపై కోపమును పొందియుందురు. తనకు ప్రసంగించుటకు అవకాశము కలుగుటచే నలుఁడు ఆకోపమును ప్రకటించెను.

నలుఁ డన్నట్లు సాగరునకు కృతజ్ఞత లేదా? సగరవంశస్థుల విషయమున కృతజ్ఞతను ప్రకటించి రామునిదూతయైన హనుమంతునకు సాయ మొనర్చుటకే మైనాకుని ప్రోత్సహించినసముద్రుఁడు, రాముఁడు మూఁడుదినము లుపాసించినను ప్రసన్నుఁడు కాకుండు టెందువలన? రామునకు కోపము వచ్చునట్లు చేసి ఆయన సంధించినబ్రహ్మాస్త్రముచేత ద్రుమకుల్యమునందలి దస్యులను సంహరింపఁజేయుటకే సముద్రుఁ డట్లు వర్తించెను. దివ్యుఁడైన సముద్రుఁడు రాముని ఆవిషయమై అర్థించుటకు ఇష్టపడక ఈపద్ధతియందు తనయభీష్టమును నెఱవేర్చు కొనెను. ఉపాస్యదైవతస్థానమున నున్న సముద్రుఁడు సేతునిర్మాణమునకు అనుజ్ఞ నిచ్చి అందులకు ప్రతిఫలముగా దస్యుసంహారమును కోరుటయు ఉచితముగా నుండదు. కావున సముద్రుఁ డిట్లు వర్తించెను.

## ౩. సేతునిర్మాణము

నలుఁడు సేతునిర్మాణమునకు పూనినంతనే రాముని యానతిపై వానరులు ఋక్షులు అడవులకు పోయి కొండలవంటి మహావృక్షములను పెకలించి తెచ్చి సేతువుయొక్క మార్గమునందు నింపిరి. పిమ్మట వారు నలునినిర్దేశము ననుసరించి హస్తిప్రమాణములైన పాషాణము

లను గండశిలలను యంత్రములతో తీసికొనివచ్చి యావృక్షషండములపై వైచుచుండిరి. కొందఱు సూత్రములు పట్టి మార్గమును తీర్చుచుండఁగా కొందఱు దండములు ధరించి వృక్షములను శిలలను యథోచితముగా కూర్చుచుండిరి. తృణకాష్ఠములతో పుష్పితాగ్రములైనవృక్షములతో, నలుఁడు తండ్రియైన విశ్వకర్మయే వచ్చె ననునట్లు, దశయోజనవిస్తృతమై శతయోజనాయతమైన సేతువును నిర్మింపఁజొచ్చెను. మొదటిదినమున పదునాల్గు. రెండవదినమున ఇరువది, మూఁడవదినమున ఇరువదియొక్కటి, నాల్గవదినమున ఇరువదిరెండు, అయిదవదినమున ఇరువదిమూఁడు యోజనములు నిర్మింపఁబడెను. ఆకాశమున స్వాతిపథమువలె ఆసేతువు సముద్రముపై విరాజిల్లెను.

సాగరమునకు పాపటవలె నున్న యాసేతువును దేవగంధర్వసిద్ధాదులు వచ్చి పరమాశ్చర్యముతో చూడఁజొచ్చిరి. సేతువును కట్టుచు కొంతమంది యవ్వలితీరమునకు చేరిరి. గదాపాణియై విభీషణుఁడు అగ్రగామియై చని యవ్వలితీరమున నిలిచెను. ఆఱవదినమున రాముఁడు హనుమంతునిపై, లక్ష్మణుఁడు అంగదునిపై కూర్చుండి సుగ్రీవునితో కూడ సైన్యములను నడుపుకొనుచు సముద్రమును దాఁటి దక్షిణతీరమును చేరి అక్కడ విడిదిచేసిరి.

రాముఁడు లోకక్షయసూచకములైన నిమిత్తములను చూచి లక్ష్మణునితో, "త్వరలో మహాయుద్ధము సంభవించి రాక్షసవినాశము సంభవింపఁగలదు; ఇప్పుడే మనము పోయి లంకచుట్టును వ్యూహములుగా సైన్యముల నేర్పఱచి ముట్టడింతము" అని ధనుష్పాణియై బయలుదేరెను. విభీషణసుగ్రీవులనాయకత్వమున సైన్యములు వీరనినాదములు గావించుచు లంకను చేరెను. లంకలో మ్రోఁగుచున్న భేరీమృదంగ ఘోషమును విని ఋక్షవానరవీరులు సహింపక అంతకన్నను బిగ్గరగా వీరఘోషమును గావించిరి.

చిత్రధ్వజపతాకినియైన లంకను చూడఁగానే రాముఁడు సీతను స్మరించి దుఃఖించి వెంటనే ధైర్యము నవలంబించి సేనావిభాగమును గావించెను. "గరుడాకారమైన వ్యూహమున అంగదుఁడు ఉరోభాగమున, దక్షిణపార్శ్వమునందు ఋషభుఁడు, ఎడమవైపున గంధమాదనుఁడు, జాంబవంతుఁడు సుషేణుఁడు వేగదర్శియు కుక్షిప్రదేశమున, జఘన భాగమున సుగ్రీవుఁడు సేనాసమావృతులై యుండవలయును; నేను లక్ష్మణునితో జాగరూకుఁడనై శిరోభాగమున నుందును" అని రాముఁడు ఆజ్ఞాపించెను. అట్లే సైన్య మంతయు విభక్తమై సన్నద్ధ మయ్యెను.

అప్పుడు రాముఁడు సుగ్రీవుని చూచి, "సైన్య మంతయు విభక్త మైనది కదా! ఇంక శుకుని వదలిపెట్టు" మనెను. సుగ్రీవుఁ డట్లే కావించెను.

## 4. చారకృత్యము

బంధముక్తుఁడైన శుకుఁడు కడుభీతితో పరువెత్తుచు రావణుని యొద్దకు పోయెను. రావణుఁడు వానిని చూచి నవ్వుచు, "నీకు రెక్క లూడినట్లున్నవే! ఆ చపలచిత్తులైన వానరులచేతికి చిక్కితివా యేమి!" అని యడిగెను. శుకుఁ డిట్లు చెప్పెను. "నీ సందేశమును నేను చెప్పు చుండఁగనే వానరులు నాపైఁ బడి పిడికిళ్ళతో పొడువఁజొచ్చిరి. వారితో మాటాడుటకుఁ గాని ప్రశ్నించుటకుఁ గాని యవకాశమే లేకుండెను. ఖరవిరాధకబంధనిహంతయైన యా రాముఁడు సేతువు నిర్మించి సాగ రము దాఁటి లంకను ముట్టడించియున్నాఁడు. వానరసైన్యములు ప్రాకార ములపైకి ఎగఁబ్రాకకముందే సీతను రామున కొసంగుము; లేదా యుద్ధ మున కైన సిద్ధపడుము."

రావణుఁడు క్రుద్ధుఁడై యిట్లనెను "సర్వలోకభయమే తట స్థించినను నేను సీత నీయను. రామునకు నాబలము తెలియదు; అందు

వలన నాపైకి వచ్చుచున్నాఁడు. నేను శత్రువాహినీమహారంగమున ప్రవేశించి శరకోణములతో చాపమయియైన వీణను మ్రోగించి తుములమైన యల్లెత్రాటిమ్రోఁతను, నారాచనిస్వనమును, క్షతగాత్రులయార్త నాదమును ఘోరసంగీతమునుగా పుట్టింతును." వెంటనే రావణుఁడు శుకసారణులను చూచి, "మీరు రామునిసైన్యమున ప్రవేశించి సేనా పరిమాణ మెంత యున్నదో, మంత్రు లెవరో, సేనాపతి యెవఁడో మొదలగువిశేషములను కనుగొని రండు" అని పంపెను.

శ్లో॥ మమ చాపమయీం వీణాం శరకోణైః ప్రవాదితామ్॥ 42

శ్లో॥ జ్యాశబ్దతుములాం ఘోరాం మార్గగీతమహాస్వనామ్।
నారాచతలసంనాదాం తాం మ మాహితవాహినీమ్।
అవగాహ్య మహారంగం వాదయిష్యా మ్యహం రణే॥ 43

తి. టీక:–అత్ర తుముల మహాస్వన సంనాద శబ్దైః వీణాయాః మంద్రమధ్యతారాః శబ్దా ఉక్తాః।

## యుద్ధ–సర్గ–24

శుకసారణులు వానరరూపధరులై రామునిసైన్యమున ప్రవేశించి పర్వతాగ్రములందు నదులందు గుహలయందును విడిసియున్న సైన్యములను, సాగరమును దాఁటి వచ్చుచున్నబలములను, దాఁటఁగోరుచున్నవానిని చూచి మొత్తము సైన్యముయొక్క పరిమాణము ఇంత యని నిశ్చయింపఁజాలక విస్మితులై తిరుగుచుండిరి. విభీషణుఁడు వారిని జూచి గుర్తించి పట్టుకొని రామునిసన్నిధికి తీసికొనిపోయి, "వీరు రావణునిమంత్రులు శుకసారణులు; గూఢచారులై వచ్చిరి" అని చెప్పెను. వారు మహాభీతితో వచ్చినపనిని విన్నవించిరి. రాముఁడు నవ్వుచు, "మీరు చక్కఁగా మాసైన్యము నంతయు ఇప్పటికే చూచి యున్నచో నిశ్చింతగా పొండు; ఇంకను చూడవలసినది యున్నచో విభీషణుఁడు మీకు సర్వమును చూపఁగలఁడు; మీ కేమియు భయము

లేదు; స్వేచ్ఛగా సంచరింపుఁడు; పొండు" అని పలికి వారిని వదలి పెట్టుమని విభీషణునకు చెప్పెను. వారు బంధముక్తులై బయలుదేఱు చుండఁగా రాముఁడు వారిని చూచి రావణునితో ఇట్లు చెప్పుఁ డనెను. "ఏబలము నాశ్రయించి నీవు సీతను హరించితివో ఆబలము నంతయు చూపుము. రేపు ప్రాతఃకాలముననే నీనగరము రాక్షసులును నాశరములచే విధ్వంసము నొందుదురు.''

శుకసారణులు రావణునియొద్దకువచ్చి రామునిసందేశమును చెప్పిరి. పిదప సారణుఁ డిట్లనెను. ''రామలక్ష్మణవిభీషణసుగ్రీవులు నల్వురే లంకావిధ్వంసమునకు చాలియున్నారు; అసలు రాముఁ డొక్కఁడే చాలును." రావణుఁ డిట్లనెను. "సారణా! నీవు వానరపీడితుఁడవై మహాభీతిచే ఇట్లు మాటాడుచున్నావు. దేవదానవగంధర్వులలో నా కెదురు ఎవఁ డున్నాఁడు? సర్వలోకములవలన భయము కలిగినను నేను సీత నీయను."

పిదప రావణుఁడు పెక్కుతాఁటిచెట్లయెత్తున నున్న తన సౌధముయొక్క ఉపరితలమునకు శుకసారణులతో చేరి యటనుండి సముద్రమువైపు చూడఁగా లంకకు సముద్రమునకు మధ్య నున్న భూమి పర్వతములు వనములు ఋక్షవానరులతో నిండియుండెను. అతఁడు సారణుని చూచి, ''వీరిలో ముఖ్యు లెవరు? శూరు లెవరు? మహాబలు లెవరు? ముందుకు దూఁకివచ్చుచున్నవా రెవరు? ఎవరి మాటలను సుగ్రీవుఁడు వినును?" అని యడిగెను, సారణుఁడు, నీలుఁడు అంగదుఁడు హనుమంతుఁడు మొదలుగా వానరముఖ్యులను చూపి వారి పరాక్రమోత్సాహములను వారిసేనాపరిమాణములను వర్ణించి, "వీరిలో ఒక్కొక్కఁడు లంకను జయింపఁగలఁ" డన్నట్లుగా ప్రశంసించెను. శుకుఁడు కూడ మిగిలిన సుగ్రీవాదులను చూపి వారిసేనాపరిమాణము లను తెలిపి వారిపరాక్రమాదులను మిగుల ప్రశంసించెను. రావణుఁడు

ఆప్రశంసలను విని మండిపడి "మీరు రాజనీతిశాస్త్రమును చదివినారు గదా! ఏమి ఫలము! అవిజ్ఞానమంతయు మీబుద్ధికి బరువుచేసైనదే కాని మీకు కొంచెము కూడ తెలివి కలుగలేదు. ప్రభువుసమక్షమున శత్రువుల నిట్లు ప్రశంసించుమంత్రులు కూడ ఎక్కడ నైన నుందురా? భాగ్యవశమున మీవంటిమూర్ఖులను మంత్రులనుగా పెట్టుకొని నే నింకను ఈమాత్రముగ ఉన్నాను. శత్రుపక్షమును ప్రశంసించుచున్న మిమ్ము ఇప్పుడే సంహరింపఁగలను. అయినను మీరు గావించిన పూర్వోప కృతులను స్మరించి మిమ్ము వదలుచున్నాను. పొండు; ధ్వంసము కండు" అని తిరస్కరించెను. వారు సిగ్గుపడి రావణుని జయశబ్దముతో అభినందించుచు వెడలిపోయిరి.

శ్లో॥ గృహీతో వా న విజ్ఞాతో భారో జ్ఞానస్య వాహ్యతే।
ఈదృశై స్స చివై ర్యుక్తో మూర్ఖై ర్దిష్ట్యా ధరా మ్యహమ్॥ 10

శ్లో॥ అపధ్వంసత నశ్యధ్వం సన్నికర్షా దితో మమ।
న హి వాం హన్తు మిచ్ఛామి స్మరా మ్యుపకృతాని వామ్॥ 14
యుద్ధ-సర్గ-29

తరువాత రావణుఁడు శార్దూలప్రముఖులైన చారులను పిలిపించి. "రాముఁ డెట్లు నిద్రించును? ఎట్లు మేల్కొనును? ఇప్పు డేమి చేయఁ దలంచుచున్నాఁడు? ఇవి మొదలుగా అన్నివిషయములు తెలిసికొని రండు; చారులచే శత్రువులవిషయమును చక్కఁగా గ్రహించినవాఁడు అల్పప్రయత్నముననే వారిని సంహరింపఁగలఁడు" అని యాదేశించి పంపెను.

వారు రావణునకు ప్రదక్షిణ మొనర్చి సువేలశైలమునకు వచ్చి రామలక్ష్మణులను సేనాసముదాయములను పరిశీలింపఁజొచ్చిరి. విభీష ణుఁడు వారిని గుర్తించి శార్దూలుని పట్టుకొని రాముని ముందుంచెను.

తక్కినవారిని వానరులు హింసింపఁజొచ్చిరి. రాముఁడు కరుణించి వారి నందఱను విడిపించెను. వారు భయవిహ్వలులై ఎగశ్వాసతో లంకకు చేరిరి.

రావణుఁడు శార్దూలుని చూచి, "నీముఖవర్ణము యథాపూర్వముగ లేదే! దీనుఁడవై యున్నావే! కుపితులైన శత్రువులవారిని వడలేదు గదా!" అనెను. శార్దూలుఁడు మెల్లగా నిట్లనెను. "అక్కడ చారకృత్యమే సాధ్యము కాదు. మార్గము లన్నియు పర్వతసన్నిభులైన ఋక్షవానరులచేత రక్షింపఁబడుచున్నవి. వారితో మాటాడుటకుఁ గాని ప్రశ్నించుటకుఁ గాని అవకాశమే లేదు. నేను ఆసేనాసముదాయములో ప్రవేశించుచుండఁగనే నన్ను వారు గుర్తించి పెక్కువిధముల హింసించుచు రాముని యొద్దకుఁ గొనిపోయిరి. రాముఁడు కరుణించి మమ్ము విడిపించెను. రాముఁడు మమ్ము పంపించి గరుడవ్యూహముతో లంకాభిముఖముగ వచ్చుచున్నాఁడు; త్వరలోనే ప్రాకారమును చేరఁగలఁడు; ఈలోపల సీత నొసంగుము; లేదా యుద్ధమునకైన సన్నద్ధుఁడవు గమ్ము." రావణుఁడు వారిని నిరాకరించి, "దేవదానవగంధర్వులు ఎత్తి వచ్చినను నేను సీత నొసంగను; అది యటుండ నిమ్ము; అక్కడ అంతటను నీవు త్రిప్పఁబడితివి గదా! వారిలో ఎవరు శూరులో ఎవరు దురాసదులో చెప్పుము'' అనెను.

శార్దూలుఁడు సుగ్రీవసుషేణ జాంబవదాదివీరులను ప్రశంసించెను.

## 5. సీతావిమోహనము

రావణుఁడు చారులను పంపి మంత్రులను సమావేశమొనర్చి వారు చేయఁదగినకార్యములను నిశ్చయించి వారిని పంపి, విద్యుజ్జిహ్వుని గైకొని అంతఃపురమున ప్రవేశించి, "నీవు రామునిశీర్షమును ధనుశ్శర

ములను సృష్టింపుము; వానితో సీతను వంచింతము'' అని ఆదేశించెను. వాఁడు వెంటనే వానిని సృష్టించి చూపెను. రావణుఁడు వానిని మెచ్చి ఆభరణమును బహూకరించి, "నేను సీతతో మాటాడుచున్నప్పుడు నీవు రాముఁడు సంహరింపఁబడె నని చెప్పుచు ఆనవాలుగా వీనిని ప్రదర్శింపుము'' అని వానితోఁ గూడ అశోకవనమునకు పోయెను.

రావణుఁడు సీతయొద్దకు పోయి ఇట్లు చెప్పెను. "నీవు ఎవనిని ఆశ్రయించి నన్ను తిరస్కరించుచున్నావో ఆరాముఁడు నిహతుఁడైనాఁడు. పాపము! అతఁడు నన్ను హతమొనర్ప వలె నని వానరుల మూకలతో పెద్దయాశతో సముద్రము దాఁటి వచ్చినాఁడు. కాని ఏమి ప్రయోజనము? ప్రయాణపుబడలికచే వా రందఱును సువేలశైలమున ఒడలు మఱచి నిద్రించుచుండఁగా ముందుగా మనచారులు పోయి చూచి వచ్చిరి. పిదప ప్రహస్తుఁడు పెద్దసైన్యముతో పోయి ఋక్షవానరబలమును నాశ మొందించి రామునిశిరమును ఖండించెను. సుగ్రీవుఁడు భగ్నగ్రీవుఁ డయ్యెను. లక్ష్మణాదులు పలాయితులైరి. ఇదిగో రక్తార్ద్రమై రజోధ్వస్తమైన రామునిశిరస్సు." పిదప రావణుఁడు విద్యుజ్జిహ్వుని పిలుచుకొని రమ్మని ఒకరాక్షసిని పంపెను.

విద్యుజ్జిహ్వుఁడు రాఁగానే రావణుఁడు, "ఈమెను భర్తయొక్క చరమగతిని చక్కఁగా చూడనిమ్ము! ఖండితమైన యా రామునిశిరస్సును తెచ్చి చూపుము'' అనెను. వెంటనే విద్యుజ్జిహ్వుఁడు తాను సృష్టించిన రామునిశిరస్సును ధనుర్బాణములను తెచ్చి అచ్చట నుంచి వెంటనే యంతర్ధానము నొందెను. రావణుఁడు, ''ఇదిగో రామునియొక్క ధనుస్సు; చూడుము'' అని యాకార్ముకమును సీతచెంతకు విసరెను.

సీత రామునిశిరస్సును ఆకార్ముకమును చూచి, హనుమంతుఁడు చెప్పినమాటలకు సరిపోవుచున్న రావణుని కథనమును విని, అది యంతయు నిజ మనుకొని భ్రాంతయై ఏడ్చుచు కైకేయిని నిందించెను.

తరువాత ఆమె తన్ను తాను నిందించుకొనెను. "ఓకైకేయీ! రఘుకుల నందనుఁడైన రాముఁడు హతుఁడైనాఁడు! ఇంక నీకోరిక తీరినట్లే. కలహశీలవైన నీచేత కులము అంతయు విధ్వస్తమైనది. రాముఁడు నీకు ఏమి అపకారము చేసినాఁ డమ్మా! ఈయనను నాతో కూడ అడవులకు పంపితివి!

ముందుగా భర్త మరణించె నన్నచో అది భార్యయొక్క దోషమువలననే సంభవించు నని చెప్పుదురు. రామా! నీవు సద్వర్తనుఁడవు; నాదోషమువలననే మరణించితివి. నృశంసురాలను రౌద్రస్వభావము కలదానను, కాలరాత్రివంటిదానను అయిన నన్ను పొంది కమలలోచనుఁడవైన నీవు ఇట్లయితివి. బాలుఁడవైన నీవు బాలికనైన నన్ను సహచారిణినిగా గ్రహించితివి. అట్టి నన్నేల చూడవు? నాతో నేల మాటాడవు? కులపాంసనినైన నన్ను మోహావశమున భార్యనుగా పొందితివి. నేను నీకు భార్యారూపమున మృత్యువు నైతిని. నీతి విదుఁడవైన నీవు పొంచి పైఁబడుచున్న మృత్యువు నేల గుర్తింపవైతివి?"

శ్లో॥ ఏతైః స్వరైర్వ రభిజ్ఞానై రభిజ్ఞాయ సుదుఃఖితా।
విజగర్హేఽథ కైకేయీం క్రౌశన్తీ కురరీ యథా॥ 3

శ్లో॥ సకామా భవ కైకేయీ హతోఽయం కులనందనః।
కుల ముత్సాదితం సర్వం త్వయా కలహశీలయా॥ 4

శ్లో॥ ఆర్యేణ కిం ను కైకేయి కృతం రామేణ విప్రియమ్।
య న్మయా చీరవసన స్త్వయా ప్రస్థాపితో వనమ్॥ 5

శ్లో॥ ప్రథమం మరణం నార్యాః భర్తు ర్వైగుణ్య ముచ్యతే।
సువృత్తః సాధువృత్తాయాః సంవృత్తః త్వం మ మాగ్రతః॥ 9

శ్లో॥ అదృష్టం మృత్యు మాపన్నః కస్మా త్త్వం నయశాస్త్రవిత్।
వ్యసనానా ముపాయజ్ఞః కుశలో హ్యసి వర్జనే॥ 14

శ్లో॥ తథా త్వం సంపరిష్వజ్య రౌద్ర యాతినృశంసయా।
కాలరాత్ర్యా మ యాచ్ఛిద్య హృతః కమలలోచన॥ 15

శ్లో॥ కిం మాం న ప్రేక్షసే రాజన్ కిం వా న ప్రతిభాషసే।
బాలాం బాలేన సంప్రాప్తాం భార్యాం మాం సహచారిణీమ్॥ 20

శ్లో॥ అహం దాశరథే నోఢా మోహా త్స్వకులపాంసనీ।
ఆర్యపుత్రస్య రామస్య భార్యా మృత్యు రజాయత॥ 29

యుద్ధ-సర్గ-32

ఆమె యిట్లు విలపించుచు రావణునితో, ''నాభర్తశరీరమును తెప్పించి దానిపై నుంచి నన్ను కూడ సంహరింపుము; మాశరీరముల నొకచో చేర్చి పుణ్యము కట్టుకొనుము; నేను మహాత్ముఁడైన నాపతి యొక్క మార్గము ననుసరింతును" అని విలపింపఁజొచ్చెను.

ఇంతలో ఒకరాక్షసుఁడు వచ్చి, "ప్రభూ! ప్రహస్తుఁడు సకలామాత్యయుతుఁడై నీదర్శనము కోరుచున్నాఁడు; ఆత్యయికమైన పరిస్థితి కలిగిన దఁట; వారికి దర్శన మిమ్ము" అని విన్నవించెను. రావణుఁడు వెంటనే అటనుండి వెడలిపోయెను అతఁడు వెడలినంతనే ఆశిరస్సు ధనుశ్శరములును అంతర్హితము లయ్యెను.

మాయామోహితయై విలపించుచున్న సీతయొద్దకు సరమవచ్చి యిట్లు ఓదార్చెను. "అమ్మా! ఊఱడిల్లుము. ఇది యంతయు పెద్ద మాయ. నేను చాటున నుండి రావణుఁడు నీతో కావించుచున్న ప్రసంగమును వింటిని. అది యంతయు అసత్యము. అతఁడు నీయందు మాయను ప్రయోగించినాఁడు. రాముని విషయమున సౌప్తికవధము అసంభవము. రామునిచే రక్షింపఁబడుచున్న వానరబలమును నిర్మా

లించుటయు శక్యము కాదు. ఇంతకు ముందే చారులు పోయి తిరిగివచ్చి రాముఁడు వానరబలములతో సాగరమును దాఁటి వచ్చె నని చెప్పిరి. అది విని రావణుఁ డీ మాయను ప్రయోగించెను. నే నిప్పుడే లక్ష్మణ సహితుఁడై వానరవీరపరివేష్టితుఁడై యున్న రాముని చూచి వచ్చితిని. భయము నొందకుము; దుఃఖింపకుము."

ఇట్లు సరమ చెప్పుచుండఁగా భేరీనినాదము వినిపించెను. అప్పుడు సరమ మరల సీతతో ఇట్లు చెప్పెను. "అదిగో భేరీనినాదము. రావణుఁడు సంభ్రాంతుఁడై వెడలిపోయి మంత్రులతో ఆలోచించి సమ రము నిశ్చయించి సైన్యోత్థానమును ఆజ్ఞాపించినాఁడు. అదియే యీ భేరీ నినాదము. చతురంగబలములు సన్నద్ధము లగుచున్నవి. త్వరలోనే రాముఁడు శత్రుసంహారముఁ గావించి నిన్ను చేపట్టఁగలఁడు."

సీత యూరడిల్లి సరమతో నిట్లనెను. "సరమా! నేను ఈవనము నందు నిబద్ధనై ఏవార్తయు నెఱుంగక యుద్విగ్ననై యుంటిని. మాటిమాటికి వచ్చి రావణుఁడు నన్ను భయపెట్టుచున్నాఁడు. ఇప్పుడు మంత్రులతో ఆలోచించి అతఁడు ఏమి నిశ్చయించెనో తెలిసికొని రమ్మ. అదియే నాకు మహానుగ్రహము."

సరమ వెంటనే రావణునిసమీపమునకు పోయి అచ్చటి పరి స్థితిని తెలిసికొని వచ్చి సీతతో ఇట్లు చెప్పెను. "ఆప్తులు రావణుని చేరి హితము నుపదేశించుచున్నారు. జనస్థానమున జరిగినఖరాదుల వధ, సాగరలంఘనము మొదలగునవి సాధారణమానవకృత్యములు కా వని, నిన్ను రామునికొసంగి సంధిచేసికొను, మని తల్లి వృద్ధ మంత్రి అవిద్ధుఁడును రావణునకు ఉపదేశించిరి. అతఁ డంగీకరింపక యుద్ధమే నిశ్చయించెను." సరమ ఇట్లు చెప్పుచుండఁగా భేరీనినాద ముతో కలిసి శంఖాదినాదములు కూడ ఋక్షవానరసైన్యప్రస్థానమును సూచించుచు వినిపించెను.

శ్లో॥ జనన్యా రాక్షసేంద్రో వై త్వన్మోక్షార్థం బృహద్వచః।
అవిద్ధేన చ వైదేహి మంత్రివృద్ధేన బోధితః॥ 20

యుద్ధ–సర్గ–34

రావణునకు తల్లియైన కైకసి వృద్ధమంత్రియు అప్పుడు హితమును బోధించుచున్నా రని సరమ చెప్పినది. తాతయైన మాల్యవంతుఁడు కూడ సీత నొసంగు మని స్పష్టముగనే చెప్పెను. విభీషణుఁడు, అవింధ్యుఁ డను రాక్షసవిద్వాంసుఁడు కూడ రావణునకు హితమును బోధించుచుండి రని సీత హనుమంతునితో మాటాడునప్పుడే చెప్పినది (సుందర–సర్గ–37–శ్లో–12). అనఁగా విభీషణునియభిప్రాయమును వీ రందఱు సమర్థించుచున్నా రన్నమాట. వీ రందఱును రావణునకు గురుస్థానీయులు. విభీషణుఁడు అన్నకు తుదిసారి హితమును బోధించి పరిత్యక్తుఁడై వచ్చుటకు ముందు తల్లితో మాతామహునితో అవింధ్యాదులతో తనకర్తవ్యమునుగూర్చి అనేకపర్యాయములు చర్చించి యుండుట సహజము. తల్లి మాతామహుఁడు కూడ, "ఈరావణుఁడు ఎట్లును చెప్పినమాట వినఁడు; రాక్షసులకు వినాశము తప్పదు. నాయనా! నీవైన రాముని శరణమును పొంది చిరంజీవి వగుము" అనియే యుపదేశించియుందురు. అందుచేత విభీషణుఁడు తల్లియొక్క ఆదేశమువలన కూడ రాముని శరణము పొందియుండును. కావున కుటుంబధర్మదృష్టియందు కూడ తల్లి ప్రత్యక్షదైవత మగుటచేత ఆమెయాదేశమును పాటించినవిభీషణుఁడు ధర్మమునే ఆచరించెనని గ్రహింపవలసియున్నది.

## 6. మాల్యవంతునియుపదేశము

రావణుఁడు, సభయందుండఁగనే రామసైన్యాగమనసూచకములైన భేరీశంఖాదినినాదములను, విని కొంతసేపు చింతించి మంత్రులను

చూచి, "రాముని సాగరతరణమును అతని బలపౌరుషములను గూర్చియు మీరు చెప్పిన దంతయు వింటిని; కాని మీ రందఱును యుద్ధమున సత్యపరాక్రము లనియు నెఱుంగుదును; అట్టి మీరు తూష్ణీంభావముతో ఒకరి నొకరు చూచుకొనుచున్నా రేమి?" అని యడిగెను.

అప్పుడు రావణునిమాతామహుఁడు మాల్యవంతుఁ డిట్లనెను "రాజు నయకోవిదుఁడై కార్యములను నిర్వహించినచో గొప్ప యైశ్వర్యము నొందును. తా నధికుఁడై నప్పుడు యుద్ధమును, శత్రువుకన్న తాను హీనుఁడో వానితో సమానుఁడో అయినప్పుడు సంధిని గావించుకొనవలయును. ఇప్పుడు నాకు రామునితో సంధియే రుచించుచున్నది. ఈ యుద్ధమునకు మూలమైన సీతను రామున కొసంగుము. దేవర్షు లందఱును రామునిపక్షమున నున్నారు. లోకపితామహుఁడు ధర్మాశ్రయులుగా దేవతలను అధర్మాశ్రయులనుగా రాక్షసులను రెండుపక్షములుగా సృష్టించెను. ధర్మము ప్రబలి యధర్మమును నిగ్రహించునప్పుడు కృతయుగ మగును. అధర్మము ప్రబలి ధర్మమును గ్రసించునప్పుడు కలి ప్రవర్తించును. నీవు దిగ్విజయము కావించునప్పుడు మహర్షుల తపోయజ్ఞాదులను భంగపఱచి ధర్మమును హత మొనర్చితివి. అధర్మము ప్రబలి నీతపోబలము క్షీణించినది. ఇప్పుడు దేవతలబలము పెరుగుచున్నది. మహర్షులప్రభావము ప్రదీప్తమైనపావకజ్వాలవలె దుర్ధర్షముగా నున్నది. వారు ధర్మపక్షమును అనుగ్రహించుచున్నారు. రాక్షసులతేజము ధూమావృత మైన ట్లున్నది. నీవు దేవదానవయక్షాదులవలన మృత్యువు లేకుండ వరమును పొందితివి. ఇప్పుడు నరవానరులు ప్రబలి నీపైకి వచ్చుచున్నారు. లంకయం దంతటను వినాశసూచకములైన యుత్పాతములు గోచరించుచున్నవి. సముద్రమున సేతుబంధనము గావించినరామునిప్రభావమును గుర్తించి సంధిఁ గావించుకొనుము. చక్కఁగా విచారించి యుక్తమైన కార్యమును గావింపుము.

శ్లో॥ ధర్మో వై గ్రసతేఽధర్మం యదా కృత మభూ ద్యుగమ్।
అధర్మో గ్రసతే ధర్మం తదా తిష్యః ప్రవర్తతే॥ 14

యుద్ధ-సర్గ-35

తి. టీక:-తథా హి-సర్వథా సుఖసాధనం ధర్మః ఏకరూప ఏవ, అధర్మ స్త్రిధా; ధర్మాన్యః తద్విరోధీ తదభావ శ్చేతి। త త్రాద్యః శాక్తాదిధర్మమార్గే దృష్టో ధర్మాభాసః। ద్వితీయో హత్యాదిలక్షణః। అంత్యః స్వస్వవిహితనిత్యధర్మలోపాత్మా। కృతే త్రివిధాధర్మాభావ ఏవ। త్రేతాదౌ క్రమా దేకద్విత్రిభి రధర్మైః సంవలనం ధర్మస్య। ఏవం చ కలౌ అధర్మాభిభూతపాదత్రయత్వాత్ ఏకపాదేన ధర్మస్య వృత్తి రక్షతా।

ఏవం చ ధర్మతో దేవత్వం అధర్మతో రాక్షసత్వా దీతి సూచితమ్। నను అధర్మస్య రక్షోఽసురధర్మత్వే రక్షోఽసురాణాం ధర్మఫలైశ్వర్యజయాది కథ మితి చేత్ శ్రుణు। దేవాః కేవలధర్మపరాః, రక్షోఽసురాః కామ్యరాజసతామసధర్మమాత్రపరాః। తాదృశధర్మ మనుతిష్ఠతోఽపి తాన్ ఉక్త త్రిప్రకారాధర్మో న ముంచ త్యేవ రజస్తమః ప్రకృతిత్వాత్। అతో ధర్మకరణేన సుఖినోఽపి తే కామ్యత్వేన సాంతతయా ధర్మఫలాన్తే అధర్మఫలభోగభాజ ఇతి న దోషః।

ఈసందర్భమున మాల్యవంతునివాక్యమును వివరించుచు కృతాది యుగములస్వరూపమును, అధర్మపరులైన రాక్షసులకు యుద్ధజయము భోగములు ఎట్లు కలుగుచున్న వనుటకు హేతువును రామాయణ తిలకటీకాకారుఁడు ఇట్లు వివరించెను. "ఎల్లప్పుడును సుఖమునకు సాధనమైన ధర్మము ఏకరూపమే. ధర్మమునకు అన్యము, ధర్మమునకు విరోధి, ధర్మముయొక్క అభావము, అని అధర్మము మూఁడువిధములుగా నుండును. శాక్తేయధర్మము మొదలగువానియందు ధర్మాభాసము మొదటియధర్మము; అనఁగా ధర్మమునకు అన్యము. హత్యచేయుట

మొదలగునది రెండవయధర్మము; అనఁగా ధర్మమునకు విరోధి. తమకు శాస్త్రముచే విధింపఁబడిన నిత్యధర్మములను అనుష్ఠింపకుండుట మూఁడవయధర్మము; అనఁగా ధర్మముయొక్క అభావము. కృత యుగమునందు ఈమూఁడువిధములైన యధర్మములు ఉండవు. త్రేతా ద్వాపరకలియుగములందు క్రమముగా ఒకటి రెండు మూఁడు అధర్మములు ధర్మముతో పెనవేసికొనియుండును. [అనఁగా త్రేతాయుగమునందు ధర్మమునకు అన్యమైన ధర్మాభాస మొకటియే ధర్మమున ప్రవేశింఁగా, ద్వాపరమునందు ధర్మాభాసముతోఁబాటు ధర్మవిరోధియైనది కూడ ప్రవేశించును; కలియుగమునందు ధర్మాభాసము, ధర్మవిరోధి, ధర్మాభావము అనుమూఁడువిధములైనయధర్మములు ప్రవేశించి ధర్మమును క్షీణింపఁజేయును. అనఁగా ఒక్కొక్క అధర్మము ప్రవేశించి ధర్మముయొక్క ఒక్కొక్కపాదమును మ్రింగునన్నమాట] ఈవిధముగా కలియందు మూఁడు అధర్మములచేత మూఁడుధర్మపాదములు ఆక్రమింపఁబడినను ధర్మము ఒక్కపాదముచేత అక్షతమై యుండును.

ఇట్లు ధర్మమువలన దేవత్వము అధర్మమువలన రాక్షసత్వాదికము సంభవించు నని సూచింపఁబడినది. మఱి అధర్మమువలన రాక్షసత్వము అసురత్వము కలుగుచుండఁగా వారికి ధర్మమునకు ఫలములైన ఐశ్వర్యజయాదులు ఎట్లు లభించుచున్న వన్నచో; వినుము. దేవతలు కేవలధర్మపరాయణులు. రాక్షసులు అసురులు కామ్యములైన రాజస తామసధర్మములను మాత్రమే అవలంబించువారు. అట్టిధర్మములను వారు అనుష్ఠించుచున్నప్పుడు కూడ, వారిప్రకృతి లేక స్వభావము రజస్తమోగుణమయము అగుటవలన, పైనఁజెప్పఁబడిన మూఁడు విధములైన యధర్మము వారిని వదలదు. కావున వారు ధర్మాచరణము వలన సుఖమును పొందుచున్నప్పటికి, అది కామ్యమైన ధర్మ మగుట చేత, అధర్మఫలముయొక్క అస్తమునందు అధర్మఫలమును అనుభ

వించువారే యగుచున్నారు. కావున వారు మొదట ధర్మఫలములైన ఐశ్వర్యజయాదులను పొందుటలో దోష మేదియును లేదు.''

మాల్యవంతునియుపదేశమును విని రావణుఁడు క్రుద్ధుఁడై యిట్లనెను. ''నీవు హిత మనుపేరుతో అహితమును పరపక్షము నాశ్రయించి పరుషముగా చెప్పుచున్నావు. అది నా చెవికి ఎక్కుట లేదు. కృపణుఁడైన యొకమానవుని సమర్థునిగా దేవభయంకరుఁడను రాక్షసేశ్వరుఁడను అయిననన్ను హీనునిగా ఎట్లు తలంచుచున్నావు? పదస్థుఁడైన ప్రభువును పండితుఁ డెవఁడైనను, పరులప్రోత్సాహమే లేకున్నచో, ఇట్లు మాటాడునా? సాక్షాల్లక్ష్మివలె నున్న సీతను గొనివచ్చి రాఘవునకు భయపడి తిరిగి యిత్తునా? భ్రాతృమిత్రసేనాసమేతముగా నిహతుఁడైన రాముని నీవు త్వరలోనే కనులార చూడఁగలవు. దేవతలైనను ఎవనిని మార్కొని నిలువఁజాలరో అట్టిరావణుఁడు యుద్ధమునకు జంకునా? నేను నడిమికి విఱిగిన విఱుగుదును గాక; ఎవ్వని యెదుటను వంగను. ఇది నాకు సహజమైన దోషము. స్వభావము నతిక్రమించుట ఎవనికైనను అసాధ్యము. రాముఁ డెట్లో యాదృచ్ఛికముగా సేతువును కట్టి ఇక్కడికి వచ్చినంతమాత్రమున నీ కింత భయ మెందులకు? ఇదిగో చెప్పుచున్నాను. వినుము. అతఁ డిటనుండి సైన్యముతో కూడ బ్రతికి బయటఁబడఁడు.''

శ్లో॥ ద్విధా భజ్యేయ మ ప్యేవం న నమేయం తు కస్యచిత్।
ఏష మే సహజో దోషః స్వభావో దురతిక్రమః॥ 11

యుద్ధ-సర్గ-36

రావణునిపూర్వచరిత్రను స్మరించినచో ఇది యసత్య మనుట స్పష్ట మగును. ఇతఁడు కార్తవీర్యార్జునియెదుట వాలియెదుట నమ్రతను పొందవలసివచ్చె నని యిదివఱకే గ్రహించియుంటిమి. మాతామహుఁడు తనహితమునుగూర్చి చెప్పుచున్నాఁ డను వివేకము రవ్వం

శయు లేక అతఁడు శత్రుపక్షము నవలంబించి మాటాడుచున్నాఁడని నిండుసభలో ధిక్కరించుట రావణునిమూర్ఖత్వము పరాకాష్ఠ. వినాశకాలమున విపరీతబుద్ధి పుట్టు ననుట ఈసందర్భమున చక్కఁగా సమన్వయించుచున్నది. (వినాశకాలే విపరీతబుద్ధిః).

ఆ ధిక్కారమునకు మాల్యవంతుఁడు నిరుత్తరుఁడై సిగ్గుపడి రావణునకు జయమును పల్కి యటనుండి నిష్క్రమించెను. అది చూచి సభ్యులందఱును నిర్విణ్ణులైరి. రావణుఁడు వారినిర్వేదమును లెక్కపెట్టక నగరరక్షణమునకు ఏర్పాట్లు గావించి తన్ను కృతకృత్యునిగా భావించుకొనుచు సభనుండి వెడలిపోయెను.

## 7. వానరసైన్యోద్యోగము

లంకకు జేరినపిమ్మట వానరముఖ్యులు ముట్టడి నెట్లు చేయవలయునో నిర్ణయింపుఁడని రామసుగ్రీవుల నడిగిరి. రాముఁడు విభీషణునివంకఁ జూచెను విభీషణుఁడు అగ్రామ్యపదశోభితముగా పుష్కలార్థసహితముగ నిట్లు చెప్పెను.

శ్లో॥ అథ తేషు బ్రువాణేషు రావణావరజోఽబ్రవీత్।
వాక్య మగ్రామ్యపదవ త్పుష్కలార్థం విభీషణః॥ 6
యుద్ధ–సర్గ–37

"మహారాజ! నామంత్రులు నల్వురు పక్షులై లంకకు పోయి అచ్చటినగరరక్షణవిధానమును చూచి వచ్చిరి. తూర్పున ప్రహస్తుఁడు దక్షిణమున మహాపార్శ్వమహోదరులు పశ్చిమమున ఇంద్రజిత్తు ఉత్తరమున రావణుఁడు మధ్యమగుల్మమున విరూపాక్షుఁడు సేనాసమేతులై నెలకొనియున్నారు. పదివేలయేనుఁగులు పదివేలరథములు ఇరువదివేలగుఱ్ఱములు ఒకకోటి పదాతిసైన్యము రావణునియాంతరంగిక

బలము. వా రందఱును విక్రమశాలులు. ప్రహస్తాదులకు ఒక్కొక్కనికి పదిలక్షలసైన్యమున్నది. కుబేరుని రావణుఁడు మార్కొనినప్పుడు అఱువదిలక్షలమంది యోధులు ఆతనివెంట బయలుదేరిరి. వా రందఱు తేజోవీర్యపరాక్రమములందు రావణునకు సమానులే. నే నిట్లు చెప్పుచున్నందులకు కోపింపకుము. ఇట్లు చెప్పుట నీకు రోషము కలిగించుటకే కాని భయపెట్టుటకు కాదు. నీవు దేవతలను కూడ నిగ్రహింపఁగలవు. నీకు రావణునిలెక్క యేమి? మనబలములను వ్యూహములనుగా తీర్పుము; రావణుని సంహరింపుము."

విభీషణుఁడు గ్రామ్యపదములు లేకుండ పుష్కలార్థముగల వాక్యములతో ప్రసంగించె నని వాల్మీకిమహర్షి సభయందు మహారాజుతో ఎట్లు మాటాడవలయునో, వ్యక్త మొనర్చినాఁడు. రాజునకు హితమును కోరువారు యథార్థమునే చెప్పవలె. శత్రుబలమును తగ్గించి గ్రామ్యపదములతో తేల్చివేయుచు మాటాడరాదు. అయినను వారిబలమును ఉన్నదియున్నట్లే నిరూపించునప్పుడు కూడ, ఆప్రసంగము శత్రుప్రశస్తిగా తోఁచకుండ ప్రసంగింపవలె. అట్లు తోఁచకుండ ఉండవలయు నన్నచో శత్రువులనుగూర్చి చెప్పుచు వెంటనే రాజును కూడ ప్రశంసించుచుండవలె. అందువలననే విభీషణుఁడు "ఇట్లు చెప్పుట నిన్ను భయపెట్టుటకు కాదు. నీవు దేవతలను కూడ నిగ్రహింపఁగలవు. నీకు రావణునిలెక్క యేమి?" అని ప్రశంసించుచు ముగించెను. రావణునకు హితమును చెప్పినశుకసారణులు, మాల్యవంతుఁడు కూడ రామసుగ్రీవాదులబలపరాక్రమములను మాత్రమే ప్రశంసించిరి; కాని రావణునిగూర్చి ప్రశంసావాక్య మొక్కటియు చెప్పలేదు. అందువలన రావణుఁడు కుపితుఁడై వారిని తీవ్రముగ ధిక్కరించెను. రావణుఁడు ఉద్ధతుఁడు కాఁబట్టి హితులయుపదేశమును అపార్థము చేసికొనెను, కాని రామునివంటి యుదాత్తుఁడు అవిధముగా అపార్థము

చేసికొనునా అని తలంపరాదు. ప్రభువు ఉదాత్తుఁడైనను ఈపద్ధతిని పాటింపవలసినదే. ప్రభువులయెదుట శత్రుప్రశంసనే కాదు వారితో సమానులైన యితరులప్రశంసయు పనికి రా దని చెప్పుచు వనవాసమునకు బయలుదేరుసందర్భమున రాముఁడు సీతతో భరతునియెదుట తనప్రశంసను కూడ చేయవల దని చెప్పుట గమనింపఁదగియున్నది. "ఐశ్వర్యవంతులు పరులస్తవమును సహింపరు కావున భరతుని యెదుట నీవు నాగుణములను ప్రశంసింపరాదు."

శ్లో॥ ఋద్ధియుక్తా హి పురుషా న సహన్తే పరస్తవమ్।
తస్మాన్న తే గుణాః కథ్యాః భరత స్యాగ్రతో మమ॥ 22

అయోధ్యా-సర్గ-26

ఈసందర్భమున శుకసారణులవలెనే రావణునిచే ధిక్కరింపఁబడిన మాతామహుఁడు మాల్యవంతుఁడు తనకంటె చాలచిన్నవాఁడైన రావణుని జయశబ్దముతో మన్నించుట గమనింపఁదగియున్నది. మూర్ధాభిషిక్తుఁడైన మహారాజు సభలో సింహాసనాసీనుఁడై యున్నప్పుడు ఎల్లరకును పూజ్యుఁడే యని దీనివలన స్పష్ట మగుచున్నది. ఆచార్యుఁడు వయస్సుచేత చిన్నవాఁడైనను వృద్ధులైన శిష్యులకు ఎట్లు పూజ్యుఁడో అట్లే మూర్ధాభిషిక్తుఁడైన మహారాజు కూడ పినతండ్రులు పెదతండ్రులు మాతామహులు మొదలగువారికి కూడ సింహాసనస్థుఁడై యున్నప్పుడు పూజ్యుఁడే యగును. ఇంతే కాదు. వర్ణముచేత అధికుఁడైన బ్రాహ్మణుఁడు కూడ, ఆచార్యుఁడైనను. మూర్ధాభిషిక్తుఁడైన వానిని. సభలో సింహాసనమునందున్న వానిని, క్షత్రియుఁడైన శిష్యుని కూడ పూజ్యునిగా సంభావింపవలసినదే. ధర్మాచరణమునకు నిమిత్తములైన వర్ణములసృష్టియొక్క ప్రస్తావమునందే బృహదారణ్యకోపనిషత్తులో ఈవిషయము స్పష్టము కావింపఁబడినది. "కావున (బ్రాహ్మణాదివర్ణములపరిపాలనముకొఱకు క్షత్రియజాతి సృష్టింపఁబడి

యుండుటవలన) క్షత్త్రముకన్నను అధికమైనది లేదు. కావున బ్రాహ్మణుఁడు తాను క్రింద నుండి పైనున్న క్షత్త్రియుని రాజసూయమునందు ఉపాసించుచున్నాఁడు. క్షత్త్రియు నందు బ్రాహ్మణుఁడు తన యశమును స్థాపించుచున్నాఁడు. క్షత్త్రమునకు జన్మస్థానము బ్రాహ్మణ్యమే. కావున క్షత్త్రియుఁడు రాజై శ్రేష్ఠత్వమును పొందియున్నను తుదకు తనకు సంభవస్థానమైన బ్రాహ్మణ్యమునే ఆశ్రయించుచున్నాఁడు. ఎవఁడు తనకు సంభవస్థానమైన బ్రాహ్మణ్యమును హింసించుచున్నాఁడో వాఁడు తనజన్మస్థానమునే హింసించినవాఁ డగును. వాఁడు ప్రశస్తతరుఁడైన వానిని హింసించిన వానివలె పాపతరుఁ డగును."

దీనికి శ్రీశంకరభగవత్పాదులవారు ఇట్లు భాష్యమునురచించినారు. "బ్రహ్మముచేత క్షత్త్రియజాతి అతిశయముతో సృష్టింపఁబడుట వలన దానికన్నను అధికమైనది లేదు అది బ్రాహ్మణజాతిని కూడ నియమించును. కావున క్షత్త్రియునకు కారణభూతుఁడైన బ్రాహ్మణుఁడు క్రింద నుండి తనకన్నను పైనున్న క్షత్త్రియుని ఉపాసించుచున్నాఁడు. ఎక్కడ? రాజసూయమునందు. క్షత్త్రియు నందు ఖ్యాతిరూపమైన తన యశస్సును బ్రహ్మ మని స్థాపించుచున్నాఁడు. రాజసూయమునందు అభిషిక్తుఁడై ఉన్నతమైన మంచయందు (ఆసందియందు) కూర్చుండినరాజు, "బ్రహ్మన్" అని ఋత్విక్కును పిలిచి నప్పుడు ఆయన, "రాజా! నీవు బ్రహ్మవు" అని సమాధానము చెప్పును. ఇదియే క్షత్త్రియునందు బ్రహ్మయశస్సును స్థాపించుటగా చెప్పఁబడుచున్నది. రాజసూయమునందు అభిషేకమును పొందుట అనుగుణమువలన రాజు తనకు సంభవకారణమైన బ్రాహ్మణునికన్న ఆధిక్యమును పొందుచున్నను, ఆకర్మయొక్క పరిసమాప్తియందు బ్రాహ్మణునే ఆశ్రయించుచున్నాఁడు. అనఁగా బ్రాహ్మణుని పురోహితునిగ నిలుపుకొనుచున్నాఁడు. తనకు సంభవకారణమైన బ్రాహ్మణ

జాతిని ఎవఁడు హింసించుచున్నాఁడో, అనఁగా తన్కు వదనముతో చూచుచున్నాఁడో వాఁడు తన్ను కన్నవారినే నాశమొందించువాఁ డగుచున్నాఁడు. మొదట కూడ క్షత్త్రియుఁడు క్రూరత్వమువలన పాపుఁడే. ఇట్లు తన్ను కన్నవారిని హింసించువాఁడు, లోకమున ప్రశస్తతరుఁడైన వానిని హింసించినవానివలె అనఁగా, పరిభవించినవానివలె, పాపతరుఁ డగుచున్నాఁడు."

"తస్మాత్ క్షత్త్రా త్పరం నాస్తి। తస్మా ద్బ్రాహ్మణః క్షత్త్రియ మధస్తా దుపాస్తే రాజసూయే। క్షత్త్ర ఏవ తద్యశో దధాతి। సైషా క్షత్త్రస్య యోని ర్య ద్బ్రహ్మ తస్మా ద్య ద్యపి రాజా పరమతాం గచ్ఛతి బ్రహ్మైవాన్తత ఉపని శ్రయతి। స్వాం యోనిం య ఉ ఏనగ్ హినస్తి స్వాగ్ స యోని మృచ్ఛతి స పాపీయాన్ భవతి యథా శ్రేయాగ్‌సగ్ హిగ్‌సిత్వా— 11

బృహదారణ్యకోపనిషది–తృతీయాధ్యాయే–చతుర్థబ్రాహ్మణే.

శ్రీమచ్ఛంకరభగవత్పాదభాష్యమ్–"యస్మా ద్బ్రహ్మణా అతిశయేన సృష్టం క్షత్రం తస్మాత్ క్షత్రాత్ పరం నాస్తి బ్రాహ్మణజాతేరపి నియన్తృ। తస్మా ద్బ్రాహ్మణః–కారణభూతః క్షత్త్రియస్య - క్షత్త్రియ మధస్తా ద్వ్యవస్థిత స్సన్ ఉపరిస్థిత ముపాస్తే। క్వ। రాజసూయే। క్షత్త్ర ఏవ తత్-ఆత్మీయంయశః-ఖ్యాతిరూపం బ్రహ్మేతి దధాతి-స్థాపయతి। రాజసూయాభిషిక్తేన ఆసన్ద్యాం స్థితేన రాజ్ఞా ఆమన్త్రితో బ్రహ్మన్నితి ఋత్విక్ పునస్తం ప్రత్యాహ త్వం రాజన్ బ్రహ్మాసీతి। త దేత దభిధీయతే క్షత్ర ఏవ త ద్యశో దధాతీతి। సైషా–ప్రకృతా క్షత్త్రస్య యోని రేవ–య ద్బ్రహ్మ। తస్మా ద్య ద్యపి రాజా పరమతాం, రాజసూయాభిషేకగుణం గచ్ఛతి, ఆప్నోతి, బ్రహ్మైవ, బ్రాహ్మణజాతి మేవ అన్తతః–అన్తే కర్మపరిసమాప్తౌ ఉపనిశ్రయతి స్వాం యోనిం-పురోహితం నిధత్త ఇత్యర్థః। య స్తు పున ర్బలాభిమానాత్ స్వాం యోనిం, బ్రాహ్మణజాతిం, బ్రాహ్మణం, య ఉ

ఏనం హినస్తి) న్యగ్భావేన పశ్యతి. స్వాం, ఆత్మీయా మేవ స యోని మృచ్ఛతి, స్వం ప్రసవం విచ్ఛినత్తి, వినాశయతి। స ఏత త్కృత్వా పాపీయాన్ పాపతరో భవతి। పూర్వ మపి క్షత్త్రియః పాపః క్రూర త్వాత్। ఆత్మప్రసవహింసయా సుతరాం, యథా లోకే శ్రేయాంసం ప్రశస్తతరం హింసిత్వా పరిభూయ పాపతరో భవతి, తద్వత్।

ధర్మాసనమందున్న రాజునకు బ్రాహ్మణుని కూడ నియమించు నధికార మున్నను. అధర్మాధికారస్థానమునుండి దిగివచ్చినవెంటనే ఆచార్యుఁడు మాతామహుఁడు మొదలైనవారిని పూజింపవలసియే యున్న దని దీనివలన స్పష్ట మగుచున్నది. ఇంతే కాదు. రాజాసూ యాభిషేకమును పొంది అందఱకన్నను అధికుఁడైన రాజు ధర్మాసన మందు ఉన్నప్పుడు కూడ నియంతవలె తనయిష్టము వచ్చినట్లుగా వర్తించుటకు వీలులేదు. అందఱకు శాసకుఁడే యైనను, అతఁడు కూడ ధర్మశాసనమునకు బద్ధుఁడే. అనఁగా సర్వసర్వంసహాచక్రవర్తి కూడ స్వతంత్రుఁడు కాఁ డన్నమాట. అతఁడు కూడ ధర్మమునకు అధీనుఁడే. ఈవిషయమును కూడ శ్రుతియే స్పష్టముగ నుద్ఘాటించినది, "నాలుగువర్ణ మును సృష్టించినపిమ్మట బ్రహ్మము చాలు ననుకొనలేము. అందువలన అది శ్రేయోరూపమైన ధర్మమును అతిశయముగా సృష్టించెను. క్షత్త్రి మునకు కూడ క్షత్త్రి మగుటవలన ఆ శ్రేయోరూపమైనధర్మముకన్న అధికమైనది లేదు. కావుననే దుర్బలతరుఁడైనవాఁడు కూడ తనకన్న బలవత్తరుఁడైనవానిని ధర్మబలముచేత జయింపఁగోరుచున్నాఁడు. సర్వజనులలో బలవత్తముఁడైన రాజుతో సైతము సామాన్యుఁడు కూడ ఈధర్మబలముచేతనే స్పర్ధవహింపఁగలుగుచున్నాఁడు."

దీని కిట్లు శ్రీశంకరభగవత్పాదులవారు భాష్యమును రచించిరి. "ఆబ్రహ్మము నాలుగువర్ణములను సృష్టించినతరువాత కూడ ఉగ్ర త్వమువలన క్షత్త్రము అనియత మగు నేమో అను ఆశంకచేత, చాలు

ననుకొనలేదు. అందువలన అది శ్రేయోరూపమైన దానిని అతిశయముగా సృష్టించెను సృష్టింపఁబడిన ఆయీధర్మము క్షత్త్రమునకు క్షత్త్రము; అనఁగా క్షత్త్రమునకు కూడ ఏది నియంత యగుచున్నదో అట్టి ధర్మముకన్నను పరమైనది లేదు. దానిచేతనే కదా ఎల్లరు నియమింపఁబడుచున్నారు! ఇది ఎట్లు? చెప్పుచున్నాము. దుర్బలతరుఁడైనవాఁడు కూడ తనకన్న బలవత్తరుఁడైనవానిని ధర్మబలముచేత జయింపఁగోరుచున్నాఁడు. లోకమున అందఱికన్న బలవత్తముఁడైనరాజుతో కుటుంబికుఁడు (పోటీపడుచుండుట—స్పర్ధమాన ఇతి శేషః—ఆనందగిరిటీక) ఎట్లో అట్లే. కావున అందఱికన్నను బలవత్తరమైన దగుట వలన ధర్మమునకు సర్వనియన్తృత్వము సిద్ధము.''

మూలము:—స నైవ వ్యభవత్। త చ్ఛ్రేయోరూప మత్యసృజత ధర్మం। త దేత త్క్షత్రస్య క్షత్రం। య ద్ధర్మ స్తస్మా ద్ధర్మాత్పరం నాస్త్యథో అబలీయాన్ బలీయాగ్ంస మాశగ్ంసతే ధర్మేణ యథా రాజ్ఞైవం।

శ్రీమచ్ఛంకరభగవత్పాదభాష్యమ్:-స చతురః సృష్ట్వాపి వర్ణాన్ నైవ వ్యభవత్, ఉగ్రత్వాత్ క్షత్త్ర స్యానియతా శంకయా। త చ్ఛ్రేయోరూప మత్యసృజత। కిం తత్। ధర్మం। త దేతత్ శ్రేయోరూపం సృష్టం క్షత్త్రస్య క్షత్త్రం, క్షత్ర స్యాపి నియన్తృ, ఉగ్రా ద ప్యుగ్రం, య ద్ధర్మః, యో ధర్మః, తస్మాత్, క్షత్త్ర స్యాపి నియన్తృత్వా ద్ధర్మాత్ పరం నాస్తి తేన హి నియమ్యన్తే సర్వే। త త్కథ మితి। ఉచ్యతే। అథో అపి, అబలీయాన్ దుర్బలతరః। బలీయాంసం, ఆత్మనో బలవత్తర మపి, ఆశంసతే కామయతే, జేతుం ధర్మేణ బలేన, యథా లోకే రాజ్ఞా సర్వబలవత్తమే నాపి కుటుంబికః—ఏవం। తస్మాత్ సిద్ధం ధర్మస్య సర్వబలవత్తరత్వాత్ సర్వనియన్తృత్వమ్।—బృహదారణ్యకే—తృతీయాధ్యాయే చతుర్థవర్ణకే—చతుర్దశమంత్రే—

దీనినిబట్టి మహారాజైన క్షత్త్రియుఁడు కూడ స్వతంత్రుఁడు కాఁడని, ధర్మమునకు లోఁబడి దాని ననుసరింపవలసినవాఁడే యని స్పష్టమగుచున్నది. రాముఁడు వాలితో మాటాడునప్పుడు, "మావశము నందు మేము లేము" (న వయం స్వవశే స్థితాః॥—శ్లో. 35, సర్గ—18 కిష్కింధాకాండ) అని చెప్పుచు రాజులుగా నున్నతాము స్వతంత్రులు కారని ధర్మవశు లని ఈవిషయమునే స్పష్ట మొనరించినాఁడు. కావున మనదేశమున రాజులు సనాతనమైన ధర్మమునకు తాము లోఁబడి తాము దానిని అనుసరించుచు, ప్రజలను కూడ ఆ ధర్మమార్గమునందు నడపువారే కాని పాశ్చాత్యదేశములందలిరాజులవలె ఎప్పటికి తమ కెట్లు తోఁచునో అట్లు చట్టములను నిర్మించి నిరంకుశముగా ప్రజలను శాసించునియంతలు (Despots) కారని గ్రహింపవలసియున్నది. అనఁగా మనదేశమున రాజులు కాని మంత్రులు కాని ప్రజాప్రతినిధులు కాని ధర్మనిర్మాతలు కారు. వారు అపౌరుషేయమై సనాతనమై శ్రుతి విహితమై యున్నధర్మమును గ్రహించి దానిని అమలుజరుపవలసిన వారే. వారికి నూతనముగా ధర్మమును నిర్మించునధికారము లేదు. ఈ ధర్మపాలనవిధానమును దిలీపుని వర్ణించుసందర్భమున రఘువంశ కావ్యమునందు కాళిదాసు ఇట్లు నిరూపించెను. "మనువు మొదలుగా ఆవంశములోని రాజులయాచరణముచేత క్షుణ్ణమై దిలీపునిచే అనుసరింపఁబడుచున్న మార్గమునుండి రథనియన్తపోవుమార్గమునుండి చక్రముల యొక్క పట్టాలవలె ప్రజలు రేఖామాత్రముగా నైనను తొలఁగ లేదు,"

శ్లో॥ రేఖామాత్ర మపి క్షుణ్ణా దామనో ర్వర్త్మనః పరమ్।
న వ్యతీయుః ప్రజా స్తస్య నియన్తు ర్నేమివృత్తయః॥
(రఘువంశే—ప్రథమసర్గే)

రావణుఁ డేర్పఱచిన నగరరక్షణవిధానమును విభీషణునివలన విని రాముఁడు తమ వ్యూహములవిధానమును ఇట్లు ఏర్పఱచెను.

"పూర్వద్వారమున నీలుఁడు, దక్షిణమున అంగదుఁడు, పశ్చిమమున హనుమంతుఁడు రక్షస్సైన్యములను నిరోధింతురు. నేను లక్ష్మణునితో కూడ ఉత్తరద్వారమున రావణుని నిరోధింతును. సుగ్రీవజాంబవద్విభీషణులు నగరమధ్యగుల్మమును నిరోధింతురు. విభీషణుఁడు, అతని నల్వురు మంత్రులు, నేను లక్ష్మణుఁడు మొత్తము ఏడుగురము మాత్రమే మానవరూపములతో నుందుము. తక్కిన ఋక్షవానరులు ఎవ్వరును మానవరూపముల నొందరాదు. ఇదియే మనసేనలకు సంకేతము."

పిమ్మట రాముఁడు లక్ష్మణసుగ్రీవాదిపరివృతుఁడై సువేలశైలశిఖరము నధిరోహించెను. ఆశైలాగ్రమునుండి వారు లంక నంతయు కలయఁజూచిరి. ప్రాకారములోపల మఱియొకప్రాకారమువలె గోడకట్టినట్లుగా నిలిచియున్నరాక్షసయోధశ్రేణులను చూచి వానరసేనాపతులు వీరనినాదములను గావించిరి. ఇంతలో సూర్యుఁ డస్తమించి వెన్నెలతో రాత్రి వచ్చెను.

శ్లో॥ తతోఽస్త మగమత్ సూర్య స్సంధ్యయా ప్రతిరంజితః
పూర్ణచంద్రప్రదీప్తా చ క్షపా సమభివర్తత॥ 13
యుద్ధ. సర్గ. 38

గో. టీక:–పూర్ణచంద్రప్రదీప్తేతి–అనేన పౌర్ణమాస్యాం సువేలారోహణ మిత్యుక్తమ్; ప్రథమాయాం యుద్ధారంభ ఇత్యాహుః। యద్వా పూర్ణచంద్రతుల్య ప్రదీపవత్ ఇతి వా అర్థః। సంభవన్తి హి వానరసేనాయా మపి ప్రకాశార్థ మారోపితా దీపాః।

ఆరాత్రికి వా రచ్చట విశ్రమించిరి. తెల్లవారినంతనే వానరసేనానాయకులు లంకలోని వనోపవనహర్మ్యసౌధవిశేషములను చూచి

విస్మితులైరి. కొందఱు సుగ్రీవుని యనుమతితో లంకలోని యుపవనము లందు ప్రవేశించిరి. శతయోజనవిస్తీర్ణమైన త్రికూటపర్వతశిఖరమున పదియోజనముల వెడల్పు ముప్పదియోజనముల పొడవును గల లంకను అందలి పాండురాంబుదప్రఖ్యములైన సౌధగోపురములను స్తంభ సహస్రసమలంకృతమై ఆకాశము నొరయుచున్న రావణుని చైత్య ప్రాసాదమును చూచి రాముఁడు విస్మితుఁ డయ్యెను.

యోజనద్వయమండలమైన సువేలశిఖరముయొక్క అగ్రము నుండి రాముఁడు, ఉత్తరగోపురద్వారశృంగమునందు శ్వేతచామర విజయచ్ఛత్రాదిశోభితుఁడై రక్తవస్త్రపరిధానుఁడై సంధ్యాతపసంఛన్న మైన మేఘరాశివలె నున్న రావణుని చూచెను. వానిని చూచినంతనే సుగ్రీవుఁడు క్రోధావిష్టుఁడై ఆక్షణముననే యెగిరిపోయి రావణుని యెదుటవ్రాలి, "నేను లోకనాథుఁడైన రామునకు సఖుఁడను, దాసుఁడను, సుగ్రీవుఁడను; నీవు ఆనాఁడు రామలక్ష్మణులను వంచించి తప్పించుకొని వచ్చితివి; కాని నీ విప్పుడు నన్ను తప్పించుకొనలేవు" అని వాని మకుటమును లాగి నేలపైఁ గొట్టెను. సుగ్రీవుని వేగమునకు రావణుఁడు విభ్రాంతుఁ డయ్యెను వెంటనే లేచి సుగ్రీవుని పట్టుకొని క్రుద్ధుఁడై, "నీవు నాపరోక్షముననే సుగ్రీవుఁడవు; ఇప్పు డింక హీనగ్రీవుఁడవే యగుదువు" అని రెండుచేతులతో పైకెత్తి నేలపైఁ గొట్టెను. సుగ్రీవుఁడు కందుకమువలె మరల పైకి లేచి ముష్టియుద్ధ మొనర్చెను. కొంతసేపటికి రావణుఁడు ముష్టియుద్ధమున వానిని జయింపజాలక మాయాబలము నాశ్రయింపఁ దలంచెను. ఆప్రయత్నమును గమనించి సుగ్రీవుఁడు రావణుని వంచించి ఎగిరి మరల సువేలాగ్రమును చేరెను.

రాముఁడు విస్మితుఁడై ఆనందముతో సుగ్రీవుని కౌఁగిలించుకొని యిట్లనెను. "నాతో చెప్పకయే నీవు ఎంత సాహస మొనర్చితివి! ప్రభువు లిట్టి సాహసములు చేయవచ్చునా? నీవు మ మ్మందఱను ఈ

పనిచేత సంశయగ్రస్తులను గావించితివి. ఇంక నిట్లు చేయకుము నీ కే దేని ఆపద సంభవించినచో నాకు సీతతోఁ గాని సోదరులతోఁ గాని శరీరముతోఁ గాని యేమి ప్రయోజనము? నీవు పరాక్రమమున వరుణ మహేంద్రతుల్యుఁడవు. నీ వీర్యాతిశయము నెఱింగియు నేను క్షణ కాలము వ్యథ నొందితిని. నీవు రాకున్నచో రావణుని సంహరించి విభీషణుని లంకాధిపతిని గావించి అయోధ్యారాజ్యమును భరతున కప్ప గించి దేహమును వదలవలయు ననియే తలంచుచుంటిని.'' సుగ్రీవుఁడు వినతుఁడై, "రామా! నీభార్యను హరించినరావణుని చూచి ఆత్మబల జ్ఞుఁడ నైన నేను ఎట్లు సహింతును?" అని పలికెను.

శ్లో॥ త్వయి కించి త్సమాపన్నే కిం కార్యం సీతయా మమ॥ 4

శ్లో॥ భరతేన మహాబాహో లక్ష్మణేన యవీయసా।
శత్రుఘ్నేన చ శత్రుఘ్న స్వశరీరేణ వా పునః॥ 5

శ్లో॥ త్వయి చానాగతే పూర్వం ఇతి మే నిశ్చితా మతిః।
జానత శ్చాపి తే వీర్యం మహేంద్రవరుణోపమ॥ 6

శ్లో॥ హ త్వాహం రావణం యుద్ధే సపుత్రబలవాహనమ్।
అభిషిచ్య చ లంకాయాం విభీషణ మథాపి చ॥ 7

శ్లో॥ భరతే రాజ్య మారోప్య త్యక్ష్యే దేహం మహాబల। 8

యుద్ధ-సర్గ-41

పై వాక్యములనుబట్టి రామసుగ్రీవులమైత్రీదృఢత్వ మెట్టిదో మనము గ్రహింపవచ్చును. మిత్త్రునిభార్యను అపహరించినవానిని చూచినంతనే ప్రాణాపాయశంకయే లేక సుగ్రీవుఁడు రావణునిపైకి దూఁకినాఁడు. సుగ్రీవుఁ డాపద నొందినచో రాముఁడు దేహత్యాగము చేయుదు నన్నాఁడు త్యాగపూర్ణ మైనప్పుడే మైత్రి మహిత మగును. అట్టిమైత్రి మహాత్ములయందే సంభవము. కావుననే రాముఁడు, ''అంద

ులను నీ వంటి మిత్రులుగ నుండరు." (సుహృదో వా భవద్విధాః– శ్లో. 15, సర్గ–18–యుద్ధ) అని సుగ్రీవుని ప్రశంసించెను.

## 8. అంగదునిరాయబారము

రాముఁడు సుగ్రీవు నభినందించి లక్ష్మణుని చూచి, శీతోదక ఫలమూలసంపన్నములైన యుపవనముల నాశ్రయించి సేనావ్యూహ ముల నేలకొల్పి నగరమును ముట్టడింతము. లోకక్షయనిమిత్తములైన ఘోరనిమిత్తములు తోఁచుచున్నవి" అని చెప్పుచు శిఖరమునుండి లక్ష్మణసహితుఁడై దిగివచ్చి సుముహూర్తమున ధన్వియై సేనాపరి వృతుఁడై లంకాభిముఖముగా బయలుదేరెను. విభీషణసుగ్రీవహనుమ జ్జాంబవదాదులు రాము ననుసరించిరి.

ప్రాకారమును చేరినంతనే రామునియాదేశమున మైందద్వివిదు లతో నీలుఁడు పూర్వద్వారమును, ఋషభగవాక్షగజగవయులతో అంగ దుఁడు దక్షిణద్వారమును, ప్రమాథిప్రఘసులతో హనుమంతుఁడు పశ్చిమద్వారమును, ముప్పదియాఱుకోట్లబలముతో సుగ్రీవుఁడు మధ్యమగుల్మమును నిరోధించిరి. ఉత్తరద్వారమును రాముఁడు లక్ష్మణ సహితుఁడై నిరోధించెను.

మధ్యమగుల్మ మనఁగా ఉత్తరపశ్చిమద్వారములకు మధ్య నున్న శత్రుసేనాసన్నివేశము. దుర్జయులైన రావణుఁడు ఇంద్రజిత్తు ఉత్తరపశ్చిమద్వారములను అధిష్ఠించియుండిరి. ఆరెండుద్వారములకు మధ్యనున్న శత్రువ్యూహమును సుగ్రీవుఁడు విరోధించెను. ఆవిధముగా అతఁడు కాకాక్షిన్యాయమున ఉత్తరద్వారమును నిరోధించుచున్నవారికి పశ్చిమద్వారమును నిరోధించుచున్న వారికి సాహాయ్యము చేయుటకు వీలుగా నుండెను. ఈసందర్భముననే తరువాత, రామునకు పశ్చిమముగా సమీపముననందే సుగ్రీవుఁడు జాంబవంతునితో కూడ సైన్యములతో నిలిచి

యుండె నని చెప్పఁబడియున్నది. కావున మధ్యమగుల్మ మనఁగా ఉత్తరపశ్చిమద్వారముల మధ్యమున నెలకొల్పఁబడియున్న సేనాగుల్మ మని గ్రహింపవలసి యున్నది.

శ్లో॥ మధ్యమే చ స్వయం గుల్మే సుగ్రీవ స్సమతిష్ఠత। 41

యుద్ధ-సర్గ-41

గో. టీక:-దుర్జయ రావణేంద్రజి దధిష్ఠితయోః ఉత్తరపశ్చిమ ద్వారయోః మధ్యే తదుభయద్వారనిరోధకానాం కాకాక్షిన్యాయేన సాహాయ్యం కర్తుం సుగ్రీవ స్స్వయ మతిష్ఠ దితి జ్ఞేయమ్.

శ్లో॥ పశ్చిమేన తు రామస్య సుగ్రీవ స్సహజాంబవాన్।
అదూరా న్మధ్యమే గుల్మే తస్థౌ బహుబలానుగః॥ 43

ఇతి వక్ష్యమాణత్వాత్ యుద్ధ-సర్గ-41

ప్రతిద్వారమునందును ఒక్కొక కోటిచొప్పున వానరబలము దుర్గనిరోధమును గావించెను. లంకాపరిసర మంతయు సముద్ర పర్యంతము ఋక్షవానరమయ మగుటఁ జూచి రాక్షసులు విస్మితులై భీతి నొందిరి. వానరవీరనినాదము సముద్రఘోషమును మించుచుండెను.

శ్లో॥ శాసనేన తు రామస్య లక్ష్మణ స్సవిభీషణః।
ద్వారే ద్వారే హరీణాం తు కోటిం కోటిం న్యవేశయత్॥ 42

పిమ్మట రాముఁడు మంత్రులతో ఆలోచించి విభీషణుని యభిప్రాయము ననుసరించి రాజధర్మమును పాటించి అంగదుని పిలిచి యిట్లనెను. "నీవు లంకలోనికి పోయి రావణునితో నామాటగా ఇట్లు చెప్పుము. 'నీవు గర్వితుఁడవై మహర్షులకు దేవతలకు విప్రియ మొనర్చితివి. బ్రహ్మవరదానసంభవమైన నీదర్ప మింక నణఁగినట్లే. దండధరుఁడనై నేను లంకాద్వారమున నిలిచియున్నాను. నాచేత హతుఁడవై నీవు రాజర్షులయొక్క మహర్షులయొక్క దేవతలయొక్క మార్గ

మును పొందుదువు. ఏ మాయాబలము నవలంబించి నన్ను దూర మొనర్చి నాభార్యను హరించితివో ఆబలము నంతయుఁ జూపుము. మైథిలి నొసంగి శరణము వేడకున్నచో ఈలోకము నరాక్షస మొనరింతును. ధర్మాత్ముఁడైన విభీషణుఁడు లంకారాజ్యమును పొందును. నీవు ఎక్కడికి ఎగిరిపోయినను నానుండి తప్పించుకొనఁజాలవు. కావున నీకు ప్రియమైన లంకను ఒక్కసారి కనులారఁ జూచుకొని పరలోకసుగతి ప్రదములైన దానధర్మాదికములను గావించుకొనుము ' "

శ్లో॥ ఋషీణాం దేవతానాం చ గంధర్వాప్సరసాం తథా।
నాగానా మథ యక్షాణాం రాజ్ఞాం చ రజనీచర॥ 16

శ్లో॥ య చ్చ పాపం కృతం మోహా దవలిప్తేన రాక్షస।
నూన మద్య గతో దర్పః స్వయంభువరదానజః॥ 62

శ్లో॥ యస్య దండధర స్తేఽహం దారాహరణకర్శితః।
దండం ధారయమాణ స్తు లంకాద్వారే వ్యవస్థితః॥ 63

శ్లో॥ పదవీం దేవతానాం చ మహర్షీణాం చ రాక్షస।
రాజర్షీణాం చ సర్వేషాం గమిష్యసి మయా హతః॥ 64

శ్లో॥ అరాక్షస మిమం లోకం కర్తాఽస్మి నిశితైః శ్శరైః।
న చే చ్ఛరణ మభ్యేషి మా ముపాదాయ మైథిలీమ్॥ 66

యుద్ధ - సర్గ - 41

రాముఁ డిట్లు ఆదేశించినంతనే అంగదుఁ డెగిరిపోయి మందిరమున మంత్రులతోఁ గూడియున్న రావణుని సమీపమున అగ్నిశిఖవలె నిలిచి వానిని సంబోధించి యిట్లనెను. "నేను రామునిదూతను; వాలి పుత్రుఁడనైన యంగదుఁడను నీవు నన్నుగూర్చి వినియుందువను కొందును. రాముఁ డిట్లు నీతో చెప్పు మనినాఁడు. 'ఓయీ నృశంసుఁడా! మగతనముతో నగరము వెలువడి వచ్చి పోరాడుము. సపుత్త్రబాంధ

హామాత్యముగ నిన్ను సంహరించుటకు సిద్ధముగ నున్నాను. నీవు హతుఁడవైనంతనే మూఁడు లోకములు నిరుద్విగ్నము లగును. దేవ దానవయక్షగంధర్వమహర్షిమానవాధీశ్వరులకు కంటకమువలె నున్న నిన్ను పెకలింతును. నీవు నాపాదములకు ప్రణమిల్లి సత్కరించి వైదేహిని సమర్పింపకున్నచో నిన్ను హతుని గావించి లంకేశ్వరత్వమును విభీషణున కొసంగుదును."

శ్లో॥ ఆహ త్వాం రాఘవో రామః కౌసల్యానందవర్ధనః।
నిష్పత్య ప్రతియుద్ధ్యస్వ నృశంస పురుషో భవ॥ 77

శ్లో॥ హన్తాస్మి త్వాం సహామాత్యం సపుత్రజ్ఞాతిబాంధవమ్।
నిరుద్విగ్నా త్రయో లోకా భవిష్యన్తి హతే త్వయి॥ 78

శ్లో॥ దేవదానవయక్షాణాం గంధర్వోరగరక్షసామ్।
శత్రుమద్యోద్ధరిష్యామి త్వా మృషీణాం చ కంటకమ్॥ 79

శ్లో॥ విభీషణస్య చైశ్వర్యం భవిష్యతి హతే త్వయి।
న చేత్సత్కృత్య వైదేహీం ప్రణిపత్య ప్రదాస్యసి॥ 80

యుద్ధ–సర్గ–41

ఆమాటలకు రావణుఁడు క్రుద్ధుఁడై మంత్రులను చూచి "వీనిని పట్టుకొనుఁడు; చంపుఁడు; చంపుఁడు" అని శాసించెను. వెంటనే పరాక్రమశాలులైన నలువురు రాక్షసులు వచ్చి అంగదుని పట్టుకొనిరి. అంగదుఁడు వారితో కూడ పైకెగిరి ప్రాసాదశిఖరముపై దూఁకెను. ఆతనియుత్పతనవేగముచేత రాక్షసులు నల్వురను క్రిందఁబడిరి; ప్రాసాదశృంగము భగ్నమయ్యెను. అంగదుఁడు తనపేరు చెప్పుకొని మహానాద మొనర్చి రాక్షసు లందఱు చూచుచుండఁగా వచ్చి రాముని యొద్ద వ్రాలెను. రావణుఁడు ప్రాసాదభంగమునకు కుపితుఁడై చేయునది లేక నిట్టూర్పుఁ జొచ్చెను. అంగదుఁడు తిరిగివచ్చినంతనే సుగ్రీ

వునియానతిపై సుషేణుఁడు ప్రతిద్వారము నొద్దకు పోయి సైన్యముల సన్నివేశములను పరిశీలింపఁజొచ్చెను.

"నీవు దేవతలకు మహర్షులకు విప్రియమొనర్చితివి....దండధరుఁడనై నేను లంకాద్వారమున నిలిచియున్నాను'' అని చెప్పిన రాముఁడు, "నీవు నాకు ప్రణమిల్లి సత్కరించి వైదేహి నొసంగకున్నచో నిన్ను హతుని గావించి లంకేశ్వరత్వమును విభీషణున కొసంగుదును" అని చెప్పుట ఎట్లు సమంజస మగును. రావణుఁడు ప్రణమిల్లి సీత నొసంగినంతమాత్రమున రాముఁడు వానిని క్షమింపవచ్చునా? అట్లు క్షమించి వానిని వదలినచో తాపసకంటకులైన రాక్షసుల సంహరింతు నని ఆయన మహర్షుల కిచ్చినమాట, లంకేశ్వరత్వమును విభీషణునకు నొసంగుదు నని చెప్పినమాటయు అసత్యములు కావా?

''నేను దండధరుఁడనై నిలిచియున్నాను'' అనుమాటవలన రాముఁడు, "వాలిని దండించి వానికి సుగతిని కలిగించినట్లే నీకు కూడ శాస్త్రవిహితమైనదండనము కావించి సుగతిని కలిగింతు" నని చెప్పినట్లయినది. రావణుఁడు పశ్చాత్తప్తుఁడై సీత నొసంగి తనతప్పును ఒప్పుకొని దండనమునకు అంగీకరించినచో రాముఁడు రావణుని మాత్రము దండించి ఆతనియనుచరులైన పుత్రమిత్రాదులను వదలిపెట్టి యుండును. బంగారమును దొంగిలించినవాఁడు పశ్చాత్తప్తుఁడై ప్రాయశ్చిత్తమును కోరినచో, వాఁడు ముందు అపహరించినబంగారమును తెచ్చి యప్పగించి తరువాత ప్రాయశ్చిత్తమును పొందవలె. అట్లే రావణుఁడు కూడ ముందు సీత నొసంగి తరువాత ప్రాయశ్చిత్తమును పొందవలె. అప్పుడు పుత్రమిత్రాదివిధ్వంసము మాత్రమే తప్పును. అంతే కాని అతనికి మరణదండనము తప్పు నని రాముని యభిప్రాయము కాదు. అందువలన లంకారాజ్యము విభీషణునకు ఎట్లైన లభించు ననియే ఆయన యభిప్రాయము. రావణుఁడు దండనమునకు అంగీకరించినచో పుత్ర

మిత్త్రాదివినాశము, లంకావిధ్వంసనము కనులారఁ జూచునప్పుడు కలుగు మహాదుఃఖము కలిగియుండదు; వాలి మరణించినట్లే ఒక్క బాణముననే అతఁడు స్వర్గతుఁడై యుండును. ఎట్లైనను అతఁడు రాజుగా కొనసాగుట సంభవము కాదు. ఈవిషయము రాముని మాటలయందే స్పష్ట మగుచున్నది. "పాపుఁడవు; మూర్ఖసహాయుఁడవు; నీస్వరూపమునే ఎఱుంగనివాఁడవు, అయిననీవు క్షణము కూడ రాజ్యమును అధర్మమార్గమున అనుభవించుట ఇంక శక్యము కాదు."

శ్లో॥ న హి రాజ్య మధర్మేణ భోక్తుం క్షణ మపి త్వయా।
శక్యం మూర్ఖసహాయేన పాపే నావిదితాత్మనా॥ 68

యుద్ధ–సర్గ–41

ఇట్లు దండనము నంగీకరించి రావణుఁడు దివంగతుఁ డైనచో పుత్త్రమిత్త్రాదులతో ధనసంపదలతో సమృద్ధమైనరాజ్యము విభీషణునకు లభింపవచ్చును; కాని మహర్షులకు ఇచ్చినమాట ఎట్లు నెరవేరును? జనస్థానము నాక్రమించి అప్పుడు ప్రత్యక్షముగా తాపసులకు కంటకులుగా నున్న ఖరాదులను పదునాలుగువేలమందిని సంహరించుటచేతనే ఆమాట చాలవఱకు నెరవేరినది. ఖరాదులసంహారముచేత రాక్షసజాతియంతయు గడగడలాడిన దనుట స్పష్టము. మాల్యవంతుఁడు, అవింధ్యుఁడు, కుంభకర్ణుఁడు మొదలగువారే కాక విభీషణుఁడు చెప్పినట్లుగా ప్రహస్తాదిమంత్రులు కూడ వెనుకటివలె తమయధర్మవర్తనము ఇంక కొనసాగ దని దృఢముగా తలంచుచుండిరి. మాల్యవదాదులు కొందఱు నిర్భయముగా ఆమాట చెప్పఁగలిగినను తక్కినవారు మనస్సులలో అట్టినిశ్చయమునే కలిగియుండిరి. ఆంజనేయుఁడు కావించిన లంకాదహనము వారియిందు ఆయభిప్రాయమును ఇంకను గట్టిపఱచినది. రావణుఁడు దండనమున కంగీకరించి దివంగతుఁడై విభీషణుఁడు రా

జగుచో ఇంక రాక్షసు లెవరును ఇతరులను హింసించుటకు పూను కొనరు. మహర్షులయభీష్టము కూడ నదియే. విష్ణుదేవుఁడు రాముఁడుగా అవతరించునప్పుడు దేవతలు ప్రధానముగా కోరినది రావణసంహారమే. అందువలన వారియభీష్టము కూడ తీరినట్లే యగును.

ఇంద్రజిత్తు రావణునికన్న పరాక్రమశాలి యని అతఁడు సంహ రింపఁబడినప్పుడు, రావణునిసంహారముకన్న మహత్తరమైనకార్యము సంభవించినట్లుగా మేము సంతోషించితి మని అగస్త్యుఁడు రావణుని వృత్తాంతమునకు ముందు ఉద్ఘాటించెను. విభీషణుని ధిక్కరించి మాటాడినప్పుడు వానిమూర్ఖతయు స్పష్ట మగుచునే యున్నది. అట్టి యింద్రజిత్తు తండ్రి మరణించినపిమ్మట రాజ్యమును అభిలషింపకుం డునా? విభీషణునియాధిపత్యమును అంగీకరించునా? అతఁడు బ్రతికి యుండఁగా దేవతలకుఁ గాని విభీషణునకుఁ గాని నిర్భయత్వ మెట్లు కలుగును? ఇంద్రజిత్తు గాని యితరరాక్షసులు ఎవరైనను గాని విభీష ణునియాధిపత్యము నంగీకరించి ధర్మవర్తనులై యున్నచో ఎవరును భయపడవలసినయక్కఱ లేదు. అట్లుగాక వారు యథాపూర్వముగా సాధుజనకంటకులైనచో వారిని విభీషణుఁడు గాని, ఆతనియభ్య ర్థనముపై రాముఁడు గాని తప్పక నిర్మూలించును. ఆంజనేయుఁడు సుగ్రీవుని జయము నుద్ఘోషించునప్పుడు, "రాఘవునిచే అభిపాలితుఁ డైన రాజు సుగ్రీవుఁడు జయించును" (రాజా జయతి సుగ్రీవో రాఘవే ణాభిపాలితః-శ్లో. 35 సర్గ-42. సుందరకాండ) అని ప్రకటించుట గమనింపఁదగియున్నది. వాలికన్న సుగ్రీవుఁడు దుర్బలుఁడు. వాలికి లోఁబడినవా రందఱు సుగ్రీవునకు లోఁబడ కుండుట సహజము. కాని సుగ్రీవునకు పట్టాభిషేకము జరిగినంతనే, రామశాసనమునకు వెఱచియే, ఋక్షవానరమహావీరు లందఱు సుగ్రీవునియాజ్ఞకు లోఁబడిరి. సుగ్రీ వునియాజ్ఞ నంగీకరింప కున్నచో రామునివలన శిక్షణము సంభవించు

ననుట సువిదితము. విభీషణుఁడు కూడ సుగ్రీవునివంటివాఁడే. కావున సుగ్రీవవిభీషణులధర్మపరిపాలనమునకు రామునిరక్షణము ఎప్పుడును సిద్ధమే. అందువలన లోకమున ధర్మజయము కూడ సిద్ధమే.

## గద్యము

ఆపస్తంబసూత్ర కౌండిన్యసగోత్ర పోలూరి
వేంకటనరసాంబా వేంకటనారాయణామాత్యపుత్ర
హనుమజ్జానకీరామశర్మప్రణీతంబైన
శ్రీరామాయణతరంగిణియందు
వింశంబైన సేతుబంధతీర్థము
సమాప్తము

శ్రీరామ

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 4 | తండి | తండ్రి |
| 7 | 18 | నిర్మిచి | నిర్మించి |
| 7 | 24 | అదు | అందు |
| 11 | 7 | సంతికాన్ | వాసంతికాన్ |
| 15 | 4 | పోవ | పోవు |
| 21 | 25 | స్వర్గతు | స్వర్గతే |
| 25 | 4 | దరరథుని | దశరథుని |
| 26 | 10 | నంపాతి | సంపాతి |
| 27 | 10 | తీవ్రః ఖేద శ్చ | తీవ్రః స్వేదశ్చ ఖేదశ్చ |
| 27 | 11 | 0 | 10 |
| 27 | 19 | భవిష్యతీతి | భవిష్యం హి |
| 32 | 24 | ప్రసంగములలో | ప్రసంగములలో |
| 35 | 2 | శైలవన | సశైలవన |
| 35 | 13 | దృక్కులతో | దృక్కులతో |
| 37 | 10 | అగస్త్యు | అగస్త్యుం |
| 38 | 23 | కూత | కూడ |
| 44 | 17 | పుజికస్థలామ్। | పుంజికస్థలామ్। |
| 55 | 6 | ప్రాకృతోఽపిః | ప్రాకృతోఽపి |
| 55 | 12 | పొదిన | పొందిన |
| 57 | 4 | గమీష్యే | గమిష్యే |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 60 | 22 | నరునిచే | వానరునిచే |
| 70 | 4 | ద్యానించుచు | ధ్యానించుచు |
| 73 | 21 | దారయ | ధారయ |
| 76 | 16 | lustnctive | Instinctive |
| 77 | 7 | మఱచిపొమ్ము | మఱచిపొమ్ము. |
| 79 | 2 | మాతము | మాత్రము |
| 79 | 4 | ప్రహింప | గ్రహింప |
| 81 | 5 | కృపయు | కృపణయు |
| 83 | 1 | పీతాసందర్శనము | సీతాసందర్శనము |
| 83 | 21 | యోశంస | యోనృశంస |
| 108 | 21 | చేయఁలి | చేయఁజాలి |
| 109 | 23 | మబివాద్య | మభివాద్య |
| 113 | 6 | సమపాగతో | సముపాగతో |
| 114 | 16 | తటస్థడలేదు | తటస్థపడలేదు |
| 114 | 17 | శుశ్రూష | శుశ్రూష |
| 123 | 12 | ధ్యుతిః | ద్యుతిః |
| 124 | 17 | సుగ్రీవని | సుగ్రీవుని |
| 133 | 25 | ప్రవర్తిచు | ప్రవర్తించు |
| 137 | 20 | అట్ట్రి | అట్టి |
| 139 | 10 | కోల్కి | కోర్కి |
| 141 | 19 | మనశిల్యా | మనశ్శిలా |
| 147 | 20 | తప్పంచుకొన | తప్పించుకొన |
| 148 | 19 | పౌర | పౌర్ణ |
| 163 | 17 | ధిరమును | ధిక్కారమును |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 167 | 7 | చి వానిని | చిన్నవానిని |
| 170 | 4 | బుద్ధి | బుద్ధి |
| 174 | 8 | ధర్మవక్షమునకు | ధర్మపక్షమునకు |
| 175 | 17 | క్షిఫ్రం | క్షిప్రం |
| 175 | 18 | విఖీషణ | విభీషణ |
| 179 | 16 | యు దురు. | యుందురు. |
| 179 | 21 | మ ము | మనము |
| 179 | 22 | విఖీ | విభీష |
| 179 | 23 | ప గ్రాహ్యఁడే | పరిగ్రాహ్యఁడే |
| 181 | 24 | స్పయమ్॥ | స్వ్వయమ్॥ |
| 187 | 17 | నీ ని | నీతిని |
| 195 | 20 | అట్టిది | అట్టిదే |
| 204 | 25 | ప్రభుపులకు | ప్రభువులకు |
| 208 | 4 | చెప్పి ట్లయినది | చెప్పినట్లయినది |
| 217 | 18 | క్రొశ స్తీ | క్రోశ స్తీ |
| 222 | 14 | ధర్మఫలై శ్యర్య | ధర్మఫలై శ్వర్య |
| 223 | 9 | ప్రవేశిం ఁగా | ప్రవేశింపఁగా |
| 233 | 16 | తతోఽ న్త | తతోఽ స్త |
| 235 | 15 | జాన శ్చాపి | జానతశ్చాపి |
| 238 | 22 | యిట్లి ను | యిట్లినెను |
| 241 | 2 | చూచు ప్పుడు | చూచునప్పుడు |
| 241 | 24 | వారియిందు | వారియందు |
| 242 | 26 | నంగీకరింప న్నచో | నంగీకరింపకున్నచో |

# ఇతర గ్రంథములు

## ముద్రితములు

నాటకములు:– భువనవిజయము, ఎఱ్ఱాప్రెగ్గడ నన్నయభట్టు

కావ్యము:- బాపూజీ

కథలసంపుటి–కథాతరంగిణి 3–00

ధర్మతత్త్వగ్రంథములు:–

[ప్రతులుదొరుకుచోటు:–శ్రీరమణాశ్రమము; తిరువణ్ణామలై

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీరమణజీవితస్మరణోపదేశములు | — | 3–00 |
| 2. | శ్రీభగవద్గీతాసారము | — | 4–00 |
| 3. | పరాపూజ–ఆత్మబోధము | — | 3–00 |
| 4. | శివానందలహర్యాది గ్రంథసంగ్రహములు | — | 5–00 |
| 5. | ఆత్మసాక్షాత్కారము | — | 3–00 |
| 6. | దేవీకాలోత్తరము | — | 3–00 |
| 7. | శ్రీత్రిపురారహస్యజ్ఞానఖండసారము | — | 10–00 |
| 8 | శ్రీరమణకథామణిమాల | — | 10–00 |

---

## శ్రీరామాయణతరంగిణి

| | | |
|---|---|---|
| మొదటిభాగము | — | 12–00 |
| రెండవభాగము | — | 15–00 |
| మూడవభాగము | — | 18–00 |
| నాల్గవభాగము | — | 20–00 |
| అయిదవభాగము | — | 20–00 |

## అముద్రితములు

ఝాన్సీలక్ష్మీదేవి– 18 సర్గల గేయకావ్యము

నాయకోదయము – స్వాతంత్ర్యోద్యమ సంఘటనాత్మక పద్యకావ్యము

నలచరిత్రము –చంపూకావ్యము

శ్రీవాసుదేవకథాసుధ మొదలైనవి.